# అహం భో అభివాదయే



డా॥ తిరుమల రామచంద్ర

ప్రాకృత అకాడెమీ ప్రచురణ - 9

# అహం భో అభివాదయే




డాక్టర్ తిరుమల రామచంద్ర, డి.లిట్.



ప్రాకృత అకాడెమీ
హైదరాబాద్ - 500 080.

ప్రథమ ముద్రణ : జూలై, 1995

ప్రతులు : 1000

ముఖచిత్రం : శ్రీ సెల్వరాజ్

ధర : రూ. 50-00

ప్రతులకు :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
4-1-435, విజ్ఞాన్ భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001.

---

ముద్రణ : లక్ష్మీ గణపతి ప్రింటింగ్ ప్రెస్,
SRT-199, 1-1-379/50/1, జవాహర్‌నగర్,
హైదరాబాదు-500 020.

# మనవి మాటలు

నేను స్పెషల్ కరెస్పాండెంట్‌గా ఎందరినో ప్రముఖులను కలుసుకొన్నాను. వారిలో కొందరి పరిచయాలు 'మరపురాని మనీషులు' అనే గ్రంథంలో పొందుపరచాను; కొన్నిటిని 'తెలుగు వెలుగులు'లలో చేర్చాను. మరికొందరు మహనీయుల లేఖినీ చిత్రాల సంకలనమిది. దీనిలో నా వైయక్తిక దృష్టే ఎక్కువగా కానవస్తుంది. పాఠకులు పలువురికి వీరు పరిచితులయి ఉంటారు గనుక నా భావాలతో బేరీజు వేసుకోగలరు.

ఈ సంకలనంలోని వ్యాసాలన్నీ పత్రికలలో అవసర నైవేద్యాలుగా వ్రాసినవే. వీటిని ప్రచురించడానికి అనుమతించిన ఆయా పత్రికా సంపాదకులకు కృతజ్ఞుణ్ని.

ఈ సంకలనాన్ని నా మిత్రుడు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి సతీమణి, సోదరి అన్నపూర్ణమ్మకు అంకితమిస్తున్నందుకు ఆనందిస్తున్నాను.

ముఖపత్ర చిత్రాన్ని భావస్ఫోరకంగా గీచిన చిత్రకారులు శ్రీ కె. సెల్వరాజ్‌గారికి, శ్రద్ధతో సుందరంగా ముద్రించి యిచ్చిన లక్ష్మీగణపతి ప్రెస్‌వారికి కృతజ్ఞుణ్ని.

హైదరాబాదు-80
యువ జ్యేష్ఠ పూర్ణిమ,
13-6-1995.

భాషా సేవకుడు
తిరుమల రామచంద్ర

# అర్పణ

నిరంతర హరిధ్యాన
మరందా స్వాద తుందిలా,
అన్నపూర్ణా న్వర్థ నామ్నీ
దేవీ రాజత్యపాంసులా.

**అమ్మా!** అన్నపూర్ణమ్మా! నీవు కాళిదాసు మాటలలో అపాంసులనాంధురి కీర్తనీయవు. పలుదోమిన మీదట ప్రాతస్స్మరామి రఘునాథ పదారవిందంతో ప్రారంభమయ్యే నీ స్తోత్ర పఠనం మేల్కొలుపులతో, సహస్రనామాలతో, మంగళాలతో కొనసాగుతూ పడుకొనేవరకూ పూర్తికాదు గదా! ఏ గురువువద్ద నేర్చావమ్మా ఈ అవధాన విద్య?

శ్రీమద్రామాయణ శ్రీమద్భాగవతాలు ఇన్నిమార్లు పారాయణం చేసి, ఇన్నిమార్లు పట్టాభిషేక సప్తాహాలు చేసిన వారిని గ్రామైకరాత్రంగా ఆ సేతుశీత నగం చుట్టిన నేను ఎక్కడా, ఎన్నడూ కానను, వినను.

నీవు పేరుకు తగిన దానివి. కృష్ణరాయలు వర్ణించిన విష్ణుచిత్తుని సతీ మణి ఒక్కతే నీకు సాటి. మిత్రుడు వదలిపెట్టపోయిన యథామూల ఆంధ్ర మహాభారత వచనం ముద్రణకు లక్ష విలువచేసే నీ నగకట్టును మదుపుపెట్టిన త్యాగశీలవు.

**తల్లీ!** నీలాటి మహనీయురాలికి నేను ఏమి ఇయ్యగలనమ్మా? పుట్టింటి ఈ చిన్ని కానుకను అందుకో; నేనూ, నా అర్ధాంగి సౌభాగ్యవతి అనంతలక్ష్మి అర్పిస్తున్నాము.

సోదరుడు
**తిరుమల రామచంద్ర**

# విషయసూచిక

# అనంతకృష్ణులకు అంజలి

అనేక వాఙ్మయాలలో తలస్పర్శి పాండితి, దాని మీగడ తరక అనదగిన సహృదయత. దాని బాహిరరూప మనదగిన కమ్మని కవిత, దానికి గమకమైన గాన గరిమ, వీటన్నిటి సమాహార మనదగిన సచ్చరిత్ర పటిమ, దాని ప్రతికృతి అయిన మహితాకృతి, దానిని ప్రస్ఫుటించే పరిశుద్ధాభిరుచి, దానితో బారలుసాచి స్పర్థించే సదభివ్యక్తి రాళ్ళపల్లి అనంతకృష్ణుల అపురూప స్వరూపరేఖ అంటే చాలు.

అనంతకృష్ణుల స్వరూపం ఇంత సరసోదారంగా అవిర్భవించడానికి కారణం మొదట వారి పితృపాదులు, పిదప వారి గురుపాదులు శ్రీకృష్ణ బ్రహ్మ తంత్ర పరకాల యతీంద్రులు అని నా అభిప్రాయం. పితృపాదులయిన కర్నమడకల కృష్ణమాచార్యులు అనంతకృష్ణులకు అక్షరాభ్యాసం చేయించి, తెలుగు సంస్కృత కావ్యాలు చెప్పారు. "శాఖాచంక్రమణము ఎప్పుడును చేయక శ్లోకార్థ తాత్పర్యములను వారివలె ప్రశాంతముగ చెప్పగలుగుట ఉపాధ్యాయులలో ఎందరో సాధింపలేని సిద్ధి.... కావ్యనాటక రసానుభవము వారికెంత తీవ్రమో అంత అంతరంగమైనది, ఆధ్యాత్మికమైనది.... చక్కని కవితకు వారు లోగినవారేగాని, బహిరంగముగ సాత్త్వికభావములు ప్రకటించుట వారి వాడుక కాదు. అదొక అసాధారణమైన ఆత్మసంయమము వారిది." అని తమ పితృపాదులను ప్రశంసించారు అనంతకృష్ణులు. (నా గురువులు—అనంతకృష్ణశర్మ సన్మాన సంచిక.)

పిదప శ్రీ చామరాజనగరం రామశాస్త్రి అనే పండితులవద్ద, పరకాల యతీంద్రులు శ్రీకృష్ణబ్రహ్మతంత్రుల వంటి మహాపురుషునివద్ద అంతేవాసిత్వం అనంతకృష్ణులను గొప్పవ్యక్తిగా తీర్చినది. ఈ తీర్పునకు మరొక కూర్పు డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డితో వారి చేర్పు. "సాహిత్య సంస్కారమున నాకు కడపటి గురువు ఆయన. రామలింగారెడ్డిగారు నన్ను సమాన స్కంధునిగా చూచేవారు. నా దృక్పథం మారడానికి, ప్రత్యేకముగా తిక్కనపై అభిమానానికి

ఆయనే కారణం" అని అనంతకృష్ణులు ముక్తకంఠంతో చెప్పుకొనేవారు. ఇరుప్రక్కల మూడవవ్యక్తికి చొరవలేని ముగ్ధమధుర సంబంధం వారిది.

పాటల పాతర అయిన తల్లి శ్రీమతి అలమేలు మంగమ్మగారి ప్రోత్సాహంతో అనంతకృష్ణులలో కలిగిన సంగీతాభిరుచి శ్రీ బిడారం కృష్ణప్పవంటి వైణిక గాయక సార్వభౌముని శిష్యత్వంతో తీగలుసాగి వారిని గాన కళా ప్రపూర్ణ, గాన సింధు, సంగీత కళానిధి బిరుద విరాజితులను చేసింది.

అనంతకృష్ణులు తమ 19వ ఏట 1912 జూలై 2వ తేదీన మైసూరులో మహారాజా కళాశాలలో తొలిసారిగా స్థాపితమైన తెలుగు పండిత పదవిని మెట్టి, ముప్పయి ఎనిమిదేండ్లు పలువురు శిష్యులకు తెలుగు నేర్పి, తెలుగు సరస్వతికి పట్టం కట్టినారు. పిదప 1950 నుంచి ఏడేండ్లపాటు తిరుపతి ప్రాచ్య పరిశోధనాలయంలో తాళ్ళపాక వారి కీర్తనలు సంస్కరించి ప్రచురించారు, కొన్ని కీర్తనలను స్వరపరిచారు. స్వరపర్చడం అనంతకృష్ణులకు వెన్నతో పెట్టిన విద్య. 1917 లో రవీంద్రకవీంద్రుడు మైసూరుకు వచ్చినప్పుడు, పట్టుమని పాతికేళ్ళయినా నిండని అనంతకృష్ణులు, రవీంద్రుడు భువనమనమోహిని, జనగణమన పాడుతూంటే, ఆ పాటలకు వెంటవెంటనే స్వరకల్పన చేశారట. రవీంద్రుడు "I can not imagine how this young Pundit follows me with notations" అని ఆశ్చర్యపడ్డాడట.

అనంతకృష్ణుల రచనా వ్యాసంగం విశ్వగుణాదర్శకర్త వేంకటాధ్వరి "సుభాషితకౌస్తుభం" పద్యాల తెనిగింపుతో 13వ ఏట – 1906 లోనే ప్రారంభమయింది. పిదప తారాదేవి, మీరాబాయి ఆదిగా కావ్య నవలోపన్యాస విమర్శలు, సంస్కృతానువాదాలు పుంఖానుపుంఖంగా వెలువడినవి. వారివన్నీ తేనె తెలుగు కూర్పులు, సాహిత్యపు తీర్పులు. తెలుగులోను, సంస్కృతంలోను, కన్నడంలోను సమానస్థాయిలో సాగింది వారి రచన.

వారి తారాదేవి కథాకథన కౌశలానికి, తెలుగు పలుకుబడుల ప్రయోగ పాటవానికి కాణాచి. మీరాబాయి అజరామరమైన కావ్యం. మహీశూర రాజ్యాభ్యుదయాదర్శ సంస్కృత చంపువు ఆధునిక వైజ్ఞానిక సంస్కృతికి, ఆశుకవితకు విజయం. వారి వేమన, నాటకోపన్యాసములు, సారస్వతోపన్యాసములు, గానకళ, గానకలె, సాహిత్య మత్తు జీవనకలె, రాయలనాటి రసికత మున్నగునవి విమర్శ వాఙ్మయానికి నికషాలు. "తత్త్వమును దెలిసికొనవలెనను నాశ, తెలిసిన దానిని నిర్భయముగా ప్రపంచమునకు బోధించు ధైర్యము, దానికి నిబంధనమై ఇరుపక్కలందులు మరుగులేని మంచి పదునుగల చురకత్తివంటి రచనాశక్తి,

దానికి మెరుగిచ్చునట్టి సూక్ష్మదృష్టి, గాయపుమందు కత్తికే పూసి కొట్టినట్టు తిడుతూనే నవ్వించే హాస్యకుశలత" వారి విమర్శకు మూలద్రవ్యాలు. వారి విమర్శ అద్వితీయము, అననుకార్యము. వారి గాథాసప్తశతీసారము, సుందర పాండ్య విరచిత నీతి ద్విషష్టిక, నృత్తరత్నావళి మున్నగు అనువాదాలు, మూల సౌందర్యాన్ని జిగేలు మనజేసే మూలసమాన స్కంధాలు. పలువురి గ్రంథాలకు వారు వ్రాసిన పీఠికలు రామణీయక పేటికలు. అభిమానులకు వ్రాసిన కమ్మలు సాహిత్యపు కమ్మతెమ్మెరలు. వారేది వ్రాసినా, ఉన్నదున్నట్టు అచ్చు వేసుకోన దగిన అచ్చుకట్టు.

సంగీత సాహిత్యాలకు వారు చేసిన సేవను పురస్కరించుకొని పెక్కు సంస్థలు వారిని సత్కరించాయి. వారిని మైసూరు చతుర్థ సంగీత సమ్మేళనం అధ్యక్షతతోపాటు 1961 లో గానకళాసింధు బిరుదం, 1969 లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీవారి గాన కళాప్రపూర్ణ బిరుదం, బెంగళూరు గాయక సమాజం సంగీత రత్నాకర బిరుదం, 1970లో కేంద్ర సంగీత నాటక అకాడెమీ ఫెలోషిప్పు, 1974లో మద్రాసు మ్యూజిక్ అకాడెమీ వార్షికోత్సవాధ్యక్షతతోపాటు సంగీత కళానిధి బిరుదు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ విశిష్ట సభ్యత్వం, 1974లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ బిరుదు, అస్తమించే దినాన తిరుమల తిరుపతి ఆస్థాన విద్వత్పదవి వరించాయి.

"విద్యా దదాతి వినయం" అన్న సూక్తికి అనంతకృష్ణులు సజీవోదాహరణం. తిరుపతి సమీపంలోని మంగాపురంలో వున్న అన్నమాచార్య వంశం వారు అన్నమాచార్యులు పూజించిన విగ్రహాలను భరించలేక ఒక భక్తునికి దానం చేయగా, మడిబట్టలతో వెళ్ళి ఆ విగ్రహాలకు, అన్నమయ్య తిరువేంగళనాథుల చిరుతలు, పావుకోళ్ళు మున్నగువాటికి సాష్టాంగ దండప్రణామం సమర్పించి వచ్చిన వినయ సంపన్నులు, భక్తిసంపన్నులు అనంతకృష్ణులు.

ఈ సాహిత్య విమర్శ ప్రస్థానాచార్యులకు సాహిత్య పరమార్థం — గురించి నిష్కృష్టమైన సిద్ధాంతాలున్నవి. "సాహిత్య పరమార్థం అన్ని కళల పరమార్థమూ-అలౌకికానుభవం; చిత్తసంస్కారమూను. సాహిత్యం ప్రపంచానికి అద్దంగా వున్నదా, లేదా అన్నది చిన్నమెట్టు. ఉండినది, ఉండవచ్చునది, ఉండవలసినది అనేవి ఉత్తరోత్తరం బలీయాలు. దీనిని నైతిక ధార్మిక హార్దికమైన వాటికీ అన్వయిస్తాను. ఒక్కొక్క దానినుంచి మరొక్క దానికి వెళ్ళడానికి నా ప్రయత్నం. ప్రయోజనాత్మకతకంటే, ఉన్నదున్నట్టు చూపడంకంటే, ఉండవలసినదిగా చూపడం శ్రేష్ఠమైంది" అని నిర్వచించారు ఆ సాహిత్య తపోధనులు.

అనంతకృష్ణులు నిరంతరం – కలకాలం – సాహిత్యంలోను, జీవితం లోను పులుగడిగిన ముత్యాలరాశిగా, సాయం సంఫుల్ల మల్లీమతల్లికా గుచ్ఛంగా, తావులీనే అపరంజి పోతపోసిన దివ్యమంగళ విగ్రహంగా దర్శనమిస్తారు.

అనంతకృష్ణులు విమర్శకులుగా ఆంధ్రావళికి ఏ సుముహూర్తాన దర్శన మిచ్చారోగాని, వారు ప్రవర్తింపజేసిన శిష్టాభిరుచి ప్రస్థానం అరుదశాబ్దాలుగా అవిచ్ఛిన్నంగా సాగుతున్నది; ఆంధ్రసారస్వత రమకు అసదృశ నీరాజనంగాను, జిజ్ఞాసువులకు విమర్శామ్నాయ మణిదీపంగాను వెలుగొందుతున్నది. వారు ఆనందవర్ధనులుగా, అభినవగుప్తులుగా సాక్షాత్కరిస్తారు.

(ఆంధ్రపత్రిక, సిద్ధార్థినామ సంవత్సరాది సంచిక – 11.3.1979)

# కందుకూరికి సుపరిచితులు

## కారుపల్లి శివరామదాసు

శ్రీ వీరేశలింగం పంతులుగారు గొప్ప వ్యక్తి; వ్యక్తి అనడం కన్నా గొప్ప సంస్థ అనడం సముచితంగా ఉంటుంది. ఆయన దక్షిణ భారత ఈశ్వర చంద్ర విద్యాసాగరుడు. అటు తమిళనాడు సంఘ సేవకులను, ఇటు కన్నడనాడు సంఘ సంస్కర్తలను ప్రభావితులను చేసినట్టివారు. సాహిత్యం సంఘాశ్రయం. సాహిత్యంతో సంఘం ఏర్పడదు గాని, సంఘంతో సాహిత్యం ఏర్పడుతుంది. సంఘంలో, ప్రజలలో కలిగే పరిణామాలను బట్టే సాహిత్యం పొటమరిస్తుంది. కనుక పంతులుగారు సంఘ సంస్కర్తగా చేసిన సేవనే నేను సాహిత్య సేవ కన్నా మిన్నగా పరిగణిస్తాను. సంఘసంస్కరణకు, మానవసేవకు సాహిత్యం ఒక సాధనప్రాయం ఆయనకు. ఆయన ఎక్కడికి వెళ్ళినా, ఎవరిని కలుసుకొన్నా, ఎవరితో పరిచయమై ముచ్చటించినా సంఘం, దాని బాగోగులు ముఖ్యం; సాహిత్యం గౌణం. ఈ విషయాన్ని తమిళనాడు శాసనసభకు హొసూరు నియోజకవర్గ సభ్యులు శ్రీ కె. ఎన్. కోదండ రామయ్య (ఎం.ఏ; బి.ఒ.ఎల్; బి.టి, ఎం.ఎల్.ఏ.) తమ తండ్రి శ్రీ కారుపల్లి శివరామయ్యగారు శ్రీ వీరేశలింగంగారితో జరిపిన గోష్ఠులను గురించి చెప్పేటప్పుడు తెలిపారు. పంతులుగారు శ్రీ శివరామయ్యగారితో ఉత్తర ప్రత్యుత్తరాలు తరచు జరిపేవారు.

శ్రీ వీరేశలింగం పంతులుగారు మద్రాసులో వున్నప్పుడు, వేసవికి తరచు బెంగుళూరులో విశ్రాంతి తీసుకునేవారు. చామరాజపేటలో ఆయన బస. చామరాజపేట మొదటి రాస్తాలో శ్రీ కారుపల్లి శివరామయ్యగారి యిల్లు. శివరామయ్యగారు ప్రస్తుత తమిళనాడులో ధర్మపురి జిల్లా హొసూరు తాలూకా హొసూరు వాస్తవ్యులు. 1883 జూలై 15వ తేదీన జన్మించారు. 1961 లో కీర్తిశేషులయ్యారు. వారిని కోదండరామయ్యగారితో పాటు ఒకటి రెండుసార్లు దర్శించే అవకాశం నాకు కలిగింది. ఆయన గొప్ప విద్వాంసులు. సంస్కృతాంధ్ర, కర్నాటక, హిందీ భాషా సాహిత్యాలను ఆపోశనం పట్టినవారు. ఈ పాండిత్యానికి బంగారు పూతగా సంఘసంస్కార దీక్ష. శ్రీ బి. కె. దేవయ్యగారనే భూస్వామి

సహాయంతో హొసూరు తాలూకా తెలుగువారి సర్వతోముఖ వికాసానికి జీవితం అంకితం చేసిన మహామహు డాయన. బెంగుళూరు హొసూరుకు సమీపం గనుక బెంగుళూరులో ఉంటూ ఆయన తమకు వచ్చిన భాషలన్నిటిలోను రచనలు సాగించారు. ఆయన రచించిన గ్రంథాలలో కొన్ని ఇవి :—

తెలుగు :— సత్యహరిశ్చంద్ర చరిత్రము, కుచేలోపాఖ్యానము, జ్ఞానాంజనము, దయానంద షట్త్రింశన్మంజరి, సుజ్ఞాన చంద్రోదయము, జీవ కారుణ్యము, శ్రీ గోపాలకృష్ణ గోఖలే, రామకృష్ణ పరమహంస, శ్రీ స్మరణామృతము, జ్ఞానరత్నము, శ్రీ సుబ్రహ్మణ్య సేవానందము, రామకోటి, గీతా ప్రభ. ఈ పన్నెండు గ్రంథాలే కాక ఇంకా ఎన్నో ఉన్నాయి.

కన్నడం :— రామదాసు, కృష్ణలీల, రామరాజ్యము, ఆత్మ రామాయణము, గోపీచంద్ర చరిత్రము, రాజకుమారీ యమున, లలిత, స్నేహలత, భక్త విజయము, సుజ్ఞాన చంద్రోదయము, యోగ రహస్య, రామకోటి, గీతాప్రభ, జగన్నాథపండిత చరిత్ర. పురందరదాస చరిత్ర, కౌసల్యాపరిణయము. ఈ 16 పుస్తకాలే కాక ఇంకా ఎన్నో ఉన్నాయి.

శ్రీ శివరామయ్యగారు 1916-17 ప్రాంతంలో బెంగుళూరు నుంచి "ఆనంద చంద్రిక," "రాజహంస" అనే కన్నడ మాసపత్రికలు ప్రచురించేవారు. ఆనంద చంద్రిక కార్యాలయం, ఆయన ఇంటితోపాటు సాహిత్యగోష్ఠి కేంద్రం గాను, సంఘ సంస్కరణ ప్రచార కార్యాలయంగాను ఉండేది. ఆంధ్రదేశం నుంచి వచ్చే పండిత తల్లజులకు, ప్రజా సేవకులకు మాత్రమేకాక, రావ్‌బహదూర్ ఆర్. నరసింహాచార్ మొదలయిన కన్నడ విద్వద్వరేణ్యులకు కూడ ఆనంద చంద్రిక ఆనందం కలిగించేది. సాహిత్యమేకాక, విధవా వివాహాలు, రజస్వలానంతర వివాహాలు, స్త్రీల స్వాతంత్ర్యం మొదలయిన విషయాలపై తీవ్రంగా చర్చలు జరిగేవి. బెంగుళూరు బ్రహ్మసమాజమందిరంలో ప్రార్థనలు జరిగేవి. శ్రీ శివరామయ్యగారు సనాతనవాదులైనా, వేదమతాన్ని, ఉపనిషన్మతాన్ని నమ్ముతున్న నిజమైన ఆస్తికులు గనుక ఆ ప్రార్థనలలో పాల్గొనేవారు; వేదోపనిషన్మతాన్ని వివరించేవారు. ఏమైనా వీరేశలింగం పంతులుగారి ఉద్యమం బెంగుళూరు ప్రాంతంలో వ్యాపించడానికి శివరామయ్యగారి ఇల్లూ, ఆనంద చంద్రికా కార్యాలయమూ ప్రధాన శిబిరాలుగా ఉండేవి.

శ్రీ శివరామయ్యగారు 1916లో కన్నడంలో రామదాసు నాటకం వ్రాశారు. దీనిలో ఆయన వీరేశలింగంగారి సంఘసంస్కరణ విషయాలను చర్చించారు. బ్రహ్మసమాజ ప్రార్థనల పద్ధతిలో ఆయన "శ్రీ స్మరణామృతము"లో ప్రార్థనలు వ్రాశారు :—

"పరమేశ్వరా, పరమకృపాకారా, పరమకల్యాణ పరిపూర్ణా, పరమ కారుణ్యమూర్తీ, పతిత పావనా, ప్రణతార్తి భంజనా, పరమానంద పరిపూర్ణా, సచ్చిదానంద నిలయా, లోకనాథా, లోకపితా, జ్యోతిర్మయా, జగన్నాథా, దీనబంధో, దయాసింధో, నీకు నమస్కారము. అనంతా నీకనంత కోటి వందనములు.

"పరమ జనకా, నీచరిత్రలను వినుచు, నీ నామకీర్తనము సలుపుచు, నీ పాద సేవ చేయుచు, ఆనందించు భాగ్యము నను్గ్రహింపుము. భక్తవత్సలా, భక్తసులభా, అమృతమయా, దురాలాప జరాభార దరిద్ర దుఃఖరోగముల నుండి తొలగించి, అమృతత్వమొసంగుము. ప్రాణనాథా, నీకు నమస్కారము, నమస్కారము. అనంతా, నీ కనంతకోటి వందనములు."

ఈ శ్రీస్మరణామృతములో పైన పేర్కొన్న వచనాలు మాత్రమే కాక రాగతాళ నిర్దేశంతో కీర్తనలూ చాల ఉన్నాయి.

శ్రీ శివరామయ్య గారికి శ్రీ వీరేశలింగంగారితో పరిచయం క్రమంగా మైత్రిగా పరిణమించింది. వారిమధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు విరివిగా జరిగేవి. సాహిత్య విషయాలలో శ్రీ కె. వి. లక్ష్మణరావు, శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమ రావు గార్లతో చర్చలు, ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగేవి. శ్రీ శివరామయ్యగారికి శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య గారితో పరిచయం కలిగిన తర్వాత, గ్రంథాల యోద్యమం కూడ హొసూరు ప్రాంతంలో విస్తరించింది. గాంధీజీకి ముందే **1910లోనే ఆయన 'జీవకారుణ్యము' గ్రంథం వ్రాసి మద్యపాన నిషేధ ప్రచారం చేశారు.**

శ్రీ శివరామయ్యగారు గొప్ప హరికథకులు కావడంవల్ల శివరామదాసు అని పేరు పొందారు. 'హరికథారత్నాకర' అనే బిరుదును విద్వద్వరేణ్యులు ఇచ్చారు. శ్రీ శివరామదాసుగారి సమయస్ఫూర్తిని, అఖండ పాండిత్యాన్ని, బహుగ్రంథ రచనా కౌశలాన్ని చూచి ఆశ్చర్యపడిన కలకత్తాలోని అఖిలభారత సాహిత్య సంఘం 1919 సెప్టెంబరు 20వ తేదీన ఆయనకు "విద్యానిధి" అనే బిరుదం ఇచ్చింది. అఖిల భారత సాహిత్య సంఘం అధ్యక్షుడు శ్రీ అక్షయ కుమార్ ఆగమాచార్య, పరీక్షకులు ఆత్మరామశాస్త్రీ ఒంకమనె, భరద్వాజ దత్తాత్రేయ కృష్ణశర్మ, సంఘ కార్యదర్శి జ్ఞానేంద్రకుమార్ కావ్యార్ మాల్ వేదాంతరత్న పరీక్షించి సంతకాలతో "విద్యానిధి" బిరుదు ఇచ్చారు. ఆ యోగ్యతా పత్రం అంగ్ల మాతృక ఇది :—

"We, members and the examiners of Sangha in

todays"s meeting, have closely examined Mr. Karupally Sivarama Dass (of Bangalore city) dissertation and several of his Telugu and Canarese works, and do hereby confer on him the title of Vidyanidhi in recognition of his Profound Scholorship, erudition and valuable services for the enrichment of both Telugu and Kannada literatures respectively.

"Dated the 20th September 1919."

ఈ బిరుదాన్ని, బిరుదు ప్రదాన పద్ధతిని బట్టి శివరామదాసుగారి పాండిత్య ప్రతిభలు, సేవాపరాయణత వ్యక్తమవుతాయి.

శ్రీ శివరామదాసుగారు శ్రీ బి. కె. దేవయ్యగారి తోడ్పాటుతో హోసూరు తాలూకా సర్వతోముఖాభివృద్ధికోసం ముఖాసి బారందూరులో 1911న సకల జనాభివర్ధినీ సంఘం, కెలమంగళంలో 1911న సనాతన ధర్మబోధినీ సభ—అనే రెండు సంస్థలను స్థాపించారు.

శ్రీ వీరేశలింగం పంతులుగారి సిద్ధాంతాలను తెలుగుదేశానికి అనుకొని ఉండి, రాజకీయ కారణాలవల్ల నేడు విడిపోయిన హోసూరు తాలూకాలోను, కర్నాటక రాజధాని, తత్పరిసరాలలోను వ్యాపించడానికి నిరంతరం పాటుపడిన శ్రీ శివరామదాసుగారు నిరంతర స్మరణీయులు. శ్రీ శివరామదాసుగారు ప్రారంభించి పెంచిన సంస్థల కార్యక్రమాన్ని నిరంతరాయంగా కొనసాగించడమేకాక, దక్షిణాంధ్రుల శ్రేయస్సు కోసం జీవితాన్ని మీదుకట్టిన మహనీయులు ఆయన కుమారులు శ్రీ కోదండ రామయ్యగారు ప్రశంసనీయులు. శ్రీ కోదండ రామయ్యగారు తమిళనాడు శాసన సభ్యులుగా వుంటూ, స్థానిక ప్రజల తోడ్పాటుతో, తమిళనాడు ప్రభుత్వ సహాయంతో దక్షిణాంధ్ర ప్రజల కోసం పాటుపడుతూ తమ తండ్రిగారి సాహిత్య సంఘసేవా సంప్రదాయాన్ని కొనసాగించడమే కాక, మౌలిక పరిశోధన చేసి వందలాది వ్యాసాలు వ్రాశారు; శ్రీకృష్ణదేవరాయలపై "ఆదర్శ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు" అనే మహా పరిశోధన గ్రంథం రచించారు. ఇది విజయనగర చరిత్ర సర్వస్వంగా ఉంటుంది.

(ఆంధ్రప్రదేశ్ – మార్చి 1976)

# వేరునగధీరుడు... వెరపెరుగని వీరుడు

సురపురం రాజ్యం విజయనగర సామ్రాజ్యానికీ, బహమనీ రాజ్యానికీ మధ్యన ఉన్న తటస్థ (బఫ్ఫర్) రాజ్యం. ఈ రాజ్యపాలకులు మహావీరులైన వ్యాధులు, వీరిలో పొన్నంగి పామ నాయకుని కుమారుడు పీతాంబర బహరీ పిడ్డనాయకుడు వీరాధివీరుడు. ఇతడు తన రాజ్యంపై దండెత్తి వచ్చిన మొగల్ చక్రవర్తి ఔరంగజేబు సైన్యాన్ని రెండుసార్లు ఓడించాడు. ఇంత చిన్న రాజ్యం అంత పెద్ద సామ్రాజ్యం సైన్యాన్ని ఓడించినందుకు విస్తుపోయిన ఒక బ్రిటిష్ రాయబారి పిడ్డనాయకుణ్ణి ప్రశ్నించాడు "మహారాజా, మీ విజయ రహస్యం ఏమిటి?" అని.

పీతాంబర పిడ్డనాయకుడు "ఉండండి. చెబుతాను" అని సమాధాన మిచ్చి, దగ్గరలో నిలుచున్న ఒక యువకుడిని పిలిచాడు. అతడు సమీపించగానే, పక్కన ఉన్న ఒక మర్రిచెట్టును చూపి "దాని పైకి ఎక్కు!" అని ఆజ్ఞాపించాడు పిడ్డనాయకుడు. అతడు ఎక్కాడు. "అక్కడి నుంచి దూకు!" అన్నాడు నాయకుడు. అతడు దూకబోయాడు. "ఆగు. దిగి రా!" అన్నాడు నాయకుడు. అతడు దిగివచ్చి, చేతులు కట్టుకొని నిలబడ్డాడు.

పిడ్డనాయకుడు బ్రిటిష్ రాయబారి వైపు చూచి, యువకుడి వైపు చూపుతూ "ఇదీ నా విజయ రహస్యం" అన్నాడు. ఎంత వ్యూహరచనాశక్తి, సమరచాతుర్యం ఉన్నా, ప్రాణమిచ్చే అనుయాయులుండాలి. వారు అలా ఉండడానికి వారియెడల ప్రేమగౌరవాలే కాక, వారికి తానొక పెద్ద ఆశ్రయం, గొప్ప భద్రత అనే భావంతో ప్రవర్తించాలి. అప్పుడే ఏ వ్యక్తి అయినా, ఏ నాయకుడైనా, ఏ సంస్థ అయినా మూడు పూవులూ ఆరవై కాయలుగా వృద్ధి చెందే అవకాశం ఉంది.

అలాటి మహావ్యక్తి రామనాథ్‌జీ గోయంకా. ఏవో న్యాయశాస్త్రపు చిక్కులవల్ల ఇండియన్ ఎక్స్‌ప్రెస్ సముదాయం సమాచార పత్రికలు చిత్తూరు నుంచి వెలువడవలసి వచ్చింది. చిత్తూరు మద్రాసుకు వందపదిమైళ్ళ దూరంలో బెంగుళూరు మార్గంలో ఉంది. ఈ రహదారి రాత్రీపగలూ ప్రయాణికులతో, వాహనాలతో కిటకిటలాడుతూ ఉంటుంది. పత్రికలు మద్రాసు వీథులలో ఉదయం ఆరుగంటల కల్లా ఉండాలి. ఇదీ రామ్‌నాథ్‌జీ కట్టడి.

ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షా ఫలితాలు ప్రకటించే రోజు తమ పత్రికలు హిందూ మొదలైన పత్రికల కంటే ముందుగానే మద్రాసుకు చేరాలి. ఎక్స్‌ప్రెస్ సముదాయానికి ఎన్నో వ్యానులు, ట్రక్కులు, లారీలు, కార్లు ఉన్నాయి. డ్రైవర్లు దాదాపు ముప్పైమంది ఉంటారు. రామ్‌నాథ్‌జీ మొదలియార్ అనే డ్రైవరును పిలిచారు. "మొదలియార్, మన పత్రికలు చిత్తూరులో తెల్లవారు జామున 3-30 కు అచ్చవుతాయి. నీవు వాటిని ఐదుకల్లా ఇక్కడికి చేర్చాలి. నేను గేటువద్ద నీ కోసం ఎదురుచూస్తుంటాను" అన్నారు అతనితో. "అప్పడియే యశమాన్" అన్నాడు మొదలియార్. పరీక్షా ఫలితాలు ప్రకటించే నాటికి ముందురోజు సాయంత్రం జరిగిన సంభాషణ ఇది.

రామ్‌నాథ్‌జీ వెనుకటి సాయంత్రం చెప్పినట్లే తెల్లవారుజామున గేటువద్ద నిలబడి ఉన్నారు. పక్కన ఒక కుర్చీకి పూలదండ వ్రేలాడుతూంది. టేబుల్ మీద చందన తాంబూలాలు, కొత్తపంచల చాపు, ఉత్తరీయం ఉన్నాయి. 4-50 అయింది. అందరి కళ్ళు గేటువైపే ఉన్నాయి. రామనాథ్‌జీ వెనక్కు చేతులు కట్టుకొని పచారు చేస్తున్నారు. ఏ చిన్న అలికిడి అయినా పత్రికల వ్యానేమోనని నిక్కి చూస్తున్నారు. 55, 56, 57 దడదడలాడుతూ వ్యాను దూసుకొని వచ్చింది. అలసిపోయిన మొదలియార్ వ్యాను దిగి రామనాథ్‌జీ దగ్గరికి వచ్చి నా కర్తవ్యం నిర్వహించాననే చూపులతోనే వాలిపోయాడు. రామనాథ్‌జీ అతనిని గట్టిగా కౌగలించుకొని, భుజం తడుతూ, "మొదలియార్, నీబోటి వాళ్ళవల్లే నా సంస్థ నిలిచింది. మేమెంత పని చేసినా, సరకును జనానికి సమయానికి అందించే వాళ్ళు నీబోటివాళ్ళే. వెళ్ళు. పక్క గదిలో వేన్నీళ్ళున్నాయి. స్నానం చేసిరా. నీతో పనుంది" అన్నారు. అతడు కాలకృత్యాలు ముగించుకొని రావడానికి అరగంట పట్టింది. అతడు రాగానే, రామనాథ్‌జీ కొత్తపంచల చాపు, చింపి ఒకటి కట్టుకోమని ఇచ్చి, తర్వాత అతనికి చందనం అలది, మెడలో పూలమాల వేసి, కుడిచేతికి ఒక బంగారు గొలుసు తొడిగారు. కరతాళధ్వనుల మధ్య మొదలియార్ ఆనందబాష్పాలు కురిపిస్తూ నిలుచుండిపోయాడు.

ఒక్క మొదలియారే కాదు. రామనాథ్‌జీతో వైయక్తిక పరిచయమున్న ప్రతి వ్యక్తీ అలాటివాడే. ఎక్స్‌ప్రెస్ సంస్థలో 60 ఏళ్ళుగా పనిచేస్తున్న శేషాద్రి గారు మరొక పెద్ద ఉదాహరణ. శేషాద్రిగారు ఎం.ఏ. పట్టం పుచ్చుకొని ఉద్యోగాన్వేషణలో ఉన్నారు. రామనాథ్‌జీ కుమారుడు భగవాన్‌దాస్‌జీకి అప్పుడు ఏడెనిమిదేళ్ళు. ఆయనకు ఒక ట్యూటర్ కోసం పత్రికలో ప్రకటించారు. శేషాద్రి గారు ఒక పెద్దమనిషి సిఫార్సుతో రామనాథ్‌జీ వద్దకు వచ్చారు. ట్యూటర్‌గా

కుదిరారు. ఆ భగవాన్‌దాస్‌జీకే కాక అందరికీ 'మాస్టర్' అయ్యారు. శేషాద్రి గారు తర్వాత ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో సబ్ ఎడిటర్‌గా నియమితులై అసిస్టెంట్ ఎడిటర్ అయి, ఒక ప్రచురణకు స్థానిక సంపాదకులై ఇంకా పని చేస్తున్నారు. ఆయన ఇండియన్ ఎక్స్‌ప్రెస్ కంతా మాస్టరే.

రామనాథ్‌జీ గొప్ప సాహసోపేతుడైన వ్యాపారి. ఆ సాహసమే లేకపోతే ఆయన పత్రికా సామ్రాజ్యం ఇంతగా విస్తరించేదా? ఒకమారు విదేశాల నుంచి ఫిన్‌ల్యాండ్ నుంచి అనుకుంటాను — న్యూస్ ప్రింట్ రానున్నది. ఆ సరుకు ఓడ మద్రాసు చేరడానికి 20 రోజులు పడుతుంది. సరుకు వెంటనే దించుకోకపోతే రోజుకు నాలుగైదువేల రూపాయల డెమెరేజి పడుతుంది. రామనాథ్‌జీ ఆలోచించారు. రేవులో దించడానికి పదిరోజులు. అక్కడినుంచి ఎక్స్‌ప్రెస్ కార్యాలయం ఉన్న ఓల్డ్ మద్రాసు క్లబ్‌కు తరలించడానికి పది రోజులు. తడిసి మోపెడవుతుంది. కనుక ఓడ రేవు చేరగానే సరుకు కార్యాలయం చేరాలి. 'ఏమిటి' ఉపాయం? ఎక్స్‌ప్రెస్ ఎస్టేటులో ప్రస్తుతం ఉన్న ఏడంతస్తుల కార్యాలయం పక్కన పెద్ద తోట ఉండేది. అది అడవిలాగ పెరిగి ఉండేది. దాదాపు మూడు వందల సంవత్సరాల మహావృక్షాలు ఉండేవి. రామనాథ్‌జీ ఆ అడవిని స్వయంగా నిలబడి నరికించి, దాదాపు 300 మంది కార్మికులను నియమించి నాలుగు పెద్ద గిడ్డంగులు కట్టించారు. రాత్రీ పగలూ ఆయన అక్కడే మకాం. ఇరవై రోజుల్లో నిర్మాణం పూర్తయింది. న్యూస్ ప్రింట్ ఓడ రేవు చేరడమేమిటి, సరకు వెంటనే గిడ్డంగులు చేరడమేమిటి- జరిగిపోయాయి. ఆ కాలంలో అలా గిడ్డంగులు నిర్మించడం మహా సాహసమే.

రామనాథ్‌జీ పట్టింపులు వచ్చినప్పుడు డబ్బుకు వెనకాడేవారు కాదు. లండన్ నుంచి 64 పుటలు ఏకకాలంలో ముద్రించే రోటరీ తెప్పించారు. దాని వెంట ఐదేళ్ళపాటు దానిని నిర్వహించే ఒప్పందంతో ఒక బ్రిటిష్ ఇంజనీర్ సకుటుంబంగా వచ్చాడు. కుటుంబానికి ఓల్డ్ మద్రాసు క్లబ్బులోని ఒక పాత బంగళా కేటాయించారు.

రెండేళ్ళు సవ్యంగా పని జరిగింది. ఆ ఇంజనీరుతో ఏదో వాగ్వివాదం ఏర్పడింది. లిఫ్ట్‌లో వస్తున్నారు, మేమూ కొంతమంది ఉన్నాము ఆ లిఫ్ట్‌లో. ఘర్షణ తీవ్రంగా జరిగింది. రామనాథ్‌జీ తన ఆఫీసు గదిలో అడుగు పెట్టగానే మొదట చేసిన పని — ఆ ఇంజనీరు ఒప్పందం ప్రకారం - తక్కిన మూడు సంవత్సరాల జీతం- నెలకు ఐదువేల రూపాయల ప్రకారం - లెక్కకట్టి చెక్కు వ్రాసి అతనికి పంపారు. సాయంకాలానికల్లా ఇల్లు ఖాళీ చేయమన్నారు. ఆ ఇంజనీరు బ్రిటిష్ హై కమీషనర్‌తో మొరపెట్టుకున్నాడు. "నీ డబ్బు మూడు

సంవత్సరాలకు ముందుగానే వచ్చింది గదా! స్వదేశానికి తిరిగి వెళ్ళు - ఇప్పుడు భారతదేశం స్వతంత్రం. మన మాట వినేవారు లేరు" అన్నారు హైకమిషన్ కార్యాలయంవారు.

ఆ ఇంజనీరుకు చెక్కు పంపిన తర్వాత రామనాథ్‌జీ రాఘవన్ అనే అతనిని పిలిపించి, "నీవు నేటి నుంచి రోటరీ సూపరింటెండెంట్ ఇంజనీరువి" అన్నారు. అతడు గాభరాపడి "నేను ఎలక్ట్రీషియన్‌ను. నాకు రోటరీ గురించి తెలీదు ..." అని నీళ్ళు నమిలాడు. "అదంతా నాకు తెలీదు. ఇప్పుడు 9.00 గంటలు. సాయంత్రం 3.00 వరకు కావలసినంత టైముంది" అని వెళ్ళ మన్నారు.

రాఘవన్ బిక్కమొగం వేసుకొని రోటరీ వద్దకు వచ్చాడు. పత్రికా ముద్రణకు ప్రయోగాలు ప్రారంభించాడు- దాదాపు మూడు రీళ్ళ న్యూస్‌ప్రింట్ పాడయి పర్వతంలా రోటరీ గదంతా వ్యాపించింది. సాయంకాలం 4.00 గంటలకు ఒక దోవకు వచ్చింది. పత్రికలన్నీ ముద్ద ముద్దగా అచ్చయి వచ్చాయి. "రేపటికి సరిపోతుంది. నడూ" అన్నారు రామనాథ్‌జీ. 150 రూపాయల ఎలక్ట్రీషియన్ రాఘవన్ తెల్లవారే సరికి 3000 రూపాయల ఇంజనీరయ్యాడు. సిరిదా వచ్చిన వచ్చును గదా!

ఏదో ప్రత్యేక సంచిక వేస్తున్నాము. రాత్రి ఒంటి గంట. నార్లగారి కుమారునికి బాగులేదు. ఇంటి నుంచి ఫోన్లపై ఫోన్లు. ఇంటివాళ్ళు విసిగి రామనాథ్‌జీకి ఫోను చేశారు. ఆయన ఆంధ్రప్రభ ప్రత్యేక సంచిక మేకప్ గదికి వచ్చారు. "నరాలాజీ! ఇంటి నుంచి ఫోను వచ్చింది. ప్రత్యేక సంచికను మరొకరు చూస్తారు. పిల్లవాడికి ఏమయినా అయితే ఎవరు చూస్తారు? వెళ్ళు!" అని లిఫ్ట్ వరకు లాక్కుపోయారు.

రామనాథ్‌జీ ఉద్యోగుల విషయంలో అగౌరవంగా ప్రవర్తించేవారు కారు. కాని ఎదుటివాడు మోసం తలపెట్టాడని భావిస్తే మాత్రం కరుకుగా ఉండేవారు. ఉద్యోగుల విషయంతో ఇతరుల జోక్యాన్ని హర్షించేవారు కారు— చివరకు తన కుమారుడు, అల్లుడు అయినా సరే.

శ్రీనివాసన్ అనే ఆయన ఎక్స్‌ప్రెస్‌లో పనిచేసేవారు. ఆయనను అడ్వర్టైజ్‌మెంట్ శాఖకు అధిపతిని చేశారు. మంచి సమర్థుడే. ఒకమారు రామనాథ్‌జీ అల్లుడు ఖైతాన్‌గారు అడ్వర్టైజ్‌మెంట్ శాఖకు వెళ్ళి మేనేజరయిన శ్రీనివాసన్‌ను కాదని మరొక వ్యక్తిని బయటికి పిలిచి ఏమో అడిగారు. దానికి శ్రీనివాసన్ అభ్యంతరం చెప్పారు. యజమానుల దగ్గరివారు అలా జోక్యం చేసుకుంటే క్రమశిక్షణ చెడిపోయి, పని పాడవుతుందని నిరసన తెలిపారు.

రామనాథ్‌జీకి ఇద్దరూ కావాలి. ఒకాయన అల్లుడు. రెండవవారు సమర్థుడైన ఉద్యోగి. కనుక అల్లుణ్ణి పిలిచి అలా ప్రవర్తించవద్దని, మేనేజరుతో సరాసరి వ్యవహరించమని చెప్పారు. శ్రీనివాసన్‌ను పిలిచి "అబ్బాయి! నా అల్లుడు ఖైతాన్ ప్రొడక్షన్ మేనేజరు; రేపు యజమాని కావచ్చు. కనుక జాగ్రత్తగా మసలు. నిరసనలు, అభ్యంతరాలు వద్దు" అని హితవు చెప్పి నాలుగైదు వందల ఇంక్రిమెంటూ ఇచ్చారు క్రమశిక్షణ విషయంలో గట్టిగా ఉన్నందుకు. ఇదే ఆయన వ్యాపార చాతుర్యం.

రామ్‌నాథ్‌జీ చివరి ఊపిరి వరకు జాతీయవాది 1932 లో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ అధిపతి కాగానే, పత్రిక శీర్షిక మధ్య త్రివర్ణ పతాకాన్ని చిహ్నంగా ముద్రించారు. ఖద్దరు కట్టడం, కాంగ్రెస్ జండాను ఎగరవేయడం పెద్ద నేరమైన ఆ రోజుల్లో పత్రిక ముఖపత్రం పైచివర రెండు త్రివర్ణ పతాకాలను చిత్రించడం మహా సాహసం.

రామ్‌నాథ్‌జీ ఆంధ్రప్రభ చేసిన సత్కార్యాలన్నిటినీ ప్రోత్సహించారు. హృదయ పూర్వకంగా అనుమతించి, ఆలంబనంగా ఉన్నారు. ఆంధ్రప్రభ రాయలసీమ క్షామ నివారణకు రెండుసార్లు లక్షలు సేకరించి ఇచ్చింది.

శ్రీ నీలం రాజు వెంకట శేషయ్యగారు సంపాదకులుగా ఉన్నప్పుడు భద్రాచలంలో రామదాసు ధ్యానమందిరం నిర్మాణానికి లక్షలు సేకరించింది ఆంధ్రప్రభ. ఇదేమిటి చాదస్తం!– అని చిన్నచూపు చూడకుండా రామ్‌నాథ్‌జీ అనుమతించారు ఈ పనికి. ఆ ధ్యాన మందిరాన్ని డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ ఆవిష్కరించారు.

ఇటీవల ఆంధ్రప్రభ మద్రాసు ఎడిషన్‌ను మరల ప్రారంభించినప్పుడు, పాత ఉద్యోగులను కొందరిని రామనాథ్‌జీ సన్మానించారు. వారిలో నేనూ ఒకణ్ణి.

ఇలాటి అపూర్వ గుణగణ సముపేతులు, అగర్భ సాహసవంతులు అయిన రామనాథ్‌జీ గోయంకా 1904 ఏప్రిల్ 18 న బీహార్ రాష్ట్రంలోని దర్భాంగా జిల్లా దిల్దార్ నగరంలో జన్మించారు. ఆరు నెలల పసికందుగా ఉన్నప్పుడే తల్లిని కోల్పోయారు. అప్పటి నుంచి పిన్నతల్లి పెంపకంలో ఆమె ప్రేమానురాగాలతో పెరిగారు. ఆమె ఆయనను దత్తత చేసుకుంది. ఆమె పర్యవేక్షణలోనే చిన్ననాటి చదువు పూర్తయింది.

రామనాథ్‌జీ స్వాతంత్ర్యోద్యమంలో విరిసిన, చరిత్రాత్మకమైన కాశీ విద్యాపీఠ్‌లో చేరారు. అక్కడ ఆచార్య జె. బి. కృపలానీ మొదలయిన వారు ఆయనకు గురువులు. 18 వ ఏట అక్కడ చదువు పూర్తయి పట్టభద్రులయిన

తర్వాత మేనమామల వ్యాపారంలో చేరి సుఖ్‌దేవ్ దాస్ రామ్‌ప్రసాద్ వ్యాపార సంస్థ ప్రతినిధిగా 1922 లో మద్రాసు చేరారు.

అప్పటి నుంచి ఆయన స్వాతంత్రోద్యమంలో చేరి, జాతీయవాదులతో భుజాలు కలిపి బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో పోరాటం ప్రారంభించారు. కాంగ్రెస్ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటూ వచ్చారు. ఈ సేవను గుర్తించిన గాంధీజీ 1924 లో ఆయనను హిందీ ప్రచార సభ యావజ్జీవ ధర్మకర్తగా నియమించారు.

బ్రిటిష్ ప్రభుత్వం ఆయనను లొంగదీసుకొనడానికి 1926 లో మద్రాసు శాసనమండలి సభ్యునిగా నియమించింది. ఆయన శాసనమండలిలో ప్రతిపక్షాల స్థానాలలో కూర్చుని జాతీయ సమస్యలపై కాంగ్రెస్‌తో సహకరించేవారు. 1927 లో ఆయన శాసనమండలిలో స్వతంత్ర పక్షానికి కార్యదర్శి అయ్యారు. సైమన్ కమిషన్ నివేదికపైనా, సుబ్రహ్మణ్య భారతి గేయాల నిషేధంపైన శాసనమండలిలో ఆయన తీవ్ర నిరసన తెలిపారు. "విద్యామంత్రి సుబ్రహ్మణ్య భారతి గీతాలు చదువ వచ్చునంటారు. న్యాయశాఖా మంత్రేమో నిషేధించారు. ఇదెక్కడి వైపరీత్యం!" అని ఆయన విమర్శిస్తే అందరూ గొల్లున నవ్వారు.

ఆయన 1932 లో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ప్రారంభంతో పత్రికా రంగంలో అడుగుపెట్టారు. అప్పటి నుంచి తుదివరకు 59 సంవత్సరాలు న్యాయం కోసం, అవినీతి నిర్మూలన కోసం నిర్భయంగా పోరాడారు. 1942 నాటికి ఎక్స్‌ప్రెస్ పత్రిక పుంజుకుంటూంది. అప్పుడు 'క్విట్ ఇండియా' ఉద్యమం ప్రారంభమయింది. దానిని ఆయన పూర్తిగా సమర్థించారు. గాంధీజీ ఇష్టానికి అనుగుణంగా, బ్రిటిష్ నిరంకుశత పట్ల నిరసనగా పత్రిక ప్రచురణను ఆపివేశారు. ఆ సమయంలోనే ఆయన జాతీయ వార్తాపత్రికా సంపాదకుల మహాసభకు అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. క్విట్ ఇండియా ఉద్యమానికి ప్రపంచ వ్యాప్తంగా బలం కూడగట్టుకోడం కోసం ఆయన రహస్యంగా "ఇండియా రేవేజ్డ్" (విధ్వస్త భారతదేశం) అనే పుస్తకాన్ని ప్రచురించి అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్‌కు భారతదేశంలోని అమెరికా ప్రతినిధి ద్వారా అందజేశారు. దానిలో మన దేశంలో బ్రిటిష్ పాలకులు జరిపిన అత్యాచారాలు చిత్రితమయ్యాయి. ఆ పుస్తకాన్ని బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది.

రామనాథ్‌జీ "క్విట్ ఇండియా" అనే మరొక పుస్తకాన్ని ప్రచురించారు. ఇది చాలా ప్రజాభిమానాన్ని చూరగొన్నది. రామనాథ్‌జీ అజ్ఞాతవాసంలో వున్న పలువురు నాయకులకు ఆశ్రయమిచ్చి ఉద్యమానికి ఎంతగానో తోడ్పడ్డారు.

దానికి గుర్తింపుగా ఆయనను కాంగ్రెస్ రాజ్యాంగ నిర్మాణ సభ సభ్యునిగా నియమించింది.

ఆయన నిజమైన కాంగ్రెస్‌వాది. గాంధీజీకి 1920 లో చేసిన వాగ్దానం ప్రకారం యావజ్జీవం ఖద్దరు ధరించారు. వ్యసనాలకు దూరంగా ఉన్నారు. స్వాతంత్ర్యానంతరం కేంద్రంలో మంత్రి పదవి ఇవ్వ జూపగా సవినయంగా "నా పత్రికే నాకు రాజ్యం" అంటూ నిరాకరించారు. 1969 లో కాంగ్రెస్‌లో చీలికలు ఏర్పడేవరకు ఆయన అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యులుగా ఉన్నారు. శ్రీమతి ఇందిరాగాంధీ విధానాలను ప్రతిఘటించారు. దానివల్ల ఆయన ఎన్నో చిక్కులు పడవలసి వచ్చింది. అత్యయిక (ఎమర్జెన్సీ) పరిస్థితిలో ఆయన, ఆయన కుమారుడు భగవాన్‌దాస్‌జీ, కోడలు శ్రీమతి సరోజ్‌జీ ఎప్పటికప్పుడు విపత్తులను ఎదురుచూస్తూ వుండేవారు. అయినా ఆయన భయపడలేదు. ఆయన పత్రికా సముదాయం ప్రభుత్వాన్ని విమర్శించడం మానలేదు. అత్యయిక పరిస్థితి అంతమై, 1977 లో జరిగిన ఎన్నికలలో ప్రతిపక్షాల విజయం ఇండియన్ ఎక్స్‌ప్రెస్ విజయంగానే దేశ ప్రజలు భావించారు.

రామనాథ్‌జీ 1987 లో 83 వ ఏట నైతిక మూల్యాల పతనానికి, ఉన్నతాధికార వర్గాలలో వ్యాపించిన అవినీతికి నిరసనగా మహాయుద్ధం ప్రారంభించారు. ఈ యుద్ధం బోఫార్స్, ఫెయిర్‌ఫాక్స్ మొదలయిన అన్యాయపు లావాదేవీలను బట్టబయలుచేసి, రాజీవ్‌గాంధీ ప్రభుత్వం కూలిపోవడానికి కారణమైంది. ఈ మహాయుద్ధ సమయంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఆయనపై 210 అభియోగాలు మోపి, 600 మంది గూఢచారులతో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ శాఖలపై ఏకకాలంలో దాడి జరిపింది. అయినా ఆయన నిబ్బరం చెక్కు చెదరలేదు.

"ఒక పత్రికా సంపాదకుడూ, ఒక పత్రికా యజమాని స్వేచ్ఛగా వ్యవహరించదలిస్తే ఎవరు అడ్డుకోగలరు? మనం నిజాయితీపరులమనీ, ధైర్యవంతులమనీ తెలిసి కూడా మనమీద కత్తి గట్టరనుకోడం పొరపాటు. కాని, అవినీతిపరులపై మాత్రమే వారు ప్రతాపం చూపగలరు. అధికారాన్ని చేతిలో ఉంచుకొని ఆడేవాళ్ళు ఒకరకంగా పిరికివాళ్ళు. కేంద్రంలో ప్రభుత్వం మారిన ప్రతిసారీ, అధికార కేంద్రం మారిన ప్రతిసారీ, నేను జో హుకుం అనవలసివస్తే అందరూ నన్ను బెదిరించడానికి ప్రయత్నిస్తారు. తమ ధైర్యసాహసాలను గురించి బాహాటంగా గొప్పలు చెప్పుకొనే ఈ సిగ్గుమాలిన సంపాదకులు, యజమానులు రాజకీయ నాయకుల ముందు చిన్న చిన్న వరాల కోసం మోకాళ్ళమీద నిలబడుతారు. ఆ వరాలు దొరక్కపోతే నీలాపనిందల్లు

మోపుతారు" అని ఆయన 1985 లో ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ ప్రతినిధితో మచ్చటించి నవ్వుడన్నారు.

ఇంత గొప్పవాడయినా రామనాథ్‌జీ "నేను సాధారణ మానవుణ్ణి. ఏదో కాకతాళీయంగా వార్తా పత్రికా వ్యాపారరంగంలో దిగాను. కనుకనే నా పేరు పదిమందికీ తెలిసింది. లేకపోతే నాబోటి వాడిని ఎవరు పట్టించుకుంటారు?" అంటారు వినయభరంతో.

పత్రికా సమ్రాట్, మేరునగధీరుడూ, వెరుపెరుగని వీరుడూ ఆయిన రామనాథ్‌జీ గోయంకా చివరి వరకూ తను నమ్మిన సిద్ధాంతాల కోసం పోరాడుతూ 1991 అక్టోబర్ 5 వ తేదీ శనివారం తెల్లవారుజామున 3.00 గంటలకు కన్నుమూశారు. దేశం గొప్ప వ్యక్తిని కోల్పోయింది.

రామనాథ్‌జీ ఏకైక పుత్రుడు భగవాన్‌దాస్‌జీ గోయంకాతో నాకు సన్నిహితత్వం ఉండేది. ఆయన ప్రోత్సాహంతోనే నేను ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో తెలుగుతల్లి, మరుపురాని మనీషి మొదలైన శీర్షికలు నడిపాను. అవి ఎంతో పాఠకప్రియమైనవి. ఆయన అకాలంలో మృత్యువు వాత పడ్డారు. ఆయనకూ, రామనాథ్‌జీ గోయంకాకు ఇవే నా కృతజ్ఞతతో నిండిన కైమోడ్పులు.

(ఆదివారం ఆంధ్రప్రభ – 13–10–91)

# పార్లమెంటరీ వ్యవహార పండితుడు డాక్టర్ పట్టాభిగారు

మహాపురుషుల తీరే వేరు; అది అనితరసుసాధం, అనితర సుబోధం. పెరుగుతున్న కొద్దీ వటవృక్షంలాగ వ్యాపించి విస్మయం కలిగించడమే కాదు; అణురూపంలో అణగి మణగి ఉన్ననాడే మన్ననలందుకొనే విలక్షణత దానిది. పూవు పుట్టగనే పరిమళిస్తుందంటారు కదా మరి! అలాటి సురభిల సౌగంధిక సుమమే డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు.

పదిలక్షల మందిలోనైనా వదలక పట్టియిచ్చే సమున్నత సింహసంహననం, మాటలలో, చేతలలో, వ్రాతలలో అంచులువార పెల్లుబికే ఆంధ్రత్వం, అనర్గళమైన వాగ్ధాటి, అపారమైన విజ్ఞానం, అపూర్వ ప్రతిభా ప్రాభవం, అంకెల సంకలనంలో అనిదంపూర్వమైన చాతురి, తిరుగులేని తర్కం, పాఠకుని ప్రగాఢ శక్తివరవశునిచేసే రచనాశక్తి — జున్నుకట్టినవారు ఆయన అంటే, ఆయన స్వరూపాన్ని కొంత సమీపించగలమేమో!

పట్టాభిగారి జననం 1880 నవంబరు 24 వ తేదీన పశ్చిమ గోదావరి జిల్లా గుండుగొలను గ్రామంలో. తలిదండ్రులు కలవారు కానందున ఆయన బాల్యంలో కష్టపడి చదువు సాగించవలసి వచ్చింది. ఈ పరిశ్రమ వల్లనే కాబోలు ఆయన తెలివి తేటదేరి, బుద్ధి పదునుదేరి, జ్ఞాపకశక్తి గడిదేరింది. ఆయన ఏకసంత గ్రాహి; ఒక్కమారు కన్నదీ, విన్నదీ మనసులో ముద్రపడి పోవలసినదే. కనుకనే అన్ని పరీక్షలలోను కన్నాకై సాటి విద్యార్థుల మనసులనే కాక ఉపాధ్యాయుల ప్రేమాదరాలను చూరగొన్నారు. విద్యార్థి వేతనాలతోనే చదువు కొనసాగింది. ఆయన 1897 లో బందరు నోబుల్ కళాశాలలో చేరి ఎఫ్. ఏ. పరీక్ష ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులై, మద్రాసులో బి. ఏ; ఎం. బి. సి. ఎం. పరీక్షలలో పారంగతులై బందరులో స్థిరపడి వైద్యవృత్తి ప్రారంభించారు; పెద్దపేరు పొందారు.

ఈ స్వయం కృషి సత్ఫలం వల్లనే ఆయనలోని పెక్కు శక్తులు సంపూర్ణంగా వికసించాయి. దానిలో ఒక్కటి జంకుకొంకులు విడనాడి సత్యాన్ని

చెప్పే సాహస స్వభావం. ఈ సాహసానికి ఆలవాలమైనది జలపాతంలాంటి వాగ్ధార. "ఆ వేగంలో మాటలకంటె ముందు భావం, భావంకంటె ముందు యుక్తి. యుక్తికంటె ముందు సిద్ధాంతం నడుస్తూ ఉంటవి. ఆ ఉపన్యాసం మధ్య ఎవరైనా కొంటెమాటో, కుంటిప్రశ్నో విసిరారా ఇక వారు అణగారిపోయారన్న మాటే. తోటాను త్రిప్పి కొట్టుతారు పడేలుమని తగిలేటట్లు! అందుకని ఆయనకు అడ్డుతగలడానికి జడుస్తారు. ప్రతివాది భయంకరుడని ఊరికే వచ్చిందా బిరుదాయనకు? ఈ సాహసమే ఆయనను వాదకోవిదునిగా తీర్చిదిద్దింది; 'పార్లమెంటరీ వ్యవహారాల పండితుని'గా పండించింది.

విద్యార్థి దశలోనే ఆయన వాదచణత్వం గురించి నిదర్శనాలు చెబుతారు. బందరులో ఒకమారు ఒక సభ జరిగిందట. దానికి జిల్లా కలెక్టర్ తెల్లదొర అధ్యక్షుడు. అతడు సభను నడపడంలో తప్పుప్రొసీజరు అనుసరించాడు. అది సభాస్తారులలోను పెక్కుమందికి తెలీలేదు. వెనుక బెంచీలలో కూర్చున్న పట్టాభిగారది చూచి సహించలేకపోయారు. ఉడుకు రక్తం. 'ప్రెసిడెంట్ నీ ప్రొసీజరు తప్పు' అని కేక వేశారట. అది తెల్లదొరల సామ్రాజ్యం. అందులోను కలెక్టరు. కోపంతో మండిపడ్డాడట. పట్టాభిగారు లేచి పార్లమెంటరీ ప్రొసీజరు తన సహజ వాగ్ధాటితో ఏకరువు పెట్టారట. ఆ స్వభావం ఆయనకు రాజకీయ రంగంలో వైయక్తికంగా కొంత నష్టం కలిగించినా, కాంగ్రెస్ తీర్మానాలు, కార్యక్రమం చక్కదిద్దడంలో మార్గదర్శకమైంది.

ఆయన వైద్యుడుగానే ఉండి ఉంటే ధన్వంతరిని మించేవారని పెద్దలంటారు. వైద్యంలోను ఆయనది మంచి చేయివాసే. వైద్యునికి కావలసింది నిదానం. అది పూర్తిగా ఆయనలో ఉండేది. ఆయన వైద్యవృత్తి ప్రారంభంలో పడిన పాట్లను గురించి ఒకమారు ఉపన్యసించారు. దానిలో కొన్ని అంశాలను పేర్కొంటాను :

"నేను 1906 లో బందరుకు ప్రాక్టీసు చేయటానికి వచ్చినపుడు మందులు ఇంకా పట్నమునుంచి నాకు చేరలేదు. అప్పటిలో నన్ను వైద్యానికి పిల్చేవాళ్ళు ఎవరున్నారు గనుక! నా అదృష్టవశాత్తు మా మాస్టరుగారు దొరికారు – నాకు వైద్యానికి. సంస్కృత పండితులు. చూచేవాళ్ళెవరున్నారు? బంక విరేచనాలు పట్టుకుంటే నన్ను పిలిచారు, మొక్కపాటి సూర్యనారాయణ శాస్త్రుర్లుగారు. నా దగ్గర మందులు లేవాయె – పోనీ ఏ ఓలియం రెజెనియో అని చెప్పి మభ్యపెట్టడానికి. ఏమి చేస్తాను? పట్టి ఆముదం రెండేసిగంటలకొకసారి రెండు చెంచాలు యివ్వమన్నాను. మొదటిడోసు పడేటప్పటికల్లా చప్పున కడుపులో మెలెయ్యడం కట్టింది. మూడురోజులిట్లా పట్టి ఆముదమే యిచ్చాను. రోగం కుదిరింది,

అప్పుడే వూళ్ళో టాక్ పడింది. కొత్త డాక్టర్ వచ్చాడని, ఆముదంతో రోగం కుదిర్చాడనీ.

"మరునాడు ఇంకో కేసు వచ్చింది. ఒక బండి తోలేవాడి అన్న, ఇస్త్రీ నేసేవాడికి ప్రాణంమీదికి వచ్చింది. కాళ్ళు చేతులు చల్లబడ్డాయి, కింద పెట్టారు. నన్ను పిలిచారు. భలే అదృష్టవంతుడినిరా – అనుకున్నా. ఏముంది? తేలికైన కేసు; నిమోనియా – ఏడురోజులు – తర్వాత క్రైసిస్; జ్వరం జారి కొలాప్సు వచ్చింది. చవ్వన గొంగళి కప్పించాను. కాస్త బ్రాంది యిప్పించాను. మంచం మీద పండుకోబెట్టించాను. కాసేపటికల్లా కేసు రికవర్ అయింది. ఊళ్ళో రెండు వందలమంది బళ్ళవాళ్ళకు పేరు పాకిపోయింది; కొత్త డాక్టర్ వచ్చాడని, చచ్చేవాళ్ళని బ్రతికిస్తున్నాడని, డబ్బు అడగడని కూడా!.... ఏడు సంవత్సరముల తర్వాత ఆ బండివాడు ఒక కుర్చీ చేయించి తీసుకువచ్చి యిచ్చాడు. ఇప్పటికీ వుంది మా యింట్లో."

నిజం చెప్పడమనేది కొత్త వైద్యునికీ, పాతవైద్యునికీ, అందరికీ అవసరమే నన్నది ఆయన వైద్యవృత్తిలో విజయానికి కీలకం. వైద్యుడు రోగి కుటుంబంలో ఒక్కడుగా తనను భావించుకోవాలనీ, కేసు అయిపోగానే తనదోవన తాను దులుపుకొని పోరాదని, ఎప్పటికప్పుడు వైద్య గ్రంథాల పఠన మననాలు కొనసాగిస్తూ ఉండాలని, చదువు ఎప్పుడూ మనను చెరచదని ఆయన సూత్రాలు. ఇవే రాజకీయ జీవితంలోను పట్టుగొమ్మలుగా ఉండినవనడంలో సందేహంలేదు.

బందరులో వైద్యవృత్తి ప్రారంభించినప్పుడే, 1906 లోనే – ఆయన మనస్సు దేశసేవవైపు, కాంగ్రెస్‌వైపు మొగ్గింది. అప్పుడే ఆ సంస్థలో చేరారు. వైద్యవృత్తీ, దేశసేవాసక్తీ రెండుపాయలై ప్రవహించడానికి వీలులేదని గ్రహించి, వృత్తి మానివేసి పూర్తిగా దేశసేవకే జీవితం అంకితం చేయడానికి నిశ్చయించారు. ఇంతలో వంగదేశంలో 'వందేమాతరం' ఉద్యమం తలయెత్తింది. దేశం అంతటా జాతీయభావాలు తామరతంపరగా అల్లుకున్నాయి. దేశంలో వివిధ ప్రాంతాలలో జాతీయ విద్యాలయాలు నెలకొనసాగాయి. ఆంధ్రదేశంలోను కొందరికి ఈ భావాలు పుట్టాయి. పట్టాభిగారు శ్రీ కోపల్లె హనుమంతరావు, కృష్ణరావుగార్లు మున్నగు వారితో కలిసి ఆంధ్ర జాతీయ కళాశాలను నెలకొల్పారు; 'ఆంధ్ర భాషాభివృద్ధి మండలి' అనే పేర సాహిత్య సంఘాన్ని స్థాపించారు.

అప్పుడే ఆయన రచనా పాటవానికీ, పత్రికా నిర్వహణకు గీటురాయిగా ఒక సంఘటన జరిగింది. కృష్ణా పత్రిక "తెల్లవారిని తుపాకులతో కాల్చుట" అన్న వ్యాసాన్ని ప్రకటించినందుకు రాజాగ్రహానికి గురి అయింది. అప్పటి జిల్లా

కలెక్టరు స్కాట్. అతడు చాలా దురుసుగా ప్రవర్తించేవాడు. అతడు తోక తొక్కిన త్రాచుపాములాగ మండిపడుతూ కృష్ణాపత్రికపై చర్య తీసుకొనడానికి ప్రయత్నించాడు. పత్రిక యజమానులను పిలిపించి అలాటి వ్యాసం ప్రకటించడానికి కారణమైన వారిని తొలగించవలసిందని, అలా చేస్తే పత్రికను ప్రాసిక్యూషన్ చేయనని మధ్యేమార్గంగా సలహాయిచ్చాడు. పత్రిక మూసివేయడమే ఉచితమని పెద్దలు పలువురు సలహా యిచ్చారట. కాని, పట్టాభిగారు, స్కాట్ సలహా ప్రకారం ఆ వ్యాసం ప్రచురణకు బాధ్యులైన సంపాదకులు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారికి పత్రికతో సంబంధం తాత్కాలికంగా తప్పించి, మూడేళ్ళపాటు పత్రికను మరొకరి పేర నడిపి, మరల దానిని కృష్ణారావుగారికి అప్పగించారట.

ఇంతలో రాజకీయ రంగంలో పెద్ద మార్పు వచ్చింది. బాలగంగాధర తిలక్ నాయకత్వం క్రమంగా సన్నగిల్లసాగింది. 1920 లో గాంధీజీ రాజకీయాలలో అడుగిడినారు. దీనితో పట్టాభిగారి ప్రజ్ఞ పారమిత, అపారమిత అయింది. గాంధీజీ నాయకత్వంలో నడచిన ప్రతి ఉద్యమంలోను పట్టాభి ముందు కురికారు. 'జన్మభూమి' అనే ఆంగ్ల వారపత్రికను నడిపారు. గాంధీజీకి భాష్యకారులుగా ఆయన అప్పటినుంచే విఖ్యాతిపొందారు. తర్వాత ఆయన వ్రాసిన "గాంధిజం–సోషలిజం" అనే గ్రంథమే ఆయన భాష్యకర్తృత్వానికి తార్కాణం. దానిలో ఆయన తన విమర్శన పటిమతో గాంధీజీ ఆశయం, ధర్మప్రయోజనం, కర్మాచరణ మొదలయినవి కూలంకషంగా చర్చించి, మేధావులను మెప్పించి, సామాన్యులకు కనువిప్పు కలిగించారు.

భాషా రాష్ట్రోద్యమం, ఆంధ్రరాష్ట్రోద్యమం 1913 లోనే పుట్టినా, 1927 వరకూ కాంగ్రెస్ కూడా దానికి అధికారముద్ర వేయలేదు. పట్టాభిగారు ఈ ఉద్యమంలో ప్రధానపాత్ర వహించారు. స్వరాష్ట్ర భావన స్వరాజ్య భావనలో అంగమేనని, దానికి పూరకమే కాని మారకం కాదని ఆయన ప్రచారం చేశారు. "ఇండియన్ నేషనలిజం" అనే గ్రంథంలో ఆయన జాతీయ భావనకు చక్కని వ్యాఖ్యానం చేశారు. "ఆంధ్రరాష్ట్రం-అనుకూల ప్రతికూల వాదాలు" అనే మహాగ్రంథంలో భాషాప్రయుక్త రాష్ట్రాలు భారతజాతి సమైక్యానికి చక్రంలో ఆకులులా, పూవులో రేకులులా ఎలా పరస్పర ప్రవర్ధకాలో స్పష్టపరిచారు. 1927 లో కాంగ్రెసు మహాసభ లక్నోలో జరిగింది. ఆ సభలో ఆయన భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణం తీర్మానాన్ని ప్రతిపాదించి, ఆమోదింపజేశారు. దానిని లోకమాన్యుడు కూడా బలపరచడం గొప్ప విషయం. అప్పుడే భాషా రాష్ట్ర సిద్ధాంతానికి ప్రతీకగా ఆంధ్ర కాంగ్రెసు కమిటీ నెలకొల్పబడింది,

ఆయన 1936 లో ఆంధ్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షులై దానిని 1940 వరకు నిర్వహించారు. అప్పుడే ఆయన రాష్ట్రమంతటా పర్యటించి ఆంధ్రరాష్ట్ర వాదం అందరికీ ఒప్పించారు. ముఖ్యంగా "ఆంధ్రరాష్ట్రం మాకు వద్దు" అని భీష్మించుకొని కూచున్న రాయలసీమవారిని ఒప్పించి, ఒక కొలికికి తెచ్చారు. కరుడుకట్టుకున్న ఆంధ్రరాష్ట్ర ప్రతికూలవాదుల అపోహలను తమ తర్కజటిల మైన వాదవజ్రాయుధంతో తెగటార్చి, తెలుగువారంతా ఒక్కటే అనే సద్భావానికి నారులు పోశారు.

జాతీయతాభావనావాహిని ఒక్క బ్రిటిషు భారతంలోనే పశ్చిమవాహినిగా ప్రవహించడంవల్ల కలిగే ప్రమాదాలను ఆయన ఏనాడో గుర్తించారు. స్వదేశీ సంస్థానాలలోని ప్రజలు స్వతంత్రులు కారని, బానిసలకు బానిసలని, వారికి రాజకీయ చైతన్యం కలిగించాలని ఆయన దానికి పూనుకున్నారు. 1936 లో కరాచీలో అఖిల భారత సంస్థాన ప్రజామండల్ కాంగ్రెస్ జరిగింది. దానికి ఆయన అధ్యక్షులు. ఆయన సారథ్యాన సంస్థాన ప్రజోద్యమం ముమ్మరంగా ముందుకు సాగింది. అప్పటినుంచి కాంగ్రెసుకు సంస్థాన ప్రజలతోను సన్నిహిత త్వం ఏర్పడింది. ఈ ఉద్యమంలో ఆయన కార్యదక్షత ముమ్మూర్తుల మూర్తీభ వించింది. ఆయన తన ప్రసంగంలో సంస్థానాల పరిపాలనలోని అవకతవకలు, రాజుల రాసక్రీడలు, ప్రజల కష్టనష్టాలు అంకెల పొంకంతో కాశీమజీలీ కథల లాగ చెప్పుకుపోతుంటే శ్రోతలు నోరు తెరచి, కన్నులు, చెవులు అప్పగించి వినవలసిందే; దానితో వారి రాజులు జనక మహారాజులు; రామచంద్రులు కారని నమ్మకం కుదరవలసిందే; వారు తమ రక్తం తాగే తోడేళ్ళనే ఆవేశంతో మైమరచి పోవలసిందే.

ఇంతటి మేధావి కాంగ్రెసు అధ్యక్షుడుగా వుండి ఉద్యమానికి సారథ్యం వహించడం ఉచితమని గాంధీజీ మొదలయిన నాయకులు భావించి 1938 లో త్రిపురలో జరిగిన కాంగ్రెసు మహాసభకు ఆయనను అధ్యక్షుడుగా ఎన్నుకో వలసిందని కాంగ్రెసు సభ్యులను కోరారు. కాని సుభాష్‌చంద్రబోస్ పోటీపడడం వల్ల ఆయనకు ఆ పదవి దక్కలేదు. 'పట్టాభి పరాజయం నా పరాజయం' అని గాంధీజీ ఆవేదన వెలిబుచ్చారు. పట్టాభిగారికి ఈ వాంఛితం స్వాతంత్ర్యానంతరం 1949 లో ఈడేరింది.

అవి 1941 గడ్డుదినాలు. ద్వితీయ ప్రపంచ సంగ్రామం ముమ్మరంగా మారణ హోమం జరుపుతున్న భయంకర కాలం. భారత రాజకీయ రంగంలోను విచిత్ర పరిణామం ఏర్పడింది. గాంధీజీ వైయక్తిక సత్యాగ్రహం ప్రారంభించారు. ఆయన భాష్యకారుడు పట్టాభిగారు కూడ 1941 మార్చి 21 న అరెస్టుచేయ

ఱడ్డారు; మరల ఎనిమిది నెలలకు విడుదలయ్యారు. యుద్ధంలో ఎవరు జయించినా భారతదేశం స్వశక్తిమీదే స్వాతంత్ర్యం సంపాదించవలసి వుందనే సత్యం నాయకు లందరు గుర్తించారు; ఏ తెల్లవారినీ దేశంలో అడుగుపెట్ట నీరాదనే నిర్ణయం చేసుకొన్నారు. గాంధీజీ ఈ నిర్ణయంతోనే "క్విట్ ఇండియా" ఉద్యమం ప్రారంభించాలని ఆలోచనలు సాగించారు. పట్టాభిగారు గాంధీజీని బలపరిచారు. 1942 ఆగస్టులో అఖిల భారత కాంగ్రెస్ సమావేశం బొంబాయిలో జరిగింది. క్విట్ ఇండియా తీర్మానాన్ని ఆ సమావేశం ఆమోదించింది. సమావేశం అనంతరం బొంబాయి నుండి బందరుకు వస్తున్న పట్టాభిగారిని ప్రభుత్వం అరెస్టుచేసి అహమదాబాద్ కోటలో నిర్బంధించింది. ఈ "క్విట్ ఇండియా" ఉద్యమంలో పట్టాభిగారి పాత్ర అతి ముఖ్యం. ఈ ఉద్యమం ఎలా నడవాలో ఇదివరకే క్షుణ్ణంగా ఆలోచించి 'ఆంధ్ర సర్క్యులర్' అన్న పేరుతో పథకం సిద్ధపరిచారు. దానిని చూచిన మీదట ప్రభుత్వం దిగ్భ్రాంతమయింది. ఆ ఉద్యమానికి 'ఆంధ్ర సర్క్యులర్' జీవగర్ర అని టాటన్‌హాం కూడా గాంధీజీకి వ్రాసిన లేఖలలో తెలియజేశాడు.

అహమద్‌నగర్ కోట కారాగారంలో ఆయన ఉన్న మూడు సంవత్సరాల లోను వ్రాసిన గ్రంథాలలో ముఖ్యమైంది "ఫెదర్స్ అండ్ స్టోన్స్". ఆ కారా గారం మహా నాయకుల కందరికీ ఆవాసమై విజ్ఞాన నిలయమా అన్నట్టు ఉండేది. నాయకులందరు తీరిక వేళల్లో తమ చిత్తవృత్తికి అనుగుణమైన వినోదంతో ఆనందించేవారు. పట్టాభిగారికి పక్షి ఈక లేరడం వినోదం. వాటితో ఆయన ఒక్క తలగడా తయారు చేశారట. ఆయన సాధారణంగానే చాల పొదుపరి అని పేరు పొందారు. వాడిన తపాలా కవర్లను చింపి వాటి వెనుక వ్రాయడం, భోజనం అయి చేతులు గడుక్కున్న పిదప చేతిని చిత్తు కాగితానికి తుడిచివేసి, ఆ కాగితాన్ని పొయ్యి రాజవేయడానికి వాడడం లాంటివి ఎన్నో ఉన్నాయి ఆయన సరదాలు. పక్షి ఈకలను కూడా ఆయన ఇలాగే ఏరి తలదిండు తయారుచేశారు. ఈ ఈకల సేకరణమే తమ గ్రంథానికి "ఫెదర్స్ అండ్ స్టోన్స్" అని పేరు పెట్టడానికి కారణమయి ఉంటుందేమో!

ప్రపంచ యుద్ధానంతరం బ్రిటిషు ప్రభుత్వం భారత దేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడానికి అంగీకరించింది. అప్పుడు జరిగిన రాయబారాలలో పట్టాభిగారు కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులుగా ప్రధానపాత్ర నిర్వహించారు. స్వాతంత్ర్యాత్పూర్వం తొలిసారిగా ఏర్పడిన రాజ్యాంగ పరిషత్తులో ఆయన కూడా సభ్యులుగా ఉన్నారు. స్వాతంత్ర్యానంతరం ఆయన ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి

చాలా కృషిచేశారు. కాంగ్రెస్ కార్యవర్గం ఆంధ్రరాష్ట్ర నిర్మాణంలోని సాధక బాధకాలను పరిశీలించడానికి ప్రత్యేక సంఘం నియమించింది. దానిలో జవాహర్ లాల్ నెహ్రూ, వల్లభాయి పటేల్, డాక్టరు పట్టాభిగారు సభ్యులు. ఈ ముగ్గురూ రాష్ట్ర నిర్మాణంపై తమ అభిప్రాయాలను సూచిస్తూ అందజేసిన నివేదిక 'జె. వి. పి. రిపోర్టు' అని ఖ్యాతి పొందింది.

ఆయన మధ్యప్రదేశ్ గవర్నర్‌గా నియమించబడ్డారు. దానితో ఆయన తెలుగువారికి అన్య రాష్ట్రాలలో గొప్పకీర్తి తెచ్చారు. ఆయన ఒకమారు నాగపూర్ న్యాయకళాశాల వార్షికోత్సవంలో ప్రసంగించి, తమ అత్యద్భుత ప్రసంగ వైదగ్ధ్యంతో, న్యాయశాస్త్ర పాండిత్యంతో న్యాయవాదులను, న్యాయాధీశులను చకితులను చేశారు. ఆ ప్రసంగాన్ని, న్యాయశాస్త్రంపై ఆయన ఇచ్చిన ఉపన్యాసాలు మరికొన్నిటిని మధ్యప్రదేశ్ ప్రభుత్వం పుస్తకరూపంలో ప్రచురించింది. గవర్నర్ పదవినుండి విరమించినపిదప ఆయన హైదరాబాద్‌లో స్థిరపడ్డారు. కొంతకాలం అస్వస్థులుగా వుండి 1959 డిసెంబర్ 17-వ తేదీన అస్తంగతులయ్యారు.

సహస్రమాస జీవిఅయిన ఆయన దేశభక్తుడుగాను, మేధావిగానేకాక మహేతిహాసకుడుగాను శాశ్వతత్వం సంపాదించుకున్నారు. కాంగ్రెస్ చరిత్ర ఆయన మహోద్గ్రంథం. వుమన్ ఇన్ హిందూ సొసైటీ, బ్రిటిష్ ఎంపైర్ అండ్ లిమిటెడ్, స్వదేశ సంస్థానాలు మొదలయినవి ఆయన పేరుపొందిన రచనలలో కొన్ని, ఇవన్నీ చాలవరకు కారాగారంలో వ్రాసినవే.

ఆయన ధన్యజీవి; తను నడిపిన ప్రతి ఉద్యమం ఫలితాలు కలగానేకాక ఇలలో నిక్కలగాచూచిన సిద్ధసంకల్పులు. స్వాతంత్ర్య సంపాదన చూచి సంతసించారు. తాము ప్రతిపాదించిన భాషారాష్ట్రోద్యమం పెరిగి ఫలించి, ఆంధ్ర రాష్ట్రం ఏర్పడడం, తక్కిన భాషారాష్ట్రాలు నెలకొనడం, బొంబాయి విడిపోయి మహారాష్ట్ర గుజరాత్ రాష్ట్రాలు నెలకొల్పాలనే నిర్ణయం కావడం చూచారు. సంస్థానాల విలీనీకరణం కన్నులారా కాంచారు. జమీందారీరద్దు ఉద్యమానికి పునాదివేసి, ఫలితాలు పరికించారు. ఆయన కన్నుమూయడంతో "నో చేంజర్సు"-పాతతరంవారు పూర్తిగా కనుమరుగైపోయారు.

ఆయన వట్టి మాటలలో మేటి మాత్రమే కాదు; క్రియాదక్షుడు కూడా. సామాన్యంగా మేధావులు మేఘ వీథులలో విహరిస్తూ, మేదినిమీద కాళ్ళంటనీరు, పట్టాభిగారు మేధతోపాటు మేదినిని అంటిపెట్టుకోవాలన్నవారే. ఆంధ్ర జాతీయ కళాశాల, ఆంధ్ర బ్యాంకి, ఆంధ్ర ఇన్‌ష్యూరెన్సు కంపెనీ, కృష్ణా కో-అపరేటివ్

బ్యాంకి, భారత లక్ష్మి బ్యాంకి, హిందూస్తాన్ ఇన్‌ష్యూరెన్స్ ఇంకా ఎన్నో ఆయన క్రియాదక్షతకు స్వరూపాలు. ఆయన ఒకమారు శ్రీ ప్రకాశం జన్మ దినోత్సవసభలో తమకూ ఆయనకూ గల వ్యత్యాసాన్ని వివరిస్తూ ప్రసంగించారు. దానితో ఆయన ఎంతటి వ్యవహర్తో, క్రియానిపుణుడో స్పష్టమవుతుంది.

"ప్రకాశంగారు కేవలం నేలపైనే నలుగురికీ అందుబాటులో కనిపిస్తూ నడుస్తారు. నేను నీటిపైన కూడా పయనం చేయగలను. కనిపించకుండా నీటి అట్టడుగున సాగిపోగలను. ప్రకాశంగారు నేటి సంగతే ఆలోచించరు. నేను ఎల్లుండి సంగతి కూడా ఇవాళే ఆలోచిస్తాను. ఆయనకు ఆయనను గూర్చిన ఆలోచనే ఉండదు. నాకు నన్నుగూర్చిన ఆలోచనే — పరాయివారిని గురించి కూడా— ఏ నా విషయం కోసమో ఆలోచిస్తాను." పట్టాభిగారి ఈ వచనాలు ఆయన స్వరూప స్వభావాలకు నిర్వచనాలవుతూ, "మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం నచ సుఖం" అన్న భర్తృహరి మాటలను తలపింపవూ?

కాని, ఆయన అంత్యకాల జీవితంచూస్తే ఒక సందేహం పొటమరిస్తుంది. ప్రతిభలో, వయసులో పండువారిన ఆయన ప్రాభవం స్వాతంత్ర్యోద్యమంలో ఉన్నంతగా, స్వాతంత్ర్య సంసిద్ధికి తర్వాత కనిపించదేమి?—అని. ఐదు దశాబ్దాల పాటు ఏకైక ధ్యేయంతో జాతీయోద్యమంలో నిర్విరామ కృషిచేసిన ఆయన పలుకుబడి నేడు కనిపించదేమి?— అని. దానికి కారణం ఆయన లోపాలేవీకావు. స్వాతంత్ర్యం సిద్ధించనుండగానే, జవాహర్‌లాల్ నెహ్రూ ప్రాబల్యం పాతుకో సాగింది; గాంధీజీమతం మటుమాయమై పోసాగింది. ఇది నెహ్రూ యుగం. పట్టాభిగారు గాంధీ భాష్యకారులు; గాంధీధర్మమే లోకకల్యాణ కారకమని నమ్మినవారు. కనుక నెహ్రూ సోషలిస్టిక్ పద్ధతి భావనలో ఆయనకు స్థానం లేకపోయింది. ఆయన అప్పటికీ ఇప్పటికీ ఎప్పటికీ నోచేంజరు! మరి గాంధీమతం వీడి మరొక మతం చేపట్టడం ఎలా? ఇదే ఆయన తుదినాళ్ళలో వెనుకబడడానికి కారణమనుకుంటాను. ఇదే ఆయన గాంధీ మతనిష్ఠకు, ఆత్మబల పటిష్ఠతకు నిదర్శనం.

(భారతి — జనవరి, 1960)

# ప్రాచ్య కవితా కోకిల సరోజినీదేవి

**తెలుగు వారి కోడలు సరోజినీదేవి 1879 ఫిబ్రవరిలో జన్మించి పుట్టిన ఇంటికీ, మెట్టిన ఇంటికీ, భారత దేశానికీ, ప్రపంచ నారీలోకానికి కీర్తిని గుట్టలుగా పోసిన గొప్ప ఇల్లాలు. ఆమె 106వ జయంతి సందర్భంగా ఈ వ్యాసం ప్రచురితం.**

కూజంతం రామ రామేతి
మధురం మధురాక్షరమ్,
అరుహ్య కవితా శాఖాం
వందే వాల్మీకి కోకిలమ్.

అని ఆనాడు ఆదికవి వాల్మీకిని కవి కోకిలగా వర్ణించారు. ఈనాడు భారత కోకిలగా కాక ప్రాచ్యకోకిలగా ప్రశంసలు పొందిన కవయిత్రి సరోజినీదేవి. పదకొండవ ఏటనే ఆంగ్లంలో అపూర్వమైన కవిత చెప్పిన భావుకురాలు ఆమె. 13వ ఏట ఒక గీతం రచించి కవయిత్రిగా కీర్తి గడించింది. సరోజినీదేవి పుణ్యాన హైదరాబాదు తెలుగు గాజుల గలగలలు, చిక్కని వసుపు పూతలు, అరుణోదయంతో పోటీపడే గోరింటకెంపు రంగులు ఆంగ్ల కవితా నౌకలో సప్త సముద్రాలుదాటి పాశ్చాత్య భావుకలోకాన్ని దిగ్భ్రాంతులను చేశాయి; భారతీయతను — అందునా తెలుగుతనాన్ని ఆంగ్ల కవితలో రంగరించి పాశ్చాత్య మేధావులకు అందించి, 'ఏమిటీ కొత్త పోకడలు? ఏమిటీ కొత్త రంగుల దివ్వెలు?' అని వారు చకితులయి ఈ నవకవితకు నీరాజనం పట్టేటట్టు చేశాయి.

సరోజినీదేవి మాతృభాష వంగభాష. పుట్టి పెరిగింది తెలుగు నగర మయిన హైదరాబాదులో. కలిసిమెలిసి ఉన్నది వంగ, హిందీ, ఉరుదూ పండితు లయిన పెద్దలతో, నవాబులతో. అభిమానించింది ఆంగ్ల కవితను. కనుక ఆమె వంగ, హిందీ, ఉరుదూ, ఆంగ్ల భాషలలో అనర్గళంగా ప్రసంగించ గలిగేది; గోష్ఠులలో చలోక్తులు విసరగలిగేది. తెలుగులో వ్యవహారజ్ఞానం వరకే ఆమె భాషా పరిధి. కారణం ఆ కాలంలో హైదరాబాదులో రాజరికం ఉరుదూది గనుక.

తెలుగుకు అంత ప్రాధాన్యం ఉండేది కాదు. ఆమె తెలుగింటి కోడలయినా అత్తవారింటివారు కూడా ఆంగ్ల, ఉరుదూ ప్రభావితులేగాని, తెలుగులో అంతగా పాండిత్యం కలవారుకారు గనుక ఆమెపై తెలుగు భాషా సాహిత్యాల ప్రభావం, పడలేదు.

ఆమె ఉత్సాహం అపరిమితం; ధారణాశక్తి అసదృశం; సంభాషణ చాతుర్యం సాటిలేనిది; వాగ్ధాటి గద్గదనదద్గోదావరి వంటిది. ఆమె సర్వతోముఖ ప్రతిభాశాలిని అంటే ఒక్క మాటలో చాలు. సుందరమైన వచస్సు, సున్నితమైన మనస్సు, కవిత, దేశమే తపస్సు. ఇక భావుకత పొంగి పొరలక ఏమవుతుంది? హైదరాబాద్ నగరం, దాని పరిసరాలు ఎవరినైనా, ఏమాత్రం భావుకతావేశం ఉన్నవారినైనా కవిగా తీర్చిదిద్దుతాయని నా అభిప్రాయం. నాలుగు దిక్కుల నుంచి శిఖర శిరస్సులను ఎత్తి నింగిని చూస్తున్న చార్‌మినార్, ఆత్మగౌరవానికి రాజసానికి, భక్తికి బంధనానికి, కళకు కల్పనకు కాణాచి అయిన గోలుకొండదుర్గ శిథిలావశేషాలు, నగరం నాలుగువైపులా విశ్రాంతి తీసుకుంటున్న ఏనుగులలాగ కనిపించే గండ శిలలు, గుట్టలు, కనుచూపుమేర వరకు పరచుకొన్న విశాలమయిన దేవిడీలు, మహలులు, నగరలక్ష్మి తన సౌందర్యం చూచుకొనే మణిముకురాలలాగ వున్న తటాకాలు, ఆమె లీలగా విప్పిన సుదీర్ఘ వేణీభరంలాగ పారే మూసీనది — పరమ మూర్ఖున్నయినా కవిగా చేయగలవే! ఇక సరోజినివంటి జనుషాభావుకురాలు మహాకవయిత్రి కావడంలో అబ్బురమేముంది?

సరోజినీదేవి కవితాలతకు తల్లిదండ్రుల దోహదం కూడా కలిగింది. ఆమె తండ్రి అఘోరనాథ చట్టోపాధ్యాయుడు. తల్లి వరదా సుందరీదేవి. అఘోరనాథ చట్టోపాధ్యాయుడు హైదరాబాదులో ఉన్న నిజాం కళాశాలలో ఆంగ్ల భాషాచార్యుడు. రాష్ట్రంలో విద్యావ్యాప్తికోసం అప్పటి నిజాంనవాబు ఆయనను ప్రత్యేకంగా పిలిపించారు. చట్టోపాధ్యాయుడూ కవి, తల్లి వంగ భాషలో కవయిత్రి. సమకాలికులయిన బంకించంద్ర, రవీంద్రనాథ, శరచ్చంద్రుల వంటి కవులు, ఈశ్వరచంద్ర విద్యాసాగర, రామకృష్ణ పరమహంస, వివేకానందుల వంటి తత్త్వవేత్తలు, జగదీశచంద్ర, ప్రఫుల్లచంద్రుల వంటి విజ్ఞానవేత్తల ప్రభావమూ సరోజినిపై పడింది.

తన కుమార్తె వంగ భాషలో గొప్ప విద్వాంసురాలు కావాలని తండ్రి ఆశయం. కాని, ఆమె ఒక్క వంగ భాషలోనేకాక పెక్కు భాషలలో విదుషి కావడమేకాక ఆంగ్లంలో మహా కవయిత్రి అయింది. ఆమె 12వ ఏట మెట్రిక్

పరీక్షలో ఉత్తీర్ణురాలయింది. అప్పటికే ఆమె పెద్దలు పరిగణింపదగిన కవయిత్రిగా పేరుపొందింది. ఒకమారు ఆమెకు జబ్బు చేసింది. వైద్యులు విశ్రాంతి తీసుకోవాలని సలహా ఇచ్చారు. కాని, ఆమె కవితా హృదయం విశ్రాంతి తీసుకోలేదు. దాదాపు 2000 పంక్తులుగల పెద్ద గేయనాటకాన్ని ఆంగ్లంలో రచించింది.

ఆమె కవన శక్తికి అప్పటి నిజాం నవాబు ఆశ్చర్యపడ్డాడు. ఉన్నత విద్యాభ్యాసం కోసం ఆమెను విదేశాలకు పంపదలచాడు. ఆమె అంగీకరించింది. ఏడాదికి 4500 రూపాయల విద్యార్థి వేతనం ఆమెకు మంజూరయింది. ఆమె ఇంగ్లాండుకు వెళ్ళింది. అక్కడ ఆమె లండన్‌లో కింగ్స్ కళాశాలలోను, కేంబ్రిడ్జిలోని గర్ల్‌స్ కళాశాలలోను చదివింది. ఆంగ్ల పద్యరచన కూడా అక్కడే నిరాఘాటంగా సాగింది. ఆమెను అక్కడి కవులేకాక, విమర్శకులు కూడా ప్రోత్సహించారు. ఒక ప్రముఖ విమర్శకుని పరిచయ భాగ్యంతో ఆమె సరిఅయిన మార్గంలో పడింది. "భారతదేశం సుజలం, సుఫలం, సస్యశ్యామలం, శుభ్రజ్యోత్స్న పులకితయామిని, పుల్లకుసుమిత ద్రుమదళ శోభితం కనుక నీవు కవితలో భారతీయ వాతావరణాన్ని పూర్తిగా నింపు. సాధారణ ఆంగ్ల కవిత కన్నా అది విశిష్టంగా ఉంటుంది గనుక సహృదయుల దృష్టిని ఆకట్టుకుంటుంది. నీకు విశేష ఖ్యాతి వస్తుంది." అని ఆ విమర్శకుడు సలహా ఇచ్చాడు. సరోజినీదేవి ఆ సలహాను ఆనతిగా శిరసావహించింది. వివిధ వాతావరణాలు, వివిధ ప్రకృత్యనుగ్రహ సంపద ఉన్న భారతదేశ సహజ సౌందర్యంతో పోటీపడేది స్విట్జర్ ల్యాండు. ఆమె ఒకమారు అనారోగ్యంతో బాధపడుతూ, విశ్రాంతికోసం ఆ దేశానికి వెళ్ళింది. అక్కడి రమణీయ ప్రకృతి ఆమె కవితకు ద్విగుణీకృత ప్రోత్సాహం కలిగించింది. ఆమెకు ఇంగ్లాండు వాతావరణం పడలేదు. కనుక చదువు చాలించి స్వదేశానికి 1898 లో మరలి వచ్చింది.

సరోజినీదేవి తన వివాహంతోనూ దేశంలో సంచలనం కలిగించింది. కులీన వంగ బ్రాహ్మణ వంశంలో జనించిన ఒక కన్య – అఘోరనాథ చట్టోపాధ్యాయుని వంటి మహా విద్వాంసుని కుమార్తె – ఒక బ్రాహ్మణేతర యువకుని – అప్పటి నిజాం రాష్ట్రంలో చీఫ్ మెడికల్ ఆఫీసరుగా ఉన్న ముత్యాల గోవిందరాజులు నాయుడును – ప్రేమించడం, దానిని ప్రతిఘటించక తల్లిదండ్రులు ఆమోదించడం, వివాహం చేయడం అపూర్వ విషయాలు. ఆనాటికి అదొక మహాసాహసం. వివాహం బ్రహ్మసమాజ పద్ధతిలో, మద్రాసులోని బ్రహ్మ మందిరంలో మహాసంస్కర్త, ఆంధ్రదేశ ఈశ్వరచంద్ర

విద్యాసాగరులు కందుకూరి వీరేశలింగం పంతులుగారి పౌరోహిత్యంలో జరిగింది. ఆమె గృహిణి అయింది. ఆమె ప్రథమ పుత్రుడు డాక్టర్ జయసూర్య. గొప్ప అలోపతి వైద్యుడు అయినా, హోమియోపతీని స్వచ్ఛందంగా ప్రచారం చేసిన వాడు. రెండవ కుమారుడూ గొప్ప ఉద్యోగే. పెద్ద కుమార్తె పద్మజానాయుడు ప్రముఖ సంఘసేవిక. పార్లమెంటు సభ్యురాలుగాను, పశ్చిమబెంగాల్ గవర్నరు గాను సేవ చేసింది. రెండవ కుమార్తె లీలామణి నాయుడు ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో శిక్షణ పొంది, కొంత కాలం ఉస్మానియా మహిళా కళాశాలలోను, నిజాం కళాశాలలోను ఆంగ్ల భాషాచార్యగా పనిచేసింది; తర్వాత కేంద్ర ప్రభుత్వం విదేశాంగశాఖలో పనిచేసింది.

రసహృదయ అయిన సరోజినీదేవి సంసారంలో ఉన్నా, తామరాకుపై నీటి బిందువులాగ ఉంటూ, కవితా వ్యాసంగం మరువలేదు. వివిధ రచనలు సాగించింది. ఆమె కవితా మాధుర్యానికి ముగ్ధులైన రాయల్ సొసైటి ఆఫ్ ది లిటరేచర్ సంస్థ వారు ఆమెను సభ్యురాలుగా చేర్చుకున్నారు. అందువల్ల ఆమెకు ప్రముఖులయిన ఆంగ్ల కవులతో విశేష పరిచయం కలిగింది. ఆమె రచనలు నాలుగు సంపుటాలుగా వెలువడ్డాయి. మొదటిది 'గోల్డెన్ థ్రెషోల్డ్' — బంగారు ముంగిలి. దీనిలో ఆమె 1809 నుంచి 1905 వరకు చెప్పిన కవితలున్నాయి. ఇది 1905లో వెలువడింది; విశ్వవిఖ్యాతి చెంది, పెక్కు ముద్రణలు పొందింది. రెండవది 'ది పొయమ్స్ ఆఫ్ లైఫ్ అండ్ డెత్' — చావుబ్రతుకుల గీతాలు. మూడవ సంపుటి 'ది బర్డ్ ఆఫ్ టైమ్' — కాలపక్షి తరథం. ఇది 1912లో వెలువడింది. ఆమె కవితా పరిణతికి ఈ సంపుటం తార్కాణమని విమర్శకులు కీర్తించారు. దీనిని ఆమె కవితలలో సర్వోత్తమంగాను ప్రశంసించారు. నాల్గవ సంపుటి 'ది బ్రోకెన్ వింగ్' - తెగిన రెక్క. ఇది 1917లో వెలువడింది. ఆమె కవితలు కులమత వర్ణ జాతి దేశ కాలాల వైషమ్యాలకు దూరంగా, విశ్వకాంతిని ప్రసాదించే తేనెపాకాలని ప్రపంచం నాలుగంచులా పేరుపొందాయి. ఆమెను 'ప్రాచ్యకోకిల' అని వేనోళ్ళ కొనియాడారు ప్రపంచ కవులు.

దేశం అస్వతంత్రంగా ఉంది. ప్రజలు తమ హక్కుల కోసం పోరాడు తున్నారు. కాంగ్రెస్ సంస్థ, మరికొన్ని సంస్థలు దేశ ప్రజలను స్వాతంత్ర్య సమరోన్ముఖులను చేస్తున్నాయి. సరోజినీదేవికి రాజకీయ రంగంలో ప్రవేశించాలనే తలంపు కలిగింది. ఆమెకు గోపాలకృష్ణ గోఖలే వంటి ప్రముఖ రాజకీయ నాయకులతో పరిచయం కలిగింది. గోఖలేను ఆమె రాజకీయ గురువుగా స్వీకరించింది. అంతేకాక ఆమెకు పిన్న వయస్సు నుంచే కాంగ్రెస్‌తో సంబంధం,

ఉంది. 1905లో ఆమె కాంగ్రెస్ సమావేశంలో ప్రసంగించి, మహావక్త్రి అని పేరుపొందింది. అప్పటి నుంచి ఆమె కాంగ్రెస్‌పట్ల దృఢవిశ్వాసంతో ఉంది. ఒకమారు గోఖలే ఆమెకు "నీ భవిష్యత్కార్యక్రమం ఏమిటి?" అని ప్రశ్నించారట. "నేను ఐదేళ్ళలో హిందూ ముస్లిం సామరస్యం నెలకొల్పడానికి పాటుపడదలచాను" అని ఆమె సమాధాన మిచ్చిందట. తదనుగుణంగానే ఆమె 1921లో బొంబాయిలో మతకలహాలు చెలరేగినప్పుడు, మతసామరస్యానికి కృషి చేసింది. ఏ జంకు కొంకులూ లేక కలహాలు చెలరేగిన ప్రాంతానికి వెళ్ళి, అనర్గళంగా సామరస్యోపన్యాసాలు చేసి, ఉద్రేకాన్ని శాంతింపజేయగలిగింది.

రాజకీయ రంగంలో పూర్తిగా ప్రవేశించగానే ఆమెకు ఊపిరి సలుపుకోలేనంత పని కలిగింది. బ్రిటిష్ ప్రభుత్వం పంజాబులో చేసిన దురంతాలను ఖండించడం, జెనీవాలో జరిగిన అంతర్జాతీయ మహాసభకు అఖిల భారత మహిళా ప్రతినిధిగా వెళ్ళి ప్రముఖ పాత్ర వహించడం, సాటి సీమంతినులను ప్రబోధించడం, వారి సమస్యలపై ప్రసంగించడం, భారతీయ సంస్కృత్యాదర్శాలను వివరించడం, మహిళలకు వోటింగు హక్కును గురించి ఆందోళన చేయడం, దేశమంతా సంచరించడం, 1923లో కాకినాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభలో కెన్యాకు భారత ప్రతినిధిగా ఎన్నిక కావడం, విదేశాలలోని భారతీయులకు సేవచేయటం — ఇలా వేయి విధాలుగా నిరంతరం సేవలను చేసింది. 1924లో బెల్గాంలో జరిగిన కాంగ్రెస్ మహాసభ ఆమె సేవను బహుధా ప్రశంసించింది.

ఆమె పెక్కుమార్లు కారాగారవాసం అనుభవించింది. కాంగ్రెస్ సంస్థలో అన్నివర్గాల సమైక్యానికి కృషి చేసింది. 25 ఏళ్ళు కాంగ్రెస్ కార్యవర్గ సభ్యురాలుగా ఉండి గాంధీజీకి బాసటగా ఉంది. కాన్పూరు కాంగ్రెస్ మహాసభకు ఆమె అధ్యక్షురాలయింది.

1930లో దేశవ్యాప్తంగా జరిగిన సత్యాగ్రహంలో ఆమెను అరెస్టుచేసి కారాగారంలో ఉంచారు. అప్పుడు గాంధీ — ఇర్విన్ సంధి మూలంగా 1931లో జరిగిన రౌండు టేబుల్ మహాసభకు ఆహూతురాలై ఆమె కూడా కాంగ్రెస్ ప్రతినిధిగా లండన్‌కు వెళ్ళి, తన దృక్పథం వివరించింది. ఆ సంప్రదింపులు విఫలమయాయి. స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా కొనసాగింది. మరల ఆమెను కారాగారంలో బంధించారు.

చివరకు 1947 ఆగస్టు 15న భారతదేశం స్వతంత్రమైంది. స్వతంత్ర భారతంలో ఆమె ఒక రాష్ట్రానికి గవర్నరుగా నియమితురాలయింది. ఆమ్మె

పరిపాలన దక్షతను తొలి రాజ్యాంగ పరిషదధ్యక్షుడు బాబూ రాజేంద్రప్రసాద్ గొప్పగా పొగిడారు. "సరోజినీదేవికి గవర్నర్ పదవివల్ల కలిగిన గొప్పతనమేమీ లేదు. గవర్నర్ పదవిని ఆమె అంగీకరించడం ఆ పదవికే గొప్ప" అని ఆయన అన్నారు.

సరోజినీదేవి 1879 ఫిబ్రవరి 13 జన్మించింది, 1949 మార్చి 10న పరమపదించింది. ఏడుదశాబ్దాల ఆమె జీవితంలో బాల్యంలో ఒక దశాబ్దం సంగతేమోగాని, తక్కిన ఆరు దశాబ్దాలూ స్వార్థరహితం, పరార్థపూరితం, కనుక సార్థకం. ఆమె మరణానికి ప్రపంచమంతా శోకించింది. భారత స్వాతంత్ర్య సమరంలో అగ్రేసర అయిన వీరనారీమణి, రాజకీయాలను సంస్కృతితో మేళవించి, స్వచ్ఛతను చేకూర్చిన ధీరురాలు, మతసామరస్యానికి పాటుబడిన మహనీయురాలు, కులాల కట్టుబాటును తెగద్రెంచిన సంస్కార పరాయణురాలు, అన్నిటినీ మించి భారత సంస్కృతి సౌరభాన్ని తన ఆంగ్ల కవితలతో ప్రపంచ ప్రజలకు అందించిన ప్రాచ్య కోకిల అస్తమించిందని సహృదయ ప్రపంచం వాపోయింది.

కవితల్లజులు రాయప్రోలు సుబ్బారావుగారు ఆమెను ఈ విధంగా స్తుతించారు :-

"దౌర్భాగ్య పరతంత్ర తంత్రులు తెంప
సౌభాగ్య భారత జాతకమ్ము రచింప
సౌందర్య మాతవై స్వచ్ఛంద దూతవై
భోగి పండుగ పాలు పొంగింపగా
వచ్చినావె సరోజినీ దేవీ మతల్లి."

(ఆంధ్రప్రదేశ్ – ఫిబ్రవరి, 1985)

# శ్రీ విస్సా అప్పారావుగారు

శ్రీ విస్సా అప్పారావుగారు కనుమరుగై పోవడంతో వివిధానేక శాస్త్ర సంస్కృతి రహస్యాలను ప్రాచీనాధునాతన శాస్త్రీయ దృష్టితో సమన్వయపరచి వాఖ్యానించే ప్రతిభావంతులలో ఒకరు, ఎక్కడ ఏమాత్రం తెలివితేటలు, ఆసక్తి, మౌలికత కనిపించినా ప్రోత్సహించే సహృదయులలో ఒక్కరు మనకు లేకుండా పోయారు. వివిధ విషయాలలో వారి జ్ఞానం అపారమైనది. ఏ విషయాన్నైనా వారు చాలాకాలం ఆలోచించి ఆలోచించి, ప్రతికూలానుకూల హేతువులతో వడపోసి సమన్వయపరిచేవారు. ఈ ప్రక్రియకు ఎంత ఆలస్యమైనా, ఎంత శ్రమ అయినా సమన్వయం తమకు వచ్చేవరకు ఇతరులకు స్పష్టపరిచేవారు కారు.

నేను మొట్టమొదట వారిని దర్శించింది ముప్పైమూడు సంవత్సరాల క్రితం శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి సన్నిధిలో. అప్పుడు వారు ఏవో ప్రార్థనలు జరుపుతున్నారు. నేను శ్రీ శాస్త్రిగారివద్ద వున్న చనువుకొద్దీ ఏవేవో ప్రశ్నలు వేసేవాడిని. ఆనాడు ప్రార్థనలో ఎవరికో, ఏవో వింతధ్వనులు వినిపించాయట. వాటిని గురించి శాస్త్రిగారు వాఖ్యానిస్తుంటే, నేను "అవన్నీ మీ తెలివితేటలవల్ల తెలిసే విషయాలేగాని అసలు ఏమీలేదు. నమ్మడానికి లేదు" అన్నాను. నా అసభ్యత అందరికీ కొంచెం కష్టం కలిగించింది. "అలాటి విషయాలను శాస్త్రీయంగా వివరించగలరు వీరిని అడుగు" అన్నారు శాస్త్రిగారు అప్పారావుగారిని చూపిస్తూ. "ఈ మానవయంత్రం అత్యాశ్చర్యకరమైనది. మనం సాధన చేసినకొద్దీ, తరచినకొద్దీ అపూర్వశక్తులు సాధించుకోగలం, అపూర్వ విషయాలు తెలుసుకోగలం. మానవుడు నిర్మించిన వైర్‌లెస్ వుంది. అది ఎన్ని అద్భుతాలో మనకు వినిపిస్తున్నది. మనమంతా దానిని చూస్తున్నాము. అలాంటప్పుడు, ఈ అద్భుతమైన దేహయంత్ర శక్తులను మనం పరిమితం చేయగలమా? దూరశ్రవణ, దూరదర్శన శక్తుల కోసం మానవుడు తనకు తోచిన విధంగా ప్రయత్నాలు జరుపుతూనే వున్నాడు" అని శ్రీ అప్పారావుగారు అన్నారు.

శ్రీ అప్పారావుగారు అప్పుడు మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఫిజిక్స్ అడిషనల్ ప్రొఫెసరుగా వుండేవారు. వారు ఉత్తమ ఆచార్యులు. వారి సౌజన్యాన్ని

గురించి, శిష్యవాత్సల్యాన్ని గురించి విద్యార్థులు చెప్పగా విన్నాను. పాఠం శ్రద్ధగా చెప్పడంతో పాటు విద్యార్థుల సహజ ప్రవృత్తికి అనుగుణంగా అభిరుచి కలిగించడమనేది వారిలో గొప్ప గుణవిశేషం.

నేను మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు-సంస్కృతం విద్వాన్ పరీక్షకు వెళ్ళదలచాను. అప్పుడు నా వయస్సు 21 సంవత్సరాలు. ప్రాచ్య పరీక్షలకు ప్రాచ్య కళాశాలల ద్వారా కాక విడిగా వెళ్ళేవారి వయస్సు పరిమితి అప్పుడు 30 సంవత్సరాలు. ముప్పైయేళ్ళు నా వయస్సని చూపుతూ పరీక్షకు వెళ్ళడం ఉచితమని తోచలేదు. ఈ సంగతిని నేను శ్రీ ప్రభాకరశాస్త్రిగారికి విన్నవించాను. వారు అప్పారావుగారితో సంప్రతించారు. అప్పారావుగారు నన్ను పిలిచి వివరాలు వ్రాసి యిమ్మన్నారు. నేను అలాగే చేశాను. వారు నన్ను తమ వెంట విశ్వవిద్యాలయ కార్యాలయానికి పిలుచుకొని వెళ్ళారు. విశ్వవిద్యాలయం రిజిస్ట్రారుతో చర్చించారు. అభ్యర్థులు తమ వయస్సు ఎక్కువ వేసుకొని పరీక్షకు వెళ్ళితే ఉద్యోగంలో చేరిన తర్వాత దాదాపు పదేళ్ళకు ముందే ఉద్యోగ విరమణ చేయవలసి వుంటుందని, అది వారి జీవికకు హానికరమని వివరించారు.

వారి సూచనమేరకు విశ్వవిద్యాలయం వయః పరిమితిని 20 సంవత్సరాలకు తగ్గించింది. నేను 21 ఏట పరీక్షకు వెళ్ళాను. ఈ సడలింపువల్ల 30, 35 ఏళ్ళవాళ్ళు 20 ఏళ్ళని చూపుతూ పరీక్షకు వెళ్ళడం తటస్థించింది. పరీక్షా భవనంలో కొందరు పట్టుబడి విచారణకు పాల్పడవలసివచ్చింది. విశ్వవిద్యాలయంవారు విసుగెత్తి మళ్ళీ వయః పరిమితిని 30కి పెంచారు కొన్నేళ్ళ తర్వాత.

అప్పారావుగారి సౌజన్యానికి, విద్యార్థి వాత్సల్యానికి, అవ్యాజ పరోపకార పారీణతకు ఇదొక నిదర్శనం.

తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయంలోని ద్విపదభారతాన్ని ఎత్తివ్రాసి, పరిష్కరించి ముద్రణకు సిద్ధం చేయడానికి ఇద్దరు పండితులు కావాలని ఆంధ్ర విశ్వవిద్యాలయం పత్రికలలో ప్రకటించింది. అప్పుడు నేను మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తకాలయంలో లేఖకుడుగాను, ఉపపండితుడుగాను చేస్తున్న పనిని బట్టి, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికోసం తంజావూరు సరస్వతీ గ్రంథాలయంలో హరవిలాసాది ప్రబంధాల పాఠాంతరాలను సేకరించిన అనుభవాన్ని బట్టి ఆంధ్రవిశ్వవిద్యాలయంవారి ప్రకటన చూచి ధరఖాస్తు పంపుకున్నాను. అప్పుడు అకస్మాత్తుగా శ్రీ అప్పారావుగారు మద్రాసుకు వచ్చారు. నేను వారిని కలుసుకొని ధరఖాస్తు సంగతి చెప్పాను వినయంగా. "నేను విశ్వ

విద్యాలయ కళాశాలల ప్రిన్సిపాలునోయ్. నీ ఉద్యోగం తెలుగు పరిశోధనశాఖకు సంబంధించింది కదా!" అన్నారు. నేను మిన్నకున్నాను.

కొంత ఆగి నన్ను ఒకమారు పరికించి, గుబురు మీసాల మధ్య నుంచి మొలకెత్తుతున్న మందహాసంతో "ఊఁ! దరఖాస్తు పెట్టుకున్నావన్నమాట. అయితే నీ అర్హత లేమిటోయ్?" అని అడిగారు. చెప్పాను "బాగుంది. సరేగాని, తెలుగు అంకెలు చూచావూ. అవి ఎలా వచ్చాయంటావ్?" అని అడిగారు. నాకు శాసన తాళపత్ర గ్రంథాల పరిశీలనవల్ల కలిగిన అనుభవాన్నిబట్టి ఒకటి అనే సంఖ్యను నిలువుగాను, అడ్డంగాను చిన్నగీతగా వ్రాసేవారని, రెండు అడ్డగీతలు విసురుగా వ్రాయడంలో రెండు ఏర్పడిందని, మూడు అడ్డగీతలు విసురుగా వ్రాయడంలో మూడు ఏర్పడిందని, ఇలా ఏవేవో చెప్పాను. "అంతా బాగానే వుంది గదా! నీకు ఉద్యోగం రావచ్చునేమో లేవోయ్!" అన్నారు. నేను అదొక ఇంటర్వ్యూ అని భావించలేకపోయాను; యథాలాపంగా అన్నమాట అనుకున్నాను.

వారం తర్వాత నాకు ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి ఇంగ్లీషులో "మీతో ఫలానారోజు జరిగిన సంభాషణనుబట్టి మిమ్ములను తంజావూరులో సంవత్సరం పాటు పండితులుగా నియమిస్తున్నాము. మీతోపాటు శ్రీ కొమ్మనమంచి జోగయ్య శర్మ. వారితోపాటు పనిచేయాలి. ఇద్దరూ ప్రతినెలా మీ పనితీరును గురించి తెలుగుశాఖ అధ్యక్షులు శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారికి నివేదిక పంపుతూ వుండాలి. వారు మీకు మార్గదర్శకులుగా వుంటారు" అని ఒక లేఖ వచ్చింది.

అదీ శ్రీ అప్పారావుగారి సౌజన్యపూరిత లౌక్యం. పెద్దల పద్ధతి "ఫలానుమేయాః ప్రారంభాః" కదా!

వారు ఎం. ఏ. ఎల్. టి. చదివి భౌతిక శాస్త్రాచార్యులయినా, ఖగోళ శాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం, సంగీతశాస్త్రం మొదలయిన పెక్కు శాస్త్రాలలో వారి విజ్ఞానం అతి విస్తృతమైనది. ఆధునిక ఖగోళశాస్త్ర విషయాలు ప్రాచీనకాలం నుంచి భారతీయుల జ్యోతిశ్శాస్త్రాచారాలలోను, జీవితంలోను ఎలా రంగరించుకొనిపోయాయో వారు వివరిస్తున్నప్పుడు క్షణక్షణం ఆశ్చర్యపడవలసిందే. మహాభారతంలోని గ్రహ సంపత్తి వర్ణన మేరకు భారత యుద్ధకాలం మొదలయిన వాటిని గురించి వారు వివరిస్తున్నప్పుడు అపూర్వమైన విజ్ఞానపు విందుగా వుండేది. విజ్ఞానేశ్వరునికాలం మొదలు నేటి పౌరులవరకు పౌరధర్మ పరిణామాలను గురించి చెప్పిన విషయాలు విస్మరింపరానివి. సంపూర్ణ సూర్యగ్రహణం గురించి చెప్పిన విషయాలు విజ్ఞానవంతమయినవి. సంపూర్ణ సూర్యగ్రహణం ఏర్పడినప్పుడు మానవజాతికి కలిగిన భయం సాహిత్యంలో రకరకాల గాథలుగా ఎలా

వర్ణితమైనదో ఆయన దృష్టాంతాలు చెప్పేవారు. వేదకాలంనాటి సూర్యభగవానుడు కాలక్రమాన విష్ణువు కాగా, విష్ణువు అవతారమైన కృష్ణుడు కాళింగదమనం చేయడం, ఆయనాంశలను రాహుకేతువుల పాముగా చెప్పడం సూర్యగ్రహణానికి కవితారూపమని వారు తెలిపారు. నాడీగ్రంథాలు ఒక సంభావ్యతను ఊహించి గ్రహస్థితినిబట్టి లెక్కలు కట్టి వ్రాసిన సాధనవిశేషము అనేవారు. దాదాపు నాలుగు దశాబ్దాలక్రితం "ప్రాక్టికల్స్" అనే ఆంగ్ల పాఠ్యపుస్తకం వ్రాశారు. దానిని అలహాబాదు కంపెనీవారు ప్రకటించారు. భారతీయులు శాస్త్రగ్రంథాలలో పాఠ్యపుస్తకాలు వ్రాసి మెప్పు పొందడం అదే మొదలు అని ఆ రంగంలోనివారు అనేవారు.

వారు తెలుగులో వ్రాసిన శాస్త్ర గ్రంథాలలో "పరమాణుశక్తి" 1953 లో ప్రచురితమైంది. అప్పటికి ఉపలబ్ధమైన పరమాణు విజ్ఞానమంతా తెలుగువారికి వారు అందజేశారు. దానిలోని విషయం అప్పటి ఇంగ్లీషు పుస్తకాలలోను అరుదని తజ్ఞులు అంటారు. తక్కిన పుస్తకాలు వ్యాసావళి, సంగీత వ్యాసరత్నావళి, ఆకాశం మొదలైనవి. ఆకాశం పిల్లల కోసం వ్రాసింది. దానికి కేంద్రప్రభుత్వం వారి బహుమతి లభించింది.

వ్యాసావళి వారి వివిధ శాస్త్ర పరిశోధన ప్రతిభలకు గీటురాయి వంటిది. దీనిలో భౌతిక, ఖగోళ, జ్యోతిష, సంగీత, నృత్యాది వివిధ శాస్త్రాలకు సంబంధించిన మౌలిక వ్యాసాలున్నాయి. పౌరధర్మ శిక్షణ, సత్యాన్వేషణ వంటి ఇతర సాంస్కృతిక విషయాలు గూడ దీనిలో చర్చితాలు. ఈ వ్యాసాల రచన "ఫ్రం నోన్ టు అన్నోన్" అనే బోధన సూత్రానుసారం - వారు ఆచార్యులు గనుక కొనసాగింది కాబట్టి విషయం అదివరకు తెలియనివారికి కూడా విషయ ప్రవేశం కలిగించి గహన విషయాలు బోధించేవిగా వుంటాయి. వారితో సంభాషణలూ అంతే. వారు 'భారతి' మొదలయిన పత్రికలలో వ్రాసిన "సాపేక్ష సిద్ధాంతము", "రాడార్" మొదలయిన విజ్ఞానశాస్త్ర వ్యాసాలను ఈ సందర్భంలో దృష్టాంతంగా ఉదాహరించవచ్చు.

అప్పారావుగారు 1936 లో కాబోలు మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీనుండి రాజమండ్రి ట్రెయినింగ్ కళాశాలకు ప్రిన్సిపాలుగా బదిలీ అయ్యారు. ఆ పదవి విరమించి ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాశాల ప్రిన్సిపాలుగా కొన్ని సంవత్సరాలు పనిచేశారు. ఉద్యోగ విరమణ తర్వాత పూర్తిగా వారు కళల వ్యాఖ్యాన ప్రచార ప్రోత్సాహాలు ప్రారంభించారు. వారి ఉద్యోగ జీవితం ఒక ఎత్తు, ఉద్యోగ విరమణ తర్వాతి జీవితం ఒక ఎత్తు.

వారు జన్మించింది పెద్దాపురంలో, 1884 న. అప్పుడు పెద్దాపురం నాట్య

శాస్త్రానికి కాదాచి అనేవారు. అప్పారావుగారు యథాలాపంగా చిన్ననాడు విన్న కీర్తనలు, పదాలు, చూచిన భరతనాట్యాలు, కూచిపూడి నాటకాలు వారిలో సంగీత నృత్య కళాసక్తిని కలిగించి వుంటాయని నా విశ్వాసం. దీనికి తోడు కర్ణాటక సంగీతం చిన్నతనం నుంచి విని ఆనందించగల సహృదయతా అబ్బింది. త్యాగయ్యగారి శిష్యులు శ్రీ ముత్యాలపేట కృష్ణసామయ్యరు అప్పారావుగారి చిన్ననాడు అమలాపురంలో మకాం చేశారట. అప్పుడు అప్పారావుగారు కర్ణాటక సంగీత సంప్రదాయాలను ఆకళించుకున్నారు. ఉద్యోగ రీత్యా చెన్నపురికి వచ్చిన తర్వాత వారికి పెద్ద పెద్ద సంగీత విద్వాంసులతో పరిచయం, చర్చించే సావకాశం కలిగాయి. వారు నేడు తమిళనాడులోని సంగీత సంస్థలకు మూలస్తంభం వంటి 'మ్యూజిక్ అకాడమీ' స్థాపకులలో ఒకరయ్యారు. 'మ్యూజిక్ అకాడమీ' ఎక్స్‌పర్ట్ కమిటీ సభ్యులు గూడ. వారి కృషి ఫలితంగానే ఆంధ్రగాన కళాపరిషత్తు అవతరించింది. వారు తెలుగులో ప్రచురించిన త్యాగరాజ కీర్తనల సంపుటి, క్షేత్రయ్య పదాల సంపుటి తమిళ విద్వాంసుల మన్ననలకు కూడా పాత్రమై ప్రామాణికాలుగా వాసి కెక్కాయి. ఆంధ్ర గాన కళాపరిషత్తు అప్పారావుగారి యాజమాన్యాన శ్రీ మునిపల్లి సుబ్రహ్మణ్యకవి ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు కొన్ని, క్షేత్రయ్య రచించిన లక్షణ గ్రంథం శృంగార మంజరి, త్యాగరాజ శతవార్షికోత్సవ సంచిక ప్రచురించింది. అప్పారావుగారు శ్రీ నారాయణతీర్థులవారి తరంగాలు, రామదాసు కీర్తనలు, భక్తిసంప్రదాయ పదాలు స్వరసహితంగా ప్రచురించాలని ప్రయత్నించారు. కాని అవి అసంపూర్ణం గానే వుండిపోయాయి.

త్యాగరాజ కృతులలో రాగానికీ, సాహిత్యానికీ, పాటలోని విషయానికీ గల పరస్పర సంబంధాన్ని వారు చమత్కారంగా వివరించేవారు. ఆబేరి రాగం ఆందోళన సూచకం. త్యాగయ్యగారి "నగుమోము గనలేని" కృతికి ఆబేరి రాగం ఎలా నప్పిందో, ఆ కృతిలోని పదప్రయోగం ఆందోళనకు ఎలా స్ఫోరకమో వారు వివరించేవారు. శ్యామరాగం శాంతరస స్ఫోరకం. "శాంతము లేక సౌఖ్యము లేదు" అనే త్యాగయ్యగారి కృతి ఈ రాగంలో పాడడానికి కారణం శాంతరస దృష్టితోనేనని, భక్తికి కాంబోజిరాగం అంబోజం వంటిదని అనేవారు.

ఇక స్వరచర్చ, రాగాల పారిశుద్ధ్య చర్చ – వారి పెక్కు వ్యాసాలుగా విలసిల్లాయి.

కూచిపూడి నృత్యం నేడు యావద్భారత విఖ్యాతికి రావడానికి ప్రధాను లలో అప్పారావుగారు ఒక్కరు. కూచిపూడి నృత్యం శాస్త్రీయతను నిరూపించ డానికి, దానిని జనం గుర్తించడానికి వారు ఎంతో కృషిచేశారు. శ్రీ నటరాజ

రామకృష్ణ మొదలయిన పలువురికి అన్ని విధాలా ప్రోత్సాహమిచ్చి, వారు ఎంతో తోడ్పడ్డారు.

వారు ఆంధ్రదేశంలో చిత్రకళకు ఇచ్చిన ప్రోత్సాహం గూడా గొప్పది. దామెర్ల రామారావు చిత్రాలకు రాజమహేంద్రవరంలో శాశ్వతశాల, చిత్రకళా విద్యార్థులకొక చిత్రకళాశాల స్థాపించిన శ్రేయస్సు వారిదే. దానికోసం వారు పడిన శ్రమ ఒక ఉద్యమం, ఒక చరిత్ర.

అప్పారావుగారు కేంద్ర సంగీత నాటక అకాడెమీ సభ్యులుగా వున్నారు. ఆలిండియా రేడియో కేంద్ర సంగీత సలహామండలి సభ్యులుగాను వున్నారు.

వారి గుప్తదానాలతో ముందుకు వచ్చిన విద్యార్థులు నేడు ఎంతో అభివృద్ధిలో వున్నారు.

అప్పారావుగారు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి మాస్టర్ సి. వి. వి. యోగానుయాయులు. శాస్త్రిగారు పరమపదించిన పిమ్మట వారు నాతో ప్రసంగవశాత్తు "శాస్త్రిగారు ఈ యోగంలో ఎంతవరకు సాధించగలిగారు, ఎక్కడ విఫలులయ్యారు మొదలయినవి వివరంగా వ్రాయాలని ఉందోయ్!" అన్నారు. "వ్రాయండి సార్. అలాటి విశ్లేషణ చాల అవసరం." అన్నాను. కాని, వారు వ్రాసేవారేమో! వ్రాయలేదు. వ్రాసివుంటే సాధకులకు ఎంతో ఉపకరించేది.

అప్పారావుగారిలో నాకు అన్ని యోగ్యతలకన్నా మిన్నగా తోచింది అపూర్వ సమన్వయశక్తి. విజ్ఞానశాస్త్రం, లలితకళాభిరుచి ఇవన్నీ ఎలాటి స్పర్ధా సంఘర్షణలు లేకుండా వారిలో సమన్వయం పొంది, మనకు వినోద విజ్ఞానాన్ని, విమర్శనాత్మకం, హేతుబద్ధం అయిన సాహిత్యాన్ని అందజేశాయి. వారు, వారిలాంటివారు కనుమరుగై పోవడంతో మనకు కలిగే నష్టం ప్రాచీన నవీన సంప్రదాయాలకు సమన్వయం చేకూర్చగల, ఆ సమన్వయాన్ని వివరించగల మేధావులు విరళమై పోతుండడం. ఇదే నాకొక పెద్ద విచారం. శ్రీ అప్పారావుగారు 1966 జులై 30 వ తేదీన కన్నుమూశారు.

(ఆంధ్రపత్రిక – 19, ఏప్రిల్, 1966)

# సార్థక నామధేయులు సురవరంవారు

సురవరం ప్రతాపరెడ్డిగారు ఒకవ్యక్తి కాదు; మహా సంస్థ. కాదు; మహా సంస్థల సమాఖ్య. పేరుకు తగినట్టు ఆయన ప్రతాపశాలి. కాకపోతే, నిరంకుశుడైన నిజాం నవాబు కోఠీకి అనతి దూరంలో పత్రికను స్థాపించి ప్రజావిరోధుల గుండెలవిసేట్టు సంపాదకీయ శరపరంపరను మరొకరు ప్రయోగించగలరా?

రెడ్డిగారితో మొదట నా పరిచయం నమ్మాళ్వార్ ప్రచురించిన 'ప్రతాప రెడ్డి కథలు' అనే కథా సంపుటితో. దానిలోని హుసేన్‌బీ కథ నాకింకా జ్ఞాపకం ఉంది. కామాక్షి అనే బ్రాహ్మణ బాలిక బాల వితంతువు. శిరోముండనం చేయించుకొనడానికి ఇష్టపడదు. దానికి బంధువులు కోపగిస్తారు. ఒక స్వాముల వాడు ఆమెను మోసగిస్తాడు. ఆమెను తలిదండ్రులు భ్రష్టురాలని పరత్యజిస్తారు. చివరకు ఆమెనొక మహమ్మదీయుడు ఆదరిస్తాడు. ఆమె మతం మార్చుకొని హుసేన్‌బీ అయి, అతని ఇల్లాలవుతుంది. "అయ్యో! సంఘదౌర్జన్యమువలన హిందూస్త్రీలెట్లు చెడిపోతున్నారో గదా!" అని రచయిత చివర తన ఆవేదన ప్రకటిస్తాడు. సంఘ సంస్కరణ ప్రయోజనానికి రచనను సాధనం చేసుకొన్న ప్రతాపరెడ్డిగారంటే, ఎంతో గౌరవం కలిగింది, ఆ కథలు చదివిన తర్వాత.

ఆ గౌరవం ఇనుమడించింది, నేను 'మీజాన్' దినపత్రికలో పనిచేసే టప్పుడు ఆయనతో కలిగిన సన్నిహితత్వంతో. 'మీజాన్' అప్పటి హైదరాబాద్ రాష్ట్రం ప్రధానమంత్రి మీర్‌లాయక్ అలీ బంధువయిన గులాం మహమ్మద్ కలకత్తావాలా నడుపుతున్న పత్రిక. దానికి మూడు ముఖాలు — ఉరుదూ, ఇంగ్లీషు, తెలుగు. ఉరుదూ పూర్తిగా ముస్లింలీగును సమర్థించేది. ఇంగ్లీషు తటస్థంగా హైదరాబాద్ ప్రత్యేకతను, దక్కన్ సంస్కృతిని జపించేది. తెలుగు పూర్తిగా రావినారాయణరెడ్డి వర్గం ఆంధ్ర మహాసభను సమర్థించేది. ప్రతాపరెడ్డిగారి గోలకొండ పత్రికకు మీజాన్ ప్రత్యర్థి పత్రిక. అయినా, నేను తరచు ఆయన నాయకత్వంలోని విజ్ఞానవర్ధనీ పరిషత్తు సమావేశాలకు హాజరయ్యే వాడిని. అడపా దడపా కలుసుకొనే వాడిని. ఆయనతో సంభాషణ విజ్ఞాన పాఠం. యథాలాపంగా ఎన్నో అపూర్వ విషయాలు తెలిసేవి.

మీజాన్ పత్రిక ప్రథమ వార్షికోత్సవం జరిగింది. ప్రత్యేక సంచిక

వెలువరించాము. స్థానిక ప్రముఖుల వ్యాసాలుండాలని సంపాదకులు అడివి బాపిరాజుగారు అభిలషించారు. ప్రతాపరెడ్డిగారు సాటి సంపాదకులు గదా! ఆయన వ్యాసమూ ఉంటే, వార్షిక సంచిక వాసి పెరుగుతుందని బాపిరాజుగారు ఆశించారు. ప్రత్యర్థి పత్రిక గనుక, రెడ్డిగారు వ్యాసం వ్రాస్తారో, లేదో అనే సందేహం తలయెత్తింది. నేను స్వయంగా వెళ్ళి రెడ్డిగారిని ప్రార్థించాను "ఏదైనా వ్యాసం ఇవ్వండి" అని. "నా వ్యాసాలు మీరు వేసుకొంటారా? మీ పత్రిక విధానానికి విరుద్ధంగా ఉండే విషయాలు వ్రాస్తే తీసివేయరాదు సుమా!" అన్నారు. "మా పత్రిక యజమానుల విధానాలు ఏమైనా, తెలుగు మీజాన్ ఆశయం మాత్రం స్థానిక అభ్యుదయశక్తులను సమర్థించడమే. అయినా మీబోటి పెద్దల రచనలను మార్చవలసిన దుర్గతి మాకెందుకు? మీ అభిప్రాయాలు విలువయినవి. మాకు ఇష్టం లేకపోయినంత మాత్రాన వాటి విలువ తగ్గదు గదా! కనుక తీసివేసే ప్రశ్నే లేదు. విరామచిహ్నాలు కూడ తొలగించము" అని విన్నవించాను. ఆయన "కుతుబ్‌షాహీల ఆంధ్రభాషా సేవ" అనే గొప్ప వ్యాసం ఇచ్చారు. తత్కాలపు నిజాం నవాబులు తెలుగుకు ఏమీ చేయడంలేదనే గొప్ప వ్యంగ్యం తొణికిసలాడే ఆ వ్యాసం ప్రచురితమయిన ప్రత్యేక సంచికను అమూల్యంగా ఇంకా నేను భద్రపరచుకొన్నాను.

రెడ్డిగారి సహృదయతను తలచుకొన్నప్పుడు ఒళ్ళు పులకిస్తుంది. విమర్శను సవ్యంగా గ్రహించడమనేది అందరికీ అబ్బదు; దానికెంతో మనః పరిపాకం ఉండాలి. కబీర్ అంటాడు –

"నిందక నియరే రాఖిఏ
ఆంగన కుటీ సమాయ్,
బిన పానీ సాబున బినా
నిర్మల కరై సుహాయ్"

(నిందించేవాడిని ముంగిట్లో గుడిసెవేసి పెట్టుకో. సబ్బూ, నీళ్ళూ లేకుండా నీ స్వభావాన్ని కడిగి వేస్తాడు) అని. అంతటి సహృదయత, నిబ్బరం ఏవీ మనకు? మహా మహా వాళ్ళే విమర్శకు తట్టుకోరు; వెర్రి ఆవేశంతో ఊగిసలాడిపోతారు. ప్రతాపరెడ్డిగారు దీనికి అపవాదం, విమర్శను సవ్యంగా గ్రహించి అవసరమయితే తమ వాదం నిలబెట్టుకొనేవారు, లేకపోతే మార్చుకొనేవారు.

ఒకమారు విజ్ఞానవర్ధినీ పరిషత్తు సమావేశంలో "తెలుగులో స్త్రీవాచక శబ్దాలు" అనే వ్యాసం చదివాను. దానిలో నంగనాచి అనే పదం చర్చ సందర్భంలో నేను కొంచెం దురుసుగా ప్రవర్తించాను. నంగనాచి పదానికి నంగా

నాచ్ – నగ్నంగా నాట్యమాడడం – అనే హిందీపదం మూలమయి వుంటుం దని రెడ్డిగారు వ్రాసిన దానిని ప్రస్తావించి "నంగనాచి అంటే బరితెగించినదనే అర్థం కాదు. చేసేదంతా చేసి ముసంగిగా వుండే గడసరి అని అర్థం" అన్నాను. "నంగై అంటే నగ్నిక చిన్నపిల్ల. నాచ్చి అంటే, నాతి – నాయక స్త్రీ – నాయకురాలు – గడసరి. చిన్నపిల్లగా, అమాయకురాలిగా ప్రవర్తించే గడసరి" అని వివరించాను. అంతమందిలో, అధ్యక్షపీఠంలో ఉన్నవారిని విమర్శించడం సభ్యత కాదు. కాని, నా వయస్సహజమైన, వృత్తిసహజమైన చాపల్యం. వైయక్తికంగా కలుసుకొన్నప్పుడు "అయ్యా, మీరు అలా వ్రాశారు. నేను ఇలా అభిప్రాయపడుతున్నాను." అని అంటే సరిపోయేది. కాని ఇదివరకే అన్నానుగా – చాపల్యమని. నాకు కీర్తి కండూతి మరి!

నూతన సంవత్సరం బిరుదాలు ఇచ్చేవారు బాపిరాజుగారు తమ "ధూప దీపాలు" శీర్షికలో ఏటా. ఆ బిరుదులు సరదాగా, వారి అహాన్ని పెంచేవిగాను, కొంచెం వెక్కిరించేవిగాను వుండేవిగాని, దెబ్బకొట్టేవిగా వుండేవి కావు. "ప్రతాప రెడ్డిగారికి ఎలాటి బిరుదు ఇద్దాం!" అనడిగారు బాపిరాజుగారు. అప్పుడు ముల్కీవాదం చెలరేగుతోంది. ముస్లింలు ఏ ప్రాంతం వారైనా, విదేశం వారైనా నిమిషాలలో ముల్కీలై రాష్ట్రంలో ఉద్యోగాలు సంపాదించుకొనేవారు. చిక్కంతా హిందువులకే. ప్రతాపరెడ్డిగారు (ఆయన మాటలలో నీళ్ళులేని) ఇటిక్యాలపాడు వారయినా, చదువు, పరిచయాలు హైదరాబాద్ రాష్ట్రం వెలుపలే ఎక్కువ కావడంవల్ల 'ముల్కీ'కి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేవారు కారు. అందువల్ల వీరముల్కీలకు కొంచెం కష్టంగా వుండేది. హైదరాబాద్ రాష్ట్ర ప్రజల శ్రేయస్సే ఆయనకు ప్రధానం గనుక కొన్ని సందర్భాలలో (సంభాషణలలో) ముల్కీని సమర్థించడంవల్ల రాష్ట్రేతరులకు కొంచెం అసంతృప్తిగా వుండేది. నేను ఆయనను కలుసుకొని "మా పత్రిక మీకు ఒక బిరుదు ఇవ్వదలచించండి నూతన వర్షం సందర్భంగా" అన్నాను. "ఏమిటా బిరుదు?" అనడిగారు ఆయన. నేను అప్పటికప్పుడు "ముల్కీ గైర్‌ముల్కీ మహాముల్కీ!" అన్నాను. ఆయన విరగబడి నవ్వారు. "బాగుందండీ!" అన్నారు. బతుకుజీవుడా, నొప్పి కలుగ లేదు ఈయనకు – అనుకొని బాపిరాజుగారికి ఆ సంగతి తెలిపాను. మరుసటి రోజు నూతన సంవత్సరం వినోద బిరుదులు ధూపదీపాలలో వచ్చాయి.

దేశంలో తొలిసారిగా 1952లో సాధారణ ఎన్నికలు జరిగాయి. ప్రతాప రెడ్డిగారు వనపర్తి నియోజకవర్గం నుంచి హైదరాబాద్ రాష్ట్ర శాసనసభకు ఎన్నికయ్యారు. తెలుగుజాతి జాగృతికి, తెనుగుభాషా వికాసానికి హైదరాబాద్‌లో

అహర్నిశం కృషిచేసిన ప్రతాపరెడ్డిగారు ప్రథమ ప్రజా ప్రభుత్వంలో విద్యా మంత్రి కాకపోతారా? అంతటివారు మరెవరున్నారు? – అని తలపోసిన వారిలో నేనూ ఒకణ్ని. నా తలపోతను ఒక ఉత్తరంలో తెలుపుతూ, విజయాన్ని అభినందించాను. ఆయన అభినందనలు స్వీకరించారుగాని, మరేదీ తమ సమాధానంలో ప్రస్తావించలేదు. ఆయన మంత్రి కాలేదు.

ఆ సందర్భంలోనే హైదరాబాద్‌కు వచ్చినప్పుడు, ఆయనతో ప్రసంగవశాత్తు "మీరు మంత్రి అవుతారని ఆశించాను. చాలా అన్యాయం జరిగింది" అన్నాను. ఆయన మందహాసం చేశారు. "ఎట్లా అనుకున్నారు? తమ తమ నెలవులు దప్పిన తన మిత్రులు శత్రులౌట తథ్యమని సుమతి శతకకారుడు చెప్పింది అతథ్యం ఎలా అవుతుంది?" అన్నారు. నిజమే. ఆయనకు రాజకీయ నాయకులకు అవసరమైన మందవేసే శక్తిలేదు. అయిన దానికీ, కానిదానికీ ప్రకటనలు చేసే చొరవలేదు పత్రిక చేతిలో వున్నా. మంత్రుల ఎంపిక వచ్చే వేళకు ఇప్పుడు బడా నాయకులుగా చెలామణి అవుతున్నవారు, అప్పుడు ఆయనను మహావ్యక్తిగా పొగడినవారు అడ్డుపడ్డారని తర్వాత తెలిసింది. "ఏందయ్యా నువ్వు చెప్పేదం! తెలంగీ అఖ్‌బార్ నడిపిండు; మంచిగా నడిపిండు. ఆంధ్ర మహాసభలో సేవచేసిండు. మంచిగా చేసిండు. దానికోసం వజీరవుతడా? మేమేమి గాజుల్ తొడుక్కున్నమా? ఆయనేమి దేశ్‌ముఖా, దొరా?" అంటూ కీర్తిశేషుడైన ఒక మహానాయకుడు అడ్డుపడ్డాడట. "నేను మంత్రి పదవి ఆశించలేదు. రానందుకు విచారపడను. డిప్టీస్పీకరుగా నిలుపుతామన్నారు. నేనే వద్దన్నాను. ఈ రాజకీయాల చీకటి బజారులో నేను, నావంటివారు ఏమీ పనికిరారు" అని ఆయన నాలుగే మాటలు అన్నారు.

గోలకొండ పత్రిక నుంచి తప్పుకొన్న తర్వాత ఆయన 'ప్రజావాణి' అనే వారపత్రికను పెద్దఎత్తున ప్రారంభించారు. దానిలో తమకు సహాయంగా ఉండవలసిందిగా మిత్రుడు కప్పగంతుల లక్ష్మణశాస్త్రితో నాకు ఉత్తరం వ్రాయించారు; నాకూ వ్రాశారు. నేనప్పుడు ఆంధ్రప్రభలో ఉన్నాను. రెడ్డిగారితో పనిచేసే సదవకాశం లభించినందుకు సంతసిస్తూ వెంటనే అంగీకరించాను. ఆంధ్రప్రభ వదలిరావడానికి కొంత వ్యవధి కావలసి వచ్చింది. అంతలో ప్రజావాణిలో ఏదో సంక్షోభం చెలరేగింది. ఆయన నన్ను రావద్దని హెచ్చరిస్తూ, అనవసరంగా ఇబ్బంది కలిగించినందుకు నొచ్చుకొంటూ ఉత్తరం వ్రాశారు. నేను సదవకాశం చేజారిపోయిందే అని విచారపడ్డాను. ఆయన నాకు ఉత్తరం వ్రాయనక్కర లేదు; కాని ఆయన సభ్యత అది మరి!

పత్రికారుడుగా రెడ్డిగారి స్థానం ఉన్నతమైనది. న్యాయంకోసం, ధర్మం కోసం పోరాడిన అగ్రశ్రేణి పత్రకారుల కోవవారు ఆయన. గోలకొండ ద్వైవార పత్రికగా 1926 మే 10వ తేదీ నుంచి వెలువడినది మొదలు ఆయన సంపాద కీయంలో అన్నట్టు "మేము మా పత్రికాస్థాపన కాలమునుండియు రెండంశములు దృష్టియందుంచుకొని, దేశీయుల సేవచేయుచున్నాము. మొదటిది ఆంధ్రభాషా సేవ, రెండవది జాతి కుల విచక్షణలేక నిష్పక్షపాతముగా ఆంధ్రులలో సర్వ శాఖల వారియొక్క సత్వరాభివృద్ధికై పాటుపడుట" అనే లక్ష్యాలకోసం పాటు పడ్డారు. నిజాం నాజీ పరిపాలనలో పత్రికా స్వాతంత్ర్యం కరవై సాంఘిక చైతన్యం నిదురమత్తు వదలని గడ్డునాళ్ళలో రెడ్డిగారి రచనలు నందాదివ్వెలుగా వెలిగాయి. ఉర్దూభాషా వ్యామోహాన్ని ఆయన ఒక సంపాదకీయంలో "మన ఆంధ్ర పత్రికలు ఇచ్చటి ఉర్దూ పత్రికలకన్న తక్కువస్థైనవి కావని ఘంటా పథముగా చెప్పగలము. కాని అదేమి వ్యామోహమో అనేకాంధ్రులు చదువలే కున్ననూ ఉర్దూ పత్రికలను చేతబట్టిన అది కేవలము హస్తభూషణకుగాక గౌరవ ప్రదమని కూడ తలతురు. మేనత్తకు మీసము లతికించినంతమాత్రమున పిన్నబ్బ కానేరదు." అని నిర్ద్వంద్వంగా విమర్శించారు.

ఆయనే ఒక సంపాదకీయంలో అన్నట్టు గోలకొండ పత్రిక "వెగటుగా నున్నదని సత్యమును మరుగుపరచలేదు. ద్వేషబుద్ధితో అసత్య ప్రచారము గావించలేదు. దైవముఖము చూచి దేశ కాల పాత్రములను గుర్తెరిగి స్వీయ ధర్మమును నిర్వహించినది." నిజాం రాష్ట్రాంధ్రులలో చైతన్యం కలిగించడమే దాని ఈ స్వీయధర్మం.

రెడ్డిగారు చేసినసేవ మహత్తరమైనది. తాను చేసిన సేవకు సంతృప్తిగా ఆయన ఇలా అన్నారు:- "ఇన్ని సంవత్సరములు ఆంధ్రోద్యమమునకు తోడుగా మేము కావించిన కృషి ఫలమునిచ్చుటకు ప్రారంభమైనదనుటకు నిదర్శనములు కానవచ్చుచున్నవి. మేమింతవరకును ప్రజాభిప్రాయములను వెల్లడిచేయుచు నోరులేని ప్రజలు తమ కష్టములేవో గుర్తించి చెప్పగలవారగునట్లు చేయుటకు యత్నించుచుంటిమి." ఔను. నిష్కామకర్మలోని సంతృప్తి ఇలాటిది.

రెడ్డిగారు గుండెలుతీసిన పత్రకారుడే కాక సంపాదకుడు, అగ్రశ్రేణి పరిశోధకుడు, కథానికా రచయిత, నవలా రచయిత, నాటకకర్త, వ్యాసకర్త, రాజనీతి శాస్త్రజ్ఞుడు, సంఘతత్త్వవేత్త, కవి. ఆయన బహుముఖ ప్రజ్ఞావిలసితానికి తెలుగులో తొలిసారిగా వెలువడిన హిందువుల పండుగలు, ఆంధ్రుల సాంఘిక చరిత్ర తార్కాణాలు. ఆయన రచనలన్నీ ప్రతి పయొనీర్ రచనలలాగే

లక్ష్యశుద్ధి, లక్ష్యసిద్ధి గలవి. ప్రతిదానికీ ఏదో ప్రయోజనం, సంస్కరణోద్దేశం ఉండవలసిందే. ఆయన రచనలను కొన్నిటిని ఉట్టంకిస్తున్నాను:

హిందువుల పండుగలు, ఆంధ్రుల సాంఘిక చరిత్ర, రామాయణ విశేషములు, ఆరెవీరులు, కర్నూలు రాజవంశావళి, సురవరం వారి వంశావళి— పరిశోధన గ్రంథాలు. శుద్ధాంతకాంత—నవల. ఉచ్ఛల విషాదము, భక్త తుకారాం, సాంఘిక నాటకము—నాటకాలు. నిజాం రాష్ట్ర పరిపాలనము, గ్రంథాలయోద్యమము, మద్యపానము, గ్రామజన దర్పణము, పూనా వ్యవసాయ ప్రదర్శనము, హైందవ ధర్మవీరులు, సంఘోద్ధరణము, ప్రాథమిక స్వత్వములు, యువజన విజ్ఞానము, జాగీర్లు, లిపి సంస్కరణము — సంఘ విజ్ఞాన, సంఘ ప్రబోధ గ్రంథాలు. ప్రతాపరెడ్డి కథలు, మొగలాయి కథలు—కథా సంపుటాలు. రాజా బహద్దరు వేంకటరామారెడ్డి జీవిత చరిత్ర, స్వవిషయ సంగ్రహము—జీవిత చరిత్రలు. హంవీర సంభవము, ప్రేమార్పణ, మహమూద్ ఘజ్నవీ, ధర్మాసనము, మద్యపానము, పద్మిని, దేశమాత మున్నగునవి ఖండకావ్యాలు. ఇక వ్యాసాలు అసంఖ్యాకాలు. అనువాదాలు ఎన్నో. ఆయన ప్రబంధాలు పఠించేప్పుడు కానవచ్చిన, అప్పటికి శబ్దరత్నాకరంలో లేని పెక్కు పదాలను, శబ్దరత్నాకరంలో మార్జినులో గుర్తుపెట్టుకున్నారు. వాటిని మిత్రుడు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి విడిగా ఆయన పేర వ్యాసంగా తెలుగు అకాడెమీవారి పత్రికలో ప్రచురించారు. (ఈ పదాలలో చాల సూర్యారావు నిఘంటువులో చేరాయి.)

రెడ్డిగారి ఇంటిపేరు సురవరం. అది మొదట సూరాపురమని వుండి క్రమంగా సురవరమయిందనేవారు ఆయన. సూరాపురం మూలరూపం సురపురం. సురపురమనేది కృష్ణా భీమా నదుల మధ్య గల సంస్థానం. పూర్వంలాగే ఇప్పటికీ మహా సారవంతమయిన నల్లరేగడి ప్రాంతం. దీని కోసమే అటు విజయనగర చక్రవర్తులు, ఇటు బహమనీ సుల్తానులు తరచు పోట్లాడేవారు. ఈ రెండు రాజ్యాల మధ్య ఈ సురపుర రాజ్యం బఫ్ఫర్ స్టేటుగా వుండేది. ఈ రాజ్య పాలకులు వ్యాధులు—బోయలు. వీరు విజయనగర సార్వభౌములకే లోబడి వుండేవారు, వారికి సైనికులను సమకూర్చేవారు. వ్యాధులను కన్నడంలో బేడరు అంటారు. ఇది ఉర్దూ ఉచ్చారణలో బేండర్ అయి, సురపురానికి బేండర్ షోరాపూర్ అనే పేరు వచ్చింది.

ఈ బేండర్ షోరాపూర్ కూడ నేను రెడ్డిగారికి సన్నిహితుడు కావడానికి కారణమయింది. బేండర్ షోరాపూర్-సురపురం నా అత్తవారి ఊరు. ఈ సంస్థానం నేటికీ పండిత ప్రకాండుల పుట్టినిల్లు. అచలాత్మజా పరిణయాది ప్రబంధకర్త,

చంద్రికా ఖండనాద్యపూర్వ విశిష్టాద్వైత వేదాంతగ్రంథరచయిత సురపురం వెంకటాచార్యులు మున్నగు మహా విద్వాంసులు ఈ సురపురం అలంకరించారు. ప్రతాపరెడ్డిగారికి ఈ సురపురంపై మహాదరం ఉండేది. సంస్కృత, సంస్కృతి కేంద్రమనే ఆ ఆదరం నేను ఆ వూరి అల్లుడ్ని కావడం వల్ల నాపైన కూడ ప్రసరించింది. తరచు మా సంభాషణలో సురపుర విద్వాంసుల చాటువులు, ఛలోక్తులు ప్రసక్తమయ్యేవి. ఈ వేంకటాచార్యుల కాలంలోనే తమ పూర్వులు వైష్ణవ మతం స్వీకరించినట్టు తెలిసిందని ఆయన నాతో అన్నారు ప్రసంగవశాత్తు.

రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి మాటలలో రెడ్డిగారికి జోహార్లర్పిస్తాను : "శ్రీ ప్రతాపరెడ్డిగారిది చాల సంస్కృతమైన పవిత్ర జీవితము. ఆంగ్లేయుల భారతీయుల స్పర్ధా కోలాహలము, బ్రాహ్మణా బ్రాహ్మణ విరోధము, హిందూ మహమ్మదీయుల పరస్పరాసూయా ద్వేషములు ఇత్యాదుల సంఘర్షణలో కలుషితమైన కాలమున అందరితోను కలసి, అందరిని మించి, విశాలమయిన మానవ ధర్మమునకై సర్వస్వమును సమర్పించిన త్యాగి ఆయన. సత్యధర్మము లెందున్నను వానికి తలవంచు నిర్మల హృదయుడు. యుక్తమని తాను నమ్మిన వానిని ఎంత కష్టమైనను ఆచరించు ధైర్యముగాని, ఆయుక్తమని తోచినప్పుడు తన లోపములను బహిరంగముగా అంగీకరించు వినయముగాని ఆయకున్నంత కలవారరుదు. స్వాతంత్ర్య సంపాదన సంగ్రామమున, సంపాదనానంతరము వచ్చిపడిన స్వచ్ఛంద జీవితమున కొంతయైనను వివేకము నిలిచియున్నందుకు ప్రతాపరెడ్డిగారివంటి తెరమరుగు సూత్రధారులు కొందరే నిజముగా హేతుభూతులు. వారి త్యాగమునకు జోహారులు."

నాస్తి తేషాం యశః కాయే
జరామరణజం భయం.

— భర్తృహరి

(ఆంధ్రప్రదేశ్ యూనియన్ ఆఫ్ జర్నలిస్ట్స్ ప్రత్యేక సంచిక – 1985)

# శ్రీ శ్రీవాత్సవ

ఆంధ్ర సాహిత్యాభిమానులకు, నిరంతర రచనా వ్యగ్రులకు, అనవరత పఠనాసక్తులకు, అనుక్షణ విజ్ఞానార్జనపరులకు, అత్యంత స్నేహశీలులకు, సహృదయులకు శ్రీ శ్రీవాత్సవ — యండమూరి సత్యనారాయణరావు అకాల మరణం విచారం కలిగిస్తుంది. శ్రీ యండమూరి ఉగాది పండుగనాడు — మొన్నటి మార్చి 29వ తేదీన — న్యూఢిల్లీలో హృద్రోగంతో మరణించారు.

శ్రీ యండమూరి 1913లో తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకాలోని ఒక గ్రామంలో పుట్టారు. కలవారు కావడంవల్ల ఎలాటి చీకూ చింతా లేకుండా పెరిగారు. కాకినాడలో పిఠాపురం రాజా కళాశాలలో పట్టభద్రు లయ్యారు. ఆయన ఉపాధ్యాయవృత్తిలో ఉండడం మేలని తలిదండ్రులు భావించడంవల్ల ఎల్. టి. పట్టం పొంది, కొంతకాలం ఉపాధ్యాయుడుగాను పని చేశారు. కాని, ఆయనకు ఈ వృత్తి నచ్చలేదు. అంతకన్నా విశాలమైన పత్రికా రచన అభిమానవృత్తి అందువల్ల కొంతకాలం కొన్ని పత్రికలకు మఫ్యుసల్ కరెస్పాండెంటుగా పనిచేశారు.

అప్పుడు పత్రికారంగానికి పట్టు మద్రాసు నగరం — మద్రాసు నగరం చేరారు. అప్పుడే పిఠాపురం రాజాగారు మొదలయినవారు ప్రజాపార్టీని స్థాపించి ఎన్నికలలో పోటీ చేయడానికి పూనుకొని 'జనవాణి' దినపత్రిక స్థాపించారు. శ్రీ తాపీ ధర్మారావుగారు దానికి సంపాదకులు. శ్రీ యండమూరి 1937లో జనవాణిలో సబ్ ఎడిటర్‌గా చేరారు.

ఎన్నికలలో పీపుల్సుపార్టీ ఘోరంగా పరాజయం పొందింది. జనవాణి ఆగిపోయింది. శ్రీ యండమూరి మరొక ఉద్యోగం చూసుకోవలసి వచ్చింది. ఇంతలో ద్వితీయ ప్రపంచ యుద్ధం చెలరేగింది. యుద్ధ ప్రచారంకోసం కేంద్ర ప్రభుత్వం ఆల్ ఇండియా రేడియోను విస్తరించింది. శ్రీ యండమూరి ఆల్ ఇండియా రేడియో మద్రాసు కేంద్రం తెలుగు శాఖలో చేరారు. ఈ కేంద్రంలో చాలాకాలం పనిచేశారు. కటక్, విజయవాడ కేంద్రాలలో కొంతకాలం పని చేశారు. రెండేళ్ళక్రితం ఢిల్లీకి అసిస్టెంట్ డైరెక్టరుగా బదిలీ అయ్యారు.

శ్రీ యండమూరి నిరంతరం రచనా వ్యాసక్తులు. 'శ్రీవాత్సవ' అనే

కలంపేరుతో సాహిత్య, సంగీత, శిల్ప, చిత్రలేఖనాది వివిధ విషయాలపై దాదాపు 25 సంవత్సరాలుగా పెక్కు వ్యాసాలు వ్రాశారు. 20 సంవత్సరాలుగా "సాహిత్య సింహావలోకం" అన్న శీర్షికకింద గడచిన సంవత్సరం సాహిత్య పరిస్థితిని సమీక్ష చేసేవారు. ఈ సమీక్షలో ఆయన స్వయంగా కొన్ని పుస్తకాలు చదవక, ఇతరుల రచనలపైనో, ఇతరుల "ఉద్ధరణల"పైనో ఆధారపడి చెప్పిన విషయాలు సకృత్తుగా ఆక్షేపణలకు అవకాశమిచ్చేవి. ఏమైనా, ఆయన తన అభిప్రాయాన్ని నిర్మొగమాటంగా చెప్పేవారు. ఇతర భాషాసాహిత్యాలు ఎంత ముందుకుపోతున్నదీ, తెలుగు ఎంత వెనుకబడుతున్నదీ, ఎప్పటికప్పుడు పాఠకునికి జ్ఞాపకం చేసేవారు.

'సత్య' అనే పేరుతో పెక్కు రేడియో నాటికలు వ్రాసి ప్రచారం చేశారు. పిల్లల పుస్తకాలు, నవలలు వ్రాశారు. అడపా దడపా కొన్ని గేయాలూ వ్రాశారు.

ఆయన స్నేహశీలుడు, స్నేహపాత్రుడు. దేశంలో పేరుమోసిన పెద్ద రచయిత లందరితోను ఆయనకు సన్నిహిత సంబంధం వుండేది.

"ఉదయ కిరణాలు" అనే సాహిత్య విమర్శ గ్రంథానికి దక్షిణాంధ్ర వాఙ్మయంపై వ్రాసిన మరొక విమర్శ గ్రంథానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ బహుమతులు లభించాయి.

ఆయనకు – ముఖ్యంగా రేడియోలో వున్నందున – కన్నడం, తమిళం, మలయాళం, హిందీ, బెంగాలీ భాషలతో బాగా పరిచయం వుండేది. రాజాజీ రచించిన 'వ్యాసర్ విరుందు'ను ఆయన తెలుగు చేశారు. టాగోర్ గీతాంజలిని కూడా బెంగాలీ నుంచి అనువదించారు.

ఆయనలోని పొంగులువారే ఉత్సాహం, మనం వెనకబడిపోతున్నామనే నిర్వేదం, రచనా వ్యగ్రత, నిమిషాలపై ఏదో చేద్దామనే ఉద్వేగం అప్పుడు విపరీతంగా కానవచ్చినా, అవి జిజ్ఞాసువులకు అవసరమేనేమోనని ఇప్పుడు అనిపిస్తుంది.

(ఆంధ్రపత్రిక – 13-4-1968)

# యుగకవి డాక్టర్ పుట్టపర్తి

పట్టరాని ఆవేశం, పట్టి చూద్దామనే కావేషం; ఏ పిల్లగాలి వీచినా కదలిపోయే మనసు, ఏ చల్లగాలి సోకినా సడలిపోయే దినుసు; మాటవినకపోతే మతిచలించేటంత ఆగ్రహం, మాట వింటే కనకాభిషేకం చేసేటంత అనుగ్రహం; మూడు అంగల్లో ముల్లోకాలు జయిద్దామన్నంత ఆశ, ఆఁ! మానవ మాత్రులం ఏమిటి సాధ్యమన్నంత నిరాశ; ధ్రువునికన్నా దృఢతరమైన భక్తి, దానికి ప్రతిధ్రువమైన విశృంఖల రక్తి; ఛీ! ఛీ! ఏమిటి ఈ పాడులోకం అన్న విరక్తి, ఇదే కదా మన తరణోపాయానికి మెట్టు అన్న ఆసక్తి; మంత్రతంత్రాలపై మరులు, అధివాస్తవిక భావాల తెరలు; ఇంతవాణ్ణయినా జనం అడుగులకు మడుగులొత్తలేదే అన్న సంతాపం, ఆఁ! మనది ఎంతపాటి పాండిత్యంలే అన్న పశ్చాత్తాపం — ఇలాటి పరస్పర వైరుధ్యాలపుట్ట పుట్టపర్తి నారాయణాచార్యులు. ఉవ్వెత్తుగాలేచి సంఘర్షించుకొనే ఈ వైరుధ్యాలే ఈయనను బహుభాషావేత్తగా తీర్చాయి, రచనలో బహుమార్గానుసారిగా మార్చాయి.

సంస్కృత కవయిత్రి అయిన కన్నతల్లి చల్లనిచూపు, ఉద్దండపండితులైన తండ్రి శ్రీమాన్ శ్రీనివాసాచార్యులవారి తీవ్రశిక్షణ, వీనికితోడు ఎంతటి స్తబ్ధహృదయుణ్ణయినా కదిలించి వేసే జీర్ణ విజయనగర సామ్రాజ్య భాగమైన పెనుగొండలో నివాసమూ చిన్ననాటి నుంచే నారాయణాచార్యుల రసావేశావిష్ట హృదయానికి, పట్టుదలకు ఉద్దీపకాలయ్యాయి. అందువల్లనే పదునాల్గవ యేటే "పెనుగొండలక్ష్మి" కావ్యం చెప్పగలిగారు.

అపురూపమైన ప్రతిభ, దానికి మించిన బహుభాషా పాండితి, పాండితిని మీరే బహుముఖ వ్యుత్పత్తి, వ్యుత్పత్తికి తగిన ధారణ, ధారణను సార్థకంచేసే నిరర్గళ వాగ్ధాటి, వాగ్ధాటిని పొంకంగా కుదించే సుందర వచన రచనాచాతురి — ఇన్నిఉన్నా, సులభంగా ఆవేశపడే, స్పందించే హృదయంవల్ల చిత్రవిచిత్ర పరిస్థితులలో పడి, సాహిత్యంలో అడ్డాదిడ్డిగా దారులు తొక్కారు ఈయన.

చిన్ననాటి ప్రబంధ కవిత్వపు పుట్టనుంచి పైకిలేచి, అప్పటి జాతీయభావ పరవశతతో "అగ్నివీణ" మీటారు. ఇంతలో, ఎందుకో ఏమో హఠాత్తుగా ఈయన చూపు భక్తిమీదికి, భగవంతునిమీదికి ఎగబ్రాకింది. తులసీదాస

రామాయణ నిత్యపారాయణం ప్రారంభించి, ఆ వేదిలోనే తులసీదాసు చరిత్ర లోని ఒక ఘట్టాన్ని "సాక్షాత్కారము" అనే కావ్యంగా చిత్రించి, రామచంద్రుని సాక్షాత్కారమైనట్టు మురిసి, "పాద్యము" సమర్పించి, "విభూతి" శతకంతో రామచంద్రుని దివ్యవిభూతిని కీర్తించారు.

ఆ సమయంలోనే త్యాగయ్యగారి సోదరులు దొరస్వామయ్యగారి "ఆడెనమ్మా శివుడు" అనే గొప్పకృతి ఈయన అంతరంగంలో అనురణించింది. "ధిమిధిమి ధ్వని సరిద్గిరి గర్భములు దూగ నమిత సంరంభ హాహాకారములు రేగ" "శివతాండవము"ను "ఇటువంటి గేయకృతి యింకొకటి లేదు" అన్నంత హాయిగా. అసదృశంగా పాడారు.

అంతలో ఈయనపై చరిత్రజల్లులు పడ్డాయి. "శివభారతము"లాగ, "రాణాప్రతాప చరిత్ర" లాగ "విజయనగర భారతము" వ్రాయబూనుకున్నారు. ఎల్లో, ఏమో, అంతలో అరవిందుని అధిమానవ తత్త్వం సోకింది. రచనకే స్వస్తి చెప్పి ఆశ్రమమొకటి స్థాపించి, అపరారవిందులయి స్థిర సుఖాసనంతో తపస్సుకు తలపడ్డారు. ఈయనది కవి హృదయం! యోగం – చిత్తవృత్తి నిరోధం సాధ్యమా? మరల కలం పట్టారు. జాతీయతానుభూతితో "గాంధీ మహా ప్రస్థానము" ముగించారు; బావుకత పైకొని కాళిదాసు ఒరవడిగా ఒక నిరుపేద నిరోషి కారాగారం నుంచి తన యిల్లాలికి జలధరంతో సందేశం పంపినట్టు "మేఘదూతము" ముచ్చటగా పాడారు. ఈ మేఘం రామగిరి నుంచి ఎక్కడికో హిమాలయానికి బయలుదేరింది కాదు; హంపీ నుంచి బయలుదేరి "మంద సుందరముగా మరుతుండు తనతోడి పయనంబు దూగించి రాగా" శ్రీకాకుళం మీదుగా వెళ్ళుతుంది.

తిరువాన్కూరులో ఎటిమలాజికల్ డిక్షనరీలో పనిచేసినప్పుడు నేర్చు కున్న తమిళ కేరళ భాషల జ్ఞానం వ్యర్థం కాకుండా ఆ భాషలలోని కొన్ని రచనలను తెలుగులోకి, "ఏకవీర" మున్నగు వాటిని కేరళంలోకి అనువ దించారు; మరెన్నో స్వతంత్ర రచనలూ సాగించారు.

అయితే, ఈయనను మరాఠీ భక్తులు తుకారాం, నామ్‌దేవ్, ఏక్‌నాథ్, సమర్థరామదాస్ ఊపిరిసలపనివ్వలేదు; తమవైపు లాక్కున్నారు. మరి యీ భక్త శిఖామణి వారి కనుసన్నలలో మెలగుతూ ఇరవై వేల పైచిలుకు ద్విపదలతో "పండరీ భాగవతము" రచించికాని నిద్రపోలేదు. తర్వాత, "జనప్రియ రామాయ ణము" రచనకు కడంగి వాల్మీకి కొన్ని పాత్రలకు అన్యాయం చేశాడనే నమ్మ కంతో వాల్మీకిని సరిదిద్దడానికి కూడా జంకలేదు. నిజానికి రామాయణం వాల్మీకి సృష్టి; స్వోపజ్ఞం. దానిలో ఎవరి వేళ్లూ అవసరం లేదు.

నారాయణాచార్యులు, ఇన్ని వైరుధ్యాలతో ఎన్నిరకాల వ్రాతలు వ్రాసినా, సిద్ధహస్తుడు, రసావిష్టుడు, వ్యుత్పన్నుడు గనుక అగ్రశ్రేణిలోనే ఉంటూ సహృదయులను తలలూపేట్టు చేశారు. ముఖ్యంగా ఈయన "శివతాండవము"

"ఏమానందము భూమీతలమున
శివతాండవమట శివలాస్యంబట
ఓహో హోహో ఊహాతీతం
బీ యానందం బిలాతలంబున"

అన్న ప్రారంభ గీతాలను సార్థకం చేస్తుంది.

.... .... ....

పై మాటలు నేను మూడుదశాబ్దాలక్రితం (1960లో) ఆంధ్ర సచిత్ర వారపత్రిక 'తెలుగు వెలుగులు' శీర్షికలో వ్రాసినవి. నాటికీ, నారాయణాచార్యులు పరమపదించే నాటికీ ఆయనలో భావావేశంగానీ, భక్తి పారవశ్యంగానీ, రచనా రామణీయకంగానీ లేశమైనా తగ్గలేదు. అదీ ఆ మహాకవి విశిష్టత.

.... .... ....

"అమరుక కవేః ఏకశ్లోకః ప్రబంధ శతాయతే" అన్నారు పూర్వ విమర్శకులు. నారాయణాచార్యుల ఒక్క రచన అయినా, ఆ రచనలోని ఏ ఒక్క పద్యమైనా ఆయనను కవితారంగంలో జగాదీవిటిగా వెలిగింపజేస్తుంది. నారాయణాచార్యులు వస్తుతః భక్తుడు. ఈ భక్తి నవ విధ భక్తిగానేగాక దేశభక్తి గాను పరిణమించి, పెనుగొండలక్ష్మి, అగ్నివీణ, గాంధీ మహాప్రస్థానం, విజయనగర భారతం, మేఘదూతం వంటి మహాకావ్యాలు సృష్టించింది.

## భక్తి – ప్రేమ పరాకాష్ఠ

భక్తికి మనస్సును పరిపక్వంచేసే శక్తి ఉంది. బుద్ధికి అతీతమైనది భక్తితో లభిస్తుంది; మనస్సుకు అతీతమైనది భక్తితో సిద్ధిస్తుంది. "బౌద్ధికమైన అవగాహన మాత్రమే మానవుని హృదయాన్ని సంతృప్తిపరచజాలదు. మనం కేవలం బుద్ధితో జీవింపలేము. మన భావాలకూ, ఉద్వేగాలకూ స్థానమైన హృదయం బుద్ధికంటే సన్నిహితం. హృదయం సంతృప్తి పొందకపోతే, మానవుడు సుఖంగా ఉండలేడు. బుద్ధి మనస్సుకు శాంతి కలిగింపజాలదు" అంటారు స్వామి అమలానంద.

భగవంతుని మనస్సుతో కాక హృదయంతో చూడడం భక్తి. డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడన్నట్టు ఈ భక్తి ద్వారా మానవుడు తనకు భగవంతునితో గల సంబంధాన్ని విశదాతి విశదంగా గ్రహించి చివరకు తనకు ఆత్మభూతుడైన పరమాత్మకు శరణాగతుడవుతాడు.

## వేదాలలో భక్తి బీజాలు

ఈ భక్తికి మూలం వేదంలోనే కనిపిస్తుంది:

"అర్చత ప్రార్చత ప్రియామేధాసో అర్చత
అర్చంతు పుత్రకా ఉతపురం నధృష్ణ్వర్చత
అవ స్వరాతిగర్గరో గోధా పరిసనిష్వణత్
పింగా పరిచనిష్కదద్ ఇంద్రాయ బ్రహ్మోద్యతమ్."

పాడండి. పాడండి, ఓ ప్రియమేధా! పాడు. బాలులారా గానం చేయండి. దుర్గం, రక్షణం అయిన భగవంతుణ్ని కీర్తించండి. గర్గరం పెద్దగా పలుకు గాక! వీణానిక్వణనాలు ప్రతి ధ్వనించుగాక! వీణతీగలు తమ స్వరాలను అంతటా వ్యాపింపజేయుగాక! పరమేశ్వరునికే మన కీర్తనం ఊర్ధ్వభాగంలో ప్రసరించుగాక! - అని వేద ఋషులు భక్తిపారవశ్యంతో సర్వేశ్వరుని సంకీర్తనం చేశారు.

మానవుని పుట్టుకతోనే భక్తి ఆవిర్భవించిందనవచ్చు. అయినప్పుడు వేద ఋషులు భక్తితో భగవంతుని కీర్తించడం సహజాతి సహజం. భక్తిని పలువురు ఋషులు, ఆచార్యులూ వివిధ రీతుల నిర్వచించారు. 'భక్తిరీశ్వర విషయైవ అనురక్తిరితి యుజ్యతే' — పరమాత్మైకపరమైన అనురక్తే భక్తి అని శాండిల్య భక్తిసూత్ర వ్యాఖ్యాత స్వప్నేశ్వరుడు నిర్వచించాడు. నిరంతర ప్రేమ ప్రవాహః — భక్తి నిరంతర ప్రేమ ప్రవాహమన్నారు భగవద్రామానుజులు శ్రీభాష్యంలో. ఈ నైరంతర్యంతోపాటు గాఢత్వమూ ఉండాలని విష్ణుపురాణ వచనం :—

"యా ప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ,
త్వామనుస్మరతః సా మే హృదయాన్నాపసర్పతు."

అవివేకులకు విషయసుఖాలలో ఎలాటి ఎడతెగని గాఢమైన ప్రేమ ఉంటుందో అలాంటిది భగవంతుని విషయంలో భక్తునికి ఉండాలి; భక్తుని హృదయం నుంచి పోరాదు. నారద భక్తిసూత్రాలు భక్తిని నిర్వచిస్తూ వివిధ మతాలు వివరించి, చివరకు తన మతాన్ని నొక్కి చెప్పాయి ఈవిధంగా:- పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః కథాదిష్వితి గర్గః. నారదస్తు తదర్పితాఖిలాచరతా, తద్విస్మరణే పరమ వ్యాకులతేతి. భగవంతుని పూజాదులతో అనురాగం భక్తి అని పారాశర్యుడు అంటాడు. భగవత్కథలలో అనురాగం భక్తి అని గర్గుడన్నాడు. కాని, భగవంతునికి తన సకల వ్యవహారాలూ అర్పించి, అతడు

మరపునకు వస్తే వ్యాకులపడటం భక్తి అని నారదుడు అంటున్నాడు. దీనినే యామునులు

"దర్శనం పరభక్తిః స్యాత్ పరజ్ఞానం తు సంగమః,
పునర్విశ్లేష భీరుత్వం పరమా భక్తి రుచ్యతే."

భగవత్సాక్షాత్కారం పరభక్తి. భగవదైక్యం పరజ్ఞానం. భగవంతునితో తనకు వియోగం సంభవిస్తుందేమోనని భయపడడం పరమభక్తి - అని వివరించారు ఆగమ ప్రామాణ్యంలో. దీనినే రూపగోస్వామి మరింత ధ్రువపరిచారు ఈ విధంగా :

"అన్యాభిలషితా శూన్యం జ్ఞానకర్మాద్యనావృతమ్,
ఆనుకూల్యేన కృష్ణానుశీలనం భక్తిరుత్తమా."

ఎలాటి ప్రతిఫలాపేక్ష లేక జ్ఞాన కర్మ విరహితంగా నిరంతరం అనుకూల మార్గంలో కృష్ణుని సేవించడమే ఉత్తమ భక్తి.

## భక్తి యోగం విశిష్టత

కర్మజ్ఞాన యోగాలకన్నా 'భక్తియోగం' ఉత్తమోత్తమైందని భక్తాచార్యులందరూ నుడివినారు. "తదేవ కర్మజ్ఞాని యోగిభ్య ఆధిక్యశబ్దాత్. సాతు కర్మజ్ఞాన యేగేభ్యోప్యధికతరా." ఆ భక్తి కర్మజ్ఞానయోగాలకన్నా గొప్పది అని శాండిల్యుడు చెప్పగా, భక్తిరేవ గరీయసీ — భక్తికి మించింది మరొకటి లేదు — అని నారదుడు తన భక్తిసూత్రాల చివర స్పష్టంగా చెప్పాడు.

ఈ భక్తికి సాధ్యంకానిది ఏదీ లేదని ప్రాచీన భాగవతాదిగ్రంథాలు, ఆధునికులసూక్తులూ తెలుపుతున్నాయి. ప్రేమతో ప్రారంభమై, ప్రేమతో వృద్ధి పొంది, ప్రేమతో సమాప్తమయ్యే వాస్తవమైన, నిష్కళంకమైన భగవదన్వేషణమే భక్తియోగం. దీనికి అసాధ్యమైంది ఏదీ లేదు — అన్నారు స్వామీ వివేకానంద. మానవ చిత్తవృత్తులకు ప్రత్యక్ష సంబంధం కలది భక్తియోగం — అన్నారు స్వామి శివానంద సరస్వతి. భక్తి అనేది జ్ఞానయుక్తమైన ఆచరణమని, అనగా భగవద్భక్తిలో మూఢత్వాలు ఉండరాదని, భక్తి పర్వతాలనైనా కదిలిస్తుందని — రాధాకృష్ణ పండితుల విశ్వాసం. ఇది భగవద్రామానుజుల 'శేముషీ భక్తిరూపా' అనే వాక్యానికి అనుగుణంగా ఉంది.

## శరణాగతి

ఈ భక్తి పరాకాష్ఠే శరణాగతి. శరణాగతిని ప్రపత్తి అని, భరన్యాసమని అంటారు. ప్రపత్తితో భక్తి పరిసమాప్తి పొందుతుందన్నారు భగవద్రామానుజులు.

"అనన్యసాధ్యే స్వాభీష్టే మహావిశ్వాస పూర్వకమ్,
తదేకోపాయతా యాఞ్చా ప్రపత్తి శ్శరణాగతిః."

ఇతరవిధాల సాధ్యపడని తన కోరికను దేవా నీవే ఉపాయమై నెరవేర్చుమని మహా విశ్వాసంతో ప్రార్థించడం ప్రపత్తి — అన్నారు భరతాచార్యులు. వేదాంత దేశికులు :

"అహం మద్రక్షణభరో మద్రక్షణఫలం తథా,
న మమ శ్రీపతే రేవే త్యాత్మానం నిక్షిపేద్బుధః."

నేను, నా రక్షణ భారం, నా రక్షణ ఫలం నాది కాదు. శ్రియఃపతి అయిన నారాయణునిదే అని వివేకవంతుడు తనను భగవంతునికి సమర్పించుకోవాలి — అని ఉపదేశించారు.

ఈ ప్రపత్తి బీజాలు కూడా వేదాలలో కనిపిస్తాయి.

"వయం ఘాతే త్వే ఇద్
వింద్ర విప్రా అపిష్మసి
త్వ మస్మాకం తవ స్మసి."

దేవా, మేము నీవాళ్ళం. నీపై ఆధారపడి ఉన్నాం. నీవు మావాడివి. మేము నీ వాళ్ళం — అనే ఋక్కు ప్రపత్తిని సూచిస్తుంది. యజుర్వేదంలోని ఈ మంత్రం— "తం పత్నీభి రనుగచ్ఛేమ దేవాః పుత్రైః భ్రాతృభి ఋతవా హిరణ్యైః నాకం గృభ్ణానా సుకృతస్యలోకే తృతీయే పృష్ఠే అధిరోచననేదివః." ఓ దేవా సుకృతం చేసినవారే ప్రవేశించడానికి అర్హమైన స్వర్గాదిలోకాలపై విరాజిల్లే త్రిపాద్విభూతిని పొందడానికి పత్నులతోను, పుత్రభ్రాతృవర్గంతోను, ధనంతోను, జనాలతోను పూజ్యుడవు, ఉన్నతగతి ప్రదాయివి అయిన నిన్నే అనుసరిస్తున్నాము — శరణం పొందుతున్నాము — అని సూచిస్తున్నది.

ఇక ఉపనిషత్తులలో శరణాగతి ప్రస్తావం చాలా చోట్ల కనిపిస్తుంది, ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే — మోక్షార్థినయి నేను నిన్ను శరణు పొందుతున్నాను — అని శ్వేతాశ్వతరోపనిషద్వాక్యం. ఈ శరణాగతిని తైత్తిరీయారణ్యకం న్యాసవిద్య అని నిర్వచించింది. ఆత్మశ్రేయస్సుకు సర్వోత్తమమయిన ఉపాయం ఏదని జిజ్ఞాసువయిన అరుణి తండ్రి అయిన ప్రజాపతిని ప్రశ్నిస్తాడు. సత్యం, తపస్సు, దమం, శమం, దానం, ధర్మం, ప్రజోత్పత్తి, అగ్నిపూజ, యజ్ఞం, మానసోపాసన, న్యాసం — అనే విధానాలను ప్రజాపతి వివరించి, వీటిలో సర్వోత్కృష్టమైనది న్యాస విద్య అని చెబుతాడు. న్యాస విద్య అంటే సమర్పణం, భరన్యాసం.

## వివిధరీతుల భగవన్నుతి

ఈ భక్తిప్రపత్తులను వివిధ రీతులలో వ్యక్తపరచడమూ క్రమంగా పెంపొందింది. భగవంతుని తండ్రిగా, తల్లిగా, మిత్రునిగా, సోదరునిగా చూచి మురిసిపోవడం వేదాలలోనే కానవస్తుంది. ఋగ్వేద ఋషులు అగ్నిని తండ్రిగా, బాంధవునిగా, సోదరునిగా, మిత్రునిగా కీర్తించారు. "ఓ వసూ, నీవు మాకు తండ్రివి. నీవే మాకు తల్లివి" అని ఒక మంత్రం స్తుతిస్తుంది. వారు సరస్వతిని ప్రార్థించినపుడు ఈ మాతృభావం స్పష్టమయింది : "ఓ సరస్వతీ, నీ పాలిండ్లు నిండారి ఉన్నాయి. అవి విశ్వకల్యాణ కారకాలు. వాటితో అర్యులను పోషిస్తున్నావు. నీవు రత్నగర్భవు. వాటిని మాకు ప్రసాదిస్తావు. మా పోషణకై వాటిని మా ముందు పెడుతున్నావు."

ఇలా వివిధ భావాలతో భగవంతుని స్తుతించిన ఋక్కులు, మంత్రాలు కోకొల్లలు. వైదిక ఋషులు భగవంతుని ప్రేమపాత్రంగా, అతిథిగా, మరెన్నో రీతులుగా కైవారాలు చేశారు. మరికొన్ని ఋక్కులు భగవంతుని దీనబాంధవునిగా, అతిథిగా, ప్రేమపాత్రంగా భావించడాన్ని విశదపరుస్తాయి.

## నారాయణాచార్యుల భక్తి

ఈ భక్తి నారాయణాచార్యుల రచనలలో పలు పాయలుగా పారింది; సహృదయుల మనస్సులను పరిపక్వం చేసింది. నారాయణాచార్యుల రచనలు ఆయన భక్తి క్రమ పరిణామానికి దృష్టాంతంగా చూపలేము. ఆయన భక్తి నిరంతరము వెలుగుతున్నట్టిదే గనుక దానికి ఆది మధ్యాంతాలు లేవు. కామిగాక మోక్షకామిగాడు — అన్నట్టు ఆయన మొదట ఏ శృంగార రచయితగానో ఉండి తర్వాత మోక్షకామి అయి భక్తిరచనలు సాగించిన వాడు కాడు. పెనుగొండ లక్ష్మిలోనే ఆయన భక్తిహృదయం పెల్లుబికింది. కనుక ఆయన రచనలు భక్తితోనే అరంభమై భక్తితోనే సమాప్తమయ్యాయనవచ్చు—జనప్రియ రామాయణం, శ్రీనివాస ప్రబంధాలతో.

## పాద్యము

ఆయన రచించిన 'పాద్యము' కావ్యం రెండు శతకాలది. పాద్యమని మొదటి శతకం పేరు, విభూతి అని రెండవ శతకం పేరు. పాద్యం గొప్ప కావ్యం. ఇదొక్కటే చాలును — నిజానికి దీనిలో ఒక్క పద్యమే చాలును నారాయణాచార్యులు కవిగా నిలబడటానికి. ఈ కావ్యం మున్నుడిలో ఆయన "నా గురువు పరమేశ్వరుడు. అతడిప్పుడున్నాడు, లేడు, ఎప్పటికీ ఉన్నాడు.

దివ్యభావాలయిన ప్రేమా, భక్తి మొదలయిన వాటికి నశ్వరత్వమూ, భౌతిక మాలిన్యము లేనట్లే వాని లక్ష్యాలకూ లేవు. ఈ సత్యాన్ని గమనించిన, అనుభవించినవారు ఋషులు-కవులు" అన్నట్టు ఈ పాద్యంలోని ప్రతి పద్యమూ భౌతిక మాలిన్యం లేని దివ్యానంద గుళిక.

"మనసు మెదలదు, గన్నులు గనవు, పలుకు
బయలుదేరదు ఉపచార వాక్యములకు
ప్రభలు చల్లు నివాత దీపంబు నీవు
మోహనంబైన యొక ముగ్ధ పూజ నాది." 18

అంటారు ఈయన. నిజం. మనకు ఇష్టులయిన వారు ఎదుటబడినప్పుడు వెంటనే మనకేమీ తోచదు. మాట పెగలదు. చూపు మసకబారుతుంది — ఆనంద పారవశ్యంతో. ప్రేమమయుడు, నిత్యదీపుడు అయిన భగవంతుడే సాక్షాత్కరిస్తే ఇక ఏమి చేయగలం! 'ప్రభలు చల్లు నివాత దీపంబు నీవు!' ఆహా! ఎంతటి రూపకం! తపోనిష్ఠుడైన పరమశివుని కాళిదాసు 'నివాత నిష్కంపమివ ప్రదీపం' అన్నాడు.

"నీ మహనీయత న్నెలియ
నేరగనైతి నటన్న చింత నెం
దో మతిపోయి యాకులత
దూలగ గ్రొత్త మొగిళ్ళ పుప్పొడుల్
బ్రామిన వింతనవ్వులను
రాల్చి ననున్ గెరలించివైతు స్వా
మీ! మరి నేను నవ్వెదను
మీకయి వాసనలేని నవ్వులన్."

రెండు నవ్వులలోని వ్యత్యాసాన్ని ఈయన ఎంత కటు సుందరంగా తెలిపారో! భగవంతుని నవ్వు నిత్య సుగంధి, నిత్య నూతనోజ్జ్వలం. అది తన వాసనాకాంతులతో దీనహీనులను కెరలించివేస్తుంది. మానవునిది భౌతికమైన నవ్వు. అనిత్యం, కాంతిహీనం, వాసనలేనిది. భగవంతుని నవ్వును — శుచిస్మితం — అన్నారు యామునులు. నారాయణాచార్యులు కొత్తమొగిళ్ళ పుప్పొడితో పోల్చారు. మొగలి చెండు పుప్పొడి వాసనలు చాలాకాలం ఉంటాయి. మనస్సును ఎక్కడికో తీసుకొని వెళ్ళుతాయి. ఇది జనసామాన్యానుభవం. భగవంతుని నవ్వుతో పోల్చదగిన దీర్ఘకాలికమైన సుగంధం మరొకటి లేదేమో!

ప్రతి భక్తుడూ గోవిందుని గోకులంలో ఏ జన్మ ఎత్తినా బాగుండేదని

వాపోయాడు. ఆళ్వారులు గోపికలు కాలేకపోతిమే అని అలమటించారు. వేదాంత దేశికులు గోపాలుడు ఊదిన పిల్లనగ్రోవి భాగ్యాన్ని "అంశవాన్ వంశనాళః" అని ప్రశంసించారు. నారాయణాచార్యులు "ఆవై పుట్టివుంటే ఎంత బాగుండేది, గోపాలకృష్ణుని లాలనకు పాత్రమై ఉండేవాణ్ణి. మనుష్యజన్మ నా నెత్తిమీద రుద్దావే!" అని కోప్పడ్డారు విభూతి శతకంలో :

"నేనొక ధేనువై సొగసు
నింపిన, నా రమణీయ శృంగ కో
టీ నవ కుట్మలంబుల గ
డింతువు పట్టులకుచ్చులన్, గళల్
పూనిన కన్నులందు తడి
ముద్దుల బెట్టెదవేమొ! శుష్కవాం
ఛా నిబిరీస మీ మనుజ
జన్మము నాపయి నెత్తితేమిరా?"

ఎంత సుందరంగా ఊహించారు ఈయన. అందమైన పద్యం. అప్పుడప్పుడే పొటమరిస్తున్న మొగ్గ కొమ్ములు. వాటికి పట్టుకుచ్చులు కట్టడం, మెరిసిపోయే కన్నులను వేడివేడిగా తడితడిగా ముద్దుపెట్టుకోడం — ప్రతి గ్రామీణ జీవితం లోనూ కనిపించే కమనీయ దృశ్యం. దానికి దివ్యత్వ సౌరభం కలిగించారు ఈయన. తడిముద్దులట! ఎంత తియ్యనివో!

## శివతాండవం

నారాయణాచార్యుల 'శివతాండవం' చాల ప్రచారానికి వచ్చింది. హిందీ, బెంగాలీ, తమిళ, కేరళ సహృదయులు పలువురు దానిని విని దాని శబ్ద సమ్మేళనానికి పరవశించి ఆయా భాషలలో అనువదించమని కోరారట. వారిని ఆకర్షించినవి దాని శబ్దసమ్మేళనం, సంస్కృత పదబంధురత మాత్రమే కాక రాగానుగుణమైన పదచ్ఛందస్సు. పద్యాలు రాగతాళాలకు లొంగిరావు. సంస్కృత నాటకకర్తలు అందువల్లనే రాగాలు ఆలపించవలసి వచ్చినప్పుడు మాత్రా చ్ఛందస్సులకు, గీతాలకు మళ్ళేవారు. శివతాండవంలో శివాలాస్యం కూడ ఉంది. మొదటిది ఉద్ధత శైలిలో నడువగా, రెండవది లలితాతిలలిత శైలిలో నడిచింది. భక్తి పూలమాలలోని దారం వంటిదని చెప్పనక్కరలేదు.

"తలపైని చదలేటి యలలు తాండవమాడ
అలలత్రోపుడుల క్రొన్నెల పూవు గదలాడ
మొనసి ఫాలముపైన ముంగురులు చెఱలాడ

కనుబొమ్మలో మధుర గమనములు నడయాడ
కనుపాపలో గౌరి కసినవ్వు బింబింప
కనుచూపులను తరుణకౌతుకము జుంబింప
కడగి మూడవకంట గటిక నిప్పులు వ్రేల
ధిమిధిమి ధ్వని సరిద్గిరి గర్భములు రేగ
ఆడెనమ్మా శివుడు!
పాడెనమ్మా శివుడు!"

అని ప్రారంభమైన శివతాండవం శివాలాస్యంలోని చివరి
"పలికిరంతటన గీర్వాణులెల్లరు గూడ
చలితకంఠముల శివశక్తులకు మంగళము
కచ్ఛపివీణ ఉత్కంఠ తోడుత రాగ
గుచ్ఛముల నీన అఘూర్ణితముగ దిక్కు
లాడినది గిరికన్నె."

అనే గీతం వరకు శ్రోతలు జాగరూకులై వినవలసిందే. ఎక్కడా బీరువోని వటుత్వం! ఎక్కడా సడలని గతి! ఎక్కడా తప్పని లయ!

శివుడు తాండవం చేస్తుంటే ఫాలంపైన ముంగురులు చెరలాడినాయట. భక్తకవులందరూ భగవంతుని, నిత్య యౌవనుని ఫాలంపై నాట్యమాడే అలకలను పనిగట్టుకుని వర్ణించారు. లలాట పర్యంత విలంబితాలకమ్ — అని నారాయణుని వర్ణించారు యామునులు.

"అలకలల్లలాడగ గని
ఆ రాణ్మని ఎటుపొంగెనో!"

అని త్యాగయ్యగారు మారీచుణ్ని ఎదిరించి పోరాడుతున్న రామచంద్రుని మోమున రంజిల్లే అలకలను చూచి విశ్వామిత్రులై పొంగిపోయారు. ఇక నాట్య సమయంలో ముంగురులు చెరలాడటం నారాయణాచార్యులను ఊరికే ఉండనిస్తుందా?

విఖ్యాత కళా విమర్శకుడు ఆనంద కుమారస్వామి శివతాండవం గురించి 1914లో ఆంగ్లంలో ఒక వ్యాస సంపుటి ప్రచురించారు. దానిలోని ఒక వ్యాసంలో శివతాండవ తత్త్వాన్ని వర్ణించారు ఆయన. సర్వ ప్రపంచ సృష్టి స్పందనమే శివుని నృత్యభంగులు — అని ఆయన ఆ వ్యాసంలో విశదీకరించారు. సృష్టి పరమేశ్వరునిలీల. ఈ లీల పరమసత్యపు వ్యక్తరూపం. ఈ వ్యక్తరూపమే పరమమని నమ్మినవారు భ్రమపాలవుతారు. ఈ చైతన్య వ్యక్త

రూపాన్ని ఉపాసించి, దానికి అతీతమైన మూలపదార్థమే సర్వమని నమ్మినవారు ఆ పరమస్థితిలో తాదాత్మ్యం పొందుతారు – ఇదీ శివతాండవ శివాలాస్య రహస్యం.

## సాక్షాత్కారం

సాక్షాత్కారము మరొక భక్తి కావ్యం. దీని ఇతివృత్తం తులసీదాస జీవితంలోని ఘట్టమని ఇదివరకే తెలిపాను. ఇది పూర్తిగా ఆవేదనా ఝరి. నారాయణాచార్యులు కావ్య ప్రారంభంలో

"రసమో వ్యంగ్యమొ భావమో మరి అతం
ద్రాలంకృతి న్యాసమో
ఇసుమంతైన నెరుంగనోయి ప్రభువా
ఈ కొండలన్ చింత వె
క్కసమైనప్పుడు ఏడ్చి కొంటి నదియే
కావ్యాత్మగా మారె నీ
యసమాన ప్రతిభా ప్రభావమున
మోహచ్ఛేద కౌక్షేయమై."

అని నివేదించుకొన్నారు. కనుక ఇది ఏడ్పు, ఆవేదన పరంపర.

## పండరీ భాగవతం

నారాయణాచార్యుల భక్తి రచనలలో 20 వేల పైచిలుకు ద్విపద లున్నట్టిది పండరీ భాగవతం. దీనిలో పుండరీక, చోకామీళ, నామదేవ, గోరాకుంభార, నరహరులనే పాండురంగవిఠల భక్తుల చరిత్రలు వర్ణితాలు. భక్తకవులందరూ పదచ్ఛందస్సుతోపాటు ద్విపదనూ – ఎక్కువగా వాడారు. ద్విపద కథాకథనానుకూల ఛ్ఛందస్సు. కథా గమనానికి అడ్డురానిది. నాదృష్టిలో ఇది పాల్కురికి సోమనాథోపజ్ఞం. తరువోజపాదాన్ని రెండుగా విరిచి ద్విపదను సృష్టించాడు సోమన. బసవుని పాదాలన్నాడు. గౌరన నవనాథ చరిత్రను ద్విపదలో రచించాడు. తాళ్ళపాక కవులు భక్తి, విశిష్టాద్వైత తత్త్వాల ప్రచారానికి ద్విపదను బాగా ఉపయోగించారు. కనుక నారాయణాచార్యులు పండరీ భాగవతా నికి ద్విపదను స్వీకరించడం సహజం. వాల్మీకి అనుష్టుప్పును 'పాఠ్యే గేయే చ మధురం' అని అన్నట్టు తెలుగు ద్విపద 'పాఠ్యే గేయే చ మధురం'. పండరీ భాగవతం – నా దృష్టిలో ఈ శతాబ్దపు గొప్ప భక్తికావ్యం. భక్తికావ్యమే గాదు మహాకావ్యం. ఇదివరకు తెలుగులో వచ్చిన ద్విపద కావ్యాలన్నిటికన్నా పెద్దది.

తిరువేంగళనాథుని పరమయోగి విలాసంతో పోటీపడేది; సోమనాథుని ప్రారంభానికి చివరిఫలం వంటిది.

నారాయణాచార్యులు ఈ కావ్యావతారికలో సంస్కృతాంధ్ర కవులందరినీ స్తుతిస్తూ, కావ్యరచనోద్దేశాన్ని ఇలా నివేదించారు :

“మరి అద్యతన కవివర శక్తి రక్తి
గుఱితించి, భావి విజ్ఞుల గుస్తరించి
భక్తుల దాసుండ భక్తుల లెంక
భక్తుల పడిగాపు భక్తి జీవనుడ
భక్తి గోత్రుండ సద్భక్తి వంశ్యుండ
భక్తి చాపల్యుండ భక్తి బంధుండ
విదితాష్టభాషా కవిత్వ నిర్మాణ
మదబంధురుడ కళామహిత రాహస్య
సేవధి, అవధాన చిత్ర చణుండ
భావుకులెల్లరు ప్రమదంబు నొంది
భళి భళి యని మెచ్చ భక్త కుటుంబ
ములు తలలార్చి కన్నులను మోడ్వంగ
భక్త భండారంబు పండరీశ్వరుడు
రక్తి దుల్కాడ సంభ్రమితు డావేశ
మున ఘల్లు ఘలు ఘల్లుమని వలయములు
నినదింప బ్రేంకణంబును జూప రసము
యమకంబు గమకంబు నమరిన జాతి
గ్రమహితాన్వయము గారకముల సొంపు
నుడులతో తూగు నానుడులతో బాగు
వడకని గతియు చొప్పడినట్టి మితియు
ధ్వని యలంకార ముత్తమశైలి పాక
మనపద్య మౌచితి యర్థవిన్యాస
మప్పుడప్పుడు గుప్పు గుప్పున వెదలి
ముప్పిరి గొనజేయ మోదంబు విబుధ
కోటికి రచియింతు ఘోర దుర్జన్మ
పాటన ప్రవణుడౌ పండరినాథు
గుణపరీమళములు గుబులుకొనంగ

నెనిమిది దిక్కుల నెంతయువేడ్క
పరమంబు పండరీ భాగవతమ్ము."

దుర్జనన పాటనం ఈ రచనోద్దేశం. ఈ భక్తులు సామాన్య ప్రజల నుంచి వచ్చిన వారు గనుక ఈ కావ్యం ప్రజల జీవిత వాహినిలోని వివిధ తరంగాలకు, మలుపులకు, సుడిగుండాలకు అద్దం పడుతుంది. ఇది ఏ మరాఠీ రచనకు అనుకరణం కాదు; స్వతంత్ర రచన, మౌలిక రచన.

## జనప్రియ రామాయణం

నారాయణాచార్యుల రచనలో మకుటాయమానమైంది "జనప్రియ రామాయణము." ఇది షట్పదీ ఛ్ఛందస్సులో సాగింది. పాఠ్యే గేయే చ మధురం. ఈ రచనోద్దేశం ఆయనే మున్నుడిలో ఇలా చెప్పుకొన్నారు :-

"నేను ఉత్తర హిందూస్థానంలో తిరిగినప్పుడు అక్కడ తులసీరామాయణానికున్న బ్రహ్మాండమైన ప్రచారాన్ని గమనించాను. ఇలా తెలుగులో ఒకటి ఉంటే బాగుంటుందేమోననిపించింది. కానీ తులసీదాసెక్కడ? నేనెక్కడ? నక్క ఎక్కడ? నాగలోకమెక్కడ? అయినా ఏమో ప్రయత్నం చేసినాను. మొదట్లో రామాయణం వ్రాసే దానికి భయపడినాననే చెప్పాలి. వాల్మీకి మహర్షి అర్థ గాంభీర్యం చూచే కొద్దీ భయం అయింది. అందులో కిష్కింధాకాండలో ఆయన ప్రకృతి వర్ణన మహాద్భుతంగా సాగింది. అందుకే ముందు దాన్నే వ్రాశాను.... పదిమందీ బాగుందన్నారు. దానితో ధైర్యం వచ్చి ముందుకు సాగాను. కిష్కింధా కాండమంతా మూలానుసారంగా సాగిందనే చెప్పవచ్చు. తర్వాత కంబ రామాయణం, మరాఠీలోని భావార్థ రామాయణం, మలయాళంలోని రామాయణం ఇంకా కొన్ని రామాయణాలు చదవడం తటస్థించింది. వారందరూ వాల్మీకిని యథాతథంగా అనుసరించినవారు కారు. వీరికి వచ్చిన చిక్కేమిటి? అనుకున్నాను. వాల్మీకిది ధ్వని ప్రధానమైన కవిత్వం. అది చాలాచోట్ల ఆ పదాలు వేస్తేనే కుదురుతుంది. పైగా వాల్మీకి కంఠోక్తిగా రాముణ్ని భగవంతుడని పలుమార్లు చెప్పడు; ధ్వనింపజేస్తాడు. అట్లా ఇతర భాషల్లో ధ్వనిని తీసుకు రావడం కష్టం. రాముణ్ని అడుగడుగునా భగవంతుడుగా వాచ్యంగా చెప్పకపోతే చాలామందికి సంతోషంగా ఉండదు. రామాయణ రామచరిత్ర — భారతీయులకు ఉపాసనాగ్రంథం. అందువల్ల వాల్మీకినే అనుసరించడం తరువాత నాకు ఇష్టం లేకపోయింది. నా మనస్సుకు తృప్తిగా ఉండేటట్లు రామకథను మలచుకుంటూపోయాను. కథలో మలుపులు తిప్పినపుడు వాస్తవానికి దూరమవుతుంది కదా! — ఇది కావ్యదృష్టి లేనివాడు వేసే ప్రశ్న. కవి చారిత్రకుడుకాడు.

కవితారీతులలో రసోత్పాదన చేయడమే వాని ధర్మం. కాళిదాసాదులంతా అనుసరించిన మార్గం ఇదే. కనుక ఆ దృష్టితో నన్ను విమర్శిస్తే, వారికి ఉత్తరం నా మౌనం."

వాల్మీకిని అనుసరించలేదని ఈయన కంఠోక్తిగా చెప్పుకున్నాడు గనుక మనకు ఈయనతో వాదమే లేదు. వాల్మీకికి మెరుగుపెట్టాను, వ్యాసునికి మెరుగులు దిద్దాను అన్నప్పుడే మనకు వాదం.

ఈ జనప్రియ రామాయణం దాదాపు ఎనిమిదివేల పుటల మహాగ్రంథం. పుటకు నాలుగు షట్పదుల ప్రకారం దాదాపు 32 వేల షట్పదులుంటాయి. ఈయన కాండలలో ఖండాలని విభాగాలు చేసుకొన్నారు – ఉదాహరణకు బాల కాండలో సరస్వతీ సాక్షాత్కార ఖండం, వశిష్ఠదయా వర్షణ ఖండం, ఇష్టి ఖండం ఇత్యాదిగా. వృత్తాలు నడపడంకన్నా షట్పదులు నడపడం చాలకష్టం. ఈయన రెండు రెండు పాదాలకొక ప్రాస, లేక యతి పాటిస్తూ అసిధారా వ్రతంగా సాగించారు రచనను. ప్రతి ఖండం ప్రారంభంలో కందంతో ఇష్ట దేవతాస్తుతి, ప్రతి ఖండం చివర రెండు వృత్తాలతో సంబోధనా చేశారు.

రాముడు అవతరిస్తున్నాడు. అంతఃపురంలో అందరూ కుతూహలాయత్తచిత్తులై ఉన్నారు. దశరథుడు నిరంతరం భగవన్నామమే జపిస్తున్నాడట:

"అడుగడుగునకు దోచు
నెడదలో రాజునకు
రాబోవు పుత్రోదయంబూ– నెమ్మనము
కుసుమితం బొకనందనంబూ
రంగనాథుని దలచి వినయమున దలవంచు రాజు తిరు
మంత్రమును సాయుజ్య మధురమును జపియించు."

ఇక కౌసల్య స్థితి చెప్పనక్కరలేదు. ఆమెకు ఏమీ తోచలేదు.

"కౌసల్య కింటిలో
గను మూతపడదు, ది
క్కుల నెల్ల రంగనాథుండూ– శంఖ చ
క్ర గదాది భృత్యశోభితుడూ– నిటల తటి
ఘటితాంజలుండౌచు– గట్టెదుట నిలుచున్న
చండ రాక్షసకుల జ్వరమైన గరుడుండు
'నే వత్తునే తల్లి

నీకు సుతుడను గాగ
నీ చనుబాలు గాంక్షించీ– యాజ్యాహు
తులకన్న చవులు భావించీ– ఒక తొల్లి
యదితికిని జన్మించి తమర కార్యము బూని
నీవు రెండవయదితిదేవి యీ సారికిని'
అని పలికినటులైన
నతివ కలకల నవ్వు
పూర్వజని ఏదియో మెదలీ– కై మోడ్పు
మధురముగ మదియెల్ల కదలీ– తపమునకు
ఫలకాలమెదురైన పలుతలంపుల నలగు
సాధకుని యెదవోలె సదమదంబై పొలతి."

(బాల. పు. 160-161)

ఇలా భక్తి పారవశ్యంతో శ్రీ వైష్ణవ సంప్రదాయ సరణిలో సాగిపోతుంది ఈ రామాయణం.

నారాయణాచార్యులు ఈ యుగానికే కాదు రాబోయే యుగానికీ మహాభక్త కవి. తాను భక్తి సాహిత్యంలో తరించి, పతితలను తరింపజేశారు నారాయణాచార్యులు మనపాటి మానవుడే. లోపాలు లేనివాడు కాదు. కాని ఆ లోపాలను అరసి, ఎప్పటికప్పుడు భక్త్యావేదనలో తపించి, లోపాలను దహించుకొంటూ, శ్యామ శబలం చేసిన బంగారులాగ పరిశుద్ధుడైనారు. తన రచనలతో లక్షలాది ప్రజలను తరింపజేశారుగనుక. అలా తరింపజేయడానికే రచనలు చేశారు గనుక– ఉత్తమ గతులు పొంది ఉంటారు. సందేహం లేదు.

శ్రీనివాస కల్యాణ ప్రబంధం నవీన రీతులతో ప్రాచీన ప్రబంధాలతో ఏగసక్కెమాడే అతని ఈ శతాబ్దపు మహాకావ్యం.

శ్రీనాథుడు "దివిజకవివరు గుండిలన్ దిగ్గురనగ నరుగుచున్నాడు శ్రీనాథుడమరపురికి" అని చెప్పుకొన్నాడు- అవసాన కాలంలో. నారాయణాచార్యులు,

"ఒకనాడు కృష్ణరాయ కిరీట సుమశేఖ
రంబైన యభయ హస్తంబు మాది
ఒకనాడు గీర్దేవతా క్రమకంకణ
స్వనమైన మాదురీ ప్రతిభ మాది
ఒకనాడు రామానుజ కుశాగ్రబుద్ధికే
చదువు నేర్పినది వంశమ్ము మాది

ఒకనాటి సకల శోభకు తాకనంబైన
దండిపురంబు పెన్గొండ మాది
తల్లిదండ్రుల మేధ విద్యా నిషధ్య
పాండితీ శోభ పదునాల్గు భాషలందు
బ్రదుకునను బడిపంతులు, భాగ్యములకు
చీడబట్టిన రాయలసీమ మాది!"

అని చెప్పుకున్నారు. ఇది స్వాతిశయం కాదు. యదార్థం. ఇంతటి వానిని పర లోకంలోను శ్రియఃపతి కరుణా కటాక్షంతో అనుగ్రహిస్తాడు.

(ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక – 1960,
శ్రీ నృసింహప్రియ 11 వ వార్షిక సంచిక)

# ఆ సహృదయమూర్తి!

సరిగ్గా మూడు దశాబ్దాలనాటి ముచ్చట. భద్రాచలంలో రామదాస ధ్యానమందిరం ఏర్పాట్లు చురుకుగా సాగుతున్నాయి. అప్పటి ఉపరాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారు ధ్యానమందిరం ప్రారంభోత్సవం చేయనున్నారు. పరిసర ప్రాంతాలనుంచి జనం బిలబిలమంటూ వస్తున్నారు, పడవలపై గోదావరి దాటి వచ్చేవారు, ఇతర యానాలనుంచి వచ్చేవారు— ఎటు చూచినా జనమే. ఉదయం పది గంటలకే ప్రారంభోత్సవం గనుక వెనుకటి రాత్రంతా నిర్వాహకులు తీరిక లేకుండా తిరుగుతున్నారు. వారి మధ్యన అసులో కండెలాగ సంరంభ సంభరితులుగా ఉన్నారు పైడిలక్ష్మయ్యగారు.

ఔను. ఆయన దేవాదాయ ధర్మాదాయశాఖ కమీషనర్. వస్తున్నవారు డాక్టర్ రాధాకృష్ణగారు. ఏర్పాట్లు కచ్చితంగా వుండాలి. ఆంధ్రాణాం హి అనేకత్వమ్— అనే అపవాదు రాకూడదు. కనుక ఆయన ప్రతిచిన్న విషయాన్ని— క్యూ పద్ధతి సరిగా వుందా, గోదావరి మెట్లు సరిగా ఉన్నాయా, సభాంగణంలో కుర్చీలు కుంటకుండా ఉన్నాయా— చూస్తున్నారు; వారివెంట ఉన్న ప్రముఖులతో ఛలోక్తులు విసురుతున్నారు. ఆ ప్రముఖులలో అప్పటి పార్లమెంటు సభ్యురాలు వాణీ రమణారావు, శ్రీమతి లక్ష్మీకాంతమ్మ మున్నగు వారున్నట్లు గుర్తు.

నేను ఆ ఉత్సవాన్ని 'కవర్' చేయడానికి ఆంధ్రప్రభ ప్రత్యేక ప్రతినిధిగా వెళ్ళాను. ఆ హడావుడి అంతా చూస్తున్నాను. పైడివారికి బాగా ఎరిగినవాడిని— వారు మా ఊరివారే గనక. కాని, అంతగా చనువులేదు, దూరంగా మద్రాసులో ఉండడంవల్ల. అయినా, పత్రికా ప్రతినిధిగా సంక్రమించిన స్వాతంత్ర్యంతో ప్రశ్నించాను. "ఏమిటి మీకు ఈ ఆరాటం? మీరు అధికారులు. ఒక వైపు కూర్చుంటే, క్రిందివారు చేసుకుపోరా?" అని. ఆయన ఒక్క మందహాసం విసిరి, "ప్రారంభోత్సవం చేయడానికి వస్తున్నవారు రాధాకృష్ణ పండితులు. ఆయనకు మన లోపాలు కనిపించరాదు. ఏర్పాట్లు కచ్చితంగా లేకపోతే ఎట్లా?" అన్నారు. "ఆయన ఇవన్నీ చూడవచ్చారా?" అన్నాను. "ఆ! అదే మన లోపం. ఒకరు చూడవచ్చారా అన్నదృష్టితో మనం చేయరాదు. మన కర్తవ్యం ప్రతీది

నిర్దుష్టంగా ఉండేట్టు చూడడం. అయినా లోపాలు ఉంటాయి. అది మానవ సహజం. మనవిధి మనం నిర్వ ర్తించాలి." అంటూ తమ సోమనాథ శతకంనుంచి

"సంతులు సరోవరములు వర్షంబు తరులు
జనుల కొనరించుచుండు నిస్వార్థ సేవ
స్వార్థరహిత సేవయే సత్యపథము
సూరి వందిత సద్గురు సోమనాథా!"

అనే పద్యం చదివి "మహానుభావులు నిర్వార్థ సేవ చేస్తుండగా, మనం విధ్యుక్త ధర్మాన్నైనా, మనఃపూర్వకంగా నిర్వర్తించవద్దా?" అని ప్రశ్నించారు.

అదీ పైడివారి విధి నిర్వహణ, కర్తవ్య నిష్ఠ.

ఆయనది సమున్నతాకృతి. అదే పాత పద్ధతి తలపాగాతో మరింత ఉన్నతంగా కనిపించేది. ఆ ఉత్సవ సమయంలో ఎక్కడ చూచినా ఆ తల పాగాయే తిరుగాడుతున్నట్టు నాకు అనిపించింది.

ప్రారంభోత్సవం పూర్తయింది. ఉత్సవ విశేషాలు ప్రచురించడం కోసం మా పత్రికా సంపాదకులు శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారితోపాటు విజయవాడకు బయలుదేరుతూ, పైడివారిని కలుసుకొని అభినందించాను వినయంతో. ఆయన మునుపటి మందహాసంతోనే "ఇలాంటి అవకాశాలు అరుదుగా వస్తాయి. అసలే మన మనస్సు కోతి. దానిని పట్టుకొని కట్టివేయాలి. ఏ పనికైనా – అది భగవద్ధ్యానం కానీండి, ఇంటిని చక్కబెట్టుకోడం కానీండి. ఇలాంటి సమయంలో ఏకాగ్రతతో అందరూ పనిచేశారు గనుక ప్రారంభోత్సవం అద్భుతంగా జరిగింది" అన్నారు.

"ఔను. మీరూ మనస్సు కోతి అని చెప్పిన పద్యం నాకు జ్ఞాపకం ఉంది" అంటూ,

"అనిశము మోహకాననము
నందు, సతీకుచ పర్వతమ్ములన్
కొనమొసలేని యాశలను
కొమ్మల స్వేచ్ఛ జరించునట్టి యా
మనసను క్రోతి నెట్టులొ స
మంచిత భక్తిని గట్టి నీవశం
బునగొను మాది బిక్షు! భవ
ముక్తిఫలప్రద మల్లికార్జునా!"

అనే పద్యం చదివాను. ఆయన చాల సంతోషించి "అదంతా గురుకృప" అంటూ మమ్మల్ని సాగనంపారు.

లక్ష్మయ్యగారు న్యాయవాదులుగా ప్రసిద్ధిపొందారు. పార్లమెంటు సభ్యులుగా ఉన్నారు. విద్యార్థి దశనుంచే నాటక రచన ప్రారంభించారు. చిన్ననాడు రచించిన మార్కండేయ విజయ నాటిక ప్రదర్శనాన్ని నా చిన్నతనంలో చూచాను. శ్రీ సి. ఎన్. నటేశన్ నాటకమండలి వారు ప్రదర్శించినట్లు గుర్తు. ఆయన ఈ నాటకమేకాక మహాత్మ కబీరు, శ్రీరామాశ్వమేధము, ఉభ్థాగ్రేసరుడు, తారాశశాంకము, మల్లికార్జున మాహాత్మ్యము, సాయిలీల, సంసార నౌక, శ్రీశైలీయము అనే నాటకాలూ రచించారు. చివరివి మూడు ముద్రణ కాలేదనుకుంటాను. నాటకాలన్నీ రాయలసీమ అంతటా, సర్కార్లలోను పెక్కుసార్లు ప్రదర్శనం పొంది జనాన్ని ఆకర్షించాయి. మల్లికార్జున మాహాత్మ్య నాటకం హేమారెడ్డి మల్లమ్మ చరిత్ర. ఈ నాటకంలో మల్లమ్మ తల్లిదండ్రులు ఆమెను అత్తవారింటికి పంపుతున్న ఘట్టం కాళిదాసు శాకుంతలంలోని చతుర్థాంకాన్ని తలపిస్తుంది. ఆమెను వారు

"పతిని దైవంబుగా భావించి సతతంబు
నింపు సొంపెలయ బూచింపుమమ్మ!
అత్త మామలను ప్రత్యక్ష దేవతలని
తలచి భక్తిని సేవ సలుపు మమ్మ!
తోడి కోడండ్రు నీ తోబుట్టువు లటంచు
నెంచి యాదరమున గాంచు మమ్మ!
సేవకులను నిరసింపక కన్నబి
డ్డలవోలె బోషించి యలరు మమ్మ!
శ్రీగిరి క్షేత్రమందు రాజిల్లునట్టి
జనని భ్రమరాంబ, మల్లికార్జునుడు మనకు
నిష్టదైవమ్ములని యాత్మ నెంచుమమ్మ!
పోయిరావమ్మ! శుభములు పొందుమమ్మ!

అంటూ దీవించి సాగనంపుతారు.

రాయలసీమలోని కమ్మవారంతా చాలవరకు రామానుజ సంప్రదాయానుయాయులే. కాని లక్ష్మయ్యగారు మాత్రం శైవం అవలంబించారు. ఆయన గురువులు బెంగుళూరు పరిసరాలలో వున్న కెంగేరిలోని సావన్ దర్బారు ఆశ్రమవాసులు బాబా సద్గురు సోమనాథ మహారాజ్‌గారు. లక్ష్మయ్యగారు వారిపై "సూరి వంద్రిత సద్గురు సోమనాథ!" అనే మకుటంతో శతకం చెప్పారు. (దానిలోని ఒక పద్యం ఇదివరకే ఉదాహరించాను.)

ఆయనలో మంచితనం పాళ్లెక్కువ. అందువలననే ఆయన రొమ్ము విరిచి

"ధనము గడియింప నీచ వర్తన మదేల?
జనుల వంచించి మోసంబు సలుపనేల?
వచ్చునే వెంట పుచ్చిన వక్కు తుదకు?
సూరి వందిత సద్గురు సోమనాథ!"

అని అనగలిగినారు. అదీ ఆయన చరిత్ర బలం!

ఆయన అనంతపురం జిల్లా రచయితల సంఘం అధ్యక్షుడుగా ఉన్నప్పుడే అనుకుంటాను, నాకు ఆంధ్ర నాట్య సంఘం జరిపిన సన్మానం ఆయన జరిపించడం నాకింకా గుర్తుంది. ఆయన సమున్నత మధురోదార మూర్తి, అనుభవం పండి, జ్ఞానం నిండారిన మందహాస మధురముఖదీప్తి నాకు నిరంతరం జ్ఞాపకముంటాయి.

(రసమయి ప్రచురించిన శ్రీ పైడి లక్ష్మయ్య సన్మాన సంచిక – 1990)

# డాక్టర్ జకీర్ హుస్సేన్

"జకీర్ హుస్సేన్, ఆయన సంఘం సూచించిన బేసిక్ జాతీయవిద్య అన్నమాట భారతదేశంలోను, విదేశాలలోనూ చాల వుత్సాహం కలిగిస్తున్నది"— అని అన్నారు గాంధీజీ జకీర్ హుసేన్ అధ్యక్షతన నియమించబడిన ప్రత్యేక సంఘం సిద్ధపరచిన నివేదికకు వ్రాసిన పీఠికలో. ఈ నివేదిక 1938 లో సిద్ధ మయింది.

ఈ నివేదికకు ఒక గాథ వుంది. అప్పటి బ్రిటిష్ విద్యా విధానం— వారి వలన ప్రభుత్వానికి అవసరమైన గుమాస్తాలను, వహారా వారిని తయారు చేయ డానికి వుపయోగపడేదేకాని, జాతిలో చైతన్యోత్సాహాలు రేకెత్తించేది, జాతిని ముందుకు తీసుకుని పోయేది కాదని మన నాయకులకు ముఖ్యంగా గాంధీజీకి అభిప్రాయం కలిగింది. విద్య అనేది బాలబాలికలను అకర్మణ్యులుగానో వికర్మ ణ్యులుగానో చేయక కర్మణ్యులుగాను, చదువు ముగించిన పిదవ స్వశక్తిపై ఆధారపడి పొట్టపోసుకోవడమేకాక, జాతికి కూడ ప్రయోజనపడే వారినిగాను తీర్చిదిద్దడం అవసరమని గాంధీజీ నిశ్చయించారు. ఈ నిశ్చయంతో యావద్భా రతదేశ విద్యావేత్తలనందరినీ 1937 అక్టోబరులో సమావేశపరచి, విద్యామహాసభ జరిపించారు. ఈ మహాసభ 22, 23 తేదీలలో వార్ధాలో జరిగింది. ఈ మహా సభలో మనదేశంలో బేసిక్ విద్యా విధానానికి పునాదులు పడ్డాయి. ఈ మహా సభలో జాతీయ విద్యా విస్తరణకు నాలుగు తీర్మానాలు అంగీకరించబడ్డాయి. బేసిక్ జాతీయ విద్యా విధానానికి ఒక ప్రణాళికను సిద్ధపరచాలని డాక్టర్ జకీర్ హుస్సేన్ అధ్యక్షుడుగా ఒక సంఘం నియమించబడింది. పైన పేర్కొన బడినది ఈ సంఘమే. ఈ సంఘం కొన్ని నెలలపాటు దేశమంతా తిరిగి నివేదికను సిద్ధపరచింది.

డాక్టర్ జకీర్ హుస్సేన్ అధ్యక్షుడుగా బేసిక్ విద్యా విధాన సంఘాన్ని నియమించడాన్నిబట్టే గాంధీజీకి ఆయనపై ఎంత విశ్వాసముందో గ్రహించ వచ్చు. ఆ విశ్వాసం కలిగించడానికి డాక్టర్ జకీర్ హుస్సేన్ విద్యారంగంలో, ముఖ్యంగా గాంధీజీ ఉద్దేశించిన విద్యావిధాన రంగంలో చేసిన కృషి కూడ అలాంటిది. ఆయన ఢిల్లీలోని జాతీయ విద్యాసంస్థ జామియామిలియా ఉస్మాని

యాకు 1926 నుంచి 1948 వరకు వైస్‌చాన్సలర్‌గా వున్నప్పుడు జాతీయ విద్యావిధానం గురించి నూతన పథకాలను ఆలోచించారు; గాంధీజీ పథకాలు, సూచనలు గ్రహించి బేసిక్ విద్య మొదలు ఉన్నత కళాశాల విద్య వరకు పెక్కు పథకాలు సిద్ధపరచి, జామియామిల్లియాలో అమలు పరచారు. ప్రతి విద్యార్థిని జాతీయవాదిగా, దేశం కోసం ఎంతటి త్యాగానికైనా సిద్ధపడేవాడినిగా రూపొందించారు.

గాంధీజీకి జాతీయ విద్యావిధాన రంగంలో కుడిభుజంగా వున్న డాక్టర్ జకీర్ హుస్సేన్ 1897 ఫిబ్రవరి 8వ తేదీన నేటి ఆంధ్ర రాజధాని అయిన హైదరాబాద్ నగరంలో జన్మించారు. ఆయన పూర్వులు ఉత్తరప్రదేశ్‌లోని ఫరూఖాబాద్ జిల్లావారు. ఆయన తండ్రి హైదరాబాద్‌లో కొలువులో వుండేవారు.

ఆయన విద్యాభ్యాసం అంతా ఉత్తరప్రదేశ్‌లోనే జరిగింది. మొదట అయన ఎటావాలోని ఇస్లామియా హైస్కూలులో (1907 నుంచి 1913 వరకు) చదివి మెట్రిక్యులేషన్ పరీక్షలో వుత్తీర్ణులై, అలీఘర్ నగరంలోని ఎం.ఎ.ఓ. కాలేజిలో చేరి 1918లో పట్టభద్రులయారు. అప్పుడా కళాశాల అలహాబాద్ విశ్వ విద్యాలయానికి అనుబంధ కళాశాలగా వుండేది. తర్వాత ఆయన అలహాబాద్‌లో న్యాయకళాశాలలో చేరారు. ఆ కాలంలో న్యాయవాది వృత్తికి చాల గౌరవం వుండేది. న్యాయవాదులు సంఘంలో ఎనలేని గౌరవం చూరగొనేవారు. అందు వల్ల ఆయనకు కూడా ఆ వృత్తి ఆకర్షకమయింది.

ఆ సమయంలోనే జకీర్ హుస్సేన్‌కు జాతీయవాదంపైన, గాంధీజీ పైన భక్తిశ్రద్ధలు ఏర్పడ్డాయి. మతాన్ని కచ్చితంగా పాటించే ముస్లిం వంశంలో జన్మించిన ఆయనకు ముస్లింలీగ్ కార్యక్రమాలు నచ్చలేదు. దాని ద్విజాతి సిద్ధాంతం అసలే నచ్చలేదు. మీదుమిక్కిలి విదేశీయులయిన బ్రిటిష్ వారి అండ దండలకోసం ముస్లింలీగ్ అంగలార్చడం సుతరాం ఆయనకు గిట్టలేదు. అందు వల్ల భారతజాతి అంతా ఒక్కటేనని, హిందువులు, ముస్లిములు మతంతో వేరయిన సిద్ధాంతభేదం గల సోదరులేనని ప్రవచించే గాంధీజీ సిద్ధాంతాలవైపే ఆయన మనస్సు మొగ్గింది. ఈ మొగ్గ తొడిగిన మొగ్గు గుబాళించే సమయమూ త్వరలోనే సమకూరింది.

గాంధీజీ ఉద్యమం – సహాయ నిరాకరణోద్యమం – ముమ్మరంగా సాగిన రోజులవి. గాంధీజీ బ్రిటిష్ విద్యాసంస్థలను గూడ బహిష్కరించాలని తన అనుయాయులను ఆదేశించారు. పెక్కు పాఠశాలలు, కళాశాలలు విద్యా

ర్థులు లేక బోసిపోయాయి. నూతన జాతీయ విద్యాలయాలు, కళాశాలలు నెలకొన్నాయి. గాంధీజీ ఆహ్వాన నినాదం డాక్టర్ జకీర్ హుస్సేన్ మనసుమీద కూడా పడింది. ఆయన వెంటనే న్యాయశాస్త్ర కళాశాలకు వెళ్ళడం మానుకున్నారు. న్యాయవాది కావడంకన్నా ఉపాధ్యాయుడుగా దేశానికి, ప్రజలకు వాస్తవమైన సేవ చేయగలమనే విశ్వాసంతో జామియా మిలియా ఇస్లామియా (జాతీయ విద్యాలయం)లో ఉపాధ్యాయుడుగా చేరారు. వేతనం పుచ్చుకొనేవారుకారు. గాంధీజీ విద్యా సిద్ధాంతాలు ఆయన మనస్సులో అప్పుడే నార్లు పోశాయి.

గాంధీజీ తమ సహాయ నిరాకరణోద్యమాన్ని 1922లో ఆపారు. అప్పుడు జకీర్ హుస్సేన్ జర్మనీ రాజధాని అయిన బెర్లిన్ వెళ్ళి ఎం. ఏ. ప్యాసయి విద్యా భాషా విషయాలలోను, సాంఘికశాస్త్రంలోను పరిశోధన చేసి, పి హెచ్.డి. పట్టం పొందారు.

ఆయన భారతదేశానికి తిరిగి రాగానే తన నిర్ణయాలు వెంటనే ఆచరణలో పెట్టడానికి అవకాశం కలగడం మహాభాగ్యం. జామియామిలియా ఇస్లామియా వైస్‌చాన్సలర్ పదవి ఆయనను స్వయంవరం చేసుకుంది — 1926. అప్పటి నుంచి 1948 వరకు 22 సంవత్సరాలలోను, ఆయన తన విశ్వవిద్యాలయంలో గాంధీజీ "నయీతాలీం" — జాతీయ విద్యావిధానాన్ని అమలుపరచడం మాత్రమే కాక, దేశంలోని వివిధ విద్యాసంఘాలకు, విద్యా మహాసభలకు అధ్యక్షుడుగాను ఉంటూ ఎంతో సేవ చేశారు. విద్యార్థులను జాతీయవాదులనుగా, సత్పౌరులనుగా తీర్చిదిద్దారు.

1938లో బేసిక్ విద్యావిధాన సంఘం నివేదిక జాతీయవాదులందరికీ నూతనోత్తేజం కలిగించింది. "చేతిపనులకు, పాఠ్య విషయాలకు సమన్వయం సాధించాలి. పాఠ్య విషయాలు విద్యార్థులకు జీవిత సాహిత్యాన్ని సమకూర్చాలి. ఆచరణవల్ల జ్ఞాన సంపాదన జరగాలి. వైయక్తికమైన చొరవను ప్రోత్సహించాలి. బాధ్యతాజ్ఞానం అలవరచాలి. ఈ లక్ష్యాల సాధనకు తగిన పాఠ్య పుస్తకాలు రచించాలి, బోధించాలి." ఇవి ఈ సంఘం చేసిన సూచనల సారాంశం.

ఆయన 38 నుంచి 50 వరకు హిందూస్తానీ తాలిమీ సంఘ్ (సేవాగ్రాం) అధ్యక్షులుగా వున్నారు. సంఘం అధ్యక్షులుగా ఆయన 1950లో విద్యావిధాన పునర్నిర్మాణంపై నివేదిక సిద్ధపరచారు. దానిని కాంగ్రెస్ రాష్ట్ర ప్రభుత్వాలు అమలుపరచాయి.

1942లో జామియా మిలియాలో రెండవ బేసిక్ జాతీయ విద్యావేత్తల

మహాసభ ఆయన అధ్యక్షతన జరిగింది. పని – కాయకష్టం – నూతన బేసిక్ విద్యకు కేంద్రమని, అదే ఆధారమని ఆయన అన్నారు. పనికి విద్యాబోధనలో గల ప్రాధాన్యాన్ని ఆయన ఈవిధంగా వివరిచారు :

"విద్యా శిక్షణలో పని – కాయకష్టం – ఒక భాగంగా వుండాలని మనం అనడం కొత్త సంగతేమీకాదు. ఈ విషయాన్ని ప్రాచీనులు చాలాకాలం నుంచే చెబుతున్నారు. కాని ప్రతివారూ 'పని' అంటే ఏమిటో తమ పద్ధతిలో వివరించారు. పని అనేది చదువుకు మూలసూత్రం. ఇది ప్రధానంగా వుండాలి. మరొక విషయానికి అనుబంధం కాకుండా విడిగా వుండాలి. దానికొక పీరియడ్ ప్రత్యేకించాలి. అది ప్రయోజనకరంగా వుండాలి. ఇంతకూ విద్యార్థులు కూలివారు కారుగనుక, ఏపని చేసినా మంచిదే. వారి పనే సర్జనాత్మకం. వారిని అవిధంగానే ఏదో చేయనివ్వాలి."

స్వాతంత్ర్య సంసిద్ధి తర్వాత, 1948లో, ఆయన అలీఘర్ విశ్వవిద్యాలయం వైస్‌చాన్సలర్‌గా నియమించబడ్డారు. అది కరుడుగట్టిన మతతత్త్వసంస్థ. దానిని చక్కబరిచే పనికి ఆయన శ్రద్ధతో పూనుకుని, 1956 వరకు తన కర్తవ్యం, పదవీ నిర్వహించారు. 1948-49లో విశ్వవిద్యాలయ విద్యా సంఘం సభ్యులుగా వున్నారు. ఇంత శ్రమపడి రూపుతీర్చిన బేసిక్ విద్యావిధానం దేశంలో సరిగా అమలుకానందుకు ఆయనకు చాలా విచారం కలిగింది. స్వాతంత్ర్య సంసిద్ధి తర్వాత ఇంకా గూడ, మన జాతీయ ప్రభుత్వం ఆ విధానం నుంచి తగినంత ప్రయోజనం చూపలేకపోతున్నందుకు ఆయన మనస్సు కుతకుతలాడింది. 1956 ఏప్రిల్‌లో న్యూఢిల్లీలో జరిగిన భారతదేశ రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖాధికారుల సదస్సులో ఆయన తన అసంతృప్తిని, ఆవేదనను వెళ్ళబోశారు. "బేసిక్ విద్యావిధాన విస్తరణకు బాధ్యులయిన నిర్వహణాధికారులు, పరిపాలకులు దీనిఎడల శ్రద్ధ తీసుకోడంలేదని విచారిస్తున్నాను. మేము ఉద్దేశించిన ఆశయసిద్ధికి ఏమి చేయాలని ఆలోచించడానికి కూడా వారికి తీరికలేదు." అని ఆయన అన్నారు. తన జీవిత లక్ష్యం, సూత్రం అయిన జాతీయ విద్యా విధానం సరిగా ఆచరణకు పెట్టనందుకు ఆయన హృదయం ఎంత కుమిలిందో ఈ మాటలు వ్యక్తం చేస్తాయి.

ఆయన 1955 వరకు ఇంటర్నేషనల్ స్టూడెంట్స్ సర్వీస్ సంస్థ భారతీయ శాఖకు అధ్యక్షులుగాను, వర్ల్డ్ యూనివర్శిటీ సర్వీస్ (జెనీవా) సంస్థకు 1955

నుంచి 57 వరకు అధ్యక్షులుగాను, సెకండరీ విద్య తాలూకు సెంట్రల్ బోర్డుకు అధ్యక్షుడుగాను, యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్ సభ్యులుగాను (1957 జూన్ వరకు), 1957 వరకు రాజ్యసభ సభ్యులుగాను, 1957-58లో ప్రపంచ విజ్ఞాన సమితి కార్యవర్గం (పారిస్) సభ్యులుగాను, భారత్ ప్రెస్ కమిషన్ సభ్యులు గాను, బీహార్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ విద్యా పునర్నిర్మాణ సంఘం సభ్యులుగాను వున్నారు.

భారత ప్రభుత్వం ఆయనను 1957 మేనెలలో బీహార్ గవర్నరుగా నియమించింది. ఆ పదవిలో ఆయన 1962 వరకు వున్నారు. దీనితో ఆయన కార్యకలాపాలు విద్యారంగానికేకాక రాజకీయాలవైపు కూడా ప్రసరించాయి. అయినా ఆయన విద్యావిషయకోపన్యాసాలివ్వడం, గ్రంథాలు రచించడం మానలేదు. "భారతదేశంలో విద్యాపునర్నిర్మాణ సూత్రాలు" అనే విషయంపై 1958లో పటేల్ స్మారక పరిశోధన ఉపన్యాసాలిచ్చారు. 1960లో "నీతి — రాజ్యం" అనే విషయమై మవ్లంకర్ స్మారకోపన్యాసాలు చేశారు.

ఆయన ప్రజాసేవ మెచ్చి భారత ప్రభుత్వ ఆయనను 1954లో పద్మభూషణ్ బిరుదుతోను 1963లో అత్యున్నత బిరుదం "భారతరత్న" బిరుదంతోను గౌరవించింది.

1962 డాక్టర్ రాజేంద్రప్రసాద్ అనారోగ్యంతో రాష్ట్రపతి పదవికి నిలబడకపోవడంవల్ల అంతవరకు ఉపరాష్ట్రపతిగా వున్న డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ రాష్ట్రపతిగా ఎన్నిక కావడంతో డాక్టర్ జకీర్‌హుస్సేన్ ఉపరాష్ట్రపతిగా రాజ్యసభ అధ్యక్ష పదవిని ఎంతో నిష్పాక్షికంగాను, సమర్థతతోను చతురతతోను, పద్యస్ఫూర్తితోను నిర్వహించి వివిధ రాజకీయపక్షాల ప్రశంసలను అందుకున్నారు. 1962 నుంచి ఢిల్లీ విశ్వవిద్యాలయం చాన్సలర్‌గాను వున్నారు.

డాక్టర్ జకీర్‌హుస్సేన్ సద్భావ ప్రతినిధిగా అరబ్ రిపబ్లిక్, మొరాకో, అల్జీరియా, కువాయిత్, సౌదీఅరేబియా, జోర్డాన్, గ్రీస్, సోవియట్ యూనియన్, సింగపూర్ మొదలయిన విదేశాలలో పర్యటించి భారత సంస్కృతి మహత్తును ప్రపంచానికి చాటారు. ప్రస్తుతం అమెరికాలో పర్యటన జరుపుతున్నారు.

ఆయనకు "కల్చర్"పై (సంస్కృతిపై) ప్రీతి వున్నట్టే "హార్టీకల్చర్"పై (తోటపనిపై) కూడ ఎంతో ప్రీతి.

ఆయన ఉరుదూ ఆంగ్లాలలో విద్యా విషయమై పెక్కు పుస్తకాలు,

వ్యాసాలు మౌలికంగా రచించారు. పెక్కు పుస్తకాలను జర్మనీ మొదలైన భాషల నుంచి ఉరుదూలోకి అనువదించారు. "ప్లాటో రిపబ్లిక్"ను ఉరుదూ చేశారు. "శిక్ష" (హిందీ), కాపిటలిజం: ఏన్ ఎస్సే ఇన్ అండర్ స్టాండింగ్స్ ఆఫ్ ఎకనామిక్స్, లెక్చెర్స్ ఆన్ ది స్కోప్ అండ్ మెథడ్ ఆఫ్ ది ఎకనామిక్స్, ఎడ్యుకేషనల్ డిస్కోర్సస్ మొదలయినవి ఆయన రచనలలో కొన్ని.

గాంధీ అనుచరులలో వృద్ధాతి వృద్ధులు విద్యా వృద్ధులు, జ్ఞానవృద్ధులు, దేశసేవావృద్ధులు, వయోవృద్ధులు, బహుభాషావేత్తలు అయిన డాక్టర్ జకీర్ హుస్సేన్ రాష్ట్రపతిగా ఎన్నికకావడంవల్ల భారతదేశం పేరు ప్రతిష్ఠ పెరుగుతా యనడంలో సందేహం లేదు.

ఆయన ఉప రాష్ట్రపతిగా వున్నప్పుడు ఒకమారు కావలి జవాహర్ భారతిలో ప్రసంగించినప్పుడు, అక్కడి ప్రకృతి సౌందర్యాన్ని, పరిసర సౌందర్యాన్ని పరికించి ముగ్ధులై, "నేను ఇలాటి పరిసరాలలో ఇలాటి సంస్థను నడుపుదామనుకున్నాను. కాని ఆ యోగం అబ్బలేదు. నేను రాజకీయాలనుంచి విరమించిన తర్వాత ఇక్కడ స్థిరపడుతాను" అని ఎంతో ఆవేదనావేగావేశాలతో అన్నారు.

(ఆంధ్రపత్రిక – 3–5–1967)

# అమర సంపాదకులు
# పప్పూరు రామాచార్యులు

బంగారు శలాక వలె నిగనిగ మెరసిపోయే దేహయష్టి, నిరంతరం మందహసితం చిందులాడే సుందరవదనం, ఊర్ధ్వత్రిపుండ్రాలంకృతమై శోభిల్లే విశాల ఫాలం, నున్నగా ముండితమైన మస్తకానికి ముచ్చట కొలిపే నాలుగు వరకల పిలక, తెల్లని ఖద్దరు ధోవతి, కుర్తా, ఉత్తరీయం—సాక్షాత్తు ప్రవరాఖ్యుడు స్వాతంత్రోద్యమంలో పాల్గొనడానికి దివినుంచి భువికి దిగి వచ్చాడా అన్నట్లున్న సుందరరాములు శ్రీ పప్పూరు రామాచార్యులు.

ఆయన రూపానికి హాస్య వ్యంగాలు అపరంజికి తావి వంటివి. ఆయన హ్యూమర్, విట్ ఎప్పుడెప్పుడు విందామా, ఎప్పుడాయన చక్కని పలువరుస కనిపిస్తుందా— అనిపించేది. బుద్ధుడు నవ్వితే దంతకాంతి చంద్రికలతో పరిసర ప్రాంతాలు వెలిగిపోయేవని బౌద్ధ సాహిత్యంలో అడుగడుగునా వర్ణనలున్నాయి. అవి అతిశయోక్తులు కావు అని నిర్ధారణ అయ్యేది రామాచార్యుల నవ్వు చూచిన మీదట.

రామాచార్యులు 1896 నవంబర్ 8 వ తేదీన అనంతపురంలో జన్మించారు. తండ్రిగారు నరసింహాచార్యులు ఆంధ్ర సంస్కృత విద్వాంసులు. పౌరాణికులు. రామాచార్యుల ప్రాథమిక విద్య తండ్రిగారి వద్ద, అనంతపురం బళ్ళలో కొనసాగింది. హైస్కూలు చదువు రాజమహేంద్రవరంలోను, ఇంటర్మీడియట్ మదరాసు పచ్చయప్ప కళాశాలలోను పూర్తయ్యాయి. అనంతపురంలోని దత్త మండల కళాశాలలో బి. ఏ. పూర్తి చేశారు. కాని ఏ కారణం వల్లనో పరీక్షకు వెళ్ళలేదు. చదువు కోసం వివిధ ప్రాంతాలలో ఉండడం వల్ల ఆయనకు వివిధ ప్రజల ఆచార వ్యవహారాలు, ప్రవర్తనలు ఆకళించుకునే అవకాశం కలిగింది.

రామాచార్యులుగారు తండ్రిగారి ప్రోత్సాహంతో రెవిన్యూ ఆఫీసులో గుమాస్తాగా చేరారు. తండ్రిగారు చాలా సంతోషించారు. కాని ఆయన సంతోషం ఎన్నో నాళ్ళు నిలువలేదు.

అవి సహాయ నిరాకరణ తీవ్రతరమౌతున్న రోజులు. గాంధీజీ దక్షిణాఫ్రికా నుంచి భారతదేశానికి వచ్చి పర్యటన జరుపుతూ – 1919-20 కాబోలు – ఆంధ్ర ప్రాంతానికి వచ్చారు. పలుచోట్ల ప్రసంగించారు. గాంధీజీ తాడిపత్రికి వచ్చి ప్రసంగించినప్పుడు రామాచార్యులు విన్నారు. ఆయన ప్రభావానికి లోనయ్యారు. అప్పుడాయన వయస్సు 23 సంవత్సరాలు.

ఈలోగా గాడిచెర్ల హరి సర్వోత్తమరావు గారితో పరిచయం ఏర్పడింది. గాడిచెర్ల వారు ఒడ్డు పొడుగూ గల వ్యక్తి. వ్యక్తిత్వానికి తగిన విజ్ఞానం, విజ్ఞానానికి తగిన వాగ్ధోరణి గలవారు. దేశ దాస్య విమోచనం కోసం ఆయన ప్రసంగించేటప్పుడు పిడికిలి బిగించి బల్ల గుద్దేవారు. బల్ల పెటపెటలాలేది. ప్రేక్షకులు ఆశ్చర్యంతో స్తంభించిపోయేవారు. గాడిచెర్లవారి పరిచయం ఫలితంగా రామాచార్యులు. రెవిన్యూశాఖ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి, సహాయ నిరాకరణోద్యమంలో దూకారు. సభలూ, పికెటింగులూ, విదేశ వస్త్ర దహనాలు నిత్యకృత్యాలయ్యాయి.

మాతృదేశ విమోచనదీక్ష సరే. పెద్ద కుటుంబం. గడవడం కష్టం కదా. ఆ సమయంలో ఇల్లూరిలోని పెద్ద భూస్వామి మాజీ రాష్ట్రపతి శ్రీ సంజీవరెడ్డి గారి తండ్రి శ్రీ చిన్నపరెడ్డిగారు తన కుమారులకు సంజీవరెడ్డి మొదలయిన వారికి చదువు చెప్పడానికి రామాచార్యులను తమ ఊరికి పిలిపించుకొని ఉపాధ్యాయులనుగా నియమించారు; ఆ ఊరిలోనే గృహ భోజన వసతి కలిగించారు. ఆ విధంగా శ్రీ సంజీవరెడ్డి, శ్రీ రాజశేఖరరెడ్డి, కమ్యూనిస్టు నాయకుడు శ్రీ తరిమెల నాగిరెడ్డి మొదలయిన వారు రామాచార్యుల శిష్యులయ్యారు. రామాచార్యులు పిల్లలకు చదువు చెబుతూ పెద్దలకు రామాయణ భారతాలు పురాణం చెప్పి, రాజకీయాలు మేళవించి ప్రబోధించేవారు.

ఆయన శ్రీ చిన్నపరెడ్డి, శ్రీ తరిమెల సుబ్బారెడ్డి మున్నగువారి సాహచర్యంతో మద్యనిషేధ ప్రచారం చేశారు. అప్పుడు ఆయనను పోలీసులు అరెస్టు చేసి, గుత్తి కోర్టులో హాజరు పరచారు. ఆయన కోర్టులో తాను చేసినది ఏవిధంగా చూచినా నేరం కాదని సహేతుక వాగ్ధోరణిలో వాదించారు. ఆయన వాద పటిమకు న్యాయాధీశుడు ఆశ్చర్యపడి ఆయనను విడుదల చేశాడు. ఆయన రచించిన 'కల్లు పెంట' నాటిక అప్పటిదే.

స్వాతంత్రోద్యమ ప్రచారానికి పత్రిక పరమ సాధనమని గుర్తించిన రామాచార్యులు 1922 లో కొందరు భాగస్వాములతో కలిసి 'పినాకిని' అనే

పత్రికను స్థాపించారు. కాని భాగస్థులతో అభిప్రాయ భేదాలవల్ల దానిని వదిలి 'శ్రీసాధన' అనే వారపత్రికను 1927 లో శ్రీ క్రైప సుబ్రహ్మణ్యశర్మగారి ప్రోత్సాహంతో స్థాపించారు. ఆయన అమృత హస్తం మహిమ. అది వజ్రోత్సవం చేసుకుని, ఆయన కుమారులు శ్రీ శేషాచార్యుల సంపాదకత్వంలో నిరాఘాటంగా ప్రజాసేవ చేస్తున్నది. అరవై సంవత్సరాలకు పైగా మనుగడ సాగిస్తున్న పత్రిక తెలుగునాట మరొకటి లేదు.

సాధన పత్రిక సాధించిన విజయాలు ఘనమైనవి. సంఘంలోని కుళ్ళును ప్రభుత్వోద్యోగులలోని అవినీతిని సాధన తీవ్రంగా విమర్శించేది. ఉద్యోగులకు సాధన పత్రిక అంటే గుండె గుభేలుమనేది. అప్పటి మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారిగారు సర్కారు జిల్లాల్లో కృష్ణా పత్రిక సంపాదకీయాలను, రాయలసీమలో సాధన పత్రిక సంపాదకీయాలను ప్రామాణికాలుగా పరిగణించే వారు. రామాచార్యులు భయమెరుగని సంపాదకుడు; కలం బలం ఎరిగిన సంపాదకుడు. కనుకనే రాజగోపాలాచారి గారికి అంతటి గౌరవం. రామాచార్యులు అభ్యుదయకరమైన చట్టాలను, భావాలను, రాజకీయ సిద్ధాంతాలను సాధన పత్రిక ద్వారా ప్రచారం చేశారు; ప్రజాసామాన్యం గ్రహించే రీతిగా ప్రచారం చేశారు.

రాష్ట్ర రాజకీయాలలో ముఖ్యంగా అనంతపురం జిల్లా రాజకీయాలలో రామాచార్యుల పాత్ర గొప్పది. 1931 సత్యాగ్రహంలో బళ్ళారి జైలులో ఏడాది శిక్ష అనుభవించారు. జిల్లా కాంగ్రెస్ కార్యదర్శి పదవిని, అధ్యక్ష పదవిని నిర్వహించారు. 1937 లో శ్రీ బాగ్ ఒప్పందానికి మూలభూతులై సర్కారు, రాయలసీమ ప్రజలలో పరస్పర సామరస్యానికి కృషి చేశారు. 1941 లో రెండున్నర సంవత్సరం తంజావూరు కారాగారంలో ఉన్నారు. అచట వాల్మీకి రామాయణం, కాళిదాసు శాకుంతలం చదివి తోటి ఖైదీలకు వినిపించి వ్యాఖ్యానించేవారు. ఆయన వ్యాఖ్యానాన్ని జెయిలు అధికారులు కూడ చాటుమాటుగా వినేవారు.

అనంతపురం మునిసిపల్ చెయిర్మన్‌గా, అనంతపురం జిల్లా కేంద్ర సహకార బ్యాంకు అధ్యక్షులుగా, జిల్లా మార్కెటింగ్ సొసైటీ, రాయలసీమ సహకార శిక్షణాలయాల అధ్యక్షులుగా, బిల్డింగ్ కోఆపరేటివ్ సొసైటీ డైరెక్టర్‌గా, భూమి తణఖా బ్యాంకి డైరెక్టర్‌గా రామాచార్యులు సాధించిన విజయాలు అసాధారణమైనవి. 1955 నుంచి ఐదేళ్ళపాటు ఉమ్మడి మద్రాసు రాష్ట్ర విధానసభ సభ్యులుగా చేసిన కృషి విస్మరించరానిది. జిల్లా గెజిటీర్ల సంస్కరణ సంఘం సభ్యులుగా అనంతపురం గెజిటీర్ పూర్తి చేయడం, ఆకాశ

వాణి సలహాసంఘ సభ్యులుగా భక్తిరంజని కార్యక్రమం ప్రవేశపెట్టడం ఆయన కీర్తికి చిహ్నాలు. సాయిబాబా జూనియర్ కళాశాల మున్నగు విద్యా సంస్కృతి సంఘాలకు కరస్పాండెంటుగాను, జిల్లా కేంద్రం గ్రంథాలయం అధ్యక్షులుగాను వాటి అభివృద్ధికి పాటుపడ్డారు.

రామాచార్యులు సహజ హాస్య చతురులు. వారి హాస్యం వారి రచనలలోను, ఉపన్యాసాలలోను తొణికిసలాడేది. శ్రోతలు వారి హాస్య చతురోక్తుల కోసం ఉవ్విళ్ళూరే వారు

ఒకనాడు ఆయన తన సతీమణిని "నా కట్టుకునే పంచ ఎక్కడ?" అని అడిగారు. అప్పుడామె కొంచెం కోపంగా వుండింది. "నేనేమి మీ పంచ కట్టుకుంటానా? నాకేం తెలుసు?" అని జవాబిచ్చారట. అందుకు ఆయన "నన్నే కట్టుకొన్నదానివి. నా పంచెను వదులుతావా?" అని రిటార్ట్ చేశారట. ఆమె అంత కోపంలోను నవ్వక తప్పింది కాదు.

ఒకమారు ఆయన ప్రచారానికి ఒక పల్లెకు వెళ్ళారు. అక్కడ కనీసం కాఫీ అయినాలేదు. అప్పుడు ఆయన హాస్యంగా

"ఎప్పుడు అడిగిన అప్పుడు
కప్పుడు కాఫీని ఈయగలిగిన మిత్రుల్
చొప్పడిన యూరనుండుము
చొప్పడ కున్నట్టి యూరు చొరకుము సుమతీ"

అని పద్యం ఆశువుగా చెప్పారట.

ఒకమారు ఆచార్య రంగా అనంతపురం వెళ్ళారు. ఆయన ఉపన్యసించే సభకు రామాచార్యులు అధ్యక్షులు. కార్యకర్తలు ఒకే పూలదండ తెచ్చారు. దానిని అధ్యక్షునికి వేయడమా, ఉపన్యాసకునికి వేయడమా అని తర్జన భర్జన పడుతున్నారు. అది గ్రహించిన రామాచార్యులు పూలదండ రంగాగారికే వేయండని రంగాగారికే వేయించి- "లోకంలో పూలరంగడు అనే వ్యవహారం ఉంది గాని, పూలరాముడు అనే వ్యవహారం లేదు కనుక పూలదండ రంగాగారికే" అని అన్నారు. ఆయన సమయస్ఫూర్తికి అందరూ నవ్వారు. కార్యకర్తలు మానం దక్కిందని ఆనందించారు.

రామాచార్యులు ఎంత గొప్ప వక్తలో, అంతటి గొప్ప రచయితలు. దత్త మండల కళాశాలలో ఆయన బి. ఏ. విద్యార్థిగా ఉన్నప్పుడే సుప్రసిద్ధ ఆంగ్ల రచయిత స్టీల్ రచించిన 'టాట్లర్' వ్యాసాలు ఒరవడిగా 'వదరుబోతు' వ్యాసాలు రచించారు. వాటిలో హాస్యం కన్నా గాంభీర్యం హెచ్చుగా ఉందని,

ఎవరో విమర్శించారు. దానికి ఆయన ఒక చాటు శ్లోకం ఉదాహరించారు. ఆ చాటువు సందర్భమిది.

"రామ పట్టాభిషేకానికి వానర స్త్రీలు కూడా అయోధ్యకు వెళ్ళారు. వారు అక్కడ సీతాదేవిని చూచారు. ఇలా అనుకున్నారు :

గౌరీ తనుః, నయనమాయతం, ఉన్నతాచ
నాసా, పృథుః కుచతటీచ, పటీ విచిత్రా,
అంగాని రోమ రహితాని సుఖాయ భర్తుః
పుచ్ఛం న తుచ్ఛ మపి! క్వత్ర సమస్త వస్తు?

సీతాదేవి మేనిరంగు పసుపు పచ్చన, కళ్ళు పొడుగు, ముక్కు ఎత్తైందే. చనుకట్టు భారీగానే వుంది. కట్టుకున్నవి చిత్రమైన వస్త్రాలు. ఒంటిమీద మన కున్నట్టు రోమాలు లేవు. మొగునికి ఎంతో హాయి. కాని ఒక్క పిసరంత తోక వుంటే బాగుండేది. ఆఁ! ఇంతకూ అన్నీ ఒకే చోట ఎలా వుంటాయి?" వదరుబోతులో హాస్యం లేదనడం ఇలాంటిదే అని ఆయన ఛలోక్తి.

శ్రీ పానుగంటి నరసింహరావుగారు స్పెక్టేటర్ ఒరవడిగా 'సాక్షి' వ్యాసాలు రచించగా, వదరుపోతు వ్యాసాలకు టాట్లర్ వరవడి అయింది. ఈ వ్యాసాలలోని హాస్యం వేమన హాస్యం వలె కత్తికే మందు పెట్టి కొట్టినట్లు కొంచెం గాయపరచినా, సాంత్వన పరిచేది. ప్రత్యర్థులు కూడా కడుపుబ్బ నవ్వేవారు.

రామాచార్యులు వేమన పద్యాల లాగ 'విశ్వ వినుత నామ వినుము రామ' అనే మకుటంతో రామయ్య పద్యాలు అనే పేరుతో ఎన్నో రచించారు. తెలివికి తిండి ప్రధానం కాదని తెలిపే ఒక పద్యం మచ్చుకు :

"గడ్డిమేసి గోవు ఘనమైన పాలిచ్చు
గాలిమేసి తపసి జ్ఞానమిచ్చు
తిన్న తిండి కాదు తెలివి కాధారంబు
విశ్వవినుత నామ వినుర రామ!"

నేను ఒకమారు ఆయనను కలుసుకొన్నప్పుడు "మీరు చాలా గొప్ప వారు. మీరు చేస్తున్నవన్నీ సత్కార్యాలే" అని అన్నాను. ఆయన మందహాసం చేస్తూ "నాబోటి వాడు మంచి పనులు చేయక తప్పదు, పెద్దపనికి పూనుకుంటా ననుకో. స్వామీ! ఈ నామాలూ పిలక జుట్టుతో మీరు కూడానా ఈ పనికి?— అని చేతులు జోడిస్తారు" అన్నారు.

ఆయన కాంగ్రెస్‌ను వదలి ప్రకాశంగారి ప్రజాపార్టీలో చేరారు. ప్రజా పార్టీ మంత్రివర్గం ఏర్పడినప్పుడు శ్రీ తెన్నేటి విశ్వనాథంగారితో పాటు రామా

చార్యులు కూడా మంత్రి అవుతారని అనుకున్నారు అందరూ. ఆయన మద్రాసుకు వచ్చినప్పుడు నేను ఆ సంగతి కదిపాను. "ప్రకాశంగారు ముఖ్యమంత్రి. ఆయన ఇష్టం. నన్ను తీసుకోలేదు" అని మాత్రమే అన్నారు. మరే వ్యాఖ్యా చేయలేదు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మన లిపిని సంస్కరించదలచి, తెలుగు, కన్నడ లిపుల ఏకీకరణ అవసరమని తలచి, శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు అధ్యక్షులుగా, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు కార్యదర్శిగా ఒక సంఘాన్ని నియమించింది. దానిలో రామాచార్యులతో పాటు నేనూ సభ్యుణ్ణి. కన్నడ, తెలుగు లిపుల ఏకీకరణం ఆయన అభిమతం. దానిని మైసూరు విశ్వవిద్యాలయం తెలుగు ప్రొఫెసర్ శ్రీ కె. సుబ్బరామప్పగారు సమర్థించారు. ఆ సమావేశంలో నేను కన్నడ-తెలుగు లిపుల ఏకీకరణను తీవ్రంగా ప్రతిఘటించాను. తర్వాత నేను శ్రీ పి. వి. నరసింహారావు రాష్ట్ర విద్యామంత్రిగా వున్నప్పుడు నియమించిన తెలుగు-కన్నడ లిపి ఏకీకరణ ఉపసంఘం కన్వీనరును. "ఇప్పటి తెలుగు లిపి సౌందర్యానికి భంగం కలుగని రీతిగా ఉభయ లిపుల సంస్కరణ జరగాలి. మార్పు పిడుగుపాటుగా విరుచుకుపడేదిగా కాక, క్రమంగా పూవు వికసించినట్లు ఉండాలి" అని నేను వాదించి తీర్మానం ఆ విధంగా నెగ్గించాను. నేను తమకు విరుద్ధంగా వాదించినందుకు రామాచార్యులు ఆగ్రహించలేదు సరికదా, "నీ వాదం బాగుంది. కాని సౌందర్యం కన్నా సదుపయోగం, సమయం కలిసి రావడం ముఖ్యాంశాలు" అని సంఘ సమావేశానంతరం అన్నారు నాతో. అలాంటిది ఆయన ప్రజాస్వామ్య తత్త్వం.

రామాచార్యులుగారు 1972 మార్చి 21 న పరమపదించారు. అప్పటికి ఆయన వయస్సు 76 సంవత్సరాలు. పరమపదించేవరకు ఆయన తమ వేష భాషలను మార్చుకోలేదు. ఎవరి ఇచ్చకాలకో, పదవులకో తమ భావాలు మార్చుకోలేదు. సాధన పత్రికలో సమున్నత సంపాదకీయాలు, నిశిత రాజకీయ వ్యాఖ్యలు చేయడం మానలేదు. అదే చిరునవ్వు! అదే తెల్ల ఖద్దరు! అదే హాస్య భరిత సంభాషణ ధోరణి.

ఆ మహామహుడు భయమెరుగని సంపాదకుడుగా, నిష్పాక్షిక నిశిత రాజకీయ వ్యాఖ్యాతగా, సరస సాహితీ సౌరభాలు వెలార్చే రచయితగా, చతుర సంభాషకుడుగా, పురాణాలను - ముఖ్యంగా భారతాన్ని రాజకీయోపన్యాసాలలో కుమ్మరించి నవ్వులతో కడుపుబ్బ చేసే మహా వక్తగా, తెలుగువారిలో భావ సమైక్యం సాధించిన సజ్జనుడుగా తెలుగువారి హృదయాలలో నిరంతరం ఖ్యాతిగా వెలుగుతూనే ఉంటారు.

(ఆదివారం ఆంధ్రప్రభ — 24-11-1991)

# ప్రజాస్వామ్య పరిణతికి ప్రత్యక్ష ఫలం–
# ప్రధాని లాల్ బహదూర్ శాస్త్రి

"నేను ఏమి పనిచేయాలి?" అని ప్రశ్నించారు లాల్ బహదూర్ భువనేశ్వర్‌లో జవాహర్‌లాల్‌ను. "నా పని చూస్తూ ఉండు" అన్నారు జవాహర్ లాల్.

ఈ మాటలు జవాహర్‌లాల్ ఏ అపూర్వ శుభ ముహూర్తాన అన్నారోగాని తర్వాత అక్షరాలా నిజమయాయి. జవాహర్‌లాల్ తలపెట్టిన పనులన్నీ పట్టుగా కొనసాగించడానికేనా అన్నట్టు లాల్ బహదూర్ భారత ప్రధానిగా ఎన్నికయారు.

జవాహర్‌లాల్ లాల్ బహదూర్‌ను రాజకీయ రంగంలో తన వారసుడుగా పరిగణించడం కాశీమజిలీ కథలలోవలె పంచ పంచ ఉషఃకాలంలో కోట తలుపులు తెరవగానే కనిపించిన వ్యక్తికి పట్టపు ఏనుగుతో పూలమాల వేయించి పట్టం కట్టడంవలె జరిగింది కాదు. తరంపైగా లాల్ బహదూర్ శక్తియుక్తులను జవాహర్‌లాల్ తరచి చూస్తున్నారు. కనుకనే, "నెహ్రూ తర్వాత ఎవరు?" అని నేల నాలుగు చెరుగులా గగ్గోలు పుట్టినా, నిశ్చింతంగా ఉన్నారు, ఏనాడో తన వారసుడు లాల్ బహదూర్ అని నిర్ణయించుకున్నట్టు!

ఇద్దరికీ అనువంశికతలో, శిక్షణలో వ్యక్తిత్వంలో, మనః ప్రవృత్తిలో ఎంత మాత్రమూ సామ్యం లేదు. కాని, రాజకీయ దృక్పథంలో, సాంఘికార్థిక లక్ష్యాల సాధనలో ఇరువురి ఆశయాలకూ, అభిప్రాయాలకూ సామ్యమే కాదు, ఏక్యమూ వున్నది. జవాహర్‌కు, లాల్ బహదూర్‌కు ప్రజాస్వామ్యమన్నా, మతాతీత ప్రవృత్తి అన్నా అచంచల విశ్వాసం వున్నది. దారిద్ర్య విద్రావణంలో లాల్ బహదూర్ బద్ధకంకణులే. అదనపు గుణాలు చెప్పనక్కరలేదు.

లాల్ బహదూర్ చీటికి మాటికి చికాకు పడరు. ఆయన సహనం తరుగనిదీ, ఎవరెస్టు శిఖరంలాగా నిరంతరం పెరిగేదీని. ఆయన మూర్తీభవించిన వినయం. అయినా, పురుషోత్తమదాస్ టాండన్ అన్నట్టు "ఆ వినయం వెనుక వజ్రం లాంటి నిశ్చిత సంకల్పం ఉన్నది." ఆయన మృదు మధుర స్వభావం

శత్రువునయినా మిత్రుణ్ని చేస్తుంది. ఎదుటివారి కష్టాలను ఏమాత్రం విసుగూ, వేసటా లేకుండా వినడం ఆయనకే చెల్లుతుంది. క్లిష్ట సమస్యలను పరిష్కరించ డం ఆయన గొప్ప నేర్పు. "అతి క్లిష్ట సమయంలోను మహా సంయమనంతో కృషిచేసి సమాధానం సాధించడంలో ఆయన ప్రతిభాశాలి" అన్నారు టాండన్. జవాహర్‌లాలేమో "ఆయన నిజాయితీ కలవాడు. చిత్తశుద్ధితో క్రియాశీలిస్సై కష్టించి పనిచేస్తాడు" అన్నారు. జవాహర్‌లాగే ఆయన రాత్రి పొద్దుపోయేదాకా పనిచేసి, తెల్లవారు జామునే మేల్కొంటారు.

కాని, జవాహర్ లాగ బహదూర్ అగర్భశ్రీమంతుడుగా జన్మించలేదు. ఆయన తండ్రి శారదా ప్రసాద్ మొదట కడు బీద బడిపంతులు. తర్వాత మొగల్‌సరాయి (ఉత్తర ప్రదేశ్)లో సర్కారు నౌకరీలో చేరాడు. లాల్ బహ దూర్ 1904 అక్టోబరు 2 వ తేదీన మొగల్‌సరాయిలో జన్మించారు. ఎలాగో సంసారం ఈదుకుని వస్తున్న తండ్రి ఆయన ఏడున్నర వయస్సులోనే మర ణించాడు; దరిద్రానికి తోడు దుర్దశ అన్నట్లు. అందువల్ల లాల్ బహదూర్ కాశీలో మాతామహుని ఇంట పెరగవలసి వచ్చింది.

పెద్ద పెద్ద ఖర్చులతో పెద్ద పెద్ద స్కూళ్ళలో చదివే అవకాశం ఏదీ? కనుక, లాల్ బహదూర్ కాశీలోనే హరిశ్చంద్ర పాఠశాలలో చేరారు. తర్వాత కాశీ విద్యాపీఠ్‌లో చదివారు. కాశీ విద్యాపీఠ్ జాతీయ దృక్పథంతో శ్రీ శివ ప్రసాదగుప్త అనే దేశభక్తుడు స్థాపించిన విద్యా సంస్థ— మన మదనపల్లి నేషనల్ యూనివర్సిటీ, బందరు జాతీయ కళాశాల వంటిది. కనుక లాల్ బహదూర్‌కు ఉగ్గుపాలతోనే జాతీయ దృక్పథం, రాజకీయాలలో ఆసక్తి ఏర్పడ్డాయి. సాహసం, సహనం, చొరవ సహజంగానే అలవడినాయి. ఒకమారు గంగ దాటి ఇంటికి వెళ్ళడానికి పడవ కేవుకు పైసలు లేకపోయాయట. విద్యార్థి బహాదూర్ లాల్ బహదూర్ తన పుస్తకాల సంచి తలమీద పెట్టుకొని, గంగలో దిగి ఈదుకుంటూ అవలిగట్టు చేరారట. ఇలాంటి పట్టుదల విద్యాపీఠం చలవే. అక్కడ అప్పుడు ఆచార్యులు శ్రీప్రకాశ, కృపలానీ, సంపూర్ణానంద, నరేంద్ర దేవ్ మొదలైన మహా నాయకులు. వీరందరూ జాతీయాదర్శంతో ఉపాధ్యాయ వృత్తి చేపట్టిన త్యాగధనులు.

అసహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా వున్న రోజులు. జాతీయ శిక్షణతో జాజువారిన లాల్ బహదూర్ హృదయం వుత్సాహంతో వుబికింది, గాంధీజీ శంఖనాదానికి. ఆయన చదువు వదిలి ఉద్యమంలో దూకారు. కారాగార క్లేశం అనుభవించారు. ఆయన వయస్సు అప్పటికి 17 సంవత్సరాలు. కారా

గారం నుంచి తిరిగి వచ్చిన తర్వాత ఆయన మరల విద్యాపీఠంలో చేరి చదువు పూర్తిచేసి 'శాస్త్రి' పట్టం పొందారు. స్నాతకులయారు. రాజకీయాలే వృత్తి, దేశ సేవే పరమార్థంగా జీవితంలో అడుగు పెట్టారు 22 ఏండ్ల ప్రాయాన.

అప్పటి యువకులందరూ 'పంజాబ్ కేసరి' లాలా లాజ్‌పత్‌రాయ్ గర్జనలకు ఉత్తేజితులయినట్లే లాల్ బహదూర్ కూడా ఉత్తేజితులయారు. దానితో ఆయన కార్యరంగం కాశీనుంచి అలాహాబాద్‌కు మారింది. అక్కడ ఆయన మునిసిపల్ ఎన్నికలలో పాల్గొని గెలుపొందారు. అదే ఆయన తొలి పదవి. అప్పటినుంచి జవాహర్‌లాల్‌తో ఆయనకు సన్నిహితత్వం ఏర్పడింది. ఆయన ఏడేళ్ళపాటు అలహాబాద్ మునిసిపల్ బోర్డులో వివిధ పదవులు నిర్వహిస్తూనే జిల్లా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగాను, 1935 లో ఉత్తర ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగాను ఎన్నికయారు.

ఇంతలో శాసనసభా ప్రవేశానికి కాంగ్రెస్ నిర్ణయించడంతో ఆయన కూడా ఉత్తర ప్రదేశ్ శాసనసభకు ఎన్నికయారు (1937). అంతకు ముందు తర్వాత పెక్కుసార్లు కృష్ణ జన్మస్థానానికి వెళ్ళి వచ్చారు. మొత్తం ఆయన ఎనిమిదిసార్లు అరెస్టయి తొమ్మిది సంవత్సరాలు జెయిలులో గడిపారు.

లాల్ బహదూర్ 1937 లో శాసన సభకు ఎన్నికైనా, మంత్రి అయినది 1948 లో; పండిట్ గోవింద వల్లభపంత్ మంత్రి వర్గంలో. అదే ఆయన మొదటి మంత్రి పదవి. ఆయన కేంద్రప్రభుత్వ మంత్రి కావడం 1952 లో. అప్పటి నుంచి ఆయన జవాహర్‌లాల్‌కు మరింత సన్నిహితులూ, సహచరులూ అయ్యారు. ఆయన ప్రతి పదవిలోను విశిష్టత చూపుతూనే ఉన్నారు.

ఆయన కాంగ్రెస్ సంస్థలోను, పరిపాలన వ్యవస్థలోను సాధించిన విజయాలు అనేకం. అస్సాంలో భాషా విద్వేషంతో అల్లర్లు చెలరేగినప్పుడు, అక్కడికి వెళ్ళి సమాధానం ఏర్పరచారు. దానికి తర్వాత 'శాస్త్రి పథకం' అనే పేరు పడింది. నేపాల్‌కు వెళ్ళి భారత నేపాల్ మైత్రిని పటిష్ఠం చేశారు అకాలీలతో సంప్రదించి పంజాబీసుబా ఉద్యమాన్ని మాన్పించారు. అవినీతి నిర్మూలనకు సంతానం కమిటీ నియామకం వంటి పెక్కు చర్యలు తీసుకున్నారు. కాశ్మీర్‌లో ప్రభుత్వం మార్పు ఆయన కృషే. ఇన్ని పనులూ ఆయన కాంగ్రెస్ సిద్ధాంతానికిగాని, ప్రతిష్ఠకు గాని భంగం కలుగకుండా నిర్వహించారు. సంస్థ కోసం పెద్దలు ఆదేశించినప్పుడెల్లా పదవిని పరక పుల్లవలె వదిలి పెట్టారు.

ఆయనది 112 పౌనుల, ఐదడుగుల రెండంగుళాల చిట్టి పొట్టి శరీరం. అయినా, అది వజ్ర కఠినం; నిరంతరం అపార శక్తితో పనిచేయగలదు,

"కొందరు గొప్పవారుగా పుడతారు. కొందరు గొప్పతనం సాధిస్తారు. కొందరికి మరికొందరు గొప్పతనం అంటగడుతారు" అని సోమరిపోతులు అంటుంటారు. ఎవ్వరూ పుట్టుకతో గొప్పవారు కాదు. గొప్పతనం ఒకరు అంటగడితే అంటుకొని ఉండేది కాదు. సాధించాలి. "సాధనమున పనులు సమకూరు ధరలోన." లాల్ బహదూర్ శాస్త్రి పుట్టు శాస్త్రి కాదు; పెట్టు శాస్త్రి. ఆయనకు గొప్పతనం హఠాత్తుగా అబ్బింది కాదు ఆయన పుట్టుకతో గొప్పవాడు కాలేదు. ఎవరూ ఆయనకు గొప్పతనం కట్టబెట్టలేదు. అర్ధశతాబ్ది సాధనా, నిరంతర ప్రజాసేవా పరాయణతా, అకుంఠిత కర్మఠతా ఆయనకు గొప్పతనం చేకూర్చాయి.

ఆయన ప్రజా సామాన్య ప్రధాని. ప్రధానిగా ఆయన ఎన్నిక ప్రజాస్వామ్య సిద్ధాంతం పరిణామానికి ప్రబల నిదర్శనం; ప్రత్యక్ష ఫలం.

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక — 7–10–1964)

# ప్రథమ విహాయస విహారిణి
# వాలంటీనా తెరిష్కోవా

"మా నాన్న ద్వితీయ ప్రపంచ యుద్ధానికి బలి అయ్యారు. నన్ను, మరిద్దరు నా తోబుట్టువులను పెంచి పెద్దజేయడానికి మా అమ్మ ఎన్నో అగచాట్లు పడింది. అందువల్ల యుద్ధమంటే నాకెంతో భయం. ప్రపంచం మారణాస్త్రాలకు మసయిపోవడం నేను ఊహించనైనా ఊహించలేను. అంతరిక్షం నుంచి చూస్తే వెన్నెలలో నీలలోహిత కాంతులతో మాణిక్యపుంజంలాగ మెరిసిపోయే ఈ సుందర భూగోళాన్ని భద్రపరచుకోడానికి ప్రయత్నిద్దాము. యుద్ధం మనకు ఎన్నటికీ వద్దు. శాంతికోసమే శాస్త్రవిజ్ఞానాన్ని వినియోగించుకుందాము."

ప్రథమ విహాయస విహారిణి వాలంటీనా టెరెష్కోవా నవంబర్ రెండవ వారంలో భారతదేశ యాత్ర చేస్తూ, చెన్నపురికి వచ్చినప్పుడు పత్రికా రచయితల గోష్ఠిలో అన్నమాటలివి.

నిరాడంబరమైన అద్దకపు గౌనుతో, ఆరోగ్యం తొణికిసలాడే అంగసౌష్ఠవంతో, ప్రేమ వివేకాలు ముప్పిరిగొన్న ముఖవర్చస్సుతో, విజ్ఞానం తెచ్చిన వినయభారంతో టెరెష్కోవా ప్రాచీన భారతీయ విదుషీమణులు గార్గీవాచక్నవి మొదలయిన వారిని తలపించింది. ఆమెవెంట ఆమె భర్త విహాయస విహారి ఆండ్రియన్ నికోలయేవ్, విహాయస యాత్రాసోదరుడు వేలరీ బైకోవ్‌స్కీ, ఆయన సతీమణి వచ్చారు.

ప్రమదలు పురుషులకు ఏమిటా తీసిపోరని ప్రపంచానికి తన రోదసీ విహారంతో చాటిన టెరెష్కోవా రష్యన్ ఫెడరేషన్‌లోని యరోస్లావల్ ప్రాంతంలోని మస్లెన్నికోవో గ్రామంలో 1937 మార్చి 6వ తేదీన జన్మించింది. తండ్రి వ్లాడిమిర్ టెరెష్కోవ్ ట్రాక్టర్ డ్రైవరు. తల్లి యెలెనా టెరెష్కోవా నూలు మిల్లులో కార్మికురాలు. వాలంటీనా ప్రాథమిక విద్యాభ్యాసం తర్వాత పదిహేడేండ్లు రాగానే, యెరోస్లావల్ పట్టణంలో టైర్ల ఫ్యాక్టరీలో పనికి కుదిరింది. అనంతరం 1968లో తన తల్లి పనిచేసే నూలుమిల్లులో చేరి, సాయంకాలం వాన (నేతపని)

సాంకేతిక కళాశాలలో చదువుతూ 1961లో కార్పాసవాన (పత్తినేత) సాంకేతిక శాస్త్రంలో పట్టభద్రురాలయింది.

ఆమె నేర్చిందేమో నేత; ప్రస్తుతం చేసేదేమో విహాయస విహారం. దీనికి కారణమేమిటంటే, ఆమెకు చిన్ననాటినుంచే పారచ్యూట్ గొడుగులు వేసుకుని ఎగరడంలోను, విమానం నడపడంలోను గల కుతూహలమే. ఆమె 1989 లో యరోస్లావల్ ఎయిర్ ఫోర్స్ కళాశాలలో చేరి నిపుణురాలయింది. రోదసీయాన శిక్షణ కళాశాలలో ఫ్లైట్ లెఫ్టినెంట్ హోదా పొందింది.

ఆమె 1963 జూన్ 16వ తేదీన "వోస్తాక్ – 6" అనే రోదసీ నౌకలో 71 గంటల పాటు 48 మార్లు భూమిచుట్టూ విహరించి ముందు ఏర్పాటయిన స్థలంలోనే భద్రంగా దిగింది.

ఆమె భర్త నికోలయేవ్ నిరుడు (1962) ఆగస్టు 11వ తేదీన "వోస్తోక్ – 3" రోదసీనౌకలో 95 గంటల పాటు 64 మార్లు భూప్రదక్షిణంచేసి భద్రంగా దిగాడు.

రోదసీ విహారిణి వాలంటీనా, సాటి రోదసీ విహారి నికోలయేవ్‌ను ప్రేమించి పెండ్లాడడంలో ఆశ్చర్యమేముంది? వారి వివాహం మొన్నటి నవంబర్ 3వ తేదీన మాస్కోలో మహా వైభవోపేతంగా జరిగింది. వెంటనే వివాహానంతర విలాసయాత్ర మొదలుపెట్టారు. ప్రాచ్య దేశాలలో ఆ యాత్రలోనే భారతదేశానికి వచ్చారు సపరివారంగా.

వాలంటినా తెరెష్కోవా పత్రికా రచయితల గోష్ఠిలో ప్రశ్నలకు సమాధానం చెప్పిన తీరు ఎంతో సరసంగా, సద్యస్ఫురణగాను ఉన్నది.

ప్రజలు అనుకున్నదాని కంటె ముందుగానే సోవియట్ చంద్రమండలం చేరగలదని ఆమె అంటూ "చంద్రమండలం చేరడానికి మూడు అత్యావశ్యకం: సోవియట్ శాస్త్రజ్ఞులు విశ్వాంతరాళాన్ని ఇంకా పరిశీలించాలి. మరింత శక్తిమంతమైన రోదసీ నౌకలను సిద్ధపరచాలి. రోదసీ నౌకలను మరింత వేగంగా విసిరి వేయగల రాకెట్లు సిద్ధపరచాలి" అని వివరించింది.

"సోవియట్ ప్రజల అలవాటు మొదట పనిచేయడం, తర్వాత ప్రపంచానికి తెలపడం" అని ఆమె అన్నమాటలు ఎంతో గంభీరంగా వినబడ్డాయి.

ఆమె భారతదేశంపై ఐదునిమిషాలపాటు విహరించిందట. సముద్ర తీరాలు, పెద్ద పెద్ద నగరాలు, మొదలయిన వాటిని గుర్తించిందట. కన్యాకుమారి నుంచి కాశ్మీరందాకా ఉన్న దూరాన్ని సెకెండులో లెక్కకట్ట గలిగిందట,

"నేనే మొదట రోదసీ యాత్రకు బయలుదేరడానికి, నన్నే ఎన్నుకొనడానికి ప్రత్యేకమైన కారణాలేవీ లేవు. నేను ప్రత్యేక శిక్షణ పొందాను. పదివేల మంది స్త్రీల దరఖాస్తులలో నాదీ ఒకటి. కేవలం ధైర్యం మాత్రమే రోదసీ యాత్రకు చాలదు. విజ్ఞానశాస్త్ర పరిచయం, విమానచోదక శిక్షణ కావాలి. ఎవరో ఒకరు వెళ్ళాలి. ప్రత్యేక శిక్షణ పొందినందువల్ల నాకు ప్రథమావకాశం లభించింది" అని వాలంటీనా అన్నది.

ఆమెకు భారతీయ సంగీతమంటే చాలా ఇష్టం. వివాహానంతరం, భారత దేశానికి విలాసయాత్రకు రావడం, ముఖ్యంగా ప్రధాని శ్రీ నెహ్రూ జన్మదినోత్సవ సందర్భంలో రావడం తనకూ, తన భర్తకూ చాల ఆనందంగా ఉన్నదని ఆమె అన్నప్పుడు ఆమె కళ్ళు మెరిసిపోయాయి.

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక – 16–11–1963)

# సామాన్యజనం అంతరంగపు మాన్యరూపం శ్రీ కామరాజ్

అవి ఉమ్మడి మద్రాసు రాష్ట్రం శాసనసభా సమావేశం జరుగుతున్న రోజులు. సమావేశం ఇంకా ప్రారంభం కాలేదు. నడవలలోను, చెట్లకిందను శాసనసభ్యులు ముఠాలు ముఠాలుగా చేరి తమ తమ ప్రతిపాదనలు, తీర్మానాలు, సవరణల గురించి చర్చించుకుంటున్నారు. ఒక తమిళ పెద్దమనిషి ఏదో కాగితంతో వచ్చాడు. ఒక ముఠా వద్దకు వెళ్ళి ఒకరికి ఆ కాగితం చూపాడు. కాగితంపైన ఏవో కొన్ని పంక్తులు ఉన్నాయి. కింద కొందరి సంతకాలు ఉన్నాయి. ఆ సభ్యుడు ఆ కాగితం చదువుకున్నాడు. "ఎన్న?" (ఏమిటి?) అని ప్రశ్నించాడు. "కై ఎళుత్తు పణ్ణుంగో!" (సంతకం చేయండి) అన్నాడు కాగితం తెచ్చిన పెద్దమనిషి. "యారు శొన్నార్?" (ఎవరు చెప్పారు?) అని అడిగాడు కాగితం చదువుతున్న పెద్దమనిషి. "నాడార్ శొన్నార్" (నాడార్ చెప్పారు) అన్నాడు వచ్చిన పెద్దమనిషి. "అప్పడియా?" (అలాగా) అంటూ కాగితం చదివిన పెద్దమనిషీ, తక్కిన వారూ కిక్కురుమనకుండా సంతకాలు చేశారు; మంత్రముగ్ధులలాగ, షాక్ తిన్నవారి చందాన.

ఈ వ్యవస్థాపనశక్తి శ్రీ కామరాజ్‌కు ఏదో నడమంత్రంగా సంక్రమించింది కాదు; ఆయన స్వచ్ఛంద సేవకుడుగా సేవ చేస్తున్నప్పటినుంచే ఉద్బుద్ధమయింది. 1932లో తిరుచిరాపల్లి కారాగారం కాంగ్రెస్ బందీలతో కిటకిటలాడుతున్న సమయం. శ్రీ కామరాజ్ మధురై ప్రముఖులతోపాటు ఆ కారాగారానికి వచ్చారు. కారాగారంలో నా పక్క సిమెంట్ అరుగు మంచమే ఆయనది. నేడు ప్రముఖ నాయకులుగా, మంత్రులుగా ఉన్న పలువురు ఆంధ్ర తమిళ కన్నడ కాంగ్రెస్‌వాదులు అక్కడ శిక్ష అనుభవిస్తున్నారు: తన ప్రసంగధారా సంపాతంతో ముంచెత్తివేసే సుబ్బయ్యాపిళ్ళై, అపరగాంధీ అనబడిన వేదరత్నంరా పిళ్ళై, డాక్టర్ దీక్షితులు, వీరశిఖామణి మద్దూరి అన్నపూర్ణయ్య, తన సతీమణి మాంగల్యాన్ని కోర్టువారు వేలంవేసి జరిమానా చెల్లింపజేసినా తొణకని బెణకని బారిస్టర్ ఎల్. ఎస్. ప్రభు, వేలూరు ప్రముఖ నాయకుడు

ఉఖై దుల్లా, తిరునెల్వేలి ఆంధ్రముఖ్యుడు సోమయాజులు, కుమారస్వామిరాజా, మదురై వృద్ధ మహానాయకుడు పట్టాభిరామయ్య, వంగరాష్ట్రపు డెటెన్యూలు సురేంద్రమోహన్ ఘోష్, జీవన్‌లాల్ ఛటర్జీ, ప్రతూల్‌చంద్ర గంగూలీ, భగత్సింగ్ కేసులో యావజ్జీవ కారాగారశిక్ష పొందిన బటుకేశ్వరదత్, కుందన్ లాల్ మొదలయినవారు. శ్రీ కామరాజ్ కారాగారంలో అడుగుపెట్టి రెండురోజులు గడిచాయి. ప్రతి చిన్న విషయానికీ ప్రతివారూ కామరాజ్ సలహా అడిగేవారే. అంత బారిస్టర్ ఎల్. ఎస్. ప్రభు కూడా "ఎన్న నాడారే? అదెప్పడి?" (ఏమిటి నాడార్‌గారూ? అదెలాగ?) అని చీటికి మాటికి సంప్రతించేవాడు.

'కామరాజ్‌టచ్'కు అప్పుడే అంకురార్పణమయింది. కొందరు నాయకమ్మన్యులకు నిరక్షరాస్యుడనుకొనే కామరాజ్ వెంట అందరూ ఇలా పడడం కష్టమనిపించేది. కాని ఏం చేస్తాం? కామరాజ్ విషయైక దృష్టి, నిష్పాక్షిక వివేచన అలాంటివి. అవి తిమ్మిని బమ్మిని, బమ్మిని తిమ్మిని చేసే మేధను త్రోసిరాజనే శక్తులు.

ప్రజల మనస్సులు చూరగొనడానికి బుద్ధికి, మనస్సుకు సంబంధించిన శక్తులు మాత్రం చాలవు. ఈ శక్తులను మేధావులు చూచి ఆనందిస్తారు. బలేబలే అంటారు. అంతటితో సరి. ఈ శక్తులకు హృదయం తోడు కావాలి. "ఇతడు మాకు హితం చేస్తాడు; హితం చేయడానికి ప్రయత్నిస్తున్నాడు; మోసగాడు కాదు" అనే భావం జనం మనస్సుల్లో నాటాలి. అప్పుడు వెంటబడుతుంది జనం. శ్రీ కామరాజ్ హృదయం, ప్రజాసేవా పరాయణత తంజావూరు తుఫాను సమయంలో పరవళ్ళు తొక్కాయి. తాను ముఖ్యమంత్రిననే తలంపే లేకుండా ఆయన తన గూడకట్టు పంచ ఎగగట్టి, తుఫాను బాధిత ప్రాంతాలకు ఉరికి, మోకాలు బంటి బురదలో దిగబడి బాధితులను, వారి సామానును సురక్షిత ప్రాంతాలకు చేరవేశారు. సామాన్య కార్మికునికన్నా హెచ్చు ఒడుపుతో, శ్రద్ధతో సేవచేశారు.

"సంఘే శక్తిః కలౌయుగే" అన్నారు ఎంతో ఆలోచించిన ఎవరో పెద్దలు. సంఘం అంటే కలిసి కట్టుతనం. అది ఏదో సంస్థతో కాని ఏర్పడదు. దానిని క్రమశిక్షణతో అంటిపెట్టుకున్నవాడే నాయకుడు అవుతాడు; తానూ ఏదో సేవ చేయగలుగుతాడు. శ్రీ కామరాజ్ అలాటివారు గనుకనే క్రమశిక్షణతో ప్రధాని నెహ్రూ మాటకు కట్టుబడి తన పదవిని పరిత్యజించారు. ఆయనకు తెలుసు తన సేవకు పరిగణన ఎప్పుడూ ఉంటుందని. హృదయపూర్వకంగా సేవచేసే వారికి ఎప్పుడూ ఆ విశ్వాసం ఉంటుంది.

నిస్వార్థ ప్రజాసేవకునికి మరికొన్ని అపూర్వమైన గుణాలు వాటంతట అవే అబ్బుతాయి. అలాటివాడు పెద్ద పెద్ద వాగ్దానాలేవీ చేయడు. "పార్కలాం!" (చూద్దాం) అంటాడు శ్రీ కామరాజ్‌లాగ. పార్కలాం అంటే కేవలం ఏదో యథాలాపంగా చూద్దాం అన్నమాట కాదు. అయ్యేవరకు చెప్పడం ఎందుకనే తత్వం. కనుకనే ఆయన మితభాషి. ఆయన దూషణ భూషణాలను సరకు చేసే వారుకారు. మన నాయకులు వలువురికి విదేశాల నాయకులు పొగిడితే పొంగిపోయే జబ్బు ఉంది. శ్రీ కామరాజ్ అమెరికా డెమోక్రాటిక్ పార్టీ నాయకుడు అడ్లాయ్ స్టీవెన్సన్ పొగడినా "యారవరు?" (ఎవరాయన) అని ఎదురుప్రశ్న వేసిన వ్యక్తి.

స్వస్థాన వేషభాషలలో ఆయనకు గల ప్రీతి, పట్టుదల అపారం. భువనేశ్వర్ కాంగ్రెస్ అధ్యక్షోపన్యాసం తమిళంలోనే చదివి తమ మాతృభాషకు గొప్ప గౌరవం తెచ్చారు. శ్రీ కామరాజ్‌కు తమిళ్ తప్ప మరొకటి రాదనడం పచ్చి అబద్ధం. ఆయన జన్మస్థలమయిన విరుదునగర్ కమ్మవారి పట్టణం. ఆయనకు చిన్ననాటినుంచి తోడ్పడిన వారు ముత్తుస్వామి ఆచారి, స్వామి నిత్యానంద దక్షిణాంధ్రులు. సోమయాజులు, మీనాక్షిసుందరం (పులి అయ్యర్) మొదలయిన దక్షిణాంధ్రులు ఆయనకు సహచరులు. కనుక ఆయనకు తెలుగు బాగా వచ్చు. సత్యమూర్తి, శ్రీనివాసయ్యంగారు వంటి పెద్దలతో మెలిగినందున ఇంగ్లీషు ధారాళంగా మాట్లాడగలరు. హిందీ నేర్చుకున్నారు. మలయాళంలో ప్రసంగించగలరు. కాని, బహిరంగ సభలలో మాతృభాష తప్ప మాట్లాడరాదని ఆయన నియమం. మాతృభాషలోనే భావ వ్యక్తీకరణ సులభమని ఆయన నమ్మకం.

ఇంతటివాడు కనుకనే శ్రీ కామరాజ్ రాజాజీ వంటి మేధావుల ముందే గొప్పవాడై కేవలం ఇంద్రజాల సదృశమైన మేధ నిరుపయోగమని, హృదయం తోడైతేనే నిజమైన గొప్పవాడవుతాడని నిరూపించారు.

ఇవన్నీ పర్యాలోకించినప్పుడు, మొన్న జూలై 15వ తేదీ నుంచి ఐదు రోజులపాటు యావద్భారతంలో - ముఖ్యంగా చెన్నపురిలో శ్రీ కామరాజ్ 62వ జన్మదినోత్సవం కోలాహలంగా జరగడం, చెన్నపురి 62 ద్వార తోరణాలతో అలంకృతం కావడం నాకు ఆశ్చర్యమనిపించలేదు.

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక — 12-8-64)

# ఘనం, నయం మిక్కిలిగా పలికించే మొక్కపాటి నాగేశ్వరరావు

వీణ కేవలం తెలుగువారి సొమ్ము కాకపోయినా గాథాసప్తశతి నాటి నుంచి, అమరావతి శిల్పాల నాటినుంచి వీణ ఎడ, తక్కిన తత (తంత్రీ) వాద్యాల ఎడ తెలుగుజాతి ఎడద నిండుగా ఉండినదనడానికి నిదర్శనాలు ఎన్నో ఉన్నాయి. వీణాపాణినే వెరుగుపడజేసిన వీణ శేషణ్ణ, సుబ్బణ్ణగారల వాదన వైశారద్యాన్ని మన పెద్దలు ఎందరో ఆనందించి వుంటారు. అలంకారాలలో వుండే స్వర గ్రామాలను ముందుకు వెనుకకు పాము మెలికల వలె, శంఖావర్తం వలె, వేద విద్వాంసుల ఘన జటావారం వలె సాధనచేసి, అంగుళుల బల వేగ మాధుర్య మార్దవాలతో ప్రకృతినే మూర్ఛిల్లజేసే శేషణ్ణగారి ప్రతిభను పెద్దలు వర్ణిస్తుంటే చెవులప్పగించి వినేవారం. వీణను జగదంబగా ఆరాధించిన సంగమేశ్వరశాస్త్రిగారి ప్రతిభా విశేషాలకు విస్మితులయినవారు నేటికీ ఎందరో వున్నారు. శాస్త్రిగారు త్రిస్థాయిని నాలుగో కాలంలో వేయి ఆవృత్తులు వీణను దించకుండా వాయించడం, ఒక స్వరస్థానంలోనే స్వరలోకం సృజించుకొనడం, తానం, ఘనం మీటులలో కత్తెరమీటును సొమ్ముగా చేసుకొనడం సంగీత కోవిదులు విని తనిసిన సంగతులు. సంగమేశ్వరశాస్త్రిగారిని తమ వెంట పాశ్చాత్య దేశాలకు పిలుచుకుపోవడానికీ ఆనాడు రవీంద్రుడెంతో ప్రయత్నించి విఫలుడయాడు. తెలుగువారి వీణావాదన కౌశలం అర్ధశతాబ్ది తర్వాత ఇప్పుడు పాశ్చాత్యులకు తెలియనున్నది. శ్రీ మొక్కపాటి నాగేశ్వరరావుగారు ఆ బాధ్యతకు దీక్ష పూనారు.

శ్రీ నాగేశ్వరరావుగారు జన్మించిన మొక్కపాటి వంశం పాండిత్యానికి, కళావైదగ్ధ్యానికి పేరుపొందినట్టిది. ఆయన సోదరులలో పలువురు చిత్రకారులు, సంగీత విద్వాంసులు, కవులు. ఆయన భావుకతకు, అభిరుచికి అనుగుణంగా ఆయన ఊరిపేరు వసంతవాడ (ఏలూరు శివారు). నాగేశ్వరరావుగారు వీణను చేపట్టడానికి ముందు హోమియో వైద్యంలో పడ్డారు. ఆరేండ్ల తర్వాత వీణే ఆయనను వైద్య వృత్తినుంచి లాగుకొని తన సాధన చేయమన్నది.

ఆయన బొబ్బిలి, పిఠాపురం, విజయనగరం సంప్రదాయాలను ఎరిగిన పండితులు శ్రీ బెహరా రాజారావుగారి వద్ద మొదట్లో సాధన చేశారు. తర్వాత చెన్నపురిలోని సెంట్రల్ కర్ణాటక సంగీత కళాశాలలో మూడేళ్ళపాటు వీణలో ప్రత్యేక శిక్షణ పొంది, నిష్ణాతులయ్యారు. చెన్నపురిలో ఆయన గురువులు శ్రీయుతులు శివానందం, కల్యాణ కృష్ణ భాగవతర్, నారాయణ అయ్యంగార్. ఈ ముగ్గురివద్ద ఆయన మూడు దాక్షిణాత్య వీణా సంప్రదాయాలను ఆకళించుకున్నారు. పూర్వం నాగేశ్వరరావుగారు వీణను ఊర్ధ్వముఖంగా వాయించేవారు. అది ఆంధ్ర సంప్రదాయం. చెన్నపురికి వచ్చిన తర్వాత ఆ పద్ధతిని, వాదన వైఖరిని మార్చుకున్నారు — తిర్యఙ్ముఖంగా వాయిస్తున్నారు.

ఆయన ఆంధ్ర దక్షిణ సంప్రదాయాలను శ్రద్ధతో సాధన చేయడంవల్ల ఉభయత్రా గల విశిష్టలతో స్వీయపద్ధతిని రూపొందించుకున్నారు. అది ఘనంలోను, నయంలోను స్పష్టమౌతుంది. అంటే మంద్రాన్ని, కాకలిని, కలస్వరాన్ని పలికించడంలో నన్నమాట. ఆయనకు సంప్రదాయమంటే చాల గౌరవం. కాని, ఒక్క ఒరవడి — శిష్యపరంపరానుగమనం — ఇష్టంలేదు. శాస్త్రపు కసరత్తులతో సంగీతాన్ని శుష్కంగా చేయక ఘన నయాలతో జీవం పోస్తారు. అయితే సంప్రదాయ విరుద్ధంగా నవీనత కోరేవారు కారు. అనుభూతి కలిగితే తప్ప వాయించరు. ప్రకారాంతరంగా చెప్పాలంటే సౌకుమార్యం, వాదన విధానం ద్వారా భావస్ఫూర్తిని తేవడం వారి వైశిష్ట్యం.

ఇటీవలనే మరొకమారు ఆ నాగేశ్వరరావుగారి వీణ తని (సోలో-వ్యష్టి) వినే సదవకాశం కలిగింది. పలువురు పాశ్చాత్యులు, కర్ణాటక సంగీతప్రియులు, కచ్చేరి విద్వాంసులు, పియానో నిపుణులు వచ్చారు. (చెప్పడం మరచాను. ఐదారేళ్ళనుంచి ఆయనవద్ద పలువురు పాశ్చాత్య విద్యార్థినీ విద్యార్థులు వీణ నేర్చుకుంటున్నారు. ప్రస్తుతం ప్రధాన శిష్యురాలు, ఫ్రెంచి యువతి శ్రీమతి మారివోన్ గియర్‌సాష్. ఈమె భర్త శ్రీ యరస్లావ్ గియర్‌సాష్ మద్రాసు విశ్వవిద్యాలయంలో అద్వైత వేదాంత పరిశోధన చేస్తున్నారు.) అభోగిరాగం వర్ణనతో ఆరంభమైన కచేరీ ఖరజురాగం తిల్లానతో సమాప్తమయ్యేవరకు — రెండుగంటలసేపు శ్రోతలు తన్మయులై విన్నారు. వీణా తంత్రీ తన్వులు నాగేశ్వరరావుగారి అంగుళుల ఆలింగనంతో పలికిన కాకలీ. కల, మంద్రనిక్వాణాలు శ్రోతలను ఆనందలోకాలలో విహరింపజేశాయి. కనుకనే పెద్దలన్నారు లలిత కళలన్నిటిలోను భాషా భావాలకు అతీతమైన స్వర బలంగల సంగీతం గొప్పదని. ఆయన

తన అభిమాన కీర్తనలలో ఒకటయిన త్యాగరాజులవారి "వర నారద నారాయణ స్మరణానుభవము గల" కీర్తన విజయశ్రీ రాగంలో వాయిస్తున్నప్పుడు కలిగిన రసస్ఫూర్తిని వర్ణించలేము. ఈ రాగ విన్యాసంలో ఆయన చూపిన స్వర తాన వైదగ్ధ్యం విద్వాంసులను తలలూపజేసింది. కర్ణాటక శుద్ధం, భావ పటిమ, కల్పనా శక్తి మృదుమధురంగా వ్యక్తమయ్యాయి. తానం ఈ కచేరికే మకుటాయమానంగా విలసిల్లింది. కదన కుతూహల రాగంలో "రఘువంశ సుధాంబుధిచంద్ర శ్రీరామ రామ రాజేశ్వర" కృతి వాయించినప్పుడు శ్రోతలు వీరరసంతో పొంగిపోయారు. రాగం కదనకుతూహలం కదా మరి! ఆయనకు మరొక అభిమాన కృతి "పక్కన నిలబడి కొలిచేటి ముచ్చట" అనే త్యాగరాజులవారి కృతి. ఈ కృతి త్యాగయ్య గారికే అభిమాన కృతులలో ఒక్కటని నా నమ్మకం. ఈ కృతి వీణకోసమే రచించిందా అన్నంత కోమల కమనీయం. అందులోను ఘనం, నయం సౌమ్య యిన నాగేశ్వరరావుగారి వీణ ఈ కృతిని పలికిస్తున్నప్పటి ముచ్చట సీతమ్మ రాముని పక్కన నిలబడి కొలిచేటి ముచ్చటను మధుర సుందరంగా స్ఫురింప జేసింది.

మార్దంగిక పితామహుడు శ్రీ కారైకుడి ముత్తు అయ్యరుగారు వీణను అనుసరించి మృదంగం వాయించడంలో సాటిలేనివారు. వీణాక్వణనంతో పోటీపడే మార్దవం ఆయన అంగుళీ స్ఫోటనలకు (వేలి దెబ్బలకు) ఉంది. ఆయన తని (సోలో) ఆవృత్తం చక్కగా మిశ్రచాపుతాళంలో వాయించినప్పుడు విని ఆనందించవలసిందే. మృదుంగానికి మృదువైన అంగం అని ఎవరో ఒకప్పుడు వ్యుత్పత్తి చెప్పడం జ్ఞాపకం వచ్చి, వ్యాకరణం ఎలాగున్నా, వ్యుత్పత్తి సార్థక మనిపించింది.

పలువురు పాశ్చాత్య విద్యార్థులకు ఒజ్జలయిన నాగేశ్వరరావుగారు యూరపు ఖండానికి, అమెరికాకు వెళ్ళడంలో ఆశ్చర్యమేమీ లేదు. తెలుగువారి వీణావాదన సంప్రదాయం ఇన్నాళ్ళకు పాశ్చాత్య విద్వల్లోకాన్ని ఆకర్షించడం, పడమటి సీమలో వ్యాపించనుండడం ఆశ్చర్యపడవలసిన విషయం. "శివాస్తే పంథాన స్సంతు!"

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక – 26–2–1964)

# తమిళనాడులో తెలుగు నిలిపిన సాధు వరదరాజం పంతులు

తమ ప్రాంతాల తెలుగును ఇతరులు ఈసడించినా, తాము తెలుగువాళ్ళమని, తమ భాషను పరిరక్షించుకోవడం తమ కర్తవ్యమని దక్షిణభారతంలోని—ముఖ్యంగా తమిళనాడులోని తెలుగువారు ఆరు దశాబ్దాల క్రిందటే భావించారు. సాధు వరదరాజం పంతులుగారి అకుంఠిత దీక్షవల్ల తమిళనాడులో కొడిగట్టుతున్న తెలుగుదీపం స్నేహప్రాప్తిని పొంది మళ్ళీ వెలుగుతూంది.

వరదరాజం పంతులుగారు తిరునెల్వేలి జిల్లాలోని వీరరాఘవపురంలో 1889 ఆగస్టు 20 న జన్మించారు. వీరి తండ్రి సాధు రామకృష్ణయ్య పంతులుగారు వివిధ ప్రభుత్వోద్యోగాలలోను, ఎట్టియాపురం సంస్థానంలో దివాన్‌గాను పనిచేశారు. ఎట్టియాపురం తెలుగురాజులు తెలుగు సంగీత సాహిత్యాలను పోషించినవారు; ఆంధ్ర మహాభారతాన్ని తమిళభాషలో వచనరూపంగా అనువదింపజేసి ప్రకటించారు. సాధు వరదరాజం పంతులు తమిళం బాగా అభ్యసించారు. పట్టభద్రులయిన తర్వాత మద్రాసు విశ్వవిద్యాలయంవారి Tamil Lexicon (తమిళ శబ్దకోసం) కార్యాలయంలో ఒక చిన్న గుమాస్తాగా చేరి ఆఫీసు మేనేజరుగా బాలాకాలం పనిచేసి రిటైర్ అయ్యారు.

తమిళ నిఘంటు కార్యాలయంలో పనిచేస్తున్నప్పుడు ఆయనకు తెలుగుమీద అభిమానం ఏర్పడింది. తెలుగు మాట్లాడడం వచ్చినా వ్రాయడం, చదవడం రాదు. తెలుగు సాహిత్యంలో పరిచయంలేదు. ఈ లోపాలకు ఆయన సిగ్గుపడి తెలుగు లిపి నేర్చుకున్నారు. తెలుగు శతకాలు, భాస్కర రామాయణం, పోతన భాగవతం, వీరేశలింగంగారి రచనలు, ఆంధ్రపత్రిక దినం దినం చదివారు. తమ యింట్లోవాళ్ళకు తెలుగు నేర్పారు.

వరదరాజం పంతులుగారి భార్య జయలక్ష్మమ్మ, కుమారుడు శివసుబ్రహ్మణ్యం తెలుగులో ప్రావీణ్యం సంపాదించారు; వరదరాజం పంతులుగారి ఉద్యమానికి తోడ్పడ్డారు. ఆయన తమిళనాడులోని తెలుగువారిలో క్షీణిస్తున్న తెలుగుకు ప్రాణం పోశారు. పనిగట్టుకొని స్వంత ఖర్చులతో ఊరూరు ఎక్కేగుమ్మం, దిగే గుమ్మంగా పర్యటించి తరతరాల తెలుగును ఎగసన తోశారు.

తమిళనాడులోని తెలుగువాళ్ళకు చాలామందికి తెలుగులిపి తెలియదు భాషావ్యాప్తికి లిపి అడ్డం రాకూడదు. తంజావూరులో మహారాష్ట్ర రాజులు తెలుగు కావ్యాలను నాగరలిపిలో వ్రాయించుకొని చదివారు. ఆంగ్లేయులు సంస్కృతాన్ని రోమన్ లిపిలో ముద్రించుకొన్నారు. నేడు కూడా సైన్యంలో హిందూస్తానీకి లిపి రోమన్ లిపే. సింధులో అరబ్బీ లిపిలో సంస్కృత గ్రంథాలున్నాయి. సాధు వరదరాజం పంతులుగారు తమిళనాడులో తెలుగు ప్రచారానికి తమిళ లిపిలో తెలుగు రచనలను అచ్చువేయించారు. "దక్షిణాంధ్ర పత్రిక" అనే ఒక పత్రికను పెట్టి ఉచితంగా ప్రతులను పంచారు.

వరదరాజం పంతులుగారి పుణ్యమా అని తమిళనాడులోని తెలుగువారు తమ భాషకు, యాసకు సిగ్గుపడడం మానేశారు; ఆయనకు 'దక్షిణాంధ్ర పితామహ', 'భాషోద్ధారక' అనే బిరుదులు ఇచ్చి గౌరవించారు. వరదరాజం పంతులుగారు "దయచేసి తెలుగును కాపాడుడు" అనే పెద్ద బ్యానరును భుజానికి తగిలించుకొని కాలికి బలపం కట్టుకొని తమిళదేశమంతా తిరిగారు. ఆయన ఉద్యమం ఫలించింది. ఈ విధంగా తెలుగువ్యాప్తికి, పరిరక్షణకు జీవితం వెచ్చించి ధన్యులైన వరదరాజం పంతులుగారు 1972లో, 83వ ఏట కాలధర్మం చెందారు.

(1972లో వ్రాసిన వ్యాసం)

# వెన్నతోనే విప్లవపాఠాలు నేర్చిన చిన్ని జవాహర్

**హిం**దీలో ఒక సామెత ఉంది "హోనహార బిరబానకే హోత చీకనే సాత్" అని. అంటే, ఎదిగే మొక్క ఆకులు చిక్కగా ఉంటాయి అని. మహా నాయకుడు కానున్న శ్రీ జవాహర్‌లాల్ బాల్యం కూడా అలాటిదే. ఆయన గొప్పవాడు కాగల లక్షణాలు అప్పుడే కనిపించాయి. అలాటి నార్లు అప్పుడే ఆయన మనస్సులో పడ్డాయి.

శ్రీ జవాహర్‌లాల్ ఆగర్భ శ్రీమంతుడు. తండ్రి మోతీలాల్ ఆయనను అల్లారుముద్దుగా చూచేవాడు. ఇంటినిండా కిటకిటలాడే పిల్లలు. అయినా జవాహర్ ఏకాంతం కోరేవాడు చిన్ననాటినుంచే. ఆయన కళ్ళలో ఏదో ఆలోచన కనిపించేది. ఇంట్లో ఉన్న పిల్లలంతా ఆయనకన్నా కొంచెం పెద్దవారు. కనుక, వారు ఏవో ఆటలను గురించి, ఇంగ్లీషువారి గొప్పదనాన్ని గురించి చెప్పుకునేవారు. జవాహర్ లాల్‌కు వాటిపైన అంతగా దృష్టి ఉండేది కాదు. పాశ్చాత్యులంటే, తత్రాపి ఇంగ్లీషువారంటే ఆయనకు ఏదో అభిమానమే. ఆయన దాది ఇంగ్లీషు మహిళ. ఉపాధ్యాయుడు ఐర్లెండ్‌వాడైన బ్రూక్స్. అయినా, ఆంగ్లేయుల దౌర్జన్య చర్యలు, వారి ప్రవర్తన, వర్ణభేదం ఆయనకు గిట్టేవికాదు. పార్టీలలోను, పార్కులలోను నల్లవారికి, తెల్లవారికి విడివిడిగా బల్లలు ఏర్పాటుచేసి ఉంటాయని విని ఆయన ఆశ్చర్యపడ్డాడు. అందువల్ల వ్యక్తిగతంగా ఇంగ్లీషు వారిపై కోపం లేకపోయినా ప్రభుత్వంపై ఉండేది. అప్పట్లో జపాన్ రష్యాను ఒక యుద్ధంలో ఓడించిందంటే ఆయన ఎంతో ఆనందించాడు. జపాన్ తూర్పు జాతి, కనుక మనవారేననే భావం. ఏ రంగంలో పాశ్చాత్యుల కంటే భారతీయులది పైచేయి అయినా సంతోషించేవాడు.

బ్రూక్స్ జవాహర్‌కు మంచి అభిరుచులు కలిగించాడు; ముఖ్యంగా ఆంగ్ల సాహిత్యంలో. జవాహర్ 16 సంవత్సరాల వయిసు వరకు ఇంట్లోనే చదువు కున్నాడు ఇంగ్లీషు, లెక్కలు, సైన్సు మొదలయినవి చెప్పడానికి బ్రూక్స్, హిందీ, సంస్కృతం చెప్పడానికి ఒక పండితుడు ఉండేవారు. "ఎన్ని సంవత్స

రాలు చదివినా నాకు సంస్కృతం అబ్బలేదు" అని జవాహర్ తర్వాత తన ఆత్మకథలో వ్రాసుకున్నాడు.

తండ్రి అంటే ఆయనకు ఎంత ప్రేమో అంత భయమూ ఉండేది. తండ్రి మోతీలాల్ తప్పును సహించేవాడుకాదు. జవాహర్ చిన్నతనంలో ఒకమారు ఆయన బల్లసొరుగులోని కలాలలో ఒకదాన్ని తీసుకున్నాడు. అది తెలిసి మోతీలాల్ కొడుకు దవడ వాయగొట్టాడు. ఆ దెబ్బలకు వారంవరకు జవాహర్ లేవలేదు. తల్లి శ్రీమతి స్వరూప్‌రాణి అంటె ఆయనకు ఎంతో ఇష్టం. "నేను అమ్మ అంత ఎత్తూ ఉండేవాణ్ని గనుక అమ్మతో సమానుణ్ని" అని ఆయన అనుకునేవాడు.

జవాహర్ అందరు పిల్లలలాగే అమ్మవద్ద, పెద్దమ్మవద్ద పురాణ కథలు వినేవాడు. అతనికి రకరకాల స్వప్నాలు వచ్చేవి: ఎక్కడికో ఆకాశంలో ఎగిరి పోయినట్టు, దూర ప్రయాణాలు చేసినట్టు, దయ్యాలతో పోరాడినట్టు. ఇవన్నీ అమ్మకు చెప్పేవాడు. పురాణ కథలలో అతనికి రాజకీయాలకన్నా, పెండ్లిండ్ల సంగతే హెచ్చుగా ఉన్నట్టు తోచేది. ఆయన ఒంటిగా, ఆకాశం చూస్తూ, నక్షత్రాలు లెక్క పెడుతూ, అప్పుడప్పుడు తోటలోని కొలనిలో ఈదుతూ గడిపేవాడు. సాయంకాలాల్లో గుర్రపుస్వారీ చేసేవాడు.

దేశమంటే, దేశభక్తి అంటే, స్వాతంత్ర్యమంటే ఏమిటో ఆయన లేత మనస్సుకు తెలియజెప్పినవాడు మున్షీ ముబారక్ అలీ అనే సజ్జనుడు. ఆయన మోతీలాల్ ఇంట్లో ఒకరకంగా అన్ని విషయాలూ చూచుకొనే మున్షీ. చిన్న తనంలో జవాహర్ అతని భుజం ఎక్కికూచుని, అరేబియన్ నైట్స్‌కథలు, పారసీక కథలు వినేవాడు. 1857లో జరిగిన ప్రథమ భారత విప్లవం గురించిన వీరగాథలను మున్షీ శ్రద్ధగా చెప్పేవాడు. ముబారక్ అలీ కుటుంబం ఆ విప్లవంలో నాశనమైంది. బ్రిటిష్ సైనికులు అతని తండ్రిని తల్లి ఎదుటే ఉరితీశారు. ముబారక్ అలీ తెల్లటిగడ్డం ఊగిసలాడుతూండగా దుఃఖంతో, గంభీ రంగా ఈ కథలు చెబుతూ ఉంటే, ఆయన మానవ విజ్ఞానమంతా మూర్తీభ వించిన వాడైనట్టు జవాహర్‌కు తోచేది. "ఆయన స్మృతి నాకు ఎంతో ప్రియమైనది. అపూర్వమైనది. దానిని మనస్సులో భద్రపరచుకున్నాను" అని జవాహర్ తర్వాత వ్రాశాడు.

చిన్ని జవాహర్‌కు పుట్టినరోజు పండుగ అంటే సరదా. ఆ రోజున తక్కిన పిల్లలలాగే ఆయన ఎంతో ఆవేశంతో పొంగిపోయేవాడు. పుట్టినరోజు పండుగనాడు అతని ఎత్తు గోధుమలు, బియ్యం తూచి బీదలకు పంచేవారు.

అతనికి మంచి దుస్తులు వేసేవారు. బహుమతులు లభించేవి. మధ్యాహ్నం విందు జరిగేది. "నా పుట్టినరోజు పండుగ రోజూ వస్తే బాగుండునని అనుకునేవాడిని. ఎప్పుడోగాని రాదని విచారంగా ఉండేది. తరచు రావాలని ఆందోళన చేయడానికి కూడా ప్రయత్నించాను." అన్నాడు ఆయన. భావి రాజకీయాందోళనకు పునాది పడిందన్న మాట.

తన కుమారుడు ఇంగ్లీషు పద్ధతిలోనే చదువాలి, ఇంగ్లండులోనే చదువాలి అనే ఉద్దేశంతో మోతీలాల్ జవాహర్‌ను 1905లో సుప్రసిద్ధమైన హారో పాఠశాలకు పంపాడు. అప్పుడు అతనికి 16 సంవత్సరాలు. హారో లండనుకు పదిమైళ్ళ దూరంలో ఉంది. జవాహర్ అక్కడ రెండేండ్లు చదివాడు. పాఠశాల చదువుతో పాటు ప్రపంచ రాజకీయాలను, ముఖ్యంగా భారతదేశ సంఘటనలను గురించి శ్రద్ధగా చదివేవాడు. ఆయన హారోపాఠశాలను 1907లో వదలి, ఆ సంవత్సరం కేంబ్రిడ్జ్ ట్రినిటీ కాలేజీలో చేరాడు. అక్కడ నాచురల్ సైన్సు టిపోస్ (కెమిస్ట్రీ, జియాలజీ, బాటనీ) ఆనర్సు చదివాడు మూడేళ్ళపాటు. అక్కడ ద్వితీయుడుగా పట్టభద్రుడైనాడు.

అప్పటికి ఆయన వయస్సు 20. తండ్రికేమో ఆయన ఐ. సి. ఎస్. కావాలని ఉండేది. కాని, ఐ. సి. ఎస్. పరీక్షకు 22 సంవత్సరాల కనీసపు వయస్సు ఉండాలి. కనుక, కుమారుడు బారిస్టర్ కావడం మంచిదని, తనకు తోడుగా ఉంటాడని తండ్రికి తోచింది. జవాహర్ 1912లో బారిస్టర్ అయ్యాడు.

జవాహర్‌లో చిన్ననాటి దేశభక్తి బీజాలు, స్వాతంత్ర్య వాంఛ కేంబ్రిడ్జిలో బాగా వికసించాయి. ఆయన సైన్స్ విద్యార్థి అయినా రాజకీయాలు, చరిత్ర క్షుణ్ణంగా చదివాడు. బెర్నార్డ్ షా, వెబ్, ఫ్రాయిడ్, ఎల్లిస్ మొదలయిన వారి సిద్ధాంతాలు చదివాడు. షా, వెబ్ సిద్ధాంతాలు ఆయనకు నచ్చాయి. ఇటలీ నాయకులు గారిబాల్డీ, మేజినీల జీవితాలు అధ్యయనం చేశాడు. అవి అతనికి భావాలను తీర్చాయి. ఐర్లెండ్ ఆ కాలంలో ఆదర్శ దేశం. 1910 లో జవాహర్ ఐర్లెండ్ పర్యటన చేశాడు.

కేంబ్రిడ్జిలో నెహ్రూతో చదివిన పలువురు భారతీయులలో కొందరు స్వాతంత్రోద్యమంలో ఆయన సహచరులయారు. వారిలో కొందరు వీరు:- జె. ఎం. సేన్ గుప్తా (బెంగాల్), సైయద్ మహమూద్ (బిహార్), తసాదుక్ అహమద్ షేర్వానీ (ఉత్తర ప్రదేశ్), సైపుద్దీన్ కిచ్లూ (పంజాబ్). కిచ్లూ స్టాలిన్ శాంతి బహుమానం పొందిన ప్రథమ భారతీయుడు,

1912 లో జవాహర్ భారతదేశానికి తిరిగి వచ్చాడు; ప్రాచ్య ప్రాశ్చాత్యాల కలయికగా. "నేను పాశ్చాత్య దేశాలలో పరాయివాడిని, అక్కడివాడిని ఎలా అవుతాను; కాని, స్వదేశంలోనూ పరాయివాణ్ణా?" అని వచ్చిన తర్వాత అప్పు డప్పుడు అనుకొనేవాడు ఆయన.

ఆనాటినుంచి ఆరంభమయింది జవాహర్ రాజకీయ జీవితం కూడా. 1912 డిసెంబర్‌లో బంకీపూర్‌లో (బిహార్) జరిగిన కాంగ్రెస్ మహాసభలో జవాహర్ తొలిసారిగా పాల్గొన్నాడు.

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక బాలబాలికల ప్రత్యేక సంచిక – 15-8-1964)

# దీక్షతో, పరిశ్రమతో, వివేకంతో కొనసాగిన శ్రీ అణ్ణా జీవిత గాథ

తమిళనాడు రాజకీయ రంగంలో రెండు దశాబ్దాలయినా నిండని ద్రావిడ మున్నేట్ర కళగం నేడు ఎన్నికలలో కాంగ్రెస్ వంటి పెద్ద రాజకీయ సంస్థను, దేశానికి స్వాతంత్ర్యం సంతరించి పెట్టిన సంస్థను సవాలు చేస్తున్నదంటే ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది. కాని, ద్రావిడ మున్నేట్ర కళగం నాయకులు తమిళ ప్రజల మనస్సులను చూరగొనడానికి పాటుపటిన పద్ధతులు, పరిశ్రమ పరిశీలిస్తే ఆ పార్టీ చరచరమని ఇంతపైకి రావడానికి కారణమేమిటో అవగతం అవుతుంది. ఈ పార్టీకి మూలబంధమై మూల స్తంభమైనవారు శ్రీ సి. ఎన్. అణ్ణాదురై.

శ్రీ అణ్ణాదురైను ఆయన అనుయాయులు, అభిమానులు 'అణ్ణా' (అన్న) అని సంబోధిస్తారు. శ్రీ అణ్ణా మహావక్త. మద్రాసు సముద్ర తీరంలో ఆయన ప్రసంగ ధోరణి సముద్ర ఘోషతో పోటీ పడుతుంది. ఆయన గంటల తరబడి ప్రాచీన తమిళ గ్రాంథిక భాషలో అనర్గళంగా ఉపన్యసిస్తారు. సాహిత్య మాధుర్యం కోసమయినా, ఆయన ప్రసంగాలు వినవచ్చేవారూ అసంఖ్యాకంగా వున్నారు. ప్రాచీన ద్రావిడ వైభవం, ప్రాచీన ద్రావిడ సంస్కృతి గొప్పదనం గురించి ఆయన ప్రసంగం వింటున్నప్పుడు, పొంగని తమిళుడు వుండడు.

శ్రోతలు ఎగబడి వినడంవరకు చూస్తే.... పూర్వం ఎప్పుడో బిపిన చంద్ర పాల్‌ను గురించి ఎంతో గొప్పగా చెప్పుకునేవారు— పాల్, బాల్, లాల్— అనే మూర్తిత్రయంలో ఆయన ఒకరు. తర్వాత సేన్‌గుప్తా ప్రజాకర్షణ మాంత్రికుడుగా నాకు కనిపించాడు. ఆయన సమున్నత సుందర విగ్రహం, వాగ్ధోరణి ప్రజలను ముగ్ధులను చేసేది. ఆయన ఎక్కడికి వెళ్ళినా లక్షలమంది వచ్చేవారు— బ్రిటిష్ ప్రభుత్వం ఎంత నిషేధించినా. కాని, విదేశాలలోలాగా టికెట్లుకొని లక్షలమంది ప్రసంగం వినే పద్ధతి తమిళనాడులో— భారతదేశంలోనే అందాం— ఆరంభమయింది శ్రీ అణ్ణాతోనే ననుకుంటాను. శ్రీ అణ్ణా ప్రసంగాలన్నా, నాటకాలన్నా జనం ఎంత ధర పెట్టినా టికెట్లు కొని వినడానికి, చూడడానికి

వెళ్ళుతారంటే, ఆయన మాటలు "మరులు మాతంగి"గా వుంటాయన్నా అతిశయోక్తి లేదు.

శ్రీ అణ్ణా కేవలం వక్త మాత్రమే కాదు; నాటకకారుడు; స్క్రీన్‌ప్లే రచయిత. తన సిద్ధాంతాలయిన నాస్తికతను, ద్రావిడ తత్త్వాన్ని, బ్రాహ్మణత్వ ప్రాతికూల్యాన్ని వివరిస్తూ అసంఖ్యాకంగా పుస్తకాలు రచించారు. ఆయన నాటకాలు పెక్కు— వేలైక్కారి, ఒర్ ఇరవు మొదలయినవి వెండి తెర ఎక్కాయి. ఆయన నటుడు కూడా. పార్టీ నిధికోసం వ్రాసిన నాటకాలలో ఆయన పాత్ర ధరించేవాడు. నటుడుగా పేరు ప్రఖ్యాతుల సంగతి ఎలా వున్నా నాటకాల విషయంలో మాత్రం "తమిళనాడు బెర్నార్డ్ షా" అని ఆయనను పలువురు వర్తమాన తమిళ పండిత విమర్శకులు కీర్తించారు. ఆయన ప్రపంచ సాహిత్యాన్ని, ప్రపంచ రాజకీయాలను బాగా అధ్యయనం చేసినవారు.

ఆయనంటే తమిళనాడులోవున్న జనాదరానికి ఒక చిన్న ఉదాహరణం: 1965 లో అణ్ణా మలయాకు వెళ్ళారు. ఆయన మద్రాసులో మీనంబాకం విమానాశ్రయంలో విమానం ఎక్కేనాడు, మీనంబాకం విమానాశ్రయం అలా వుండగా, ఆ పరిసరాలను కూడా ప్రజా పారావారం ముంచెత్తింది. సింగపూర్ విమానాశ్రయంలోనూ అలా జనం త్రొక్కిసలాడినట్టు పత్రికలలో చదివాను. ఒక్క మలయా, మద్రాసులలోనే కాదు, తూత్తుకుడినుంచి తింబక్టు వరకు, తింబక్టు నుంచి తాస్మేనియా వరకు తమిళులు ఎక్కడ వున్నా అణ్ణా అంటే అంతటి ఆదరమూ చూపుతారు.

అణ్ణా అనుయాయులు ఆయనను "విప్లవవాది, నూతన ప్రపంచ శిల్పి అపారజ్ఞాని, అర్థంకాని గంభీర వ్యక్తి" అని విశ్వసిస్తారు. నేడు విప్లవకారుడుగాను, సంఘ దురాచారాల ధ్వంసకుడుగాను కీర్తితుడయ్యే శ్రీ అణ్ణా చిన్ననాడు అత్యంత సౌమ్యుడు. నోట్లో నాలుక వుందా?— అని అందరూ ఆశ్చర్యపడేవారట. ఇంతటి మాటలురాని పిల్లవాడు ఎలా బతుకుతాడో! — అని ఆయన తల్లి వాపోయేవారట

శ్రీ అణ్ణా కంచిలో నిరుపేద కుటుంబంలో జన్మించారు 1909 సెప్టెంబర్ 15 న. చిన్ననాడు పిళ్ళయార్ పాలెం శ్రీ తిరుజ్ఞాన సంబంధం అనే తమిళ విద్వాంసులు ఆయనకు తమిళం నేర్పించారు అప్పుడు అణ్ణా నొసట అరచేయి వెడల్పు చందనం పట్టెలమీద, కాని వెడల్పు కుంకుమ బొట్టుతో ఎంతో వినయంగా, ఎంతో అణకువతో ప్రాచీన గురుకుల శిష్య సంప్రదాయంతో తమిళం నేర్చారు. తర్వాత కాంచీపురంలోని పచ్చయప్ప హైస్కూలులోను, మద్రాసు

లోని పచ్చయప్ప కళాశాలలోను చదివారు. అక్కడ ఎకనామిక్స్, పొలిటికల్ సైన్స్‌లు విషయంగా ఎం. ఏ. పట్టం పుచ్చుకున్నారు. కళాశాల నుంచి వచ్చిన తర్వాత చెన్నపురిలో గోవిందప్ప నాయకన్ వీధిలో వున్న సెకండరీ స్కూలులో ఆరునెలలపాటు ఉపాధ్యాయులుగా పనిచేశారు. అప్పడే జరిగింది ఒక సంఘటన— ఆయన జీవితాన్ని మార్చివేసిన సంఘటన.

అప్పుడు ద్రావిడ మున్నేట్ర కళగానికి మూల స్వరూపమైన జస్టిస్‌పార్టీ బలం ఇంకా వుంది. ఒకసారి పెద్దినాయకుని పేటలో సర్ ఆర్కాట్ రామస్వామి మొదలియార్ శ్రీ ఇ. వి. రామస్వామి నాయకర్ (పెరియార్) అధ్యక్షతన జరిగిన సభలో ఇంగ్లీషులో ప్రసంగించారు. ఆ ప్రసంగాన్ని తమిళీకరించడానికి ఉభయ భాషలు బాగా తెలిసినవారు కావలసి వచ్చింది. అక్కడ శ్రీ అణ్ణా వున్నారు. ప్రసంగం అనువాదం చేస్తామన్నారు. సర్ రామస్వామి మొదలియార్ ఆంగ్లంలో గొప్ప వక్త; రాజనీతిజ్ఞుడు. ఆయన ప్రసంగాన్ని అనువదించడం అంత తేలిక కాదు. శ్రీ అణ్ణా చక్కగా, మూలానుసారిగా అనువదించి మూలంలోని అంద చందాలు తమిళ సామాన్య శ్రోతలకు అర్థమయ్యేట్లు చేశారు. ఆ అనువాదానికి ముగ్ధులయ్యారు పెరియార్ శ్రీ రామస్వామి నాయకర్. తమ శిష్యుడుగను, రాజకీయపక్ష అనుయాయిగను వుండాలని ఆయనను కోరారు. అంతటివాడు కోరినప్పుడు ఎవరైనా లొంగక తప్పదు. శ్రీ అణ్ణా ఉపాధ్యాయ వృత్తికి స్వస్తి చెప్పి, పెరియార్ కళగంలో చేరారు. దానితో ఆయన జీవితం కేవలం రాజకీయ జీవితం అయింది: ద్రావిడనాడు ప్రచారం, దానికోసం పత్రికలు నడపడం, ప్రకటనలు చేయడం— ఇత్యాది.

కాని 1947 నుంచి శ్రీ పెరియార్‌కు శ్రీ అణ్ణాకు అభిప్రాయభేదాలు ఏర్పడ్డాయి. వారి సిద్ధాంతాలలోనే కాక, వ్యక్తిగత పద్ధతులలోను విభేదాలు కన్పించాయి. 70 సంవత్సరాల పండు ముసలి అయిన శ్రీ పెరియార్ పార్టీ సభ్యురాలయిన శ్రీమతి మణియమ్మను పెండ్లిచేసుకోవాలని నిశ్చయించుకున్నారు. ఆమె ముప్పయి సంవత్సరాలలోపు వయస్సు గలది. కాబట్టి ఆమెను పెండ్లాడ గూడదని శ్రీ అణ్ణా, ఆయన అనుచరులూ అన్నారు. పార్టీ జనరల్ కౌన్సిల్‌లోని 44 మంది సభ్యులలో 32 మంది సమావేశమై 31 మంది పెండ్లికి ప్రతికూలంగా తీర్మానించారు. శ్రీ పెరియార్ ఆ తీర్మానాన్నిగాని, జనరల్ కౌన్సిల్ సభ్యులను గాని పట్టించుకోనేలేదు; పెళ్ళి చేసుకున్నారు.

శ్రీ అణ్ణా దానితో శ్రీ పెరియార్ నుంచి విడిపోయి, క్రొత్త రాజకీయ పక్షం నెలకొల్పడానికి సన్నాహాలు చేశారు. తాము వదలినది ద్రావిడ కళగం,

తాము నూతనంగా స్థాపించినది ద్రావిడ మున్నేట్ర కళగం– ద్రావిడ అభ్యుదయ సంఘం అన్నమాట. దీని ప్రప్రథమ సమావేశం 1949 సెప్టెంబర్ 17 వ తేదీన స్టాన్లీ మెడికల్ హాస్టల్ సమీపంలోని రాబిన్‌సన్ పార్కులో జరిగింది. దీనితో ద్రావిడమున్నేట్రకళగం అవతరించింది. శ్రీ అణ్ణా తన నూతన అభ్యుదయ పక్షం ఆశయాలను వివరించారు. తమది కేవలం రాజకీయపక్షం కాదని, సంఘ సంస్కరణ ప్రధాన లక్ష్యంగా గల మహోద్యమమని నొక్కి నొక్కి చెప్పారు. ఈ ప్రచారంవల్ల కళగం జనంలో మంచి పలుకుబడి సంపాదించింది. దీనికితోడు తమిళనాడులో కాంగ్రెస్‌పట్ల జనానికి కలిగిన అసంతృప్తి కూడా తోడయింది. ఈ అసంతృప్తి మహాగ్నిని ద్రావిడ మున్నేట్ర కళగం నాయకుల ఉపన్యాస ఝంఝామారుతాలు ప్రజ్వలింపజేశాయన్నా తప్పు కాదు.

శ్రీ అణ్ణాకు తన సిద్ధాంతాలను ప్రచారం చేయడానికి ఇంతవరకు ప్రజా సభ వేదికలే కానీ, శాసనసభ వేదికలు లేవు. కాని, ఆయన 1957 ఎన్నికలలో కాంచీపురం నుంచి మద్రాస్ శాసనసభకు ఎన్నిక కావడంతో శాసనసభా రంగం నుంచి ద్రావిడనాడు సిద్ధాంతాలను, హిందీ భాషా వ్యతిరేకతను మరింత ఎలుగెత్తి ప్రచారం చేయడానికి అవకాశం కలిగింది. 62 లో ఆయన రాజ్యసభకు ఎన్నికయారు.

శ్రీ అణ్ణా రాజ్యసభలో తొలిసారి చేసిన ప్రసంగం పలువురు ఆలోచనాపరుల ప్రశంసలకు పాత్రమయింది.

శ్రీ అణ్ణా జాతీయ భాషా సమస్యపై రాజ్యసభలో 65 మార్చి 4న చేసిన ప్రసంగం అత్యపూర్వమూ, సహేతుకమూనని ఆలోచనాపరులూ, నిష్పక్షపాతులూ ప్రశంసించారు.

ఏమైనా, ద్రావిడ మున్నేట్ర కళగం మూల బంధం, మూల స్తంభం, మార్గదర్శి అయిన అణ్ణాదురై తన పాండిత్యంతో, రచనతో, కథలతో, వ్యాసాలతో, నాటకాలతో తుదకు 'కంచి' పత్రికలో "అన్బుళ్ళ తంబి" అని సంబోధిస్తూ వ్రాసిన ఉత్తరాలతో, జనాన్ని ఎడదలు కదిపి కదలించే వాచారంభంతో కోటానుకోటి తమిళ జనాన్ని ఆకర్షిస్తూనే వున్నారు.

శ్రీ అణ్ణా సతీమణి శ్రీమతి రాణి అమ్మాళ్ ఆయనకు అనురూప ధర్మ పత్ని.

ఆయన హిందీ వ్యతిరేకోద్యమంలో తొలిసారిగా శిక్షపొందింది 1938లో. తర్వాత నాలుగుసార్లు కారాగారానికి వెళ్ళారు.

ద్రావిడ మున్నేట్ర కళగం సాధారణ ఎన్నికలలో పాల్గొనాలని నిర్ణయించిన తర్వాత 1956 ఎన్నికలలో మద్రాసు రాష్ట్ర శాసనసభకు పార్టీవారు 15 మంది

ఎన్నికయారు. తర్వాత 1962 ఎన్నికలలో 50 మంది ఎన్నికయినా, శ్రీ అణ్ణా వోడిపోయారు; పిదప రాజ్యసభకు ఎన్నికయారు.

1967 ఎన్నికలలో డి. ఎం. కె. ఇతర పార్టీల పొత్తుతో చరిత్రాత్మకమైన విజయం పొందింది. కాంగ్రెస్ పూర్తిగా పరాస్తమయింది. దేశంలో కాంగ్రెస్‌ను పూర్తిగా వోడించిన పార్టీ డి. ఎం. కె. యే. శ్రీ అణ్ణాదురై గొప్ప మెజారిటీతో లోక్‌సభకు ఎన్నికయారు. కాని రాష్ట్ర ప్రభుత్వ రథసారథ్యం కోసం లోక్‌సభ సభ్యత్వానికి రాజీనామా యిచ్చారు.

అణ్ణా 1968 ప్రారంభంలో యేల్ విశ్వవిద్యాలయం ఆహ్వానంపై అమెరికాకు వెళ్ళి విదేశాంగశాఖ అతిథిగా వున్నారు. అమెరికా నుంచి వచ్చిన తర్వాత గొంతు నొప్పని, సరిగా మింగుడు పడడంలేదని అన్నారు.

కొన్నాళ్ళు జనరల్ ఆస్పత్రిలో వున్నారు. పరీక్షించగా కంఠనాళంలో పుట్టకురుపని తేలింది. న్యూయార్క్‌లో చికిత్స జరిగింది. తిరిగి వచ్చిన తర్వాత మరీ జబ్బు పడ్డారు. అడయార్ కాన్సర్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరారు. పొత్తి కడుపులో పుట్ట కురుపున్నట్టు తేలింది. దానికి రేడియో ధార్మికశక్తి గల ఇరిడియం చికిత్స జరిగింది.

ఆయన ఆశా నిరాశల మధ్య వూగిసలాడుతూ చివరకు 1969 ఫిబ్రవరి 3 వ తేదీన తెల్లవారుజామున 12-22 కు దివంగతులయ్యారు. కోటానుకోటి ప్రజలను దుఃఖ సాగరంలో ముంచారు.

(ఆంధ్రపత్రిక : 4-2-1969)

# సంగీత సంరాజ్ఞి ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి

"సామవేదా దిదం గీతం
సంజగ్రాహ పితామహః"

అని శార్ఙ్గదేవుడనే సంగీత శాస్త్రజ్ఞుడు తాను రచించిన "సంగీత రత్నాకర"మనే గ్రంథంలో వ్రాశాడు. బ్రహ్మ సామవేదం నుంచి సంగీతాన్ని గ్రహించి భరతాది మహామునుల ద్వారా లోకానికి అందించాడని దీని అర్థం. సంగీతానికి ఉండవలసిన ప్రప్రథమ లక్షణం శ్రావ్యత. సంగీతం 'ఆపాత మధురం'గా ఉండాలని పెద్దల సూక్తి. అంటే సంగీత ధ్వని చెవిలో పడి పడగానే 'హాయిగా ఉన్నది' అనిపించాలి అని అర్థం. అలా చెవిలో పడి పడగానే తియ్యగా ఉన్నాయి అని అనిపించే పాటలు పాడి వినిపించగల సంగీత విద్వాంసురాలు, గాయని శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మి. ఈమె పూర్తిపేరు మదురై షణ్ముగ వడివేలు సుబ్బులక్ష్మి.

చైత్ర, వసంత మాసాలు వసంతకాలం. ఈ కాలంలో అంటే మార్చి, ఏప్రిల్ నెలలలో కోయిల కూస్తుంది. వర్ష ఋతువులో అనగా శ్రావణ భాద్రపద మాసాలలో మేఘం కనిపించగానే నెమలి కూస్తుంది. ఈ రెండు పక్షుల కూతల్లో చెవికి హాయినిచ్చే గుణం ఉంది. ఈ రెండు ధ్వనులనూ సంగీతంలో పంచమ షడ్జస్వరాలతో పోల్చారు. రుచిగా వుండే ఆహారం నాలుకకు తగిలితే, ముక్కుకు మంచి వాసన తగిలితే కలిగే హాయి లాంటిదే శ్రావ్యమైన సంగీతాన్ని వినడం వల్ల కలిగే హాయి కూడ.

"శిశుర్వేత్తి పశుర్వేత్తి
వేత్తి గాన రసం ఫణీ"

అంటారు. అనగా శిశువులకు, పశువులకు, పాములకు కూడా సంగీతం హాయినిస్తుందని అర్థం.

మనుష్యులలో కొంతమంది – మగవారయినా, ఆడవారయినా – మాట్లాడినా, నవ్వినా, పాటపాడినా చెవులకు హాయిగా ఉంటుంది. అటువంటి వారికి మంచి కంఠస్వరం ఉంది అని గుర్తిస్తాం. కొందరు అందంగా ఉంటారు.

కొందరు బలంగా, పుష్టిగా ఉంటారు. కొందరు పొడుగ్గా ఉంటారు – వారి పొడుగే వారి అందం అన్నట్టుగా. ఈవిధంగా ప్రత్యేకమైన మంచి లక్షణాలు కలిగిన మనుష్యులు ఉన్నట్టే, కొంతమందికి పలికితే హాయినిచ్చే కంఠస్వరం ఉంటుంది. ఈ కంఠస్వరాన్నే గాత్రం అనీ అంటారు హాయినిచ్చే గాత్రాన్ని శ్రావ్యమైన గాత్రం అంటారు. శ్రావ్యమైన గాత్రం అదృష్టవంతులైన ఏ కొద్ది మందికో ఉంటుంది. అలాంటి శ్రావ్యమైన గాత్రం గల అదృష్టవంతురాలు, ప్రపంచమంతటా ప్రఖ్యాతిగాంచిన పాటకత్తె శ్రీమతి ఎం. ఎస్. సుబ్బలక్ష్మి. ఆమె వయస్సు ఇప్పుడు 78 సంవత్సరాలు. ఆమె గాత్రం ఇప్పటికీ వన్నె తగ్గకుండా అత్యంత శ్రవణానందాన్నిస్తుంది.

ఈమె 1916 సెప్టెంబర్ 16న తమిళనాడులోని మదురై అనే నగరంలో ఒక సంగీత వంశంలో జన్మించారు. ఈమె తల్లిపేరు షణ్ముగ వడివేలు. ఆమె గొప్ప వైణికురాలు. ఈవిధంగా శ్రీమతి సుబ్బలక్ష్మి రక్తంలో సంగీతం ప్రవహించింది.

పూవు పుట్టగానే పరిమళిస్తుందన్నట్టు ఈమె గాత్రంలోని తియ్యదనం చిన్నవయసులోనే అందరినీ ఆకర్షించింది. 18 ఏళ్ళ వయస్సుకు ముందే ఈమె గాయనిగా విఖ్యాతి చెందారు. 1935 ప్రాంతంలోనే ఈమె "భక్తకుచేల" తమిళ సినిమాలో నటించి పాడి, ప్రేక్షక శ్రోతలను మెప్పించారు. పిదప 'శకుంతల' అనే తమిళ చిత్రంలో శకుంతలగా నటించి మన్నన పొందారు. రంగస్థల నటుడు, సుప్రసిద్ధ చలనచిత్ర నటుడు, గాయకుడు శ్రీ చిత్తూరు వి. నాగయ్యతో పాటు ఈమె 'భక్త మీరా' అనే హిందీ సినిమాలో మీరాగా నటించి, మీరా భజనలు శ్రావ్యంగా పాడడంతో ఈమెకు అఖిలభారత ఖ్యాతి లభించింది. ఈమె మీరా భజనల రికార్డులు భక్తిరసాన్ని కుమ్మరించాయి. ఈమెను మీరా అవతారంగా పొగిడారు; ఈమె ఆ కీర్తికి తగినట్టు జీవితమంతా గడిపారు. ఈమె ఏ కీర్తన పాడినా తన్మయురాలై పాడుతారు. "హరి తుమ్హారో జీ అనే మీరా కీర్తనను ఇతరులు పాడడంకన్నా శ్రీమతి సుబ్బులక్ష్మి పలికితేనే నాకు ఇష్టం" అన్నారు గాంధీజీ. "శ్రీమతి సుబ్బలక్ష్మి ఎక్కాలు చదివినా శ్రావ్యంగా ఉంటుంది." అని ప్రశంసించారు ప్రముఖ తమిళ రచయిత శ్రీ కల్కి– కృష్ణమూర్తి.

యజ్ఞయాగాదులు చేసిన వంశంలో జన్మించిన శ్రీ టి. సదాశివన్ అనే ప్రముఖ దేశభక్తుడు, పత్రికా సంపాదకుడు శ్రీమతి సుబ్బలక్ష్మిని వివాహ మాడారు. ఆయన విశేషంగా ప్రోత్సాహమివ్వడంతో ఈమె గొప్ప గాయనిగా పరిణతి చెందారు; సంగీత విదుషీమణిగా వికసించారు. వీరిద్దరి వివాహం

మద్రాసు నగరంలోని మీనంబాకం విమానాశ్రయానికి సమీపంలోని ఒక విష్ణు దేవాలయంలో జరిగింది. దాని మధురస్మృతి చిహ్నంగా అక్కడ వారొక కల్యాణమండపం కట్టించారు. దాని పేరు కల్కి మండపం.

శ్రీ టి. సదాశివన్ భర్తగా లభించడం ఈమె గొప్ప అదృష్టం. ఆయన ఈమెను దారిచూపే దీపంలాగ, గురువులాగ, మిత్రుడిలాగ, ఈమె చేయి పట్టుకొని నడిపించారంటే అతిశయోక్తిలేదు. ఆయన పట్టిందెల్లా బంగారమవుతుందనే ప్రఖ్యాతి గడించినవారు. ఆయన బంగారం వంటి సుబ్బలక్ష్మిని మెరుగులుదిద్ది ప్రపంచమంతా ప్రకాశింపజేశారు. ఈమె విశ్వవిఖ్యాతికి ఆయనే ముఖ్య కారణం.

భారత ప్రథమ ప్రధాని పండిత జవాహర్‌లాల్‌నెహ్రూ ఈమె పాటను ప్రత్యేకంగా అభిమానించేవారు. ఈమెను పండిత నెహ్రూ "గానరాజ్ఞి" అని ప్రశంసించారు. రవీంద్ర కవీంద్రుడు, భారత ప్రథమ రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్, ప్రముఖ విద్యావేత్త శ్రీ కె. ఎం. మున్షీ, మాజీ రాష్ట్రపతి, విశ్వవిఖ్యాత దార్శనికులు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ మున్నగు మహామహులేకాక విదేశీయులు కూడా ఈమె గానాన్ని వేనోళ్ళ కొనియాడారు. భారతదేశపు చివరి వైస్‌రాయ్ లార్డ్ మౌంట్‌బ్యాటన్, ఆయన సతీమణి, బ్రిటిష్ బంధువు లార్డ్ హేర్ ఉడ్ మున్నగువారు ఈమె గానామృతం గ్రోలి ఆనందించారు. ప్రపంచమంతటా ఈమె అభిమానులున్నారు.

మహాత్మాగాంధీ సుబ్బులక్ష్మి పాడిన 'రఘుపతి రాఘవ రాజారామ్' అనే భజన కీర్తనను, 'వైష్ణవ జనతో తేనే కహియే జే పీడ పరాఈ జాణే రే' అనే భక్తకవి నర్సీభగత్ గుజరాతీ గేయాన్ని విని ఎంతగానో పరవశులయ్యేవారు. అందువల్ల గాంధీజీ 1948 జనవరి 30న మరణించినప్పుడు, అప్పటి భారత ప్రధాని పండిత నెహ్రూ వెంటనే సుబ్బలక్ష్మిని పిలిపించారు. ఈమె మరణశయ్యపై గాంధీజీని చూచి ఎవరూ అందించకుండానే ఆ రెండు కీర్తనలూ పాడి శ్రద్ధాంజలి ఘటించారు. మరణించిన గాంధీ అంతిమయాత్ర ముగిసేవరకు ఈమె ఆకాశవాణి ద్వారా వినిపించిన భక్తిగేయాలను విని యావద్భారతమే కాదు, యావత్ప్రపంచమే పరవశించింది.

శ్రావ్యతతోపాటు ఈమె గానంలోని మరొక గొప్ప లక్షణం అర్థజ్ఞాన బోధకమయిన స్పష్టత. ఈమె ఏ భాషలోని గీతాన్నయినా, పూర్తిగా అర్థం చెప్పించుకొని, తాము పాడేటప్పుడు ఉచ్చారణ తప్పులు లేకుండా, ఆ గీతంలోని భావం అందరికీ తెలిసేటట్టు భక్తి పారవశ్యంతో పాడుతారు. ఇలా సరైన

ఉచ్చారణతో భావయుక్తంగా పాడగలగడానికి ఎంతో కృషి, పట్టుదల, శ్రద్ధ, అవసరం. ఈ విషయాలలో ఈమె చూపించేటంత శ్రద్ధ సాధారణంగా ఇతరులు చూపించలేరు.

శ్రీమతి సుబ్బులక్ష్మి తమ గానానికి తామే ఒరవడి దిద్దుకున్నారు. ఈమె గానశైలిని తరువాత ఎందరో అనుకరించారు. శ్రీమతి ఎన్. సి. వసంత కోకిలం అనే గాయనీమణి ఈమె కంటే ముందు, ఈమెకు దీటయిన స్థాయిలోనే గానం చేసేవారు. ఆమె మరణానంతరం అలా పాడగలిగినవారు నాటికీ నేటికీ శ్రీమతి సుబ్బులక్ష్మి ఒక్కరే. ఈమెకంటే సంగీతజ్ఞానం తెలిసినవారూ, క్లిష్టమైన శైలిలో పాడగలగినవారూ ఉంటే ఉండవచ్చు కాని, శ్రావ్యతలో, భావస్ఫూర్తిని కలిగించడంలో ఈమెకు ఈమే సాటి. ఇప్పటికి యాభై సంవత్సరాలకు పైగా ఈమె తన అత్యున్నతస్థాయిని నిలబెట్టుకుంటూ వస్తున్నారు. అంటే కర్నాట సంగీత సామ్రాజ్యానికి పట్టమహిషి అన్నమాట.

మైకులు ఇంకా వ్యాప్తిలోకి రాకముందే ఈమె అఖండఖ్యాతి నార్జించారు. మైకు లేకుండా ఈమె గానం కాకినాడ సరస్వతీ గానసభలో, 1948 ప్రాంతంలో, అకస్మాత్తుగా విన్నాను. దాదాపు రెండువేలమంది శ్రోతలు మంత్రముగ్ధులైనట్టుగా ఈమె పాట విన్నారని నాకు ఇప్పటికీ స్పష్టంగా గుర్తు. మైకులు వచ్చాక కూడ ఈమె గాత్రానికి సాటి వచ్చే గాయనీ నేటికీ లేదు.

తమిళనాడులో తంజావూరుజిల్లా తిరువయ్యారు గ్రామంలో త్యాగరాజ స్వామి సమాధివద్ద జరిగే ఆరాధనోత్సవాలలో త్యాగరాజ పంచరత్నకృతులను వందలాదిగా ప్రఖ్యాత సంగీత విద్వాంసులు బృందగానం చేసే సంప్రదాయం ఉంది. ఏటా శ్రీమతి సుబ్బులక్ష్మి ఆ బృందగానంలో పాల్గొంటారు. బృందగానంలోని వందలాది కంఠస్వరాలలో ఈమె గాత్రం అతిస్పష్టంగా వినిపిస్తుంది. దీనిని బట్టి ఈమె గాత్ర మాధుర్యం విశిష్టత స్పష్టమవుతుంది.

శ్రీమతి సుబ్బులక్ష్మికి ప్రపంచంలోని మహానగరాలలో గానంచేసే మహావకాశాలు లభించాయి. అక్కడ ఈమె గానంచేసి కర్నాటక సంగీతకీర్తి పతాకను, తెలుగు సంస్కృత తమిళ కీర్తనల మహత్త్వ పతాకను ఎగురవేశారు. లండన్‌లో ఈమె 'ఎందరో మహానుభావులు' అనే త్యాగరాజకృతిని గానం చేసినప్పుడు, యావన్మంది పాశ్చాత్యశ్రోతలూ లేచి నిలబడి కరతాళ ధ్వనులతో తమ హర్ష ప్రమోదాలను వెల్లడించారు. ఎడిన్‌బరోలో జరిగిన ప్రపంచోత్సవంలో ఈమె శ్రీ కంచికామకోటి పీఠాధిపతి రచించిన సంస్కృత కీర్తనలను, శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి రచించిన ఆంగ్లగేయాన్ని పాడారు. న్యూయార్క్‌లోని కార్నీజ్

హాలులో గానంచేసే ఘనత ఈమెకు దక్కింది. ఐక్యరాజ్యసమితి ప్రశంసల నందుకొన్నారు. కంచికామకోటి పీఠాధిపతి శివరాత్రి పూజా సమయంలో భక్తి కీర్తనలుపాడే సదవకాశం ఈమెకే లభించింది.

ఈమె శ్రావ్యకంఠం, సంగీత వ్యక్తిత్వంతోపాటు హృదయౌదార్యం కూడ చాల గొప్పది. ఈ ఔదార్యంవల్ల ఈమె ప్రపంచ ప్రజల ఆదరం చూర గొన్నారు. తన సంగీత కచ్చేరీలవల్ల, పాటల రికార్డులవల్ల లభించిన లక్షల రూపాయలను వివిధ సంస్థలకు విరాళమిచ్చారు.

1944లోనే ఈమె తన సంగీత కచ్చేరీలతో కస్తూర్బా స్మారకనిధికి విరాళమిచ్చారు. శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం రికార్డులు, విష్ణు సహస్రనామం రికార్డులు మొదలయిన వాటివల్ల వచ్చిన దాదాపు 12 లక్షల రూపాయలను ఈమె రామకృష్ణమఠానికి, భారతీయ విద్యాభవన్‌కు ఆధ్యాత్మిక సాంస్కృతిక సేవల నిమిత్తం దానం చేశారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారు బాలాజీ పంచరత్న మాల అనే పేరుతో తీయించిన అన్నమాచార్య కీర్తనల రికార్డులవల్ల వచ్చే లక్షల ఆదాయాన్ని ధార్మిక సంస్థలకు దానం చేశారు. ఈ బాలాజీ పంచరత్న మాలతో ఈమెకు అపారకీర్తి లభించింది. "ఈ కీర్తనలు అర్ధ శతాబ్దిగా కొనసాగుతున్న శ్రీమతి సుబ్బలక్ష్మి సంగీత జీవితానికి మకుటం" అని భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ అభినందించారు. ఈ విధంగా ఈమె కోట్లకొలది రూపాయలను పెక్కు సంస్థలకు ధార్మిక కళా సాంస్కృతిక సేవలకోసం దానమిచ్చారు. ఈమె చేతిచలవ మంచిది. "సుబ్బలక్ష్మి ప్రార్థనతో ప్రారంభమైన దంతా తప్పక వృద్ధి చెందుతుంది" అని ఒకమారు ప్రధాని శ్రీమతి గాంధీ ప్రశంసించారు.

ఇంతటి మహా సంగీత విదుషికి, ఉదార హృదయకు గౌరవాలు, బిరుదులు లభించడంతో ఆశ్చర్యమేముంది? భారత ప్రభుత్వం ప్రముఖ సంఘ సేవా పరాయణులను బిరుదులతో గౌరవించాలని నిర్ణయించిన తొలి సంవత్సరం 1954 లోనే ఈమెను 'పద్మభూషణ' బిరుదంతో సత్కరించింది. 1956లో కర్ణాటక సంగీతానికిచ్చే రాష్ట్రపతి అవార్డు ఈమెను వరించింది. మద్రాసులో ఉన్న మ్యూజిక్ అకాడెమీ భారతదేశంలోనేగాక సంగీత ప్రపంచంలో ప్రసిద్ధిగాంచిన, కళాసేవకు అంకితమైన సంస్థ. ఈ సంస్థ ఈమెను 1968 లో అధ్యక్షురాలుగా ఎన్నుకొని 'సంగీత కళానిధి' బిరుదంతో సత్కరించింది. ఈ సంస్థకు అధ్యక్షురాలుగా ఎన్నికైన తొలి మహిళ ఈమే. ఆసియా నోబెల్ బహుమతి అనదగిన రామన్ మేగ్‌సేసే బహుమతి ఈమె పొందింది. భారత ప్రభుత్వం 1975లో ఈమెను 'పద్మవిభూషణ' బిరుదంతో గౌరవిం

చింది. తిరుమల తిరుపతి దేవస్థానం, తమిళనాడు ప్రభుత్వం, మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈమెను ఆస్థాన సంగీత విద్వాంసురాలుగా నియమించాయి. ఇవన్నీ ఈమె గాత్ర మాధుర్యానికీ, భక్తి భావస్ఫూర్తి కలిగించే ఈమె గానమకరం దానికీ గుర్తింపుగా వచ్చినవే.

శ్రీమతి సుబ్బులక్ష్మికి ఆంధ్రప్రదేశ్ పైన ప్రత్యేకమైన అభిమానం ఉంది. దానికి కారణం ఈమె ఆరాధ్య దేవుడైన త్యాగరాజస్వామి పూర్వుల జన్మభూమి ఆంధ్రప్రదేశ్ కావడమే.

ప్రతిగాయని, గాయకుడు శ్రీమతి సుబ్బులక్ష్మి నుంచి నేర్చుకోవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి. వాటిలో కొన్ని ఇవి :- శ్రావ్యతను పోషిస్తూ గానం చేయడం; భావం చెడకుండా, భావౌన్నత్యానికి దీప్తి కలిగిస్తూ గానం చేయడం; భక్తిభావంతో పారవశ్యం అనుభవిస్తూ పాడడం; సంప్రదాయపుష్టితో పాటుగా సౌందర్యదృష్టినికూడ జోడించి పాడడం. ఇంకా దానగుణం, సత్ప్రవర్తన ఇటువంటివన్నీ ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరంలేదు.

శ్రావ్యమైన గాత్రం ఉండగానే సరికాదు; ఆ గాత్రాన్ని శ్రద్ధగా కాపాడుకుంటూ రావాలి. ఏమాత్రం అశ్రద్ధ చేసినా, లేక దురభ్యాసాలకులోనయినా, లేక అహార విహారాలలో కాలనియమం మొదలయిన జాగ్రత్తలు పాటించకపోయినా గాత్రంలో సౌష్ఠవం దెబ్బతింటుంది. శ్రీమతి సుబ్బులక్ష్మి క్రమబద్ధమైన నియమాలతో తమ గాత్ర మాధుర్యాన్ని పోషించుకొంటూ, నిలబెట్టుకొంటూ వచ్చారు. ఈమె గాత్రంలో ఇప్పటికీ వన్నె తరగని మాధుర్యం నిలిచి ఉంది. ఇవి ముఖ్యంగా సంగీతజ్ఞులు పాటించవలసిన జాగ్రత్తలు.

శ్రీమతి సుబ్బులక్ష్మి జీవితం నుంచి సామాన్యజనులు నేర్చుకోవలసినవీ చాల ఉన్నాయి. నియమబద్ధమైన జీవితం, తమ అర్హతలతో, ప్రవర్తనతో, ప్రజలకు నిరంతర సేవ, ఉదారత, అధికారులకు, ప్రలోభాలకు లోనుకాక స్థిరమైన లక్ష్యంతో కళాసేవ, స్వయంకృషి, భక్తితత్పరత, ఆస్తికత - ఇవన్నీ సామాన్య ప్రజలకు ఆదర్శం కావాలి. భక్తి - ఆస్తికతకు, దైవప్రాప్తికి ప్రథమ సోపానం.

"మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద" 'ఎక్కడ నా భక్తులు గానం చేస్తారో అక్కడ నేను ఉంటాను' అని కృష్ణభగవానుడు నారదునితో అన్నాడు.

దైవప్రసాదంగా లభించిన సంగీతం ద్వారా అనన్య సామాన్యమైన సమాజసేవ చేసిన, చేస్తున్న ధన్యజీవి శ్రీమతి సుబ్బులక్ష్మి. ఇంత గొప్ప సమాజసేవ చేసిన సంగీత విద్వాంసులు ప్రస్తుత సమాజంలో మరెవరూలేరని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఇలాగే ఇంకా ఎన్నో సంవత్సరాలు సమాజసేవ చేయగలిగే అవకాశం భగవంతుడు శ్రీమతి సుబ్బులక్ష్మికి ప్రసాదించాలని మనఃపూర్వకంగా అందరం కోరుకొందాం.

# తెలుగు సాహిత్యపు వెలుగు
# విశ్వనాథ సత్యనారాయణ

"కొందరికి నేను కవిని కాను. పండితుడనట. ఆ లెక్కలో నేను రెండునూ కాను. నేను పండితుడను కానని నాకు తెలియును; కవిని కానని వారికి తెలియును. వెరసి సున్నకు సున్న; హళ్ళికి హళ్ళి" అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణ రెండు దశాబ్దాల క్రితం "నేను-నా రచన" అనే వ్యాసంలో కంఠోక్తిగా, కాదుకాదు హస్తోక్తిగా వ్రాసినా, నాకు మాత్రం ఆయన మహాకవీ, మహాపండితుడూను; నాకేకాదు సహృదయులైన ఎవరికైనా ఆయన ఆ రెండు రూపాలలో సాక్షాత్కరిస్తారు.

విశ్వనాథవారు పట్టిసాధించని సాహిత్య ప్రక్రియ అంటూ లేదు. మెట్టి చూడని సారస్వతమంటూ లేదు. వారిని తలచుకొన్నప్పుడల్లా హంపీ విరూపాక్షాలయ గోపురం, దానికి అనతి దూరంలోని పంపాసరోవరం, మహాబలిపురంలోని దీపస్తంభం, దాని పక్కనే దొర్లాడే తరంగహస్త నిస్తులమైన మహాసాగరం, వింధ్యాటవీ మధ్య మణిచిత్ర కూటం, దానిపక్కనే పారే గద్గద నదద్గోదావరీ పూరం, వేయిమైళ్ళ వేగంతో వీచే ఝంఝూ మారుతం, దానిని అనుసరించి వచ్చే అకాల జలధర ధారాసంపాతం, అభ్రంకష శిఖర రాజి విరాజమాన హిమవన్నగం, అగాధాగాధమై తిమితిమింగిలాకులమైన పసిఫిక్ మహాసాగరం స్ఫురిస్తాయి.

రెండుదశాబ్దాలనాటిమాట. కాశీ విశ్వవిద్యాలయం పార్లమెంటు హాలు కిటకిటలాడుతున్నది. హాలు వసారా చుట్టూ కూడా జనం గజిబిజిగా ఇరుక్కుపోయి ఉన్నారు. వేదిక ముందు వరుసలో విశ్వవిద్యాలయోపాధ్యక్షులు ఆచార్య నరేంద్రదేవ్, విశ్వవిద్యాలయ ప్రాచార్యులు, పురప్రముఖులు ఆసీనులై ఉన్నారు. వేదిక నుంచి విశ్వనాథవారు -

"గోదావరీ పావనోదారవాః పూర  
మఖిల భారతము మాదన్ననాడు,  
తుంగభద్రా సముత్తుంగ రావముతోడ  
కవుల గానము శ్రుతిగలుపునాడు"

అని మేఘ గంభీర నిర్ఘోషంతో పద్యం పఠించగానే కలకలం చప్పున చల్లారింది. అందరూ చెవులు దోరపెట్టుకొని వినసాగినారు. శ్రోతలలో తెలుగు తెలియని హిందీ, బెంగాలీవారే పెక్కుమంది. వారిని ఏదో రసధుని ముంచెత్తింది. వేదిక నుంచి మరికొంత సేపటికి -

"పరసుఖ దశా పరీపా
క రామణీయక మెరుంగు కచసాన్నిధ్యా
త్త రమణ ప్రథమ స్పర్శ
ప్రరూఢి మెడవాలిచె సూత్రబంధన వేళన్."

అని సీతా వివాహ ఘట్టమూ, చివరన

"అమరీ కైశిక పారిజాత కుసుమో
హాస్వాదు నీ బాలకాం
డము నీ భక్తుడు శోభనాద్రి దగు సం
తానంబు జన్మాద్యపా
యము తప్పించుత! ......."

అని మంగళ పద్యం వినిపించాయి.

పదినిమిషాలయినా కరతాళధ్వనుల కోలాహలం ఆగలేదు. తర్వాత ఆచార్య నరేంద్రదేవ్ లేచి, వేదిక నధిరోహించి, విశ్వనాథవారిని గాఢాలింగనం చేసుకొని, "ఈ గమకం, సంస్కృత వృత్తాలగతి, శయ్య దేశంలోనే అపూర్వం. సంస్కృతాంధ్రాలు ఇంతగా సహజీవనం చేస్తాయని మాకు తెలియదు. ఇలాటి కవి దేశంలో ఉన్నారని కూడ మేము ఎరుగం. హిందీలో రీతి సంప్రదాయమనే విశిష్ట విధానానికి ప్రవర్తకులు తెలుగువారు. ఈ కవి రచనారీతి భారతదేశంలో విశిష్టమయింది. దీనిని ఆంధ్రరీతి అని కాని, విశ్వనాథరీతి అని కాని అందాము" అని అంటూ వుండగా జయజయ నినాదాలతో మరొకమారు సభాంగణం ప్రతిధ్వనితమైంది. ఆచార్య నరేంద్రదేవ్ విశ్వనాథవారికి దుశ్శాలువలు కప్పి, తులసీ రామాయణం, అవధీ వ్యాకరణం, నిఘంటువు మొదలయినవి బహూకరించారు.

పరరాష్ట్రంలో తెలుగువానికి, వెలుగువాణికి జరిగిన ఆ మహాగౌరవం తలచుకుంటేనే ఒళ్ళు కడిమి చెట్టవుతుంది.

విశ్వనాథవారు ఇంతటివారు కావడానికి నిదానం - మూలకారణం స్వయం కృషి, పట్టుదలానూ. ఈ గుణాలు ఏర్పడడానికి మూలహేతువు వారు తలయెత్తే నాటికే పిత్రార్జితం తుడిచి పెట్టుకొని పోవడం.

విశ్వనాథవారు జన్మించింది నందమూరులో 1895 సెప్టెంబర్ 10వ

తేదీన - అంటే 19వ శతాబ్దం చివరన. తండ్రిగారు శ్రీ శోభనాద్రి, తల్లిగారు పార్వతీదేవి. శోభనాద్రి, నందంజిల్లర యకరాల పెద్ద భూస్వామి, కాని విశ్వనాథవారు తలయెత్తేనాటికి అదంతా స్వాహా అయిపోయింది. విశ్వనాథ విద్యాభ్యాసం బందరు హైస్కూలులోను, నోబుల్ కాలేజీలోను సాగింది. హిందూ హైస్కూలు ఆవరణలోని కానుగచెట్టెక్కి, కూర్చొని ముచ్చట ముడి సవరించు కుంటూ "శృంగార వీథి" పద్యాలు చెప్పారు. మొదట్లో శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారితో కలిసి పద్యాలు చెబుదామని వుండేది కాని, అది పడలేదు. తిరుపతి వేంకటకవుల అంతేవాసులై కవితాయోగం సాధించారు.

వారు జీవితంకోసం నేషనల్ కాలేజి, హిందూ కాలేజి, ఎ. సి. కాలేజీలలో కొంతకాలం, విజయవాడ కళాశాలలో రెండుదశాబ్దాలు ఆంధ్ర భాషాచార్యులుగా గడిపినా, కరీంనగర్ కళాశాల ప్రిన్సిపాలుగా వున్నా, సాహిత్య అకాడెమీ ఉపాధ్యక్షులుగా వున్నా, శాసనమండలి సభ్యులుగా వున్నా, ఆస్థానకవిగా వున్నా ప్రధాన వ్యాసంగం రచన. లేడికి లేచిందేవేళ అన్నట్టుగా వారు వెళ్ళిందే కాలేజీ వేళగా గడిచాయి ఉద్యోగాలన్నీ. వారి తొలి కవిత గిరికుమారుని ప్రణయ గీతాలని ఆయనే నాతో అన్నారు. కాని ఆంధ్ర పౌరుషమని (1917) కొందరన్నారు. ఇది విద్యార్థిదశలో వ్రాసింది గనుక దానిని ఆయన అంతగా చెప్పుకో లేదేమో! ముద్రితమైన మొదటి నవల ఏకవీర. 1917 నుండి ఆయన పుంఖాను పుంఖంగా వేయిపడగలు, చెలియలికట్ట, బద్దెనసేనాని, సముద్రపుదిబ్బ మొదలయిన నవలలు, ఆంధ్రప్రశస్తి, ఋతుసంహారం, విశ్వనాథ మధ్యాక్కరలు రామాయణ కల్పవృక్షం వంటి కావ్యాలు, నర్తనశాల, అనార్కలి, వేనరాజు, త్రిశూలం మున్నగు నాటకాలు, పురాణవైర గ్రంథమాలపేర ఎన్నో నవలలు వ్రాశారు. కిన్నెరసాని పాటలు మున్నగు గేయరచనలు, మాకళిదుర్గంలో కుక్క మున్నగు కథలు, అవసర నైవేద్యంగా చెప్పిన కవితలు అసంఖ్యాకాలు. వివిధ విషయాలపై చెప్పిన ప్రసంగాలు, వ్రాసిన వ్యాసాలు, సహస్రాదికాలు. వారు గొప్ప వాగ్మిశేఖరులు. లేఖ ప్రక్రియ కూడా విశిష్టమైందే. అది సమకాలిక వాఙ్మయగతి పరిజ్ఞానానికి చాలా సహాయకారి.

వారి రచనలను లెక్కగడితే పెద్ద పట్టియే అవుతుంది. 25 కావ్యాలు, 15 నాటకాలు, 88 నవలలు, చిన్నకథలు, 9 విమర్శ గ్రంథాలు, 187 ఖండికలు, 66 తెలుగువ్యాసాలు, 7 ఆంగ్లవ్యాసాలు, 44 రేడియో నాటికలు, 35 రేడియో ప్రసంగాలు, 8 సంస్కృత రచనలు, 3 అనువాదాలు, 100

"విశదంబైన ప్రకాశభావమెసగన్
విచ్చె నె నేకాదశీ
శశిబింబాంధ్ర నవాంశుపుల్ జలధర
చ్ఛాయా నిరాసక్రియా
కుశలంబుల్ నిశియెల్లనుం బగటి
వెల్గుల్ గాగ నాశాధ్వనీ
న శరత్కాళ సుమాభిమంజరులు
మింటం దోరణాల్గట్టగన్"

అని వారు శరత్కాలాన్ని వర్ణించినట్టు వారికీర్తి కౌముది ఆంధ్రప్రదేశ్ సాహిత్య ప్రపంచంలో నిరంతరం వెలుగులు వెలార్చుతున్నది.

(ఆంధ్రభూమి – 19-10-76)

# పెక్కుయుగాల కన్నుపుహాత

"నానృషిః కురుతే కావ్యమ్" అన్న అభియుక్తోక్తి కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ ఎడల అక్షరాలా అన్వయిస్తుంది: ఆయనొక కవితాఋషి; రచనాయోగి. ఋషికి, యోగికి ఉండే లక్షణాలన్నీ సంపూర్ణంగా ఆయనలో ఉన్నాయి. క్రాంతదర్శిత, విశ్వాజనీనత, లోకకల్యాణ కాంక్షిత, సాధననిది ధ్యాసనం ఆయనలో, ఆయన రచనలలో వేయిపడగలతో విప్పారి ఉంటాయి. మనిషిగా పెరగనిదే రచనా పెరగదనడం సహృదయ హృదయైకవేద్యం. విశ్వనాథ యోగి, ఋషితుల్యుడన్నప్పుడు మనిషిగా పెరిగాడనడం చర్విత చర్వణమే అవుతుంది. ఆయన వైయక్తిక జీవితంలోను, సారస్వత జీవితంలోను ప్రాచీన సంప్రదాయానుసారే అయినా, ఆ అనుసరణ ఆయన నిండు హృదయానికి, మానవతకు ఎన్నడూ అడ్డురాలేదు. కులమత విభేదాలు కాలరాచి సాయపడిన ఘట్టాలు కోకొల్లలు.

ప్రాచీన సంప్రదాయం అన్నప్పుడు ఒక సంగతి పరిశీలనార్హం. నిజానికి పాతకొత్తలు ఒక నాణెం రెండు పార్శ్వాలే, ఒకొక సందర్భంలో ఏది పాతో,

పీఠికలు ఉన్నాయి. హిందీ తమిళాంగ్ల మహారాష్ట్ర భాషలలో వీరి పెక్కు రచనలు అనూదితమయాయి. ఇటీవలే వేయిపడగలు మరాఠీ అనువాదం వెలువడింది.

విశ్వనాథపై జరిగినంత విమర్శ తెలుగు సాహిత్యంలో ఎవరిమీదా జరుగ లేదు. దాదాపు 300 వ్యాసాలు, పది విమర్శ గ్రంథాలు, 10 అభినందన సంచికలు వెలువడ్డాయి.

విశ్వనాథవారి పాత్రలు కొంత వేషం మార్చుకొని తిరిగే లోకంలోని మానవులే. వారి రచనలో శాశ్వత లక్ష్యమేకాక నమసామయికోద్యమాల ప్రభావం గలవీ చాల ఉన్నాయి.

వారి రచనా విధానం విచిత్రాది విచిత్రం. బల్లా అవీ ఏమీ ఉండవు. పద్యాలయితే వందకుపైగా తలలోనే వ్రాసుకొని, తర్వాత స్వయంగా కాయితంపై పెట్టేవారు; వచనమయితే వారు చెప్పగా ఇతరులు వ్రాసుకోవలసిందే. ఏ నవల రచనా నాలుగు నాళ్ళకు మించలేదట.

"మీ రచనలలో ఏది నిలుస్తుంది? అనడిగాను." ప్రతిదీ నిలుస్తుందని అనే వారున్నారు. కాని వారు "తన ప్రతికావ్యం ప్రతివాడు గొప్పదంటాడు. నేను ఒక్కొక్క దానిలో ఒక్కొక్క శిల్పం చూపాను. కాని మన ప్రమాణాలు నిలుస్తాయా? ఎంతో పోయె, దేవాలయాలే కూలిపోయె" అన్నారు.

అయినా అన్నిటికన్నా మీ మధ్యాక్కరలు శిల్ప వైలక్షణ్యంతోను, భావనా సౌకుమార్యంతోను, దేశిచ్ఛందో విశేషంవల్లను శాశ్వతంగా ఉంటుం దండీ" అన్నాను. వారు దానికి ఒప్పలేదు. "రామాయణ కల్పవృక్షాన్ని మించిన నా కవిత్వం వుండదు. సర్వశక్తులూ పెట్టి వ్రాశాను. పరమేశ్వరుడు అనుగ్ర హించాడు. నారాయణుడే పరమేశ్వరుడు" అని అన్నారు. వారిమాటే నిజ మయింది. దీనికే 1971లో జ్ఞానపీఠ్ బహుజాతి లక్షరూపాయలు లభించింది. కేంద్ర ప్రభుత్వం వీరిని పద్మభూషణ బిరుదుతో గౌరవించింది.

పుటలతో కొలిస్తే వారి రచన రెండు లక్షల పుటలు. వారు ఏ సిద్ధాంతం చెప్పినా ఏమి వ్రాసినా, వారి రచనకున్న ప్రాచుర్యం మనదేశంలో మరే కవితకూ లేదు. ఇటీవలే వారికి సహస్ర మాసోత్సవం జరిగింది.

వేయిపడగల పాపరేడూ, చెలియలి కట్టలేని పసిఫిక్ సాథోనిధీ, మూడడు గులతో నేలనుకొలిచినట్టు పురాణాలు ప్రస్తుతించే త్రివిక్రముడూ ఒక్క రూపంలో తెలుగు సాహిత్య లోకంలో అవతరించినట్టు నాకు సాక్షాత్కరించే విశ్వనాథవారు నిన్న (18-10-1976) పగలు 11-10 నిమిషాలకు అస్తమించారు. ఆంధ్ర ప్రశస్తిలో

ఏది కొత్తో వింగడించడం పట్టు కత్తిరించినట్టుగా గిరిగీయడం సాధ్యంకాదన్నది చారిత్రక సత్యం. పాత కొత్తవేషంతో ముందుకు రావడం, కొత్త పాత ముసుగుతో మరుగునపడడం చరిత్రగతి. దీనిలో విచిత్రంగా పాత కొత్తల మేళవింపు జరిగినా, రెండింటి వ్యక్తిత్వమూ కానరావడమూ కద్దు.

విశ్వనాథ ప్రాతను పట్టుకొని ప్రాకులాడారనడం పలువురిమాట. కొత్త వింత పాతరోత అన్నది సామాన్య ప్రజల స్వభావం. కాని, స్థితప్రజ్ఞుడైన విశ్వనాథ ప్రాత విశ్వకల్యాణ సంధాయకమని నమ్మినవారు కనుక, దానిని ఉభయ జీవితాలలోను వదలలేదు. ఆ వదలకపోవడం, ఆయననొక విశిష్ట వ్యక్తిగా, అపార సాహిత్య పారావార స్రష్టగా తీర్చిందనిపిస్తుంది. పాండురంగ సుకవి అందరి ఒడుపులతో పద్యం చెప్ప నేర్తునన్నాడు. చెప్పాడో లేదో కాని, నన్నయభట్టారకుని ప్రసన్న కథా కలితార్థయుక్తి, తిక్కనార్యుని నుడికారం, శ్రీనాథుని పదగుంభన, అల్లసాని అల్లిక జిగిబిగి, కృష్ణరాయల కాఠిన్యం - ఇవన్నీ విశ్వనాథ రచనలో విశ్వరూపంతో సాక్షాత్కరిస్తాయి; సాక్షాత్కరించి విశ్వనాథరీతిగా ఏకరూపం చెందాయి. కాటూరి వేంకటేశ్వరరావు "నేనొక్కటి మనలో మాట వచింతు సూరనయొ సోమన్నో, మరే పెద్దనోయని చెప్పం బనియేమి నీవగుదు నీకేసాటి ముమ్మాటికిన్" అన్నట్టు ఆయనకు ఆయనే సాటి. "పాషాణపాక ప్రభూ!" అని వెక్కిరించినవారూ ఉన్నారు. కాని, ఆయన వెక్కిరింపులకు, కొక్కిరింవులకు చిక్కి వెనక్కు తక్కినవాడు కాడు. తానను కొన్న అభ్యుదయ మార్గంలో నల్లేరుపై బండిగా నడిచాడు.

అభ్యుదయం - అన్నమాట విషయంలోను ఆయన నిర్వచనం వేరు. కొందరు రాజకీయవాదులు కూడబలుక్కుని ప్రచారం చేసేదే అభ్యుదయమా? ఎందుకు కావాలి? మన పూర్వులు ఆశించిన, అలపించిన అభ్యుదయం వేరని, సర్వజనీనమని ఆయన విశ్వాసం. బీభత్స ప్రక్రియలతో సాధించే అభ్యుదయం నిజానికి అభ్యుదయంకాదని, సార్వత్రికానంద సంధాయకమే అభ్యుదయమని నమ్మేవారిలో ఆయన ఒకరు కనుక ఆయన సాహిత్య ప్రక్రియలన్నిటిలోను రసానందాభ్యుదయమే తొణికిసిలాడుతుంది. "స్వస్తి ప్రజాభ్యః" అన్నది ఆయన రచనా యోగానికి కుండలిని, కనుకనే ఆయన వైయక్తిక సారస్వత భావాలు ఎంత విడ్డూరంగా వున్నా, వికటంగా కనిపించని రసనిష్యందులు కావడంవల్ల సహజంగా సహృదయులను ఆకట్టుకొంటున్నాయి; ఆయన యశశ్చంద్రికలను విస్తరింపజేస్తున్నాయి. సహృదయ హృదయావర్జనకు మరొక కారణమ్మూ ఉంది. అది ఆయన పాత్రలు. విశ్వనాథ భవిష్యత్తులో

చూపు పెట్టి భూతంలోకి అడుగువేస్తాడనీ ఎంత విమర్శ ఉన్నా, ఆయన పాత్రలు కొంత వేషం మార్చుకొని లోకంలో తిరిగే వర్తమాన మానవులే. అందువల్లనే ఆయన చారిత్రక నవలలు కూడా జనరంజకమయ్యాయి. పెక్కు నవలలలో, కావ్యాలలో, చివరకు రామాయణంలోను సమకాలికోద్యమాల ప్రభావం పడక పోలేదు. సమకాలిక ప్రతిభా ప్రజ్వలనానికి గత వైభవ పునశ్చరణ తప్పదన్నది చరిత్ర సత్యం; ఏ దేశాభ్యుత్థానచరిత్ర చూచినా ఇది నిత్యం. గత వైభవ ప్రశస్తి కొందరికి వెర్రిగా, ఆవేశంగా కనిపించవచ్చు. ఆ శివమెత్తిన ఆవేశం లేనిదే కార్యోత్సాహం జనించదు. విశ్వనాథ పెక్కు రచనలు ప్రజోద్యమాలలో ఈ ఉత్సాహ ప్రవాహాలను పారించాయి.

ఆయన బాహ్య ప్రవర్తనను పరికించినవారు ఆయనను అహంకారిగా భావించారు. అహంకారానికీ, ఆత్మాభిమానానికీ వ్యత్యాసం తెలియనివారి భావన ఇది. అహంకారం ఆత్మవిధ్వంసనచణం. ఆత్మాభిమానం ఆత్మోన్నత్య సంధాయకం. దాదాపు రెండు లక్షల పుటలు వ్రాసిన రచయిత, కవి సమ్రాట్, కళా ప్రపూర్ణ, పద్మభూషణాద్యనేక బిరుద విరాజితుడు, ఆస్థానకవి, తాను నమ్మిన దానిని తన్మయతతో ఆరాధించేవాడు, ఏ ప్రలోభానికీ, అధికారానికీ తలఒగ్గనివాడు, అనేకానేక సాహిత్యాలను పుక్కిటబట్టినవాడు ఏ ధోరణిలో మాట్లాడుతాడు? వ్యాసునివలె, వాల్మీకి వలె, షేక్స్పియర్ వలె, ఆనందవర్ధనుని వలె, అభినవ గుప్తునివలె, క్షేమేంద్రుని వలె మాట్లాడడా? తెలుగు రచయితను కాదు యావత్ప్రపంచ రచయితలను తల ఎత్తుకొనేట్టు చేసే ఆత్మగౌరవ పరాకాష్ఠ విశ్వనాథ. దీనితోనే ఆయన తన రామాయణాన్ని "అమరీ కైశిక పారిజాత కుసుమోహస్వాదువు" అని చెప్పుకొన్నాడు.

విశ్వనాథ పదునాలుగవ ఏటే కవిగా అవతరించాడు. మహా కవిగా, మహా రచయితగా మనినాడు. సాహిత్య జగత్తులో సకల ప్రక్రియలలోను అంచులు చూచాడు. కొన ఊపిరివరకు కవితా గోష్ఠులతో ఆనందించి మొన్న సోమవారం శాశ్వతంగా కన్ను మూశాడు. ఆ కన్నుమూతతో పెక్కు యుగాలు కన్ను మూశాయనవచ్చు.

"బాణోచ్ఛిష్టమిదం జగత్" అనేది సంస్కృతాభాణకం. తర్వాతి సంస్కృత కవులు బాణుని అనుసరించడం వల్ల ఇది ఏర్పడింది. తెలుగు సాహిత్యంలో నేటి పెక్కు ప్రక్రియలు విశ్వనాథానుసరణలు. కనుక "విశ్వనాథోచ్ఛిష్టమిదం జగత్" అని ఘంటాపథంగా చెప్పవచ్చు.

(ఆంధ్రభూమి సంపాదకీయం – 20–10–1976)

# విద్యార్థినేత శ్రీ పి. శ్రీనివాసన్

మొన్నటి సాధారణ ఎన్నికలలో కులతత్త్వం బాగా పనిచేసిందనే ప్రథ దేశంలో ఏర్పడింది. కాంగ్రెసులోను ఈ కులతత్త్వం వుందని అనేవారు చాల మంది వున్నారు. కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ కామరాజనాడార్ పోటీచేసిన విరుదు నగర్ శాసనసభ నియోజకవర్గంలోను ఈ ప్రతిబంధకం తప్పలేదంటారు.

విరుదునగర్ నియోజకవర్గం మద్రాసు రాష్ట్రంలో రామనాథపురం జిల్లాలో వుంది. ఇది శ్రీ కామరాజ స్వస్థలం కూడా. ఆయన ఈ ప్రాంతంనుంచే ఇది వరకు ఎన్నికవుతూ వచ్చారు. ఆయన ఇదివరకు ఎన్నడూ ఎన్నికలలో వోడి పోయిందిలేదు. ఈ నియోజకవర్గం కొత్తదయినా ఆయన ఆ ప్రాంతవారే గనుక నల్లేరుమీద బండిగా గెలుస్తారని అందరూ అనుకున్నారు. కాని, అలా జరుగలేదు. ఆయన ఒక విద్యార్థి నాయకునితో వోడింపబడినారు. వోట్ల తేడా అట్టే లేదు. కాని అపజయం మాత్రం తప్పలేదు. ఈ ఎన్నికలలో కులతత్త్వం పనిచేసిందని వాదించేవారు చెప్పే ఉపపత్తి ఇలా వుంది.

ఈ నియోజకవర్గంలో మొత్తం వోటర్ల సంఖ్య 86,606. పోలయిన వోట్లు 66,593. ఎన్నికలలో గెలిచిన డి.ఎం.కె అభ్యర్థి శ్రీ పి. శ్రీనివాసన్‌కు వచ్చిన వోట్లు 33,421. శ్రీ కామరాజుకు వచ్చిన వోట్లు 32,136. పోటీచేసిన మరి యిద్దరు అభ్యర్థులలో శ్రీ పళనిస్వామినాడారుకు 579 వోట్లు. శ్రీ పెరియ కప్పు అనేవారికి 838 వోట్లు వచ్చాయి. ఒక్క విరుదునగర్ పట్టణంలోనే 20 వేల నాడార్ వోట్లున్నాయట. ఈ నియోజకవర్గం మొత్తంలో 20 వేల కమ్మ వారి, రెడ్ల వోట్లున్నాయట. తెలుగుగౌడారివారివి కొన్నివేల వోట్లు. తక్కిన కులాల వారికి, నాడార్ తెగకు స్పర్ధలున్నవట.

డి. ఎం. కె. అభ్యర్థి శ్రీ పి. శ్రీనివాసన్ తెలుగువారు. ఆయన కుటుంబం వారు, బంధువులు స్థానికంగా పలుకుబడికలవారు. తెలుగు అభిమానం, నాడార్లకు ఇతర తెగలకుగల స్పర్ధలు శ్రీ కామరాజ నాడార్ పరాజయానికి దోహద మయాయని ఎన్నికల ఫలితాలను పరిశీలించినవారు అంటున్నారు.

కాని, గెలిచిన డి. ఎం. కె. అభ్యర్థి శ్రీ పి. శ్రీనివాసన్ మాత్రం అలా

అనడంలేదు. తమిళనాడులో పాదుకున్న హిందీ వ్యతిరేకత, విద్యార్థుల కృషి, ప్రచారం, తన విజయానికి ప్రధాన కారణాలని, ఆహార సమస్య, కాంగ్రెస్‌పై వైరస్యం, కాంగ్రెస్ హయాములో ఆ ప్రాంతం వెనుకబడి వుండడం తక్కిన కారణాలని ఆయన అంటున్నారు.

శ్రీ శ్రీనివాసన్ ఉత్సాహం పొంగిపొర్లే యువకుడు. కోలముఖం, కాయ వాటు శరీరం. ఐదడుగుల ఎనిమిది అంగుళాల ఎత్తు. ప్రతి మాట ముద్దకట్టిన విశ్వాసంతో, డి. ఎం. కె. సిద్ధాంత బలంతో మాట్లాడుతారు. వయస్సు 28 సంవత్సరాలు.

ఈయన పూర్వులు కృష్ణదేవరాయల కాలంలో దక్షిణాదికి వలసవెళ్ళిన కమ్మవారు. సోమనాథ గోత్రంవారు. జన్మస్థలం రామనాథపురం జిల్లా అయ్యప్ప నాయకన్‌పట్టి గ్రామం. ఇది ఆముక్తమాల్యద జన్మించిన శ్రీవిల్లిపుత్తూరు క్షేత్రం పక్క గ్రామం. తండ్రిగారి పేరు పెరుమాళ్ళ నాయుడుగారు. గ్రామ మునసబు. ఈయన బియ్యం వ్యాపారం సందర్భంగా నాల్గయిదుసార్లు, రంగూన్‌కు, బర్మాలోని ఇతర పట్టణాలకు వెళ్ళి వచ్చారు. తల్లిగారు శ్రీరంగమ్మగారు. శ్రీనివాసన్ కడగొట్టు సంతానం. నలుగురు అక్కగార్లున్నారు. పెద్ద అక్కగారు సేలం జిల్లా కృష్ణగిరిలో ట్రెయినింగ్ స్కూలు ప్రధానోపాధ్యాయిని. తమిళనాడు కాంగ్రెస్ సంఘం అధ్యక్షుడు శ్రీ టి. ఎన్. కృష్ణస్వామి నాయుడు ఈ ప్రాంతం వారే; శ్రీనివాసన్‌కు పినతండ్రి వరుసవారు. స్వతంత్ర పార్టీ ప్రముఖుడు శ్రీ రామస్వామి నాయుడుగారూ ఈయనకు పినతండ్రి వరుసదగ్గరిచుట్టం.

శ్రీ శ్రీనివాసన్ శ్రీవిల్లిపుత్తూరు హైస్కూలులో చదువు పూర్తిచేసిన తర్వాత మధురై అమెరికన్ కళాశాలలో ఇంటరు, పచ్చయప్ప కళాశాలలో బి. ఎ., ఎం. ఎ. పూర్తిచేసి, మద్రాసు న్యాయ కళాశాలలో చేరి, 1966 ఏప్రిల్‌లో బి. ఎల్. పూర్తిచేసి పట్టం పుచ్చుకున్నారు. ఎం. ఎ. లో ఈయన ప్రత్యేక విషయం తమిళ సాహిత్యం. నాటకాలు, కథలు అంటే ఈయనకు చాల అభిరుచి. తమిళులో కథలూ వ్రాస్తారు.

విద్యార్థి దశనుంచే హిందీ ప్రతికూలోద్యమంలోనూ, ద్రావిడ మున్నేట్ర కళగం ద్రావిడనాడు ఉద్యమంలోను ఈయనకు ఆసక్తి కలిగింది. మధురై అమెరికన్ మిషన్ కళాశాలలో చదువుతున్నప్పుడే విద్యార్థి ఉద్యమంలో పాల్గొన్నారు. "ఒకసారి ఆగస్టు 15 ఆదివారంనాడు వచ్చింది. ఆరోజు హాస్టలులోని విద్యార్థులందరూ ఉత్సవం జరుపుకుందామనుకున్నారు. కాని హాస్టల్ వార్డెన్ పాదరీ ఆదివారం నాడు ఏ పనీ చేయరాదని అడ్డుతగిలి, ఉత్సవాన్ని

16 వ తేదీకి మార్చుకోమన్నారు. "ఆదివారాన్నే సోమవారానికి మార్చుకోరాదూ?—అని నేను ఆయనను అడిగాను. ఆయన కోప్పడ్డారు. దానికి విద్యార్థులు రెచ్చిపోయి ఆయనను కొట్టబోతే, నేను ఆయనను ఎత్తుకొని వారినుంచి తప్పించాను. కాని ఆయన నేనే నేరస్తుణ్నాయనట్టు ఫిర్యాదు చేయడంవల్ల ఆ సంవత్సరం సెలక్షన్ పరీక్షలో నన్ను కూర్చోనివ్వలేదు. కళాశాల నుంచి తొలగించారు. అందువల్ల నేను ఇంటర్‌లో మూడుసార్లు దండయాత్ర చేయవలసి వచ్చింది." అని శ్రీ శ్రీనివాసన్ అన్నారు.

ఈయన 1962 లో ధరల పెరుగుదల ప్రతికూలోద్యమ్యంలో జెయిలుకు వెళ్లారు. 1965 లో హిందీ వ్యతిరేకోద్యమంలో ప్రివెంటివ్ డిటెక్షన్ చట్టంకింద చాలసార్లు నిర్భంధంలోను వున్నారు. ఈయనకు హిందీభాషా వ్యతిరేకత విపరీతం. "హిందీ, భారత్ అవినాభావ సంబంధం కలవి కావు. హిందీతోపాటు భారతదేశం తమిళులకు అక్కరలేదు. హిందీ భారత సమైక్యానికి పెనుభూతం. మేము విడిగానైనా వుంటాముగాని హిందీని ఒప్పుకుని భారత్‌లో వుండము" అని ఆయన నొక్కి చెప్పారు.

"అదేమిటి? మీరు హిందీ కోసం భారతదేశం నుంచి విడిపోతారా? విడిపోయి మనడం సాధ్యమా?" అని ప్రశ్నిస్తే ఆయన సమాధానమిది.

యూరోప్‌లో వాటికన్ సిటీ లాంటి చిన్న చిన్న దేశాలు లేవా? విడిగా ఎందుకు వుండరాదు? భాష జాతికన్నా గొప్పది. జాతిని తయారు చేయవచ్చు. భాషను తయారు చేయలేము. దేశం, జాతి బానిసలైతే ఎప్పటికన్నా స్వతంత్రం కాగలవు కాని, భాష ఒక్కసారి బానిసయితే కోలుకోడం కష్టం. మాకు తమిళ భాష (నేను తెలుగువాణ్నయినా, తమిళనాడులో వున్నాను గనుక తమిళుడనే. నేను తెలుగు తమిళ భాషలకు భేదం పరిగణించడంలేదు.) జాతికన్నా, ప్రాణంకన్నా, తల్లికన్నా, తండ్రికన్నా, దైవంకన్నా గొప్పది. దానిని హిందీవంటి పరాయి భాషకు బానిసను చేయను.

"గాంధీజీ విద్యార్థులు జాతీయ సమరంలో పాల్గొనాలని ఉపదేశించారు. భాష జాతికన్నా గొప్పది గనుక తమిళభాషా రక్షణోద్యమంలో మేము పాల్గొన్నాము. స్త్రీలు గూడా వేలకువేలు పాల్గొన్నారు."

డి. ఎం. కె. తమిళ భాషాభివృద్ధికి, దాని రక్షణకు పాటుపడుతున్నందున అది తనను ఆకర్షించిందని ఆయన అన్నారు.

ఎన్నికలలో తన విజయానికి హిందీ ప్రతికూలోద్యమం ప్రధాన కారణ

మని, హిందీ ప్రతికూలోద్యమంలో పాల్గొన్న విద్యార్థులు 4000 మంది తనకోసం స్వంత ఖర్చులమీద ప్రచారం చేసిపెట్టారని శ్రీ శ్రీనివాసన్ అన్నారు.

"విరుధునగర్ మునిసిపల్ కౌన్సిల్ చెయిర్మన్ శ్రీ ఎం. ఎస్. సి. రాజా శ్రీ కామరాజును సమర్థించారు. ఈ శ్రీ రాజా తాతగారు శ్రీ సింది కుమారనాడార్, తండ్రి శ్రీ పెరియసామినాడార్ జస్టిస్‌పార్టీ ప్రముఖుడైన శ్రీ బొబ్బి రాజాకు మిత్రులు. శ్రీ ఎం. ఎస్. సి. రాజా కోటీశ్వరుడు. నావైపు విద్యార్థులు చాల ప్రచారం చేశారు. ఇతర రాష్ట్రాల నుండి విద్యార్థి సంఘాలు, కలకత్తా హోటల్ వర్కర్స్ సంఘం వంటి కొన్ని కార్మిక సంఘాలూ నా ఎన్నిక ప్రచారానికి డబ్బు పంపాయి. మా విద్యార్థులు నా నియోజకవర్గంలోని 140 గ్రామాలలోను ఇంటింటికీ తిరిగారు. నిజానికి మా నియోజకవర్గంలో సరైన రోడ్లులేవు. రావణుడు చెరలో పెట్టిన సీతలాగా ఆ గ్రామాల ప్రజలు ప్రపంచానికే వెలిగా ఉన్నారు. విద్యార్థులు ఈ గ్రామాలలో గడపగడపా ఎక్కి దిగారు. ఆహార సమస్య హిందీ వ్యతిరేకతకు తోడయింది.

"విద్యార్థులే నాకు పోలింగ్ ఏజంట్లు. ఎన్నికల సమయంలో ప్రత్యర్థులు గ్రామ ప్రజల పంటలు పాడుచేయకుండా కాపాడినవారూ విద్యార్థులే. వీరే నా నియోజకవర్గంలో ప్రచారం చేసిన తర్వాత శ్రీ భక్తవత్సలం, శ్రీ కక్కన్‌ల నియోజకవర్గాలలో ప్రచారంచేసి వారిని వోడించారు" అని శ్రీనివాసన్ అన్నారు.

"కులతత్త్వం మీ విజయానికి దోహదం చేయలేదా?" అని ప్రశ్నించగా, "హిందీభాషా విద్వేషం, ఆహార సమస్య, గ్రామాలదుస్థితి, ముఖ్యంగా మా నియోజకవర్గంలో అస్పృశ్యులయిన - పళ్ళాన్, పరయా, సెక్కిలి (తెలుగు గొడార్లు) తెగల దుస్థితి, వీటివల్ల కాంగ్రెస్‌పై ఏర్పడిన వైరస్యం, కొత్తతరానికి, పాతతరానికి ఘర్షణ, విద్యార్థుల కృషి నా విజయానికి కారణమనుకుంటాను కులతత్త్వం అంతగా లేదేమో! నాకు ఐదువేలమంది నాడార్లు వోటు చేశారు" అని ఆయన సమాధానమిచ్చారు.

"ఇక డి. ఎం. కె. ప్రభుత్వంలో తమిళుకు పూర్తిగా రక్షణ వుండ గలదు గనుక, హిందీ బలవంతంగా రుద్దడమనేది వుండదు గనుక విద్యార్థులకు సమస్యలేమీ వుండవు" అని శ్రీ శ్రీనివాసన్ నమ్మకం.

పరీక్షలు వుండాలని, పరీక్షలు తెలివితేటలకు, చదువుకు నికషం వంటివనీ ఆయన నమ్మకం.

అక్షరాస్యతలేని వయోజన వోటింగ్ దుర్వినియోగపడుతుంది గనుక అక్షరాస్యతా ప్రచారం, విద్యాప్రచారం అవసరమని ఈయన విశ్వసిస్తున్నారు.

తాను తన నియోజకవర్గంలో రోడ్లు వేయించడానికి, హరిజనుల ఉద్ధరణకు కృషి చేస్తానని ఆయన అన్నారు. హరిజనులకు గృహవసతి కల్పించడం, వారి పిల్లలకు స్కాలర్‌షిప్పులు ఇవ్వడం మంచివే అయినా, వాటివల్ల వారికి అంత ప్రయోజనంలేదని, వ్యవసాయానికి భూములివ్వాలని ఆయన అభిప్రాయం.

"అన్నిటికీ ఇక శ్రీ అణ్ణా వున్నారు. గనుక విద్యార్థులు దేనికీ ఆందోళన చేయనక్కరలేదు. భాష ఆధ్యాత్మికం; ఆత్మ మనోవికాసాలకు అవసరమయింది. ఆహారం శారీరకం; దేహపోషణకు అవసరమైంది. ఈ రెండు ముఖ్యసమస్యలను ఖండితంగా శ్రీ అణ్ణాదురై పరిష్కరిస్తారు గనుక; విద్యార్థులు ఇక రాజకీయాలకు వెలిగా వుండాలి -" ఇది శ్రీనివాసన్ గట్టి నమ్మకం.

శ్రీ శ్రీనివాసన్ భావాలు, లక్ష్యాలు చాల ఉదాత్తంగా ఉన్నాయి. తక్కిన యువశాసన సభ్యుల భావాలూ ఇదేవిధంగా వున్నాయి. వారి ఉత్సాహమూ ఉబికిపోతున్నట్టిదే. కాని, దీనికి అనుభవ పరిపాకం తోడుకావడం అవసరం. అప్పుడుగాని, వాటికి రాణ కలుగదు. మరొక సంగతి. శ్రీ శ్రీనివాసన్ మాటలను బట్టి తమిళనాడు గ్రామసీమలు, పెక్కుతెగలు చాల వెనుకబడి వున్నట్టు కనిపిస్తుంది. శ్రీ శ్రీనివాసన్, ఆయన సహచరులు వారి సముద్ధరణకు పూనుకుంటే, ఒక్క తమిళనాడేకాక యావద్దేశమూ ప్రయోజనం పొందుతుంది.

[తర్వాత నేను విరుదునగర్ వెళ్ళి తెలుసుకొన్న సంగతి ఇది. విరుదునగర్ నియోజకవర్గంలో తెలుగువారు అధిక సంఖ్యాకులు. చిన్ననాడు దేశదిమ్మరిగా తిరుగుతున్న కామరాజనాడార్‌ను శ్రీ శ్రీనివాసన్ తండ్రి పెరుమాళ్ళనాయుడు ఆదరించి పైకి తెచ్చారు. కామరాజనాడార్‌కు బడి చదువేమీలేదు. కాంగ్రెస్ వలంటీరుగాచేరి మాటలు నేర్చాడు. కాని, తెలివితేటలు గలవాడు గనుక నాయకుల అండతో ఎదిగాడు. ముందు వెనకా ఎవరూ లేనివాడు గనుక ప్రతి నాయకుడూ తన ప్రత్యర్థిని లొంగదీసుకొనడానికి ఇతనిని ఉపయోగించుకున్నారు. ఈ విధంగా ఎదిగిన కామరాజును స్థానిక తెలుగువారు తమవల్ల పైకి వచ్చిన వాడే గదా అనే భావంతో తమ వోట్లన్నీవేసి ప్రతి ఎన్నికలోను గెలిపించారు.

కాని, కామరాజనాడార్ ఈ బలుపంతా తనదేనని అహంకరించాడు. భాషా వివాదం వచ్చినప్పుడు తెలుగును తూలనాడాడు. ఇది తెలుగు వారికి కష్టమనిపించింది. వారు అతనితో ఈ విషయమై ప్రస్తావించినప్పుడు, అతడు తనది

పొరపాటునైనా అనలేదు. తెలుగు వారికి పట్టుదల పెరిగింది. ఈసారి ఎలా గెలుస్తాడో చూద్దామని బెదరించారు. ఏదో అన్నారేగాని కక్షతో ప్రవర్తిస్తారా? - అని అనుకున్నాడు నాడార్. అసెంబ్లీ ఎన్నికల్లో గ్రామమునసబు పెరుమాళ్ళ నాయుడే స్వయంగా తన కుమారుణ్ని నిలబెట్టారు, డి. ఎం. కె.పై ఇష్టంలేక పోయినా, నాడార్‌ను ఓడించాలనే దృష్టితో. తెలుగువారివోటు ఒక్కటీ నాడార్‌కు పడకుండా చూచారు. ఫలితం నాడార్ పరాజయం.]

(ఆంధ్రపత్రిక – 12–3–1967)

# తెలుగు చిత్రకళా విస్తరణకు మహోయత్నం: వరదా వెంకటరత్నం

ఎనిమిది నెలల క్రిందట శ్రీ వరదా వేంకటరత్నంగారి దర్శనానికి రాజమహేంద్రవరం వెళ్ళవలసి వచ్చింది. అప్పటికే ఆయన అస్వస్థులుగా ఉన్నారు. అతికష్టంమీద ఆరుమాటలు మాట్లాడారు: "ఆర్ట్ గ్యాలరీకి వెళ్ళండి. అక్కడ అన్నీ చెబుతారు." ఇవి ఆయన పలికిన ఆరు మాటలు. ఎన్నో విషయాలు చర్చించి తెలుసుకుందామని వెళ్ళిన నాకు ఎంతో నిరాశ కలిగింది. దైవోపహతుడిని.

మిత్రులు, అంతేవాసులు ఆయన వ్యాధి నివారణకు చేయదగినదంతా చేశారు. కాని, ఆయన ఎంతో కళా సంపత్తిని, శిష్యసంతతిని వదలి మొన్నటి అక్టోబరు 11వ తేదీన అస్తమించారు. అప్పటికి ఆయన వయస్సు 68 సంవత్సరాలు.

కళలో పుట్టి, కళలో పెరిగి, కళ కేలువట్టి, కళకోసమే జీవించి, కళను స్మరిస్తూ అసువులు బాసి చరితార్థ చరితులైన కళాతపస్వి వరదా వేంకటరత్నంగారు. ఆయన అస్తమయంతో పాతతరం తెలుగు చిత్రకారుల పరంపర అంతరించిందనే అనాలి. ఆయన వరవడిని మాత్రం శిష్యప్రశిష్యులు కొనసాగించ వచ్చుగాక!

కళకోసం అసిధారావ్రతంగా మనుగడ గడిపినవారు వరదావారు. కళాకారులు, ముఖ్యంగా చిత్రకారులు దేనికీ కట్టుబడి ఉండరని లోకంలో ఉన్న అపవాదు. కాని, వరదావారు ఈ అపవాదులకు అపవాదం. ప్రకృతిగతిలాగ ఆయన జీవితం నియమనిగళితం. నిరాడంబరత్వం ఆయన నిష్ఠకు తావి. శిష్యవత్సలత ఆయన సంపూర్ణ జీవితానికే దీప్తి.

వరదావారు విజయనగరం తాలూకా ఆలమందలో జన్మించారు. తండ్రిగారు అక్కడి నుంచి వలసవచ్చి రాజమహేంద్రవరంలో స్థిరపడడంవల్ల వారి జీవితమంతా రాజమహేంద్రవరంలో గడిచింది. చిన్ననాటినుంచే ఆయనకు

రచన, చిత్రరచన అబ్బినాయి. ఆయన పరిశ్రమకు అప్పటి ట్రెయినింగు కాలేజి ప్రిన్సిపాలు కూల్‌డ్రే దోహదం చేశారు. అపుడే దామెర్ల రామారావుగారి సాహచర్యమూ వరదా వారికి కలిగింది. వారిద్దరూ కూల్‌డ్రేకు అభిమానపాత్రులయ్యారు. కూల్‌డ్రే వరదావారి కళాదృష్టిని నిశితమూ, జాతీయమూ చేశారు.

దానితో ఆయన లక్ష్యం నిర్దిష్టమూ, నిర్దుష్టమూ అయింది. చిత్రలేఖనం తెలుగువారి సొమ్ము - అన్నంత అభిమానంతో, జాతీయతా భావంతో రచనలు సాగించారు. ఈ భావమే ఆయన రేఖకు మార్దవాన్ని, పటిమను సమకూర్చింది; శ్రీ దేవీప్రసాద్ రాయ్ చౌధురీవంటి ప్రముఖుల మన్ననలనూ సంతరించి పెట్టింది.

వరదావారు నడివయస్సులో చిత్రలేఖనానికి పూర్తిగా అంకితమైపోయే ఘటనలు కొన్ని ఏర్పడ్డాయి. ఒక్కగానొక్క కుమారుడు పుట్టిపోయాడు. వారి ధర్మపత్ని కాలధర్మం చెందింది. కుటుంబ బాధ్యత అన్నది పూర్తిగా వదలింది. ఆయన రెండవ మనువు తలపెట్టక సర్వసంగాలు పరిత్యజించి కళాదేవి ఆరాధన సాగించారు. కొంతకాలం తర్వాత జీవికకోసం బాలికల పాఠశాలలోనూ, తర్వాత ట్రెయినింగ్ కళాశాలలోను చిత్రకళోపాధ్యాయులుగ ఉన్నారు. ఆచార్య విస్సా అప్పారావు మొదలయిన సహృదయుల తోడ్పాటుతో రాజమహేంద్రవరంలో మిత్రుడు దామెర్ల రామారావు స్మృతిచిహ్నంగా రామారావు ఆర్ట్ గ్యాలరీ, చిత్రలేఖన పాఠశాల స్థాపించి పాఠ ప్రవచనాలకు, చిత్రలేఖన శిక్షణాభ్యాసాలకు పూనుకున్నారు.

సహస్రాధికంగా చిత్రాలు రచించారు. చిత్రకళలు వివరిస్తూ శతాధికంగా వ్యాసాలూ, వివరణలూ వ్రాశారు. కళకు, జీవితానికి గల సంబంధానుబంధాలను విడమరిచి చెప్పారు. వందలకొలది శిష్యులను తయారుచేశారు. దేశ, విదేశాలలోని కళా ప్రదర్శనాలకు పెక్కుచిత్రాలు, తమవి, తమ పాఠశాలవి పంపారు. మన్ననలు పొందారు. వారి చిత్రాలు ఇంగ్లండులోని వెబ్లీమ్యూజియంను, కెనడాలోని టోరాన్‌టో మ్యూజియంను, మన రాజధానిలోని సాలార్‌జంగ్ మ్యూజియంను అలంకరించాయి.

వరదావారి ఒజ్జరికం చాల గొప్పది. విద్యార్థులను ఆయన తప్పులు చేయనిచ్చేవారు. ఎవరినీ ఏమీ అనేవారు కారు. క్రమంగా వారు తమ తప్పులను తామే తెలుసుకునేట్టు తమ ఆచరణ ద్వారా చేసేవారు. ప్రతివారిలోను నిగూఢంగా ఉన్న ప్రతిభ తగిన ప్రోత్సాహమిస్తే ప్రకాశిస్తుందనేది ఆయన విశ్వాసం. కాని, ఆయన విద్యార్థులలో అశ్రద్ధ నెప్పుడూ చూచి ఊరుకోలేదు. వారిని కఠినంగా మందలించి, శ్రద్ధాళులను చేసి, ప్రతిభావంతులుగా తీర్చేవారు. పైకి

కనిపించే కాఠిన్యం వాత్సల్యపూర్ణమని అంతేవాసులకు తెలుసు. ఆయన అంత రంగమేమిటో కూడా వారికి తెలుసు.

ఏ లలితకళకైనా పరిశీలన ముఖ్యమన్నది నిజం. అందులోను చిత్ర కళకు అది జీవగర్ర అని ఆయన నొక్కి చెప్పేవారు. ఈ సూత్రాన్ని జీవితా నికి అన్వయించాలని, అప్పుడే చిత్రకారుడు గుణదోష పరిజ్ఞానం కలిగి, మెట్టుపై మెట్టు చేరుకోగలడని ఆయన ఉపదేశించేవారు. వైయక్తిక నియమనిష్ఠలు ఏ కళాకారునికైనా అతిముఖ్యమని ఆయన స్పష్టపరచేవారు. ఇలాటి నియమ నిబంధనలు అనుసరించడంవల్లనే వరదావారు, వారి శిష్యసంతతితో ఆంధ్ర చిత్రకళలో మహోత్తమ సంప్రదాయం నెలకొల్పగలిగారు.

ఏది తనంత దావలచి వచ్చినా అలక్ష్యమే అందరికీ. వరదావారి విషయం లోను అంతే జరిగింది. అయినను నడివయస్సులోను, వృద్ధాప్యంలోను ఎన్నో పదవులు వరించాయి. కాని, ఆయన ససేమిరా "రామారావు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్" వదలనని మొరాయించారు. ఆయన అలా చేయకపోయి ఉంటే ఈనాడు రాజమహేంద్రవరంలో చిత్రకళా పాఠశాల లేదు, చిత్రకళలో ఆంధ్ర సంప్ర దాయ పునరుజ్జీవనం లేదు, వరదావారే లేరు.

అంతిమక్షణం వరకు ఆయన విద్యార్థుల అభివృద్ధినే కోరారు. వారికి ఆయన సాధనను, తపస్సును నేర్పారు. నిర్భయం, నిబ్బరం, నిష్కర్ష అనే రత్నత్రయాన్ని ప్రసాదించారు. ఈ రత్నత్రయ బలంతోనే వరదావారి శిష్య సంతతి కళ పేరుతో క్రొంగ్రొత్త తీరుతో వ్యాపించే పడమటి "ఇజం"ల జోలికి పోక తెలుగుతనం గుబాళించే కళాఖండాలను ప్రపంచానికి ప్రసాదించగలుగు తున్నది; లలితకళా విస్తరణకు మహాయత్నం చేసిన వేంకటరత్నంగారి కీర్తిని సుస్థిరం చేయగలుగుతున్నది.

వరదావారి దివ్య కళాశక్తి వర్ధతా మభివర్ధతామ్!

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక – 17–6–64)

# వేలూరి శివరామశాస్త్రిగారు

శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి గుంటూరు శతావధానం మాట నా చిన్నతనంలో ప్రతి పండితునినోట వినిపించేది. పట్టుమని పందొమ్మిది సంవత్సరాలైన నిండని శివరామశాస్త్రిగారు తమ గురు ప్రతిద్వంద్వులయిన శ్రీ కొప్పరపు సోదరకవులను సాహిత్య సమరాంగణంలో మార్కొని చెప్పిన

"అనిమిత్తంబుగ గాలుద్రవ్విన త్వదీ
యాహంత నాపుందలం
పున నీ నీరస నిర్గుణాశుకవనం
బుం జెప్పి నిన్గెల్వ నెం
చిన యస్మద్గురు వర్యులన్ సుకవితా
శ్రీధుర్యులన్ మానిపిం
చి నినున్ గెల్వగ వచ్చినా నిదె సభం
జేయింతువో! వత్తువో!"

అనే పద్యాన్ని మాకు ఆదర్శంగా చెప్పేవారు; మా పైతరగతి విద్యార్థులు. మేమూ విస్తుపోయి వినేవారం. ఆ సమరంలో అక్షతగాత్రులై గెలుపుగొన్న శివరామశాస్త్రిగారిని తిరుపతి కవులు

"బాల్యోద్రేకముమై నెదిర్చితివి కొ
ప్రంపుంగవిన్ గ్రంథసా
కల్యంబుం బొనరింతొ లేదొ యని నీ
కై కొంకు నస్మన్మన
శ్శల్యం బిప్పటి కూడదీసితివి వ
త్సా! సత్సభా శోభివై
కల్యాణంబుల బొందుమయ్య ఇక వీ
కన్ శిష్య చూడామణీ!"

అని దీవించారట. తర్వాత శివరామశాస్త్రిగారు తెనాలి, బెజవాడ, కొవ్వూరు, చల్లాయి మొదలయిన పెక్కు తావులలో అవధానాలు చేసి అలాటి కీర్తినే సంపాదించారు.

గురువుల గౌరవం నిలబెట్టిన శిష్యశిఖామణులైన శివరామశాస్త్రిగారు అప్పటికే చెప్పుకోదగిన వ్యుత్పన్నత గలవారు, ముక్తాలత అనే కావ్యం, ఉపగుప్త కావ్యం, బిడాలోపాఖ్యానం అనే పద్యకథ, కృతక సూత్రం అనే ఖండకావ్యం వారి కమ్మని కైవాడానికి అప్పటికే సాక్షీ భూతాలు.

వారి జననసంస్కారం అటువంటిది. కృష్ణాజిల్లా చిరివాడలో వారు 1892లో జన్మించారు. చదువు, చెల్వము గల వంశం. తండ్రిగారు వేంక టేశ్వరావధానులు, ఘనాంతస్వాధ్యాయులు; తల్లిగారు శ్రీ విశాలాక్షిగారు; తమ కుమారునికి విశాల దృక్పథాన్ని ప్రసాదించినవారు. ఇక మేనమామగారు దోర్బల శోభనాద్రి శాస్త్రిగారు. మహా పండితులు. జననంతో కలిగిన ఈ సంస్కృతి లాభం శివరామ శాస్త్రిగారి మేధకు, ఏకసంత గ్రాహితకు, పట్టుదలకు మెరుగులు పెట్టింది.

పెద్దల పోరుతో వారు ఇంగ్లీషు చదువును మిడిల్ స్కూలు దాటించినా, తర్వాత మానివేసి అకిరిపల్లికి వెళ్ళి సంస్కృతం చదువసాగారు. తర్వాత ఇంజరంలో కాపురం పెట్టి శ్రీ జయంతి భగీరథ శాస్త్రిగారివద్ద వ్యాకరణం ప్రారంభించి మహా భాష్య శాంతి చేసుకున్నారు.

తర్వాత చిరివాడకు తిరిగివచ్చి వ్యాకరణం పాఠం చెబుతూ, త్రైయం తాలను అవలోడిస్తూ, వివిధ దర్శనాలు అధ్యయనం చేస్తూ, "ఒక్క భాషగాదు తక్కిన భాషలనన్ని గూడ నేర్పుమయ్య యాంధ్ర!" అని ప్రబోధించిన వారు గనుక తాము పెక్కు దేశీయ భాషలు, పారశీకాది వివిధ విదేశ భాషలు నేర్చారు. సంగీతం కూడా నేర్చారు. వారి సంగీతాభ్యాసానికి ఒక చిన్న కథ వుంది. అకిరిపల్లిలో వున్నప్పుడు, శ్రీ గరికిపాటి జోగయ్య శాస్త్రిగారి కర్ణపేయమైన పురాణ కథనం విని వారికి సంగీతంపై అభిరుచి కలిగింది. కాని గొంతు పెగలదు. ఆ ఆవేదనతో

"గాతే గురుః గురు సుత శ్చ సుతా చ గాతే
నాహం ప్రభుః యదపి కంఠ విలుంఠనేన,
హా! సామగానగురు మే శృణు కంఠనాళః
త్వద్ధస్త సీమని భవిష్యతి వేణు నాళః"

అని భగవానుని ప్రార్థించారట. తర్వాత దానిని ఎలాగో సాధించారు. అనగననగ రాగమతిశయిల్లుచు నుండు - కదా!

పాశ్చాత్య సంప్రదాయ వాసనలో వారు యతిప్రాసలు వదలి ఆది సభా పర్వాలు తెలిగించారు. షేక్‌స్పియర్‌ను అనుకరించి పది నాటికలు రచించి, బుక్కులు పెక్కు ఆంధ్రీకరించి, మణిమేఖల అనే ఏడాశ్వాసాల కావ్యం రచించి, రసగంగాధర, ధ్వన్యాలోక పద్మపురాణాదులు అనువదించి పెట్టుకొని ఒక సభకు వెళ్ళితే ఆ గ్రంథాలన్నీ వున్న పెట్టెను ఎవరో చోరులు తస్కరించారు. అటు తర్వాత వారు ఎంతో శ్రమపడి సేకరించిన గ్రంథాలయం

"క్షయ వత్సరమున నా తప
క్షయమగువైశాఖకృష్ణ పక్షంబున సూ
రయ దినమునన్ ద్వితీయో
దయమున జిరివాడ యెల్ల దగ్ధం"

బయినప్పుడు కాలిపోయింది. దానితో వారు అనువదించిన దర్శనాలు, యోగనాశిష్ఠం మొదలయిన ఉద్గ్రంథాలు కాలిపోయాయి. దానికి వారి గుండె కూడా మండింది.

"కాల్చితి విల్లు సర్వమును
గాల్చితి పాత్రము లూచముట్టుగా,
గాల్చితి వెల్లయున్ ధనము
కాల్చితి వెల్లయు ధాన్యరాశులన్
గాల్చితి వున్న వెల్లయును
గాల్చిన గాల్చితికాక గ్రంథముల్
కాల్చిన నీకు నో జ్వలన!
కడ్పుది నిండెనా? కాలు నిండెనో!"

అని వారు వాపోయారు. అష్టావధాన శతావధానాల సాము గరిడీల ప్రయోజనం అంతంతేనని గ్రహించిన శివరామశాస్త్రిగారి మనస్సును ఈ అగ్నిప్రమాదం కొంత మార్చింది. స్వాతంత్ర్య సమరాంగణ సూత్రధారి అయిన గాంధీజీ ప్రభావం మరింత మార్చివేసింది. దానితో వారి దృక్పథం మరొక మార్గంలో ప్రసరించింది. చిరివాడలోని తమతోటలో ఆశ్రమ తుల్యమైన నివాసంలో ఏకాంత వాసం చేస్తూ, అధ్యయనా ధ్యాపన కర్మలు జరిపారు. ఆ సమయంలో వారు చెప్పిన ఈ పద్యం వారి అకుటిలతకు, దానికి ఆలవాలమయిన మన స్తత్వానికి నిదర్శనం :

"ఏ యొకరుండు లేని యొక
యేటి సమీప తలంబునం దర
ణ్యాయతనంబునందును ద
టాక తటంబునయందు దోటయం
దాయత శైల శృంగమున
యందు జనించు మహావనీజ మం
దూయెల యొండు నాసనము
నొండును దప్పక నాకు గావలెన్."

ఈ ఏకాంతవాసంలో వారు వివిధ శాస్త్రాలను ఆలోడించారు. ఖగోళశాస్త్రం మొదలు కర్మమీమాంసవరకు ఆధునిక దృక్పథంతో తరచారు. రవీంద్రుని 'కథా'ను కథలు - గాథలు అని, శరచ్చంద్రుని నవలలు - రాముని బుద్ధిమంతనం, సర్వేసు వీలునామా, తీరని కోరికలు, బాపనపిల్ల - అని, గాంధీజీ ఆత్మకథను అనువదించారు. శతాధికంగా కథలు వ్రాశారు. వాటితో సీతల్ కా దర్వాజా, చీకటితప్పు, క్షమాపణ మొదలయినవి గొప్పస్థాయివి. వారి సాహిత్య విమర్శ గ్రంథాలు సోముడు, తాలుకుట్టనము, సభ్యత, విషయ దృష్టి గలవి. మాధవ శర్మ విషాదాంతనాటకం. ఏకావళి ఖండ కావ్యసంపుటి. కథాషట్కం, కథా సప్తకం - రెండు కథాసంపుటులు.

శాస్త్రిగారు శాస్త్ర విషయాలను - ముఖ్యంగా అరవిందుని అతిమానస మతాన్ని వివరిస్తూ, ఇటీవల భారతిలో వ్రాసిన "ఋతచిత్" వ్యాసంతోపాటు వ్రాసిన వ్యాసాలు కొన్ని వందలుంటాయి. వాటిని సంపుటాలుగా ప్రచురిస్తే ముందుతరాల వారికి విజ్ఞానకోశాలవుతాయి.

శాస్త్రిగారి శైలిలాగే జీవితం, రూపం కూడా సరళ సుందరమైనవి. వారు త్రికరణాలతోను గాంధీజీ అనుయాయులు; జాతీయవాదిగానే జీవించి జాతీయ వాదిగానే పరమపదించారు. కనుకనే తుదివరకు సచ్చింతే వారిని అనుగమించింది. పరమపదించడానికి వెనుకటిరాత్రి - (1967 మార్చి 16వ తేదీ రాత్రి) భగవద్గీ తను ఇష్టుల గోష్ఠిలో వ్యాఖ్యానించారు. మరుసటి ఉదయం 7-8 గంటలకు అసువులు బాశారు.

శ్రీ శాస్త్రిగారి భౌతికకాయంలాగే కీర్తికాయమూ అనవద్యావదాతమైనది. దానికి సాహిత్య రంగంలోగాని, వ్యావహారికరంగంలోగాని నీలిరేకలు ఎన్నటికి గూఢ సోకవు.

(ఆంధ్రసచిత్ర వారపత్రిక – 7-4-87)

# బూర్గులవారి బహుముఖ వ్యక్తిత్వం

ఆంధ్రప్రదేశ్ అవతరణకు కొంచెం ముందు జరిగిన ముచ్చట. శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు హైదరాబాద్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా వున్నారు. శాసనసభ సమావేశం జరుగుతున్నది. ప్రతిపక్షాలవారు, కొందరు స్వపక్షంవారు కూడా విమర్శలు చేశారు. సాధారణ విమర్శ కాదు; విరుచుకు పడ్డారు. ఆనాడు చూచాను - బూర్గులవారి మేరునగధీరత్వాన్ని: ఆ దినం విన్నాను - వారి వివిధ, భాషాపాండిత్యాన్ని. వామనుడుగా వున్న ఆయన తెలుగు, కన్నడ, ఉరుదు, హిందీ, మరాఠీ, ఆంగ్లభాషలలో విమర్శకు సమాధానాలు కురిపిస్తూ విక్రమావతార మెత్తారు. గీతలో కృష్ణ భగవానుడు చూపిన విశ్వరూపమే జ్ఞాపకం వచ్చింది. పృచ్ఛకులకు ఎవరికి తగినట్టు వారికి సమాధానమిస్తూ త్రివిక్రముడు బలిని అణచివేసినట్లు అణచివేశారు. ఆ వాగ్ధాటి, ఆ ప్రత్యుత్పన్న మతిత్వం: అనేక భాషా వైశారద్యం రాజకీయ నాయకులలో అరుదు. నేను మహా వక్తలయిన రాజకీయ ప్రముఖులను దర్శించాను, పండితులయిన వారిని పరిచయం చేసుకొన్నాను. కాని, బూర్గులవారి వంటి బహుభాషా పండితులయిన, బహు విజ్ఞాన ఖని అయిన రాజకీయ నాయకులను చూడలేదు.

బూర్గులవారు గొప్ప జాతి నిర్మాతలలో ఒకరు. వారి వ్యవస్థాపన దక్షత చిన్ననాటి నుంచే ఖ్యాతి చెందింది. వారు 1931లో దేవరకొండలో జరిగిన ద్వితీయ నిజాం రాష్ట్రాంధ్ర మహాసభకు అధ్యక్షత వహించి చేసిన తీర్మానాలు, కార్యదర్శిగా నిర్వహించిన రాజకీయ మహాసభ స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో గొప్ప ఘట్టాలు; పౌరస్వత్వాల చరిత్రలో గొప్ప సంఘటనలు. వారి ప్రశాంత వాద పటిమ, బహు భాషా వేత్తృత్వం విజయానికి కారణాలు.

నిద్రాణమయిన తెలంగాణాను జాగృత మొనర్చిన మహా నాయకులలో శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారొకరు. తెలంగాణాలో ఈ జాగృతి ఆంధ్రోద్యమం వల్ల కలిగింది. ఆంధ్రోద్యమం ప్రారంభం విచిత్రంగా జరిగింది.

హైదరాబాద్‌లో జరిగిన ఒక సంఘ సంస్కార సభలో న్యాయవాది శ్రీ ఆలంపల్లి వెంకట రామారావు తెలుగులో ప్రసంగించసాగారు. సభికులలో కొందరు మహారాష్ట్రులు ఆ బోయి భాషలో మాట్లాడవద్దని గోలచేశారు. ఆ

సభలో పాల్గొన్న మాడపాటి హనుమంతరావు, మందుముల నరసింగరావు, బూర్గుల రామకృష్ణరావు మొదలయినవారికి మహారాష్ట్రుల ఆ కేకలు, వెక్కిరింతలు అవమానమనిపించింది. ఆ సభనుంచి నిష్క్రమించారు. ఆ రాత్రే వారు మరొకచోట సమావేశమయి తెలుగు భాషకు కలిగిన ఆ అవమానాన్ని తుడిచి వేయడానికి ఆంధ్ర జనసంఘము అనే సంస్థను స్థాపించారు. ఈ చరిత్రాత్మక సంఘటన జరిగింది 1921 నవంబరు 12వ తేదీ.

ఈ విధంగా ప్రారంభమయిన ఆంధ్రోద్యమం తొమ్మిది సంవత్సరాలలో తెలంగాణా అంతటా విస్తరించింది. తెలంగాణా ప్రజలు ఆంధ్రత్వ భావనతో, మాతృభాషా గౌరవంతో, తమ అస్తిత్వాన్ని చాటుకొనడానికి నిశ్చయించుకొన్నారు. ఆంధ్ర జనసంఘం నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభ అయింది. దీని తొలి మహాసభలు గోలుకొండ పత్రికా సంపాదకులు, ప్రముఖ సాహిత్యవేత్తలు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతను మెదక్ జిల్లా జోగిపేటలో 1930 మార్చిలో మహావైభవంగా జరిగింది. రెండవ మహాసభ 1931 మార్చిలో నల్లగొండ జిల్లా దేవరకొండలో శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారి అధ్యక్షతను జరిగింది. ఈ మహాసభ జరిగిన తీరును శ్రీ మాడపాటి హనుమంతరావుగారు తమ తెలంగాణా ఆంధ్రోద్యమ చరిత్రలో చక్కగా వర్ణించారు. ఇది బూర్గుల వారికి సంబంధించింది గనుక ఉదాహరిస్తాను:-

"రెండవ మహాసభ 1931 మార్చిలో ఆంధ్రోద్యమ స్థాపకులలో నొకరును, జాగీర్దారులును, అప్పటికే ప్రసిద్ధిచెందిన న్యాయవాదులును, కాంగ్రెస్ నాయకులునగు శ్రీ బూర్గుల రామకృష్ణరావు అధ్యక్షతన వైభవముగా జరిగినది. ......

"ఈ సభను జరుపుకొనుటకై రాష్ట్ర ప్రభుత్వము నుండి అనుమతి పొందుటకు ఎంతయో అవస్థ అయినది. గౌరవనీయులయిన పోలీసు శాఖామంత్రి ఆంధ్ర జనకేంద్ర సంఘ కార్యదర్శిని పిలిపించుకొని, ఎంతయో తర్జనభర్జనలు చేసి, ప్రశ్న పరంపరల కురిపించి, తుదకు సభకు అనుమతినిచ్చిరి. సభకు అనేకమంది ప్రతినిధులు, విద్యావంతులైన సోదరీమణులు పలువురు వచ్చియుండిరి. మాజీ న్యాయమూర్తి పండిత కేశవరావ్ కేరటకర్, దేశభక్తవామన్ నాయక్, వారి కుమారుడు శ్రీధరనాయక్, బాజీ కిషన్‌రావు, శ్రీనివాసశర్మ మొదలగు అనేక ఆంధ్రేతర మహాశయులు సభలో పాల్గొనుటకు వచ్చిరి....

"హైదరాబాద్ నగరములోని రెడ్డి హాస్టలునుంచి విద్యార్థుల సభలు జరుగు నాటికి నాల్గుదినముల ముందే కాలినడకన వరుసగా ప్రయాణముచేసి దేవరకొండ చేరిరి. వీరివలన గ్రామములోనివారు ఉత్సాహముతో సభలో పాల్గొనిరి. విద్యార్థుల

సేవాసక్తి చాల ప్రశంసింపదగినది. అధ్యక్షుని ఊరేగింపుతో అశ్వారూఢునిచేసి సభా స్థలమునకు పెద్ద సమూహముతో తీసుకొని వెళ్ళిరి. ఆ మహాసభ జయప్రదముగా జరుగవలెనని సందేశము పంపినవారిలో ముగ్గురు గొప్ప ప్రభుత్వాధికారులు గలరు. మొదటివారు పోలీసు శాఖ ఆంగ్లమంత్రి శ్రీ టాస్కర్‌గారు, రెండవవారు విద్యాశాఖ నాజమ్ (డైరెక్టరు) మహ్మదు హుసేన్‌గారు, మరియు కోత్వాల్ రాజాబహద్దూర్ వెంకటరామరెడ్డిగారు. పూర్వపద్ధతి విడనాడక మహిళా మహాసభ కూడ చాల ఉత్సాహముగా జరిగినది. హైదరాబాదు నుండి సభకు వచ్చిన శ్రీయుతులు చిత్తారయ్య, భాగ్యరెడ్డివర్మ మొదలగువారు హరిజనవాడకు వెళ్ళి మంచి ప్రబోధము గావించిరి. భాగ్యరెడ్డిగారు హరిజన సతులందరిని తిలకము ధరించునట్లు చేసిరి.

"మహాసభ సందర్భమున జీవరక్షా ప్రచారమండలి వారు భజనమండలి సహాయముతో ప్రతిదినము గీతములు పాడుచు ప్రార్థనల సల్పుచు రాత్రుల యందు యక్షిణి దీపముద్వారా జీవదయా ప్రబోధములు గావించుచు అమితమగు సేవనొనర్చిరి. వారి పశు హింసా ప్రచారక గీతములు జనముల హృదయములపైన అమోఘమగు ప్రభావమును కలిగించినవి. అట్టి ఉత్తమసేవ యొనర్చిన శ్రీ లాల్‌జీ మేఘ్‌జీ మరియు శ్రీ గురు ప్రసాదుగార్లు స్తవనీయులు."

ఈ మహాసభలో ప్రజాభ్యుదయానికి సంబంధించిన 32 తీర్మానాలు ఆమోదించారు. 1931 ఉప్పు సత్యాగ్రహం జరిగి గాంధీ - ఇర్విన్ ఒడంబడిక కుదిరిన సమయం. దేశమంతా మహోత్సాహంగా వున్న సమయం. ఆ ప్రభావం కూడా హైదరాబాద్ రాష్ట్రం మీద, ఈ మహా సభలమీద పడింది.

ఈ మహాసభ జరిగిన పిదప 1931 ఆగష్టులో మహారాష్ట్రలోని (అప్పటి బొంబాయి రాష్ట్రంలోని) అకోలా పట్టణంలో హైదరాబాద్ రాష్ట్ర ప్రజా రాజకీయ మహాసభ జరిగింది. హైదరాబాద్ రాష్ట్ర ప్రజలకు పౌరస్వత్వాలు లేక పోవడంవల్ల సభలు, ముఖ్యంగా రాజకీయ సభలు జరుపుకొనే అధికారం లేదు. ఆంధ్ర మహాసభ జరపడానికే రాష్ట్ర ప్రభుత్వాన్ని పెక్కుసార్లు బ్రతిమాలవలసివచ్చేది. అనుమతి అధికారుల ఇష్టానిష్టాలపై ఆధారపడి వుండేది. కనుక రాజకీయ సభలు జరుపుకొనే ప్రసక్తే లేదు. దానివల్ల హైదరాబాదు రాష్ట్ర ప్రజల రాజకీయ మహాసభ అకోలాలో ఏర్పాటు చేశారు. దానికి సుప్రసిద్ధ న్యాయవాది బారెట్లా శ్రీ రామచందర్‌నాయక్ అధ్యక్షులు, శ్రీ బూర్గులవారు కార్యదర్శి.

దేశంలో తీవ్రతరమవుతున్న ప్రజోద్యమం చూచి, సంస్థానాలలో ఇలాటి

ఉద్యమాన్ని నివారించడానికి బ్రిటీష్ ప్రభుత్వం సంస్థానాలలో రాజకీయ సంస్కరణలను చేసేనెపంలో సంస్థానాధీశులతో మంతనాలు జరుపుతున్న సమయ మది. కనుక అకోలాలో జరిగిన ఈ రాజకీయ మహాసభ హైదరాబాదు సంస్థాన ప్రజలు తమ అభిప్రాయాలను ప్రకటించడానికి చాలా తోడ్పడింది. పౌరస్వత్వాలు ప్రజలకు వెంటనే ప్రసాదించాలని, బాధ్యతాయుత ప్రభుత్వాలు ఏర్పాటు చేయాలని, అకోలా మహాసభ సంస్థానాదీశుడైన నిజామును కోరింది.

బూర్గుల వారి కార్యనిర్వహణ దక్షతకు మూల బంధాలు గనక ఈ సభలను గురించి వివరంగా తెలిపాను. నిజానికి బూర్గులవారి దక్షత చిన్ననాటినుంచే స్పష్టమయింది.

బూర్గులవారు మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తి తాలూకా పడకల్ గ్రామంలో జన్మించారు. అది వారి మాతామహుల ఇల్లు. జన్మదినం 1899 మార్చి 13వ తేదీ. తండ్రి శ్రీ నరసింహారావు, తల్లి శ్రీమతి రంగనాయకమ్మ. వారి ప్రాథమిక విద్యాభ్యాసం స్వగ్రామమయిన బూర్గులలో జరిగింది. తండ్రి నరసింహారావుగారు తెలుగు, ఉర్దూ, పార్సీలను ఇంటివద్ద చేర్చారు. పార్సీ ఆనాడు రాజభాష కావడంవల్ల నిర్బంధ పఠనీయం.

పిదప ఉన్నత విద్యాభ్యాసం హైదరాబాద్‌లో జరిగింది. వారు 1911లో హైదరాబాదు నగరానికి వచ్చి ధర్మవంతు పాఠశాలలో చేరి ఏడవ తరగతిలో ఉత్తీర్ణులయ్యారు. తర్వాత శ్రీ కేసుకర్ నిర్వహిస్తున్న ట్యుటోరియల్ పాఠశాలలో చేరి బొంబాయి మెట్రిక్ పరీక్ష ఇచ్చి, నిజాం కాలేజీలో ఇంటర్మీడియేట్ చదివారు. అన్ని పరీక్షలలోను వారిది అగ్రస్థానమే.

ఆ కాలంలో పూనాలోని ఫెర్గూసన్ కళాశాల గొప్ప ఆదర్శ విద్యాలయం. దానిని మాన్యులు శ్రీ గోపాలకృష్ణ గోఖలే స్థాపించారు. అక్కడ ఉపాధ్యాయులు నామమాత్రపు వేతనంతో బోధించేవారు. పూనా శ్రీ బాలగంగాధర తిలక్ వంటి మహనీయులు ఉండడంవల్ల దేశానికి రాజకీయ కేంద్రంగా ఉండేది. బూర్గులవారు ఫెర్గూసన్ కళాశాలలో 1920లో చేరి బి.ఎ. ఆనర్స్‌లో ఉత్తీర్ణులయ్యారు. పిదప బొంబాయికి వెళ్ళి అంజుమన్ ఇస్లాం హైస్కూల్‌లో ఉపాధ్యాయులుగా పనిచేస్తూ, 1921లో ఎల్.ఎల్.బి. పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు.

పూనాలోను, బొంబాయిలోను వున్నప్పుడు వారికి పలువురు దేశనాయకులతో పరిచయం కలిగింది. శ్రీ గోఖలే శిష్యుడైన శ్రీ నటరాజన్ బొంబాయి

నుంచి 'ఇండియన్ సోషల్ రిఫామ్స్' అనే పత్రిక నడిపేవారు. ఆ పత్రికలో బూర్గులవారు సంఘ సంరక్షణపై ఆంగ్లంలో వ్యాసాలు వ్రాసేవారు.

నిజానికి బూర్గులవారు రాజకీయ జీవితం వారి 17వ ఏటనే ప్రారంభ మయిందనవచ్చు. హైదరాబాదులో వారు 1916లో యంగ్ మెన్స్ అసోసియేషన్ అనే సంఘం స్థాపించారు. దానికి కార్యదర్శిగా వుండి జాతీయ సమస్యలపై చర్చలు జరిపేవారు. ఈ సంఘానికి అధ్యక్షులు అప్పటి కాంగ్రెస్ నాయకులు శ్రీ వామన్‌నాయక్. అది ప్రథమ ప్రపంచ మహాసంగ్రామం జరుగుతున్న కాలం. ఆ సంగ్రామం 1814 నుంచి 1918 వరకు జరిగింది. యుద్ధానంతరం బ్రిటిషువారికి తోడ్పడిన స్వదేశ సంస్థానాధీశులు బ్రిటిషువారితో తమతమ సౌకర్యాలకోసం బేరాలు సాగించారు. నిజాం ప్రభువుకూడా ఒకప్పుడు బ్రిటిష వారికి స్వాధీనం చేసిన బేరారు ప్రాంతాన్ని తనకు తిరిగి ఇవ్వమని ఒత్తిడి చేయసాగారు. బూర్గులవారు 1922లో నిజాం ప్రభువు హక్కును సమర్థిస్తూ ఇంగ్లీషులోను, ఉర్దూలోను వ్యాసాలు వ్రాశారు. ఈ వ్యాసాలలో వారి రాజకీయ వైదుష్యం ప్రస్ఫుటం కావడం వల్ల అప్పటి రాజకీయ నాయకులు చాలా ప్రశంసించారు. ఈ వ్యాసాలు నిజాం ప్రభుత్వం దృష్టిని ఆకర్షించాయి. ఉన్నతోద్యోగం ఇస్తామురమ్మని బూర్గులవారిని ఆహ్వానించారు. కాని, బూర్గులవారు స్వతంత్రంగా న్యాయవాది వృత్తిని అవలంబించి, దేశసేవ చేయదలచడంవల్ల ఆ ఆహ్వానాన్ని నిరాకరించారు.

1923లో అఖిలభారత కాంగ్రెస్ మహాసభ కాకినాడలో జరిగింది దానికి మౌలానా మహమ్మద్ అలీ అధ్యక్షులు. హైదరాబాదునుంచి ఆ సభలను ప్రతినిధులుగా వెళ్ళిన ప్రముఖులలో బూర్గుల వారు ఒకరు. ఆ సందర్భంలో శ్రీ సత్యమూర్తి అధ్యక్షతన స్వదేశ సంస్థానాల ప్రతినిధుల మహాసభ కూడా జరిగింది. ఒక తీర్మానం ముసాయిదాపై తీవ్ర వాదోపవాదాలు జరుగుతున్నాయి. ఎంతకూ తెగలేదు. బూర్గులవారు మరొక ముసాయిదాను సిద్ధపరచి కాంగ్రెస్ నాయకురాలు శ్రీమతి సరోజినీ నాయుడుకు అందజేశారు. దానిని ఆమె శ్రీ సత్యమూర్తికి అందజేసింది. అది ఏకగ్రీవంగా ఆమోదితమయింది. శ్రీ సత్యమూర్తి బూర్గులవారిని మెచ్చుకొన్నారు.

ప్రథమ ప్రపంచ మహా సంగ్రామానంతరం స్వదేశ సంస్థానాలలో రాజకీయ సంస్కరణలు ప్రవేశపెట్టాలని బ్రిటిష ప్రభుత్వం సంస్థానాధీశులకు సూచనలిచ్చింది. తదనుగుణంగా నిజాం ప్రభుపు ప్రజలకు కన్నీళ్ళు తుడుపుగా సంస్కరణలు ప్రవేశపెట్టనున్నామని ప్రకటించి ప్రజాభిప్రాయం సేకరించ

డానికి 1919లో ప్రత్యేకాధికారిగా శ్రీ బాల్‌ముకుంద్ అనే వారిని నియమించారు. ఈయనకు జాతీయ దృష్టితోను, హైదరాబాదు సంస్థానాభ్యుదయ దృష్టితోను తగిన సూచనలు ఇవ్వడానికి హైదరాబాద్ పొలిటికల్ అసోసియేషన్ అనే సంస్థ నెలకొన్నది. దానికి శ్రీ రాఘవేంద్రరావు శర్మ అనే ప్రముఖులు కార్యదర్శి, సహాయ కార్యదర్శి బూర్గులవారు. ఇదే హైదరాబాద్ రాష్ట్రంలో తొలి రాజకీయ సంస్థ. ఈ సంస్థ నివేదికను బూర్గులవారు సిద్ధపరిచారు. దానిలో వారుచూపిన కౌశలాన్ని శ్రీ మాడపాటి హనుమంతరావు తెలంగాణా ఆంధ్రోద్యమ చరిత్రలో ఇలా ప్రశంసించారు:

"పైన ఉల్లేఖించిన రాజకీయ సంఘ పక్షమున మహాసభ జరుపుటకు వీలు లేనందున ఒక పథకము సిద్ధము చేసితిమి. దానిని సిద్ధపరచిన గౌరవము అపుడపుడే న్యాయవాది వృత్తి సాగించుచున్న మన బూర్గుల రామకృష్ణారావు గారికి చెందుతున్నది. ఈ అంశమును బట్టి రాజకీయోద్యమమున నిర్మాణాత్మక మగు నిట్టి కార్యమును తెలంగాణాలోని ఒక విద్యాధికుడు సాధించగలడని తెలియవచ్చును."

బూర్గులవారు బొంబాయిదుంచి హైదరాబాదుకు తిరిగివచ్చి అప్పుడు సుప్రసిద్ధులుగా వున్న శ్రీ అజ్గల్ అనే బారెట్లా వద్ద కొంతకాలం జూనియర్‌గా ఉండి 1923 నుంచి స్వతంత్రంగా న్యాయవాద వృత్తి ప్రారంభించారు, రాజకీయ సంబంధం గలవారిపైన, ఖద్దరు కట్టేవారిపైన, ఆర్య సమాజ నాయకులపైన పోలీసులు దొంగకేసులు పెట్టేవారు. అలాటి కేసులను బూర్గులవారు ఉచితంగా వాదించి ప్రజా నాయకులను గెలిపించేవారు. క్రిమినల్ సివిల్ కేసులూ చేపట్టే వారు. ఉర్దూభాషలో నిష్ణాతులు గనక హైదరాబాద్ కోర్టులో ఉర్దూలోను, రెసి డెన్సీ బజారు కోర్టులో ఆంగ్లంలోను వాదించి అందరి మెప్పు పొందేవారు. ఈ వృత్తి వల్ల వివిధ సంఘాలలో వారికి సంబంధం ఏర్పడింది. అంజుమాన్ తరక్కి ఉరుదూ (ఉర్దూ అభివృద్ధి సంఘం)లో సభ్యులుగా నున్నందున వివిధ రంగాలలోని ముస్లిం నాయకులతోను సన్నిహితత్వం ఏర్పడింది.

స్థానికులను అణచివేయడానికి విభజించి పాలించు సిద్ధాంతాన్ని అనుస రించిన నిజాం ప్రభువు రాష్ట్రంలోని ఉద్యోగాలను రాష్ట్రేతర ముస్లింలకు తరుచు ఇవ్వడం స్థానిక ముస్లింలకు చాలా కంటకంగా ఉండేది. స్థానికులకు ప్రాధాన్యం ఇవ్వాలని కోరుతూ స్థానికులు ఆందోళన ప్రారంభించారు. దీని ఫలితంగా సర్ నిజామత్ జంగ్ అధ్యక్షతను నిజాం ప్రజల సంఘం ఏర్పడింది. దీనికి బూర్గుల వారు కార్యదర్శి.

పరిసర బ్రిటిషు పరిపాలిత రాష్ట్రాలలో ప్రజోద్యమం ముమ్మరంగా సాగుతున్నది. దాని ప్రభావం నిజాం రాష్ట్రంపైన పడింది. నిజాం ప్రభువు మారుతున్న పరిస్థితులను పరిశీలించారు. రాష్ట్రంలో రాజకీయ సంస్కరణలకు సూచనలు చేయడానికి ప్రముఖ న్యాయవాది శ్రీ ఆరావముదు అయ్యంగార్ అధ్యక్షతను ఒక సంఘాన్ని నియమించారు. ఆ సంఘానికి ప్రజాభిప్రాయం తెలియజేయడానికి శ్రీ మాడపాటి హనుమంతరావుగారి అధ్యక్షతను ఒక సంఘం నెలకొన్నది. దానికి బూర్గులవారు కార్యదర్శి. బూర్గులవారు ఎంతో బాధ్యతతో నివేదికను సిద్ధపరచి శ్రీ ఆరావముదు అయ్యంగార్ సంఘానికి అందజేశారు. ఆ నివేదిక విద్వత్తా పూర్వంగాను, వివిధ విషయభరితంగాను, విజ్ఞాన విలసితంగాను ఉంది. దానిని నిజాం ప్రభుత్వం మెచ్చుకొని, హైకోర్టు న్యాయమూర్తి పదవిని ఇస్తానంటూ బూర్గులవారికి తెలిపింది. కాని, బూర్గులవారు దేశ స్వాతంత్ర్య సమరయోధులుగా దానిని నిరాకరించారు.

1938లో హరిపుర కాంగ్రెస్ మహాసభ తర్వాత హైదరాబాద్‌లో స్టేట్ కాంగ్రెస్ స్థాపించాలనే వాంఛ నిజాం రాష్ట్ర నాయకులలో కలిగినందున, బూర్గులవారు కన్వీనరుగా తాత్కాలిక సంఘం ఏర్పడింది. కాని, నిజాం ప్రభుత్వం ఇలాటి రాజకీయాందోళనలను మొగ్గలోనే త్రుంచివేయడం మంచిదని, స్టేట్ కాంగ్రెస్ ఎన్నిక 1938 సెప్టెంబర్ 9వ తేదీన జరుగనుండగా, రెండు రోజుల ముందే స్టేట్ కాంగ్రెస్ అక్రమ సంస్థ అని నిషేధాజ్ఞలు విధించింది. దానితో రెచ్చిపోయిన కార్యకర్తలు జట్లు జట్లుగా సత్యాగ్రహం చేసి అరెస్టయ్యారు.

ఈలోగా ద్వితీయ ప్రపంచ సంగ్రామం ప్రారంభమయింది. బ్రిటిషు ప్రభుత్వం భారతదేశం కూడా యుద్ధంలో చేరినట్టు ప్రకటించింది. దానిని అఖిల భారత కాంగ్రెస్ నిరాకరించింది. కాంగ్రెస్‌ను ఒప్పించడానికి బ్రిటిషు ప్రభుత్వం సర్ స్టాఫర్డ్ క్రిప్స్‌ను రాయబారం పంపింది. ఆయన 1939 డిసెంబరులో హైదరాబాదుకు వచ్చినప్పుడు బూర్గులవారిని కూడా కలుసుకొన్నాడు. క్రిప్స్ సూచనలను గాంధీజీ నిరాకరించారు. నిరాకరించకుండా ఒప్పుకొని ఉంటే, బ్రిటిషు ఎన్నికలలో క్రిప్స్ గెలిచి ప్రధాని అయ్యేవాడూ, భారతదేశం విభక్తం కాకుండా అఖండంగా, సమాఖ్యగా ఉండేది.

రాజకీయ సంస్థలపై నిషేదం తొలగనందున రాష్ట్రంలో మూడు ప్రాంతాల సంస్థలు పనిచేసేవి. 1946లో స్టేట్ కాంగ్రెస్ స్థాపనపై నిషేధం తొలగడంతో రాష్ట్రాలలోని ప్రాంతీయ సంస్థలన్నీ ఏకమై స్టేట్‌కాంగ్రెస్ ఏర్పడింది. అధ్యక్ష పదవికి జరిగిన పోటీలో రెండు వోట్లతో బూర్గులవారు ఓడి

పోయారు. స్వామి రామానందతీర్థ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. దీనివల్ల స్టేట్ కాంగ్రెస్‌లో అప్పటినుంచే చీలికలు ఆరంభమయ్యాయి.

1947 ఆగస్టులో దేశం స్వతంత్ర్యమైంది. అంతకుముందు జూన్ 11న నిజాం నవాబు తన రాష్ట్రం స్వతంత్రంగా వుంటుందని ప్రకటించారు. రాష్ట్ర ప్రజలు ఉడికిపోయారు. జూన్ 16, 17, 18 తేదీలలో హైదరాబాదులో జరిగిన స్టేట్‌కాంగ్రెస్ మహాసభలో నిజాం ప్రభువు ప్రకటనను నిరసిస్తూ బూర్గులవారు ప్రతిపాదించిన తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించడం జరిగింది. తర్వాత జరిగిన ప్రజోద్యమంలో బూర్గులవారు సత్యాగ్రహంచేసి శిక్ష పొందారు.

ఇంతలో రజాకార్ల దురంతాలు మితిమీరిపోయాయి. బూర్గులవారు కారాగారంనుంచి విడుదలకాగానే, రజాకార్ల దురంతాలకు గురియైన ప్రాంతాలను పరిశీలించారు. రజాకారుల దురంతాలకు నిరసనగా అప్పటి నిజాం ప్రభుత్వంలో మంత్రిగా ఉన్న శ్రీ జి. రామాచారి తమ పదవికి రాజీనామా ఇచ్చారు. అప్పటి హైదరాబాదులో భారత ఏజెంటు శ్రీ కె. ఎం. మున్షీ బూర్గులవారితో సంప్రదించి, కేంద్ర ప్రభుత్వం జోక్యం చేసుకోవలసిందిగా కోరడానికి బూర్గులవారి నాయకత్వంలో ప్రధాని పండిత జవాహర్‌లాల్‌నెహ్రూ వద్దకు రాయబారం పంపారు. ఉద్యమం తీవ్రతరమయింది. 1948 జూన్ బ్రిటిషువారి చివరి వైస్రాయి లార్డ్ మౌంట్ బాటన్ స్వదేశానికి తిరిగిపోయారు. శ్రీ చక్రవర్తి రాజగోపాలచారి గవర్నర్ జనరల్‌గా నియమితులయ్యారు. మేజర్ జనరల్ జె. ఎన్. చౌదరీ నాయకత్వాన హైదరాబాద్‌పై పోలీస్ చర్య జరిగింది. నిజాం ప్రభుత్వం లొంగిపోయింది. చౌదరీ పాలకుడుగా సైనికప్రభుత్వం ఏర్పడింది. నిజాం రాష్ట్రం భారతయూనియన్‌లో విలీనమయింది. ఈ విలీనానికి బూర్గులవారు చేసిన కృషిని శ్రీ మున్షీ ఎంతో ప్రశంసించారు.

పిదప సైనిక ప్రభుత్వం రద్దయి 1950 జూన్ 12వ తేదీని ఎం. కె. వెల్లోడి ముఖ్యమంత్రిగా ఏర్పడిన తాత్కాలిక ప్రభుత్వంలో బూర్గులవారు రెవెన్యూ, విద్యాశాఖా మంత్రులుగా ఉండి ఎన్నో సంస్కరణలు చేశారు.

1950 జనవరిలో భారతదేశం రిపబ్లిక్‌గా అవతరించిన పిదప 1952లో దేశమంతటితోబాటు హైదరాబాదు రాష్ట్రంలోను సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. స్టేట్ కాంగ్రెస్ అధిక సంఖ్యలో గెలిచింది. బూర్గుల వారు ముఖ్యమంత్రిగా ప్రభుత్వం ఏర్పడింది. వారి ముఖ్య మంత్రిత్వ మొక కంటక కిరీట ధారణగానే

గడచింది. ఆంధ్రప్రభ సంపాదకీయంలో నేను ఈ విషయాన్నే తెలిపాను. వారు నన్ను అభినందిస్తూ, ఆ మాటనే ఉదాహరిస్తూ నాకొక ఉత్తరం వ్రాశారు.

వారు ముఖ్యమంత్రిగా ఉండగా రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలు నిర్దిష్టంగా అభివృద్ధి సాధించాయి. భాషా ప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతానుగుణంగా ఫజులాలీ కమీషన్ సూచనల మేరకు ఆంధ్రప్రదేశ్ 1956 నవంబరు 1వ తేదీని అవతరించింది. ఆంధ్రప్రదేశ్ అవతరణకు బూర్గులవారు హృదయ పూర్వకంగా ఎంతో కృషి చేశారు. వారే ఆంధ్రప్రదేశ్ తొలి ముఖ్యమంత్రి అయి ఉంటే, ఎన్నో సమస్యలు పరిష్కారమయ్యేవని, ఇతర రాష్ట్రాలలోని పెక్కు తెలుగు ప్రాంతాలు మనకు చేరేవని, ఆంధ్ర తెలంగాణాల మధ్య భావమైక్యం సులభంగా ఏర్పడి ఉండేదని నా నమ్మకం.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడగానే బూర్గులవారు హైదరాబాద్ రాష్ట్ర ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశారు. పిదప వారు కేరళకు, ఉత్తరప్రదేశ్‌కు గవర్నర్‌గా ఉన్నారు. 69వ ఏట 1967 సెప్టెంబర్ 14వ తేదీని దివంగతులయ్యారు. వారి కాలధర్మంతో భారతదేశం, ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ ఒక రాజకీయ విజ్ఞుని, ఒక విద్వద్వరేణ్యుని, ఒక దేశభక్తాగ్రగణ్యుని కోల్పోయింది.

బూర్గులవారు ఉత్తమ రచయితలు; ఆంధ్ర సంస్కృతాంగ్ల ఉరుదూ హిందీ భాషలలో పెక్కు రచనలు చేశారు. అవన్నీ వారి పాండిత్యానికి భావుకతకు దర్పణాలు.

వారి జీవిత విశేషాలను పలువురు తెలిపారు. నేనూ ఆంధ్ర సచిత్ర వారపత్రిక నిర్వహించిన తెలుగు వెలుగులలో చిత్రించాను. కాని, సర్వోదయ నాయకులు, బూర్గుల వారి సన్నిహిత కార్యకర్తలు శ్రీ ఉమ్మెత్తల కేశవరావు గారు రచించిన 'బూర్గుల రామకృష్ణారావు' అనే జీవితచరిత్ర సమగ్రం. బూర్గుల వారి మహావ్యక్తిత్వానికి నా జోహార్లు.

(ఆంధ్రప్రదేశ్ – ఏప్రిల్, 1985)

# సిస్టర్ దేవదీవన

రోగులపాలిటి దేవునిదీవన సిస్టర్ దేవదీవన. మూర్తీభవించిన మానవతా భావన సిస్టర్ దేవదీవన. ఆమె ముక్తసరిగా మూడు మాటలే మాట్లాడుతుంది. చేతలే ప్రధానం ఆమెకు. రోగులకు శ్రీరామరక్ష అయిన చిరునవ్వు. ఎంతగట్టిగా మాట్లాడినా పట్టుమని పది అడుగులైనా దాటని మెత్తని ధ్వని ఆమె సొమ్ము. కండ్ల పట్టీలతో కదలక మెదలక మంచంపై పడివున్న రోగులను ఆప్యాయతతో పలకరించి చెమ్చాతో పాలు వారి గొంతులో పోస్తున్న ఆమె నాకు సాక్షాత్తు అన్నపూర్ణగానే కానవస్తుంది. రోగులు చాలును అన్నా, "బాబూ, మరికొంచెం తాగు, తాగకపోతే ఎట్లా? ధారకం ఒద్దూ!" అంటూ కన్నతల్లి ప్రేమతో పాలుపోసే ఆమెను అన్నపూర్ణ కాక మరేమంటాము? పొగడ్తలు ఎంత మాత్రము గిట్టని సిస్టర్ దేవదీవన సరళత, సహజ వాత్సల్యం ఏ రోగినైనా బాగుచేస్తాయి.

ఈమె పశ్చిమగోదావరిజిల్లా అనపనవారిగూడెంలో జన్మించింది. కృష్ణాజిల్లా ఇందుపల్లిలో అమ్మమ్మగారి ఇంట విద్యాభ్యాసం చేసింది. మానవసేవా దృష్టితో హైదరాబాద్‌లో నర్సు ట్రైనింగు పొందింది. మూడుపదులు ఇప్పుడిప్పుడే మించిన ఈమె పది సంవత్సరాలుగా సరోజినీదేవి కంటి ఆసుపత్రిలో సిస్టరుగా పని చేస్తున్నది.

సిస్టర్ దేవదీవన వంటివారే తక్కిన అక్కడి సిస్టర్లు మేరీ, సుశీలాదేవిడ్ మొదలైన వారు. రోగుల పాలిటి తల్లులైన వీరిని భగవంతుడు ఎప్పుడూ కరుణించుగాక అని కోరుకోవడంకంటే నాబోటివాడు మరేమి చేయగలడు?

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక, హైదరాబాద్ నోట్‌బుక్ – 3–10–1975)

# ఖండవల్లి నరసింహశాస్త్రిగారు

ఆకుపచ్చని జరీ బుటేదారీశాలువా కప్పుకొని, నీర్కావి ధోవతి కట్టుకొని, పాండిత్య వినయాల భరంతోనా అన్నట్టు ఈషద్వినమిత గాత్రంతో నడిచే స్ఫురద్రూపం, సదాచార సచ్ఛీలాల కాంతిపుంజమైన ముఖం, ఎవరైనా నమస్కరిస్తే, కుడిచేయి సగం ఎత్తి హసన్ముఖంతో ఆదరించే పద్ధతి, ఎవరికీ ఇబ్బంది కలుగరాదనే బుద్ధితో ప్లాట్‌ఫారంపై వోరగా నడిచే తీరు - ఇవి గమనించండి. ఆయనే శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రిగారు. దగ్గరకి వెళ్ళి చూస్తే కనిపిస్తుంది ఆయన వర్చస్సు. ఆ వర్చస్సంతా పెద్ద పెద్ద కన్నులనుంచే ఎదుటివారిపై ప్రవహిస్తుందా అన్నట్లు ఉంటుంది. ఆయన పొడుగాటి పెద్దచెవులు, కోటేరు వంటి ముక్కు, చక్కని పలువరుస ఆయన మహావ్యక్తిత్వానికి మరింత వన్నె తెస్తాయి.

నరసింహశాస్త్రిగారు వ్యాకరణ, సాహిత్య, ధర్మశాస్త్ర పారంగతులు, సదాచార సంపన్నులు, సుందరకాండ, భగవద్గీతా నిత్య పారాయణులు, నమక చమకాలతో నిత్యపూజ ఏ పరిస్థితులలోను తప్పరు. వారి జన్మస్థలం మహబూబ్ నగర్‌జిల్లా గోపాలపేట సంస్థానం. అక్కడే బాల్యంలో శ్రీ వల్లా నరసింహశాస్త్రి గారి వద్ద పంచకావ్యాలు, కౌముది, పరిభాషేందుశేఖరం చదివారు. పిదప ఆకిరిపల్లి సంస్కృత కళాశాలలో గొడవర్తి సంపత్కుమారాచార్యుల వద్ద భాష్యాంతం వ్యాకరణం చదివారు. పిదప పిఠాపురం, వనపర్తి పరీక్షలిచ్చి ఉత్తమ బహుమతులు పొందారు. 1943 నుంచి 1966 వరకు సీతారామ్‌బాగ్ వేదాంతవర్ధినీ సంస్కృత కళాశాలలో వ్యాకరణాధ్యాపకులుగా వుండి వందలాది శిష్యులను అన్నివర్గాలలోను తయారుచేశారు. యాదగిరిగుట్ట దేవాలయం ఆస్థానకవిగానూ, వనపర్తి సంస్థానం వ్యాకరణం పరీక్షకులుగాను, తిరుపతి వేదశాస్త్రాగమ సభ పరీక్షకులుగాను ఉన్నారు. ఇక సన్మానాలకు, వాక్యార్థాలకు కొదువలేదు; అన్ని సంస్థానాలలోను సన్మానాలు పొందారు. శృంగేరి, కామకోటి మఠాలలో వ్యాకరణ వాక్యార్థాలు చేసి ఉత్తమ సన్మానం పొందారు. ఉద్యోగానికి అవసరం కాగా వ్యాకరణ, సాహిత్య శిరోమణి పరీక్షలలోను ఉత్తీర్ణులయ్యారు.

శాస్త్రిగారి వాచికం బహుదొడ్డది. భాగవతం 18 వేల శ్లోకాలు 24 గంట

లలో పారాయణం చేస్తారు. 'వాచకశిరోమణి' అని ఆయనకు చిన్ననాటి బిరుదు. ఆయనకు 12 సంవత్సరాలప్రాయం నాటిమాట. మహారాజా గోవింద నాయక్‌గారు కృష్ణాతీరంలోని యాపర్ల క్షేత్రంలో భాగవతసప్తాహం చేయించ దలచారు. నరసింహశాస్త్రిగారి వాచికం తెలిసిన బాలసరస్వతి శ్రీనివాసాచార్యులు మొదలయినవారు ఆయననూ రమ్మన్నారు. కాని గోవింద నాయకునికి నమ్మకం కలుగకపోయినా, పండితులు చెబుతున్నారు గదా అని ఆయనను నియమించారు. ఆయన అందరికీ ఆశ్చర్యం కలిగేట్టు భాగవతం చదివారు. బాల్యంలో ఈ వాచిక శిరోమణికి ఆత్మకూరులో మరొక పరీక్ష తగిలింది. కొందరు వైష్ణవ పండితులు ఆయన సత్తా తెలుసుకొనడానికి తిరువాయ్‌మొళి అందించారు. ఆయన సంస్కృతాంధ్రాలలాగే గడగడ చదివారు. ఇవి ఈ వాచికాభరణుని అపూర్వ పఠనశక్తి.

ఆయన శంకర విజయానికి కొంతవరకు వ్యాఖ్య చేశారు. భగవద్గీతా వ్యాఖ్య, సప్తగిరి మాహాత్మ్యం, శివలీల, వేములవాడ రాజేశ్వర కల్యాణం మొదలైన సంస్కృత రచనలు చేశారు. రేడియో ప్రసంగాలు చాల ఉన్నవి. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశానికి వ్యాకరణ శాస్త్ర విషయవ్యాసాలు చాల వ్రాశారు.

సంస్కృత భాషతో సంబంధంలేని తెలుగు లేదు గనుక తెలుగు అభివృద్ధికి సంస్కృత వాఙ్మయం, అందులోను వ్యాకరణం అవశ్య పఠనీయమని శాస్త్రిగారు గట్టిగా చెబుతారు. నరసింహశాస్త్రిగారి వంటి మహా విద్వాంసుని, పాండిత్య, సచ్ఛీల, సదాచార విన్రముని, నిష్కళంకుని కన్న తల్లిదండ్రులు శ్రీయుతులు లక్ష్మణశాస్త్రి, అనంతమ్మగార్లు ధన్యులు. సప్తతి నిండిన శాస్త్రిగారు కనీసం సహస్రమాన జీవులై ఇంకా చాల రచనలు చేయాలి.

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక, హైదరాబాద్ నోట్‌బుక్ – 3–10–1975)

# ఆచార్య సత్తముడు

పదేండ్ల నాటి మాట. తెలుగునాడు ప్రముఖులను ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక పాఠకులకు పరిచయం చేయడానికి నియుక్తులమయిన నేను, నా మిత్రుడు, సహపత్రికా రచయిత శ్రీ నీలంరాజు మురళీధర్ తిరుపతి చేరాము. ఆయన గృహంలో అడుగు పెట్టాము. విద్యార్థుల మధ్య ఆసీనులై వున్నారు. అప్పుడాయన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖ అధ్యక్షులు. నా మిత్రుడు శ్రీ మురళీధర్ మెడలో కెమేరా వేలాడుతున్నది.

నేను ఆయనకు చిరపరిచితుడను. ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రచురించిన ద్విపద భారతం లిఖిత ప్రతిని తంజావూరు సరస్వతీ మహల్ పుస్తక భాండాగారం నుంచి నకలుచేసి, ముద్రణకు సిద్ధపరచిన తొలి యిద్దరిలో నేనొక్కడిని. రెండవవాడు మిత్రుడు శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మ; పింగళివారే సంపాదకుడుగా వున్న రంగనాథ రామాయణ ప్రచురణలో కూడ శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారితో పాటు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి వశంవదుణ్ణిగా ఉన్నవాడిని. నా అప్పటి పని ఆయనకు తెలుసు. మేమిద్దరం నమస్కారం అనగానే తిరిగి చూచి మందహాసంతో కుశల ప్రశ్న వేశారు. మేము మా ఆగమన కారణం తెలిపాము. ఒక్కసారిగా ఆయన ముఖం మీది మందహాసం మాయమయింది. ఆకృతి గంభీరమయింది.

"ఊహూఁ! నాకు మీ ప్రచారం అక్కరలేదు. నా పనేదో నేను చేస్తున్నాను. పత్రికలలో గొప్పలు నాకు వద్దు." అన్నారు.

"మీకు కాదండీ గొప్ప. మాకు. మా పత్రిక కండీ. తామర తంపరగా శిష్య సంతతి ఉన్న మీ విద్యా కుటుంబం అందరికీ— తెలుగు సీమలోని వారందరికీ— తెలియాలని మా పత్రిక ఆశిస్తున్నది; దేశంలోని వివిధ రంగాలలోని ప్రముఖులను పరిచయం చేయదలచింది. మా పత్రిక విజ్ఞప్తిని మీరు మన్నన చేయాలి" అన్నాము.

ఆయన ససేమిరా ఒప్పుకోలేదు. మేము నిరాశతో వెనుదిరిగి పోవలసి వచ్చింది. అంత సరళోపసర్పణీయమైన ఆయన మూర్తి అంత త్వరలో,

త్రుటిలో గంభీరాధృష్యం కావడం ఏమిటా— అని విస్తుపోయాము.... ఔను! ఎందుకు కాదు? ఆయనకు ఈషణ త్రయాన్ని కూడా మించిన చతుర్థేషణ— కీర్తిషణ— లేదు. కీర్తిషణ ఉన్నవాడు కదా ప్రచార ప్రాగల్భ్యాలకు అంగలార్చుతాడు; నేలకు నింగిని ఏకం చేస్తాడు! ఆయనకు అవి అవసరం లేదు. సచ్ఛిష్యులే సంచార ప్రచార సాధనాలు. ఆయన పదహారు అణాల ఆచార్యుడు; నిజమైన ఉపాధ్యాయుడు అని అనుకుంటూ తిరిగి వచ్చాము నేనూ, శ్రీ మురళీధర్. చెప్పిన జ్ఞాపకం వచ్చింది ఆయన తన కవితను గురించి

"నికరమ్మై అకలంకమైన సరకుల్
నిర్దుష్టముల్ నీ పరీ
క్షకు తాళంగల మేటి క్రొందినుసు మీ
కన్గప్పు మోసంపు వ
ర్తకుడన్ గాను కులక్రమాగతము బే
రంబిద్ది భాషా కుమా
రకులారా కొనరండు భవ్య కవితా
రంభ ప్రియంభావకుల్"

అని అర్ధశతాబ్ది కిందే అన్న పద్యం! ఈ ప్రచార పరాఙ్ముఖత్వం ఆయనకు ఆనాటినుంచే ఉంది. కొంచెం మనసు కుదుట పరుచుకున్నాము.

ఔను! ఆయన పింగళి సూరన్న వంశంవాడనని చెప్పుకొనే వారు గదా. సూరన్నకున్న వన్నెలలో కొన్నైనా తప్పవు గదా! ఆయన డాక్టర్ పింగళి లక్ష్మీకాంతంగారు.

శ్రీ పింగళి లక్ష్మీకాంతం కృష్ణా జిల్లా చల్లపల్లి తాలూకా చిట్టూర్పు గ్రామంలో 1892 జనవరి 10 వ తేదీన జన్మించారు. ఆయన తండ్రి శ్రీ వేంకటరత్నంగారు. తల్లి శ్రీమతి కుటుంబమ్మ. మచిలీపట్నంలోని హిందూ హైస్కూలులో చదివేటప్పుడే ఆయనకు తెలుగు భాషపై తీపి కలిగింది. దానికి కారణం కింకవీంద్ర ఘటాపంచాననేత్యాది బిరుదాంచితులైన శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ఆయన గురువులుకావడం. శాస్త్రిగారి శిష్యులందరూ చండప్రచండులే. శ్రీ లక్ష్మీకాంతంగారి భాషాసక్తిని శ్రీ వేంకటశాస్త్రిగారు బాగ ప్రోత్సహించారు. గురుశుశ్రూషవల్ల ఆయనకు చక్కని శైలీ, అవధాన ప్రజ్ఞ కలిగాయి. ఈ శైలీ ప్రజ్ఞలు గుర్వనుగ్రహ మని ఆయన ఒక సందర్భంలో ఇలా చెప్పుకున్నారు:

"అంకిలి మాన్పి భాగవత
ఘ్నా పలుకుల్ వెలయించి పల్కులన్

వంకలు తీర్చి దిద్ది రస
వంతముగా నొనరించె నెప్పుడా
కింకవి రాజ మత్త గజ
కేసరి సద్బిరుదాంచితుండు మా
వేంకట శాస్త్రి సద్గురు
కవి ప్రభువున్ మది నిల్పి గొల్చెదన్."

లక్ష్మీకాంతంగారు కుటుంబపు చిక్కులవల్ల, తండ్రిని కోల్పోవడం వల్ల ఎట్లో ఎస్. ఎస్. ఎల్. సి. పూర్తి చేశారు. జీవిక కోసం కష్టపడవలసి వచ్చింది. విజయవాడ సబ్ కోర్టులో కాపీయిస్టుగా కుదురారు. రెండేళ్ళు పని సాగింది. కాపీయిస్టు అయినవాడు కోర్టులో నిలబడే వ్రాయడం అప్పటి ఆచారం. కూర్చుని వ్రాయగూడదు. లక్ష్మీకాంతంగారు కూర్చుని వ్రాస్తున్నారట. సబ్ జడ్జి ఇది చూచారట. నిలబడి వ్రాయాలని మందలించారట. ఆయన కవి— అలాంటి మందలింపులకు తలఒగ్గని ప్రకృతి. మరుసటి ఉదయయే నౌకరీకి తిలాంజలి యిచ్చారు.

ఈ ప్రవృత్తి ఆయన జీవితమంతా ఉండేది. నా మిత్రులు శ్రీ కేశవ పంతుల నరసింహశాస్త్రిగారు ఒక సన్నివేశం గురించి చెప్పారు. శ్రీ లక్ష్మీ కాంతంగారు ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో ప్రొడ్యూసర్‌గా ఉన్నప్పుడు న్యూ ఢిల్లీలో ఒక ప్రొడ్యూసర్ల సమావేశంలో పాల్గొనవలసి వచ్చిందట. దానికి అధ్యక్షుడు కేంద్ర ప్రభుత్వ సమాచార ప్రసార శాఖా మంత్రట. ఆయన ప్రతి ప్రొడ్యూసర్‌నూ, వేలెత్తి కదిలిస్తూ, ఇలా రమ్మన్నట్టు పిలిచాడట. లక్ష్మీకాంతం గారు మంత్రి ప్రవర్తనను తీవ్రంగా నిరసించారట. ఎదుటివాడూ పెద్దమనిషేననే భావం మంత్రికి కలిగింది. దానితో ఆ మంత్రి ఈయన వద్దకేవచ్చి మాట్లాడాడట.

ఆయన విజయవాడ సబ్ కోర్టు నౌకరీకి ఇస్తీఫా ఇవ్వడం మేలయింది. లేకపోతే, ఆంధ్ర సాహిత్యం సంపన్నమయ్యేదా? నౌకరీ వదిలారేగాని, జీవిక ఎట్లా? నాటకాలలో వేషాలు వేయడం మంచిదనుకున్నారు రాత్రి వేళల్లో. అదొక ఔత్సాహిక వృత్తి అయింది. ఉదయం చదువు. మచిలీపట్నంలోని నోబుల్ కళా శాలలో ఇంటర్మీడియేటులో చేరారు. నాలుగేళ్ళు కళ్ళు మూసుకొని, పళ్ళు బిగ బట్టి చదివారు. పట్టభద్రులయ్యారు. ఈ నాటకాలలో వేషాలు వేయడం దాదాపు ఒకటిన్నర దశాబ్దంపాటు జరిగిందని ఆయన ఇలా చెప్పుకున్నారు:

"శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు తాము వ్రాసిన నాటకములను వారి శిష్యులచే ప్రదర్శింప జేసేవారు. అందువలన వారి శిష్యులలో ఒకడనైన నేను

కూడా వేషంవేసి నటించే అవకాశం కలిగింది. వారు ఏ ఊరిలో శతావధానం చేస్తారో ఆ ఊరిలోనే మాచే నాటకం వేయించేవారు. శ్రీ శాస్త్రిగారు తన శిష్యులను కవిత్వంలోనే కాక నటనలో కూడా తర్ఫీదు చేశారు. చక్కగా పద్యాలు చదవడం సాహిత్య పాఠాన్ని తూచా తప్పకుండా చెప్పడానికి తోడ్పడింది.... ఒక దఫా రాజమండ్రిలో నాటకానికి ధర్మరాజు వేషం వేసే శిష్యుడు రాలేక పోయాడు. అప్పుడు శ్రీ శాస్త్రిగారు ఆ వేషం నన్ను వేయమన్నారు. వేశాను. అదే నా ప్రథమ నాటకం. దానివల్ల తిక్కన భారతం పరిశ్రమ చేయడానికి దోహదం కలిగింది. నా కృషికి ప్రోత్సాహం కలిగింది. 1912 నుండి 1927 వరకు నాటకాలలో వేషాలు వేశాను....ఆకాలంలో వేషం వేసేవారిని ఒక విధంగా చిన్నచూపు చూసేవారు. కాని, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు తమ శిష్యులచేత వేషాలు వేయిస్తున్నారని ఒక గౌరవం వచ్చింది. చదువుకొన్నవారు వేస్తున్నా రంటే కళకు కొంత గౌరవం. మేమంతా భాషా సేవకులంగానే నాటకాలు వేశాము."

మహానటుడు శ్రీ యడవల్లి సూర్యనారాయణగారు పింగళి లక్ష్మీకాంతం గారు తనకు పోటీదారని పరిగణించినట్టు నాటక రంగంలో తల నెరిసిన శ్రీ కె. వి. గోపాలస్వామి (ఆంధ్ర విశ్వవిద్యాలయం మాజీ రిజిష్ట్రారు) ఇటీవల తెలుపడాన్ని బట్టే లక్ష్మీకాంతంగారు నటుడుగా ఆనాడు ఎంత కీర్తి గడించిందీ అర్థమౌతుంది. శ్రీ గోపాలస్వామి గారన్నట్లు లక్ష్మీకాంతంగారి వంటి నటుల వల్ల చెళ్ళపిళ్ళ వారి నాటకాలకు ప్రాచుర్యం కలిగినదన్నా ఆశ్చర్యం లేదు.

నాటకాల కోసం గురువుల వెంట తిరగడంలో లక్ష్మీకాంతంగారికి చిన్ననాడు అవధానాలు చేసే అభిరుచీ కలిగింది. తిరుపతి వేంకట కవులు చెరియొక పాదం చెప్పి అవధానం చేస్తే, తాము చెరియొక పదం చెప్పడమేకాక ప్రాచీన నవీన కవితల్లోను అవధానం చేయగలమని చెప్పుకొన్నారు. పింగళి కాటూరివారల వేమవరం అవధానం గురించి లక్ష్మీకాంతంగారి సన్నిహితులు చెప్పగా గుర్తున్న సంగతి వ్రాస్తున్నాను. అప్పుడు లక్ష్మీకాంతంగారిది నూనూగు మీసాల నూత్న యౌవనం. సభవారు తిరుపతి కవులకు ఒక సమస్య యిచ్చి పూరించమంటే, ఆయన "మా శిష్యుడు పూరిస్తాడు" అంటూ లక్ష్మీకాంతంగారికి అప్పగించారు. ఆయన ఆచార్యాజ్ఞ పాలించి సెబాసనిపించు కొన్నారు. ఆ పూరిత పద్యమిది :—

"రమ్మని పిల్వనంపిన అ
రాతుల యందలి భీతిజేసి ప్రా

ఱమ్ములు దక్కవంచు నయ
నమ్ముల బాష్పములుప్పతిల్లి శో
కమ్మున కొ్రమం దిరికి
కానగ రానిది వింతకాదు కొ
్రమ్మున దాగియుంట ప్రతి
పక్షులకున్ సహజమ్ము కాదొకో!"

లక్ష్మీకాంతంగారి కవితాలతా వికాసానికి మచిలీపట్నం ప్రధానాలవాల మయింది. శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారి సౌహార్దం ఆయన కవితకు కొత్త సౌరభం కలిగించింది. ఈ సౌరభపు గుమగుమలతో ఆయన మచిలీ పట్నం నోబుల్ హైస్కూలులోను, నోబుల్ కళాశాలలోను కొంతకాలం తెలుగు పండితులుగా పనిచేశారు. పింగళి కాటూరివారు తమ గురువులలాగే జంటకవు లయ్యారు. వారే ఒకానొక సందర్భంలో చెప్పికొన్నట్టు ఒకరు పద్యకుసుమా పచయం చేస్తే, మరొకరు వాటిని మాలగా గ్రథించారు. ఒకరు వివిధ వర్ణాలు సిద్ధపరిస్తే, మరొకరు చిత్రాలు గీచారు. ఒకరిది భావ మయితే మరొకరిది భాష, ఒకరిది పదబంధమైతే మరొకరిది భావ బంధం. ఇలా కవిత ఇద్దరినీ పెనవేసు కుంది: తొలకరిలో దర్శనమిచ్చి తర్వాత సౌందరనందంతో ఆనందాలు చిందించింది.

పింగళివారు మచిలీపట్నంలో ఇలా ఒకవైపు విద్యార్థులను, మరొకవైపు సహృదయులను అలరిస్తుండగా, ప్రత్యేకాహ్వానంపై మదరాసు విశ్వవిద్యాలయం ప్రాచ్య పరిశోధనాలయంలో పరిశోధకులుగా చేరారు.

అప్పుడు ఆయనకు మహా పండితులు, పరిశోధకులు, తెలుగు జాతికి అపూర్వ కావ్యాలు వెదకి యిచ్చినవారు, భారతజాతికి భరతనాట్య శాస్త్రాన్ని, అపూర్వ సంస్కృత రూపకాలు, కుందమాల, చతుర్భాణీవంటి వాటిని అన్వేషించి యిచ్చినవారు (తర్వాత భారత రంగస్థలానికి భరత కోశం సిద్ధపరచి ప్రసా దించినవారు) అయిన శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారితో పరిచయం కలిగింది. దాని మధుర ఫలమే సౌందరనందం. అశ్వఘోషుడు సంస్కృతంలో సౌందర నంద కావ్యాన్ని రచించాడు. ఆ కథనే క్షేమేంద్రుడు తన అవదాన కల్పలతలో సుందరీ నందావదానమనే పేరుతో మధుర మోహనంగా చెప్పాడు. రామకృష్ణ కవిగారు ఆ కావ్యాన్ని అనువదించవలసిందని లక్ష్మీకాంతంగారితో ఏదో ప్రసంగవశాన అన్నారు. అశ్వఘోషుని రచనను జంటకవులు అధ్యయనంచేసి కావ్యం రచించారు. అది అశ్వఘోషుని కావ్యానికి అనువాదం కాదని అనుసరణ_

కథానుసరణ మాత్రమేనని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చెప్పగా వారిలో పరిశీలించిన నేనూ ఒకణ్ణి.

దాని నుండి ఒక పద్యం ఉదాహరిస్తాను :—

'తానా సుందర నందు, డవ్వేలదియా
తన్వంగ లావణ్య లీ
లానందైక నిధాన, మొండొరుల ప్రే
మాలాప కేళీ వినో
దానూనానుభవమ్ము లా మదన వి
ద్యాద్వైశిక్యముల్, సామ్యముల్
కానన్‌రారు గదోయి, కామిజన లో
కమ్మందు నాదోయికిన్'

అంతలో ఆంధ్ర విశ్వ విద్యాలయంలో తెలుగు ఆనర్సు తరగతులు ఏర్పాటు చేసే దృష్టితో తెలుగు శాఖను విస్తరించే ఉద్దేశం కలిగింది వైస్ చాన్సలర్ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారికి. లక్ష్మీకాంతంగారికి ఆంధ్ర విశ్వ విద్యాలయంలో స్థానం లభించింది. 1931 నుండి 47 వరకు తెలుగు శాఖలో వివిధ పదవులు నిర్వహించారు. ఆ పదిహేడు సంవత్సరాలలోను ఆయన అసంఖ్యాకంగా శిష్యులను తీర్చిదిద్దారు. విశ్వవిద్యాలయం పక్షాన ద్విపదభారతం, రంగనాథ రామాయణం మొదలయిన గ్రంథాలు పరిశీలనాత్మకంగా పీఠికలతో ప్రచురించారు.

ఆంధ్ర విశ్వ విద్యాలయాచార్య పదవి నుండి విరమించిన తర్వాత 1953 నుండి 61 వరకు ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో స్పోకెన్‌వర్డ్ ప్రొడ్యూసర్ గాను, సలహాదారుగాను పనిచేసినమీదట శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖ అధ్యక్షులుగా పనిచేసి విరమించారు. తిరుపతిలో ఉన్నప్పుడే గౌతమీ వ్యాసాలు, ఆంధ్ర సాహిత్య శిల్ప సమీక్ష, కుమార వ్యాకరణం అనే సంస్కృత వ్యాకరణం రచించారు.

కేంద్ర సాహిత్య అకాడెమీ సభ్యులుగా ఏడేళ్ళపాటు వున్న లక్ష్మీకాంతం గారిని రాష్ట్ర సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వంతో గౌరవించింది. కాలేజీల తెలుగు పాఠ్య గ్రంథాల నిర్మాణం కోసం ప్రభుత్వం ఏర్పరచిన తెలుగు అకాడమీ ప్రత్యేక సంఘానికి అధ్యక్షులుగా పని చేశారు.

ఆకాశవాణి ప్రొడ్యూసరుగా ఆయన పెక్కు మంచి కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. ఆంగ్ల పీఠికలతో అమరవాణి కార్యక్రమాన్ని ఏర్పాటు చేసిన శ్రేయస్సు

ఆయనదే. ప్రభాత సమయాల భక్తిరంజని కార్యక్రమ ప్రమాణం పెరిగి రంజకం కావడానికీ ఆయనే కారణభూతులు.

శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం 1970లో ఆయనను గౌరవ డాక్టరేట్ బిరుదులతో గౌరవించింది.

ఆయన సహస్ర మాసాలు పూర్తిగా జీవించి, ఈ సంవత్సరం 1972 జనవరి 10వ తేదీన రాజధానిలోని ఉస్మానియా ఆస్పత్రిలో కన్ను మూశారు శాశ్వతంగా.

రెండు నెలల క్రితం ఆయనను కాకతాళీయంగా రాజధానిలో దర్శించడం సంభవించింది. ఆంధ్ర వాఙ్మయచరిత్రను రచిస్తున్నానని సూచించారు. శ్రీనాథుని వరకు వచ్చానని అన్నారు. పత్రికా రచయితలకు ఉన్న చాపల్యం కొలదీ, "ఆంధ్ర వాఙ్మయ చరిత్రలు, కవి చరిత్రలు అనంతంగా ఉన్నాయే. ఇటీవల మిత్రుడు ఆరుద్ర వ్రాశాడే పదమూడు సంపుటాలు" అన్నాను, కొంత జంకుతూనే. "ఔను వ్రాశారు. పూర్వపు శ్లోకం మీకు జ్ఞాపకంలేదూ! పర్వతే పరమాణౌచ పదార్థత్వం వ్యవస్థితం - అన్నది" అన్నారు. నేను నిరుత్తరుణ్ణయ్యాను. ఔను. ఎవరి పరిశీలన వారిది, ఎవరి విమర్శవైశారద్యం వారిది, ఎవరి సిద్ధాంతాలు వారివి. దాదాపు మూడు దశాబ్దాలు నిరంతరంగా కావ్యాలంకార భాషా శాస్త్ర పాఠాలు చెప్పినవారి అనుభవం వేరు; తదితరులది వేరు. అంతే కాదు; విషయ నివేదన పరాయణుడైన కేవల చరిత్రకారుని రచన వేరు; ప్రతిభ, దానికి వన్నె పెట్టే వ్యుత్పత్తి, దానికి అనుగుణమైన కవిహృదయ పరిశీలన, దాని రహస్యాలను పూర్తిగా వ్యక్తీకరించే కవితామయ రచన గుత్తగొన్న వారి వాఙ్మయ చరిత్రల సొంపే వేరు.

నాకు పింగళి లక్ష్మీకాంతం గారితో పోల్చదగిన ప్రాచీనుడు ఒక్కడే కనిపిస్తాడు. అతడు క్షేమేంద్రుడు. ఇద్దరికీ సమానమైనవి కవిత, విమర్శనం, లౌకిక ప్రజ్ఞ, పరిపాలన ప్రాగల్భ్యం.

(ఆంధ్రప్రదేశ్ – ఫిబ్రవరి, 1972)

# నాదస్వర సుధాలహరి
# శ్రీ దాలిపర్తి పిచ్చిహరి

**మూ**డు దశాబ్దాల నాటిమాట. తిరువయ్యారులో త్యాగరాజోత్సవాలు కోలాహలంగా జరుగుతున్నాయి. దక్షిణాపథం నాలుగంచులనుంచి వివిధ సంగీత వాద్య రీతులలో నిష్ణాతులైనవారు వేంచేశారు. నిమిషం తెరిపిలేకుండా కచ్చేరీలు సాగిపోతున్నాయి. "ఎవరో తెలుగువారు వాయిస్తున్నారు. యువకులు, ఆంధ్రత్వ మంతా మూర్తీభవించిన వ్యక్తి!" అన్నారు. వెళ్ళాము వినడానికి. శ్రోతలు కిట కిటలాడుతున్నారు.

నాదస్వరం మృదు మధురంగా వినబడసాగింది. "అడడా! ఆహాహా! ఏను సంగతిగళు" అని ప్రశంసలు వివిధ భాషలలో వినబడుతున్నాయి. "సారమతి రాగం ఎంత సారవంతంగా వాయిస్తున్నారండీ ఈయన" అని ఒకరంటే, "ధేనుకరాగానికి ఈయన వాద్యం కామధేనువు!" అన్నారు మరొకరు. "నీలాంబరో! ఎక్కడా వినలేదండీ! శ్రోలతను నీలాంబరానికి తేల్చుకొని పోతుంది కదా!" అన్నారు వేరొకరు. "మీరు లక్ష చెప్పండి శహన ఈయన సొమ్ము. శహనను ఏమి సాధించాడండీ మహానుభావుడు?" అని మరొక సంగీత వృద్ధు బళా బళీలు చెప్పుతున్నారు.

అన్నీ వింటూ కూచున్నాను. నేను కేవలం శ్రోతను, సంగీతశాస్త్ర పరిచయం ఏమాత్రమూ లేనివాడిని. నా మట్టుకు నాకు మలయానిలంలోని చల్లదనం, పున్నాగపు తావిలోని తీయదనం, చందన చర్చలోని హాయి, ప్రత్యూషంలోని ఉల్లాసం, ప్రియవ్యక్తి మృదులగాత్ర పరిష్వంగంలోని మధురానుభూతి కలిపి కలబోసి చుక్కలతో చక్కిలిగింతలు పెట్టి శ్రోతలపై నాదస్వర సుధాలహరిని చిలకరిస్తున్నారా ఈ నాదస్వరూపి—అనిపించి తన్మయతతో తలమునుకలుగా ఉన్నాను.

కచ్చేరీ ముగిసీ ముగియగానే ఆయన వద్దకు పరుగెత్తాను, ముప్పిరిగొన్న ఆంధ్రాభిమానంతో. మహానందపడ్డారు ఆయన. తెల్లటి ఖద్దరు, వినయం, దాని వల్ల కలిగిన సంస్కారం ఉట్టిపడే ప్రవర్తన-ఆయనంటే ఎంతో అభిమానం,

గౌరవం కలిగించాయి. ఆ కాలంలో ఖద్దరు కట్టడమంటేనే నేరం కదా! అలాంటప్పుడు, రాజకీయాలకు సంబంధం లేకపోయినా, కేవల జాతీయాభిమానంతో, తదభిమానానికి ప్రత్యక్ష, బాహ్య నిదర్శనంగా ఖద్దరు ధరించడం, జీవితమంతా జాతీయాభిమానంతో అపిధారావ్రతంగా గడపడం చిన్న విషయాలేమీ కావు.

అప్పటి శ్రీ పిచ్చిహరిగారి స్వరూపం అది. తర్వాత, ఒకతరం గడచిన పిదపకూడ, పాండిత్యం, తదాశ్రితమైన యశస్సు ఎంత వ్యాపించినా, ఆయన స్వభావంలో అహం ఎప్పుడూ పెరగలేదు. ఆ పాండిత్య యశస్సులతో పాటు ఆయన సహజ సరళత, నిరాడంబరత విస్తరిల్లి పరిమళించాయి. కలవారికీ, లేనివారికీ కూడా ఆయన నాదస్వరం పూర్తి విందు. లేనివారింటి విశేషాలలో వాయించడం ఆయనకొక సరదా, వ్రతమూను.

శ్రీ పిచ్చిహరిగారు కృష్ణా జిల్లా దివి తాలూకాలోని లక్ష్మీపురంలో జన్మించారు. అనువంశికంగా వచ్చిన ఆస్తి నాదస్వర వాదనం. తండ్రిగారివద్ద, తర్వాత శ్రీ పారుపల్లి రామకృష్ణయ్యగారివద్ద శుశ్రూష చేశారు. ఏ ఆస్థానమూ ఆదరించకపోయినా, ప్రజాస్థానంలో, ప్రజల ప్రోత్సాహంతో, స్వయంకృషితో పైకివచ్చారు. దక్షిణాదికి వెళ్ళి పెక్కు మెళకువలు పుణికి పుచ్చుకున్నారు. తెలుగు సంప్రదాయం, అనువంశికంగా వచ్చి, తండ్రిగారిద్వారా సంక్రమించిన మెరుగులు మేళవించి కొత్త దస్తూరి గుస్తరించి, కస్తూరి ఘుమాయింపులు పలుమారులు దక్షిణాది సంగీతరసికులకు చవిచూపి జేజేలందుకున్నారు.

పెళ్ళిళ్ళకు పుట్టినిల్లైన వసంత గ్రీష్మ ఋతువులలో చూడాలి ఆయన ఉత్సాహోద్వేగావేశాలు. అర్ధరాత్రివేళ ఊరు నాలుగు వీధులూ తిరుగుతూ ప్రజలు నిదురబరువుతో వాలిపోతున్న కనురెప్పలను దృఢ సంకల్పంతో పైకి కదలిస్తూ వింటూ వుండగా, పెళ్ళి ఊరేగింపుల ముందు నాదస్వరం వాయిస్తూ, ప్రజా హృదయాలను రాగరంజితం చేస్తూ చిద్విలాసం చూపేవారు.

ఆయన వాద్యం ప్రధాన లక్షణం లాలిత్యం. మధురమైన, సున్నితమైన పలుకుతో, స్థాయితోపాటు హాయి పెంచుతూ ఆ నాదస్వరం వీనులవిందు చేస్తుంది. శ్రుతి బాగా తగ్గించి, రెండూ ఒకటిన్నరలో వేణుగాన సుఖాన్ని కలిగిస్తూ, నొక్కులు నొక్కి సొక్కజేసి సొగసుగా స్వరం అనగల ప్రజ్ఞ ఆయన సొమ్ము. "ఇంకా తక్కువ శ్రుతిలో వాయించడం మా పిచ్చిహరి అపూర్వ ప్రజ్ఞ. పూర్వం అల్లంతదూరంలో ఉంటేగాని వినలేని నాదస్వరం ఇప్పుడు కచేరీలో కూర్చునే వినవచ్చు" అని శిష్యుడిని గురించి చెబుతూ మురిసిపోయేవారు ఆయన గురువర్యులు శ్రీ పారుపల్లి రామకృష్ణయ్యగారు.

పలుకు పలుకుతున్నట్లే, గొంతు ఒదిగినట్లే ఆయన నాదస్వరంకూడ ఒదిగివచ్చేది. ఇదివరకు అన్నట్లు సారమతి, ధేనుక, నీలాంబరి, శహానవంటి తత్త్వ స్ఫోరకమైన రాగాలు ఆయన ఆలపిస్తుంటే శ్రోతలు భావావేశంతో ఉద్రూతలూగేవారు. పలువురు గురువులవద్ద లక్ష్య లక్షణాలతో అపారజ్ఞాన సంపత్తిని ఆర్జించిన ధీశాలిగనుక అటు పండితులను తలలూపేట్టుచేశారు; మరొక వైపు సామాన్య శ్రోతలను నాదామృత తరంగాలలో తేలియాడజేశారు.

ఆయన చేసిన నాదస్వర కచ్చేరీల సంఖ్య వేలపైన ఉంటుందన్నారు విద్వాంసులు. ఆయన అనేక సన్మానాలు పొందారు, "నాదస్వరకోవిద" మొదలయిన బిరుదులు పొందారు. ప్రథమశ్రేణి నాదస్వర విద్వాంసుడుగా ఆకాశవాణి చేత మన్నన పొందిన ప్రథమాంధ్ర విద్వాంసులు ఈయనే.

తిరుపతి వేంకటేశ్వర సంగీత కళాశాలలో నాదస్వర శాఖకు ప్రధానాచార్యులుగా నియమింపబడినప్పుడు నాకు ఎంతో సంతోషం కలిగింది. ఆయన సుస్పష్టమైన పలుకు, విలంబకాలంలోగాని, ద్రుత కాలంలోగాని త్రిస్థాయిలలోను అనర్గళంగా, విస్పష్టంగా తీయనినాదంతో పండితులచే ప్రత్యేకమని పరిగణితమైన ఆయన వాద్యం శిష్యవర్గానికి సంక్రమిస్తుందిగదా అని అందరూ ఆనందించారు. సాటివారిపై ప్రేమాదరాలు, పెద్దలయెడ గౌరవ వినయాలు, శిష్యులయెడ వాత్సల్యం-తిరుపతిలో ఆయన కీర్తిని మరింత పొడిగించాయి.

ఈ సంతోష సమయంలో శ్రీ పిచ్చిహరిగారి మరణవార్త సంగీతరసికులకు పిడుగుపాటు అయింది. (శ్రీ పిచ్చిహరిగారు బందరులో ఈనెల 23వ తేదీ రాత్రి 9-15 కు ఒక వివాహంలో నాదస్వరం వాయిస్తూ, అకస్మాత్తుగా గుండె ఆగి మరణించారు.) ఇంత దుఃఖంలోను ఎంత భాగ్యశాలి ఈయన! తుదిక్షణం వరకు నాదోపాసన చేస్తూ, నాదస్వరం వాయిస్తూ, నాదబ్రహ్మలో లీనమయిపోయారు!-అనిపించింది. కాని, ఆయన హఠాన్మరణంవల్ల ఆంధ్రదేశానికి అపార నష్టం కలిగిందే అని తలపోసినప్పుడు, దుఃఖం పొంగివస్తుంది.

అంతేకాదు. ఇలాంటి పెద్దలు పరమపదించినప్పుడెల్లా నన్ను పెద్దదుఃఖం పీక్కు తింటుంది. వీరందరూ పోతే సంప్రదాయం ఏమైనట్టు? శిష్యసంతతి అంతటి పరిణతి పొందిందా! లేదు. ఇటీవలే శ్రీ పిడేలు నాయుడుగారు పరమపదించారు. ఆయన తీర్చిదిద్దిన లాలిత్య సంప్రదాయంలో ఎంతమంది శిష్యులు పారం పొందినవారు నేడు కనిపిస్తున్నారు?

నాదస్వరం మనకు ప్రాచీనమేకాదు, పరమ ప్రామాణికమైన వాద్యం.

మన రాష్ట్రంలోని ఏ ప్రాచీన బౌద్ధ జాతక శిల్పాలను చూచినా సుషిరవాద్యాల ప్రాచీనత స్పష్టమవుతుంది. ఇక ఏ శుభకార్యం తలపెట్టినా కాశ్మీర్ మొదలు కన్యాకుమారివరకు శహనాయి పేరుతో గానీండి, మరొక పేరుతో గానీండి-నాద స్వరంతోనే ప్రారంభిస్తారు గదా. ఆ మధ్య ఇది తెలుగుదేశంలో కొంత ఉపే క్షితమయినా, శ్రీ పిచ్చిహరిగారివంటి పలువురు నాదస్వర విద్వాంసుల కృషి వల్ల విస్తరించి ఇప్పటితరం వారినీ ఆవరించుకుంటున్నది. ఇలాంటప్పుడు ఈలాటి విద్వచ్ఛేఖరులు అస్తమిస్తే, ఏమిటి గతి? పాత కొత్తలను కలిపే కమ్మని కొలికి ఏదీ?

(ఆంధ్రపత్రిక – 27-6-1965)

# శ్రీ రాఘవ సంస్మరణం

దాదాపు అర్ధశతాబ్దినాటి ముచ్చట. గాంధీజీ తొలిసారిగా విచ్చేయడంతో బళ్ళారి పట్టణం కోలాహలం చెప్పలేము. మా తాతగారు శ్రీమాన్ తిరుమల తాడిమర్రి నరసింహాచార్యులవారు ఎన్నో వ్యవహారాలకోసం తరచు మాగ్రామం కమలాపురం నుంచి బళ్ళారికి వచ్చేవారు. నేను గాంధీజీ దర్శనంకోసం వారి వెంటపడ్డాను. ఇక తప్పదని వారు నన్ను బళ్ళారికి తమ వెంట పిలుచుకొని వెళ్ళారు.

బళ్ళారిలో మా మకాం "ఆంధ్ర నాటక పితామహ" ధర్మవరం రామ కృష్ణమాచార్యులవారి బంగళాలో. మేము బంగళా కాంపౌండులో అడుగుపెట్టీ పెట్టగానే, "ఓహో! శ్రీవారా! ఎప్పుడు వేంచేయడం?" అని పలకరించారు ఒకరు మా తాతగారిని. కుశలప్రశ్నలు రెండు మూడు నిమిషాలపాటు జరిగాయి. నేను వింటున్నాను; వారినే చూస్తున్నాను. వారు వెళ్ళిపోయిన తర్వాత, నా కుతూహలం గుర్తించినట్టున్నారు మా తాతగారు; నాతో అన్నారు: "రాఘవాచార్లు, గొప్ప వకీలు. నాటకాలలో గొప్పగా నటిస్తాడు. పెద్ద మనసువాడు" అని. నాకు అవేవీ అర్థంకాలేదు. కానీ, వారిని చూస్తున్నంతసేపూ మా తాతగారితో సంత చెప్పించుకుంటున్న ఆళవందార్ స్తోత్రంలోని విష్ణు వర్ణన శ్లోకాలు నా తలలో తిరిగిపోయాయి :

"ప్రబుద్ధ ముగ్ధాంబుజ చారులోచనం
సవిభ్రమ భ్రూలత ముజ్జ్వలాధరమ్,
శుచిస్మితం కోమలగండ మున్నసం
లలాట పర్యంత విలంబితాలకమ్."

అప్పుడే విచ్చిన కమలాలవంటి కండ్లు, విలాసంగా వంపులు వంపులు తిరిగిన కనుబొమలు, ఎర్రగా మెరిసిపోయే పెదవులు, తెల్లటినవ్వు, మృదువయి చిదిమిన పాల్గారు చెక్కులు, ఎత్తయిన ముక్కు, వీటన్నిటికీ తిలకప్రాయంగా నొసటిపై నాట్యమాడే ముంగురులు-ఆహా ఎలాటి సుందర విగ్రహ భావన-నాడూ నేడూ నేను యామునాచార్యులు వర్ణించిన శ్రియఃపతి తిరుముఖ మండలాన్ని సాక్షాత్క రించుకోలేదు కాని, ఆ వర్ణనమంతా ముద్దకట్టిన బళ్ళారి రాఘవను అప్పుడు

చూచాను; తర్వాత ఎన్నోసార్లు చూచాను. రంగస్థలంలో చూచాను; ప్రజా సేవా రంగంలో చూచాను. ఎప్పుడు చూచినా, ఎప్పుడు తలచినా, ఆ శ్లోకమూ, తర్వాత వున్న సుందర శ్లోకాలూ మనసులో మెదిలేవి.

నేను రాఘవను రంగస్థలంలో మొట్టమొదటిసారిగా చూచింది హిరణ్య కశిపుడుగా. అపుడు నా వయస్సు చాల చిన్నదే. కాని, రాఘవ ప్రదర్శించిన భావ శబలతను నా బుద్ధికూడా గ్రహించగలిగింది. ఒకవైపు ఏకైక పుత్రు డయిన ప్రహ్లాదునిపై వాత్సల్యం, మరొకవైపు శత్రువును గౌరవిస్తున్నాడన్న మాత్సర్యం - ఇవి రెండూ సంఘర్షించి మమత మరుగయి, మాత్సర్యం మెరుగై కోపంగా, రోషంగా, ద్వేషంగా, కాఠిన్యంగా, క్రౌర్యంగా దశాంతరాలు చెందడం, పురుషకారం - మానవశక్తి, సాటిలేని వనుకొన్నది, నమ్మినది, ప్రహ్లాదునివంటి బాలిశుడయిన బాలకుని వలన ముక్కలు ముక్కలు కాగా, ఛిద్రుపలయి చెదిరి పడగా, ఓర్వలేక, పురుషకారాన్ని మించినదేదో ఉన్నదని నేర్వలేక విఫలతతో, వివశతతో నరసింహుని ఎదుట నిస్తేజుడు, నిర్వీర్యుడు అయిన హిరణ్యకశిపు కేవల కాయం, భౌతిక దేహం నరసింహుని ఒడిలో వాలినట్టు, విలీనుడయినట్టు- ఒక్కుమ్మడిగా, భావ పరంపరను, భావ శబలతేంద్ర జాల జాలాన్ని వెదజల్లిన రాఘవ నిజంగా దివ్యసూరులలో ఒకరయిన వైకుంఠ దివ్య ద్వారపాలకుడా అనిపించేది. అనేక జన్మల, అనేక జాతుల, అనేక లోకాల సంస్కారం గలవాడు కానివాడు అలా నటించగలడా? - అనిపించేది.

ఆ హిరణ్యకశిపునే ఎన్నోసార్లు చూచాను. రాఘవ అభినయం నిత్య నూతనం; నవనవోన్మేషం; సతతేంద్రజాలం.

పఠానువేషంలో రాఘవ తీరే వేరు. ఒకవైపు విజయనగర సార్వభౌముల పరాక్రమాలను తందాన పాటల వాళ్ళు గొంతెత్తి, గుమ్మెటలు వాయిస్తూ పాడుతూ వుంటారు. పఠాను ఒక ఓరగా నిలబడి వాటిని వింటూ వుంటాడు. పాట సాగి నంత సేపూ రాఘవలో భావ సంపద వివిధ సంఘర్షణ సరభసంతో తీగలు సాగుతుంది. సామాజికులకు కనురెప్పపాటన్నదే ఉండదు. రెప్ప వేశారా, ఆ రెప్పపాటులో ఏ అభినయ చమత్కారం కోల్పోతారో, ఏమో! అనిమిషులవుతారు. అంతటిది వారి ఉత్సుకత. రాఘవ నోరు కదపడు. ఆ విశాలనేత్రాలు తప్ప మరొకటి కన్పించదు. "His silence is all eloquent while he is on the stage." రాఘవ ఆంగికమే ఇంత భావస్ఫోరకమయినప్పుడు, వాచికం ఇంతకు మించినదే. "Sound echoing the sense" అనే రంగస్థల నియమం రాఘవ నోటినుంచి వెలువడే ప్రతి పలుకులోను ప్రస్ఫుటమయ్యేది. అవసరాలను

బట్టి, స్థాయి భేదాలను బట్టి ఆ వాచికం మధురంగా, గంభీరంగా, సుకుమారంగా, సింహగర్జనంగా. పావురా గునుపుగా - వివిధ రీతులుగా విలసిల్లేది. ఏ స్థాయితో నైనా అది అనుగుణ - అనురూప - ఆవేశపూరితం, పరిపూర్ణం. రాఘవ కంఠం శ్రావ్యమై సామాజికులకు మంత్రముగ్ధులను చేసేది. రాఘవ పద్యాలను వచనం వలె పలికినా, ఆ పలుకు పద్ధతి పరవశులను చేసేది. కనుకనే రాఘవ అభి నయం చూచిన రవీంద్ర కవీంద్రుడు "What if you don't sing, Raghava? There is music in every utterence of yours." అని అనడంలో ఆశ్చర్యంలేదు.

పద్యాలు వచనంగా పలకడమంటే ఒక సంగతి జ్ఞాపకం వస్తున్నది. విశాఖపట్టణంలో ననుకుంటాను, రాఘవ చాణక్య పాత్ర అభినయిస్తున్నారు. శ్రీ శెట్టి లక్ష్మీనరసింహంగారు మొదలయిన కవి పండిత శేఖరులు ముందు వరస లలో కూర్చున్నారు. నాటకశాల కిటకిటలాడిపోతున్నది. రాఘవ పేరుతో మరింత క్రిక్కిరిసిపోయింది, నాటకాలలో పద్యాల రాగాలాపనలకు, పాటల ఫక్కీలకు అలవాటయిన జనం. రాఘవ పద్యాలు వచనాలలాగే సాగిపోతున్నాయి. సంగీతం గిరికీలు కొట్టలేదు, దీనికితోడు చాణక్య పాత్ర ఆహార్యమూ సామాన్యంగా ఉంది. వెనుక తరగతులవారు గోల ప్రారంభించారు. రాఘవ చూచారు కొంతసేపు; జనం ఓరిమి సడలిపోతున్నదని గ్రహించారు. తమ నియమం తప్పరాదు; జనరంజనం జరుగకపోరాదు. రంగస్థలం ముందుకు వచ్చారు. చేతులు జోడించి, తలవంచి, రెండు క్షణాలు నిలబడ్డారు. వెనుక తరగతుల వారిలో గోల అణగారింది; పెదవి కదపలేదు. ఇసుక వేస్తే రాలని జనంలో సూది పడితే వినిపించేంత నిశ్శబ్దం ఏర్పడింది. నాటకం మహోద్భుతంగా, నిరాఘాటంగా సాగి పోయింది. రాఘవ నటన చాతురి ఆనాడు అపూర్వ లావణ్యోదాత్తతను పుణికి పుచ్చుకొన్నదా అనిపించింది.

పాదుకా పట్టాభిషేకంలో దశరథ పాత్ర నిర్వహణలో వాల్మీకి రాఘవకు శరతోపదేశికుడా అనిపించేది. రాఘవ ఆ పాత్ర నటనకోసం వాల్మీకి హృదయం అన్వేషించేవారు; అవలోడించేవారూనట. రామాయణంలోని ఆ ఘట్టమంతా ఎప్పటికప్పుడు అధ్యయనం చేసేవారట; మననం చేసి, పండితులతో క్షుణ్ణంగా చర్చించి కానీ నటించేవారు కారట. ప్రేక్షకులకు ఆ పూర్వరంగమంతా ఏమి తెలుసు? కైక వరాలు వినగానే, దశరథుడు ఆపాద మస్తకం, పెనుమట్టి గాడ్పుకు కదలిపోయిన తరువులాగా వడవడ వణకిపోయాడని వాల్మీకి వర్ణించాడు. రాఘవ

ఆ వర్ణనను నిర్వర్ణనీయం చేశారు. భయ విభ్రమ వేపథ్వాది సాత్త్విక భావాలను పది నిమిషాలపాటయినా ప్రదర్శించేవారు. ఎన్ని పద్యాలు ఎన్ని రాగాలలో పాడితే ఆ నటనకు దీటు?

విషాద సారంగధరలో చిత్రాంగి కొండేలు చెపుతున్న రసవద్ఘట్టం. ఒక్కొక్క చిత్రాంగి బొంకుకూ రాఘవ ముఖంలో కనిపించే మార్పు సహృదయ హృదయైక వేద్యం, ఒకవైపు ఇచ్చమెచ్చిన ప్రియురాలు; మరొక వైపు బహిఃప్రాణమైన తనయుడు-ఈ రెండు ప్రేమల, వ్యామోహాల సంఘర్షణ సమ్మర్ద ముద్రలను పెదవి గదపకుండా పృథివీజనులకందరికీ తెలియజేసే రాఘవ అభినయ వైశారద్యం అనిదంపూర్వం. ఒకసారి చిత్రాంగి పాత్రధారి యైన ఒక నటశ్రీ తన నటన ప్రాభవ ప్రదర్శనానికై రాఘవ గుండె మీద "వెర్రిరాజా" అని ఫెడేలున కొట్టాడు. అప్పటికీ రాఘవ నోరు తెరువలేదు. చిత్రాంగి చేష్టలకు నిర్విణ్ణుడై పడక కుర్చీలో వెనక్కు ఒరిగిపోయిన దృశ్యం నేనేకాదు, ఎందరో నేటికీ మరచివుండరు!

అట్టిదే దుర్యోధన పాత్రకూడా. రాఘవ సంస్కృతాంధ్ర భారతాలు చదివి, కవి పండితులతో చర్చించి ఎంతో శ్రద్ధా జాగరూకతలతో దుర్యోధన పాత్ర అభినయించేవారు. దుర్యోధనుడు మామూలు హల్కా విలన్‌గాదు. అతని క్రోధానికి మూలం మాత్సర్యం, అభిమానమూనూ. తనను అవమానించిన పాండవులను రాజుగా, రారాజుగా, అభిమాన ధనుడుగా ప్రతిఘటించడం దుర్యోధనుడు చేసిన పని — ఆ అభిమాన ధనాన్ని రాఘవ తాము అధ్యయనం చేసిన పద్ధతిలో అభినయించి అభిజ్ఞులను మెప్పించేవారు.

అర్జునుడు నాగలోకంలో కళ్ళు తెరుస్తాడు. తాను ఎక్కడ వున్నదీ తెలియదు. అంతా ఆశ్చర్యం! ఏలోకమిది! స్వర్గమా! కాదు. స్వర్గలోకానికి రావలసిన ప్రసక్తిలేదు. నాగలోకమా? ఏమో! అర్జునుని ఆశ్చర్య సంభ్రమాలను చిత్రించడానికే రాఘవకు ప్రబుద్ధ ముగ్ధాంబుజ చారులోచనాలు ఉన్నాయా అని పించేది. సముద్ర జలాలు లేవు. కనీసం నీలిరంగు యవనికయినా లేదు. తన కళ్ళ నిమీలనోన్మీలనాలతో, మెడల సడలింపులతో, అలకల అలకరింపులతో రాఘవ అద్భుతరసానికి అద్భుతత్వం కలిగించారా అన్నట్టు ఉండేది. ఎంతసేపు ఈ అద్భుతం? ఐదు-పది-పదిహేను నిమిషాల సేపు! మహాగాయకుని రాగ సంచారంలో ప్రతి సుందరమైన, మధురమయిన సంగతికి శ్రోతలు ఆహా అనేట్టు, మహాకావ్యంలోని ప్రతి పద ప్రయోగానికీ రస హృదయులు ఆనందించేట్టు,

నట్టువరాలి ప్రతిచరణ విన్యాసానికి, ప్రతి మంజీర శింజితానికి నర్తన ప్రేమికులు ఊగిసలాడిపోయేట్టు - ప్రేక్షకులు ఎంతోసేపు తన్మయులై ఉండి, ఉలూపి కనిపించగానే తన్మయత్వం తొలగి తనివితీరక తికమకపడేవారేమో! నామట్టుకు నాకు ఆ తన్మయత తొలగగానే మనస్సు కస్సుమన్నది.

ఇక రాఘవ రామదాసు పాత్రను గురించి మరొక నాటకమే వ్రాయవచ్చు.

ఆంగ్ల నటశేఖరులను తమ నటనతో నివ్వెరపడేట్టు చేసేవారట రాఘవ. వారి ఆంగ్ల వాచికానికి ఆంగ్ల నటులే మురిసిపోయే వారట. ఒక్క ఒథెల్లో పాత్రను చూచే మహాభాగ్యం నాకు కలిగింది. అర్ధరాత్రివేళ శిబిరంలో వీరుల కత్తుల కరకరారావం, బాహ్య ప్రకృతిలో భయంకర నీరవం. పహరావాని హెచ్చరిక. గంట మ్రోత విని ఒథెల్లో మేల్కొంటాడు. శయ్యావటకుటీరం నుంచి వస్తూ "Silence that dreadful bell" అని గర్జిస్తాడు. ప్రేక్షకుల గుండె జల్లుమంటుంది.

రాఘవ తమిళ, కన్నడ, హిందీ, ఉర్దూ, పార్శీ నాటకాలలోను అభినయించారు. ఆయా భాషలవారూ రాఘనను తమ సర్వస్వంగానే భావించేవారు.

రాఘవ తమతోబాటు నటించిన "ప్రతి పాత్రధారిని నూరిపోసి చక్కగా తీర్చిదిద్దేవారు. రిహార్సలులో ఆచార్లవారితో సహకరించి నాటక ప్రదర్శనం చేసిన వారందరికీ, మరువరానిది ఆయన ప్రతి విషయంలోను చూపే పరిశీలన: నాటక వస్తువులను చేకూర్చడం, పూజఘంట మొదలుకొని పిన్నులవరకు జాబితాలు తయారు చేయించడం. నాటకం నడుస్తుంటే మహానందంతో తన్మయత్వంతో నటించేవారు" అని శ్రీ సీతారామరెడ్డిగారు వ్రాశారు.

రాఘవను గురించి నాబోటి సామాన్య ప్రేక్షకుడే ఎన్నైనా చెప్పగలిగినపుడు, వారితో నటించే భాగ్యం పొందినవారు ఎన్ని అపూర్వ విషయాలు చెప్పలేరు, ఎంత సంకీర్తనం చేయలేరు?

తెలుగు నాటక కళను నూతన పక్కీకి మళ్ళించినవారు రాఘవ. వారిని మనం గౌరవించడమంటే వారు ఆశించినట్టు మన దేశంలో ప్రజా ప్రబోధానికి నాటకాల ప్రాముఖ్యం ప్రభుత్వం గుర్తించేట్టు చేయడం, జిల్లాకొక నాటకశాలను అధునాతన పరికరాలతో స్థాపించడమూనూ.

చిట్టచివరన రాఘవను గురించి సహస్రమాస జీవిని అయిన మా అవ్వలతో ఒకరు అయిన కొండమ్మవ్వ అన్నమాటలు ఉదాహరించకుండా ఉండలేను. ఒకసారి ఆమెతో మాట్లాడుతున్నప్పుడు రాఘవ నాటకం సంగతి ప్రసక్తాను

ప్రసక్తంగా వచ్చింది. ఆమె విన్నంతసేపు విన్నది. తర్వాత కోపంతో అన్నది కదా: "సరే లేరా! మహాసంబరంగా చెప్పావులే. అంతంత పెద్ద కళ్ళూ, అంత ఒడ్డూ పొడుగూ, అంత పరిశ్రమా వుంటే, ఎవరైనా బాగా వేషం కడతారులే!" అని.

ఇదీ నిజమే. ఆమె ఎంత సరళంగా నటునికి వుండవలసిన సహజ లక్షణాలనూ, నటుడు చేయవలసిన అభ్యాసాన్ని చెప్పింది?- అనుకున్నాను. రాఘవకు ఆ జనుషా సౌకర్యం కలగడమూ భాగ్యవిశేషమే కదా!

(నాట్యకళ, బళ్ళారి రాఘవ సంస్మరణ సంచిక – జూలై-ఆగస్టు 1971)

# సంగీత సమ్రాట్
# ఉస్తాద్ బడే గులామ్ అలీఖాన్

ఉస్తాద్ బడే గులాం ఆలీఖాన్ విఖ్యాత సంగీత విద్వాంసుల వంశంలో జన్మించారు. ఆయన ప్రపితామహుడు మహారాజా రన్‌జిత్‌సింగ్ ఆస్థాన గాయకుడు.

బడే గులాం ఆలీఖాన్ తండ్రి శ్రీ అల్ బక్ష్ ఖాన్ కాశ్మీర్ మహారాజా ఆస్థాన గాయకుడు గాను, ఖైర్‌పూర్ సంస్థాన గాయకుడుగాను వున్నారు.

బడే గులాం ఆలీఖాన్ 1902 ఏప్రిల్ 2వ తేదీన లాహోర్‌లో జన్మించారు. ఆయన బాల్యంలో విద్యాభ్యాసం ఆయన పినతండ్రి శ్రీ కాలేఖాన్‌వద్ద జరిగింది. ఆయనకు చిన్ననాటినుంచే సంగీతంలో చాల అభిరుచి వుంది. గాయక వంశ మాయెనుమరి, తండ్రి తాతలు రాజాస్థాన సంగీత విద్వాంసులు. ఆ సుకృతం ఎలా పోతుంది? పినతండ్రి వద్దే పెరుగుతూ ఐదవ ఏటనే ఆ పినతండ్రివద్దే సంగీతాభ్యాసం ప్రారంభించారు. 16వ ఏట పినతండ్రి మరణించారు. తర్వాత తండ్రివద్దనే సంగీత విద్యాభ్యాసం కొనసాగించారు.

మొట్టమొదటిసారిగా ఆయన సంగీత పరిజ్ఞానం భారతీయులకు కలిగింది. ప్రిన్స్ ఆఫ్ వేల్స్ (ఇప్పుడు డ్యూక్ ఆఫ్ విండ్‌సర్) మన దేశానికి 1922లో వచ్చినప్పుడు. ఆయన అప్పుడు తన గానం వినిపించారు. తర్వాత ఆయన మధుర గానలహరి తరంగితమైంది.

1924లో లక్నోలో జరిగిన అఖిలభారత సంగీత మహాసభలో ఆయన తన తండ్రి అల్ బక్ష్‌ఖాన్‌తోపాటు తమ శ్రోతృ శ్రవణపేయమైన కంఠం విప్పారు. అప్పుడు అక్కడ సమావేశమయిన సంగీత విద్వాంసులంతా ఆహా! శభాష్! అన్నారు. అప్పటినుంచి ఆయన కీర్తిలహరులు, గానలహరితో పోటీ పడ్డాయి; పంజాబ్ రాష్ట్రమంతటా వ్యాపించాయి.

ఆయన చాలాకాలంపాటు స్వరాష్ట్రంలోనే కచ్చేరీలు జరుపుతూ వచ్చారు. 1939లో కలకత్తాలో అఖిలభారత సంగీత మహాసభ జరిగింది. అప్పుడు ఆయన గొప్పగా పాడి, యావద్భారత కీర్తి సంపాదించాడు.

తర్వాత రెండేళ్ళకు ఆయన బొంబాయిలో మరొక గొప్ప కచ్చేరి జరిపారు. అప్పటి నుంచి ఆయనకు అఖిలభారత మహాగాయక శ్రేణిలో స్థానం ఏర్పడింది. యావద్భారతం నుంచి ఆయనపై "సంగీత సమ్రాట్" మొదలయిన బిరుదులు వర్షించాయి.

1953లో ఆయన మద్రాసులో కచేరీ జరిపినప్పుడు, "హరిః ఓం తత్సత్" అనే వేద వాక్యాన్ని తనకు ప్రియమైన రాగాలలో ఒకటైన బెహాగ్ (బాగ్‌శ్రీ) రాగంలో ఆలపించినప్పుడు, తారస్థాయిని అందుకున్నప్పుడు, శ్రోతలు తన్మయులై పోయారు. అప్పటి మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారి శ్రోతలమధ్యనుంచి వేదికమీదికి వెళ్ళి అశ్రుపూర్ణ నయనాలతో ఆయనను ఆలింగనం చేసుకొనడం ఆనాడు ఆ గానపరమాన్నం ఆరగించిన వారికి జ్ఞాపకం వుంటుంది.

ఆయన కేవలం మధుర గాయకుడు మాత్రమేకాదు! గొప్ప సంగీత శాస్త్రవేత్త. అందువల్ల ఆయన "స్వరమండల్" అనే ఒక జంత్ర వాద్యాన్ని శాస్త్రోక్తంగా నిర్మించారు. ఆయనను ప్రజాసామాన్యం మాత్రమేకాక దేశ విదేశాల లోని పెక్కు రాజవంశాలవారు కూడా చాలా ఆదరించారు.

కొన్ని సంవత్సరాలుగా ఆయనకు ఆరోగ్యం సరిగాలేదు. 1961లో ఆయనకు పక్షవాతం తగిలింది. అయినా, ఆయన సంగీత సేవ మానలేదు.

1961లోనే ఆయనను రాష్ట్రపతి "పద్మభూషణ్" బిరుదుతో గౌరవించారు. కేంద్ర సంగీత నాట అకాడమీ 1962లో ఆయనను ఫెలోషిప్పుతో గౌర వించింది. కలకత్తా విశ్వ విద్యాలయం ఆయనకు "డాక్టర్ ఇన్ మ్యూజిక్" అనే గౌరవ బిరుదం ఇచ్చింది.

ఆయన గాత్ర మాధుర్యానికి ముగ్ధుడైన ఆఫ్ఘన్‌రాజు ఒకమారు ఆయనను కాబూల్‌కు ఆహ్వానించారు. ఆయన ఆఫ్ఘన్ దర్బారును, ప్రజలను గానామృతంలో ముంచివేశారు. తన ఆస్థానంలోనే వుండిపోవలసిందని ఆఫ్ఘన్‌రాజు ఆయనను కోరాడు. కానీ, బడే గులాం అలీఖాన్ ఒప్పుకోలేదు. భారతదేశానికి తిరిగివచ్చారు. భారతదేశంలోనే స్థిరపడ్డారు.

దేశ విభజన తర్వాత, లాహోర్‌వాడు కావడం వల్ల పాకిస్తాన్‌కు వెళ్ళి కొంతకాలం వున్నారు. కాని, ఆయన అభిమానులయిన సంగీత ప్రియుల అభ్యర్థనపై భారతదేశానికి తిరిగి వచ్చి లక్నోలో వున్నారు. కొన్ని సంవత్స రాలుగా హైద్రాబాద్‌లో వుంటూ చికిత్స పొందుతున్నారు.

బడే గులాం అలీఖాను శక్తులు గొప్పవి, ఠుమ్రీలోగాని, తానంలోగాని

ఆయన అద్వితీయులు. మాల్‌కోస్, కేదార్, యమన్, దర్బారీ కానడా, బెహాగ్, మొదలయిన రాగాలు ఆలపిస్తున్నప్పుడు, ఆయన శాస్త్ర పాండిత్యం ఎంత లోతువకు పోయేదో, ఆయన కంఠస్రావ్యత ఎంతగా జనాన్ని ఆకర్షించేదో అనుభవైక వేద్యం. ఈ రాగాలాపనకన్నా ఆయన టుమ్రీలు, ముఖ్యంగా "కాకరూ నాజాని ఆయే నా బాలం" వంటివి సంగీతప్రియుల కర్ణకుహరాలలో ప్రతిధ్వనిస్తూ వుంటాయి.

ఉస్తాద్ బడేగులాం అలీఖాన్ గాయకులలో రాజు, రాజులలో గాయకుడు. భారత సాంస్కృతిక వారసత్వ చరిత్రలో ఆయన పేరు నిరంతరం జాజ్వల్యమానంగా వుంటుంది.

ఆయన 1968 ఏప్రిల్ 23 రాత్రి జహీర్ యార్ జంగ్ దేవిడిలో కన్నుమూశారు.

(ఆంధ్రపత్రిక — 25–4–1968)

# శ్రీ క్రొవ్విడి లింగరాజు

**1931** నాటి మాట. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక జరిగింది. సత్యాగ్రహం తాత్కాలికంగా ఆగింది. కాని, విప్లవ వీరులు భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌లను బ్రిటిష్ ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా ఉరితీయించడం దేశాన్ని కలవరపరచింది. ప్రతి భారతీయుని హృదయమూ ఉద్విగ్నమైంది. ఇక యువకుల సంగతి చెప్పనక్కరలేదు. వారు పొంగులువారే ఉడుకు రక్తంతో కుతకుతలాడిపోయారు. సీతానగరం ఆశ్రమం నుంచి వెలువడుతున్న పత్రిక "కాంగ్రెస్" ఈ ఉరితీతపై "వీరబలి" అనే సంపాదకీయం వ్రాసింది. సత్యాగ్రహమే సకలాపరాధ సర్వస్వమైనప్పుడు విప్లవ వీరులను సమర్థించడం సామాన్యమైన నేరమా?

మరుసటి వారమే ఆ పత్రిక "ప్రథమ భారత స్వాతంత్ర్య సమర వర్ధంతి" అనే శీర్షికతో బ్రిటిష్‌వారు 1857 సిపాయి పితూరీ అన్నదానిని సమర్థించింది సంపాదకీయంలో. ఈ రెండు సాహసకృత్యాలకు "శభాష్. తెలుగు గడ్డ గౌరవం నిలబెట్టింది పత్రిక!" అన్నారు జనం. "ఏమిటి ఈ ఆగడం? ఎవరా సంపాదకుడు? బులావ్!" అని ఉత్తరువులు జారీచేశారు అధికారులు. 'కాంగ్రెస్' పత్రిక సంపాదకుని అరెస్టుచేసి, కోర్టులో హాజరుపరిచారు పోలీసులు. ఆ మహావీరుణ్ని చూచి విస్తుపోయారు జిల్లా కలెక్టర్ ఆండర్సన్ దొరగారు.

తెల్లని ఖద్దరు దుస్తులతో బోనులో నిలుచుని ఉన్నాడొక వామనమూర్తి. తనలో సగంలేడు. గుంటకండ్లు. ఎదుటివాని గుండెలు చీల్చుకునిచూచే వాడి చూపులు. వాటికి తట్టుకోడం కష్టమే ననిపించింది ఆ ఆండర్సన్ గారికి. 124-ఎ నిబంధన క్రింద రాజద్రోహం నేరానికి రెండు సంవత్సరాల కఠినశిక్ష, వేయి రూపాయల జరిమానా, జరిమానా చెల్లించకపోతే, మరి ఆరునెలల శిక్ష-అని తీర్పు చెప్పారు. "తీర్పు చదవండి, ఏఏ నేరాలకు శిక్ష విధించారో చూస్తాను. సమాధానం చెప్పుకుంటాను" అన్నాడు "రాజద్రోహి." ఏదీ? తీర్పుపాఠం ఏదీ? ఆండర్సన్ దొరగారు గాభరాపడ్డారు. నోటి మాటగా చెప్పిన తీర్పది. పిట్ట చిన్నదైనా కూత గట్టిదే-అనుకుని తన గదిలోకి పరుగెత్తి, పది నిముషాల తర్వాత తీర్పు కాయితాలతో కోర్టులో ప్రవేశించాడు. తీర్పు వినిపించాడు. వాటిని

ఖండిస్తూ నిందితుడు అనర్గళంగా ప్రసంగించాడు. తన దృష్టిలో తప్పు చేయ లేదని నిరూపించుకున్నాడు. "నీ వాదం వినదలచుకోలేదు. నా తీర్పు తీర్పే. తీసుకొని వెళ్ళండి" అన్నారు దొరగారు. నలుగురు అజానుబాహులు లాక్కుని వెళ్ళారు ఆ 'రాజద్రోహిని'. శ్రీ క్రొవ్విడి లింగరాజుగారే ఆ రాజద్రోహి.

శ్రీ లింగరాజుగారు 1904 నవంబరు 3వ తేదీన రాజమహేంద్రవరంలో జన్మించారు. గవర్నమెంట్ మాడల్ హైస్కూలులో మెట్రిక్యులేషన్ పరీక్ష ముగించి, కళాశాలలో చదువుదామని అనుకుంటుండగా, గాంధీజీ సహాయ నిరాకరణోద్యమ శంఖారావం వినిపించింది. చదువుకంటే దేశమే ముఖ్యమని చదువు మానివేసి ఉద్యమంలో దూకారు. అప్పుడు వారి వయస్సు 16 సంవత్స రాలు. మైనారిటీ తీరలేదు కనుక, కొరడా దెబ్బలు, పేము దెబ్బలతో సాగనంపే వారు పోలీసులు.

1924లో మద్దూరి అన్నపూర్ణయ్యగారు అరెస్టు కావడంవల్ల ఆయన రాజమండ్రి నుంచి నడుపుతున్న "కాంగ్రెస్" పత్రిక నిర్వహణ భారం లింగ రాజుగారిపై పడింది. 1932 వరకు దానిని నిర్వహించారు, మధ్యన అడపా దడపా కారాగారానికి వెళ్ళివస్తూ.

1930లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆరు నెలలు శిక్ష పడింది. "కాంగ్రెస్" పత్రికను ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. కారాగారం నుంచి విడుదలయిన తర్వాత కాంగ్రెస్ పెద్దల సలహాపై (1930 డిసెంబరులో) చెన్నపురికివచ్చి, "షాడో మూమెంట్"(రహస్యోద్యమం) నడిపించారు. పోలీసులకు అంతు చిక్కేదికాదు సత్యాగ్రహులు ఎక్కడినుంచి వస్తున్నారో జట్లు జట్లుగా అని. ప్లవరుబజారు పోలీసు స్టేషను నుంచి పోలీసులైను మూలకు వచ్చేసరికి పేము బెత్తాలతో కొట్టి తరిమివేసేవారు; పోర్టు స్టేషనువైపు రోడ్డులో లాగి పడ వేసేవారు. అక్కడ వేచిఉన్న కాంగ్రెస్‌వారి వ్యాను సత్యాగ్రహులను తీసుకుని డాక్టర్ యు. రామారావుగారు నడుపుతున్న ఆస్పత్రికి తీసుకుని వెళ్ళేది. అక్కడ చికిత్స జరిగేది. ఈ ఆస్పత్రికి శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి ధన సహాయం ఉండేది, అన్ని సంస్థలకూ ఉన్నట్టే.

ఇంతలో గాంధీ–ఇర్విన్ ఒడంబడిక జరిగింది. లింగరాజుగారు 1931 మార్చిలో మరల "కాంగ్రెస్" పత్రికను ప్రారంభించారు. పత్రికను రాజమండ్రి నుంచి సీతానగరం ఆశ్రమానికి తరలించారు. వారు సీతానగరం ఆశ్రమం స్థాపకులలో ఒక్కరు. భగత్‌సింగ్ ఉరితీతపైన సంపాదకీయం వ్రాసినందుకు రెండున్నర సంవత్సరాలు శిక్ష పొందడం మొదట్లోనే చెప్పాను.

ఈ రెండున్నర సంవత్సరాలలోను దక్షిణాపథంలో వారు చూడని కారాగారమంటూ లేదు. వారిని భయంకర విప్లవకారుడు అని ప్రభుత్వం పిల్లి కాపురంగా మూడు నెలలకొకమారు అన్ని జైళ్ళూ తిప్పింది. 1932లో కన్ననూరు జెయిలులో ఉన్నప్పుడు గోర్కీ రచించిన "మదర్"ను "అమ్మ" అనే పేరుతో అనువదించారు. అప్పుడు వారికి కమలనాథ్ తివారీ (ఇప్పటి ఎం.పి.), ఆచార్జీ, మహరాజ్‌జీ, రమేష్ సేన్ గుప్తా మొదలయిన మహానాయకులు సహచరులు. వారి సహవాసంతో మార్క్సిజంపైన ఆసక్తి కలిగి అధ్యయనం చేశారు. ఆ ఆసక్తితోనే అమ్మను అనువదించారు. ఆ లిఖిత ప్రతిని అతి కష్టంమీద జెయిలు నుంచి వెలుపలికి పంపారు. అమ్మను 1934 లో శ్రీ గద్దె లింగయ్య ప్రచురించారు. అది ప్రచురితమైన మూడు నెలలకే దానిని ప్రభుత్వం నిషేధించింది; 1938లో గాని ఆ నిషేధాన్ని తొలగించలేదు.

లింగరాజుగారు 1935 లో కొంతకాలం స్వరాజ్య పత్రిక మేనేజరుగా పనిచేశారు. 31 నుంచి 38 వరకు ఏ.ఐ.సి.సి. సభ్యులు.

1938 లో లింగరాజుగారు రాజమండ్రి మునిసిపల్ ఎన్నికలలో పాల్గొన్నారు. శ్రీ మల్లెంపూడి అప్పారావుగారనే జనతా పార్టీ ప్రముఖుణ్ని వోడించారు. పిదప ఏకగ్రీవంగా చెయిర్మన్‌గా ఎన్నికయ్యారు. 1940 డిసెంబర్‌లో వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొనేవరకు ఆ పదవిలో ఉండి, పట్టణాభివృద్ధికి తోడ్పడ్డారు.

1941 నవంబరులో తిరుచినాపల్లి జెయిలు నుంచి విడుదలయినా మరల 1942 లో ఆగస్టునుంచి డిటెన్షన్‌లో ఉండి, 44 ప్రారంభంలో విడుదలయ్యారు.

అప్పుడు కాంగ్రెసు కమిటీపై నిషేధం ఉన్నందున "కాంగ్రెస్ అసెంబ్లీ" అనే పేరుతో ఒక సంస్థ నెలకొల్పారు. శ్రీ చంద్రమౌళిగారు అధ్యక్షులు. శ్రీ కాశీశ్వరరావుగారు, లింగరాజుగారు ఉపాధ్యక్షులు. శ్రీ సంజీవరెడ్డిగారు కార్యదర్శి. 1946 లో కాంగ్రెస్‌పై నిషేధం తొలగేవరకు ఈ అసెంబ్లీ కాంగ్రెస్ కార్యకలాపాలు కొనసాగించింది.

1946 ఎన్నికలలో వారు శాసన సభ్యులుగా ఎన్నికయి, రాజాజీ మంత్రివర్గంలో రెవెన్యూ మంత్రి శ్రీ ప్రకాశంగారికి పార్లమెంటరీ కార్యదర్శిగా పనిచేశారు. 1953లో "ప్రజా పత్రిక" సంపాదకులుగా ఉన్నారు. 1955లో రాష్ట్ర కాంగ్రెస్ ఎన్నికల నిర్వహణాధికారిగా పనిచేశారు.

అప్పటినుంచి వారి దృష్టి దాదాపు పత్రికా రచనవైపే మళ్ళింది. రెండు జిల్లాల కొక దినపత్రిక ఉండాలనేది లింగరాజుగారి సిద్ధాంతం. ఈ సిద్ధాంతానుగుణంగా కొంతకాలం "గోదావరి" అనే దిన పత్రికను నడిపారు.

రేడియో వచ్చిన తరువాత అంతర్జాతీయ వార్తలకు పత్రికలు ప్రాధాన్య మివ్వడం అనవసరం; స్థానిక వార్తలకు ప్రాధాన్యమివ్వడం ఉచితం అని వారి అభిప్రాయం.

1958 లో గాంధీ సాహిత్య ప్రచురణ సంఘం ఆంధ్ర ప్రాంత సంఘానికి కార్యదర్శిగా పనిచేసి, 180 అమూల్యమైన జాబులు మొదలయినవి సేకరించారు. ఒక సంపుటం అనువదించారు. అది అచ్చయింది.

తర్వాత నెహ్రూ భారతదర్శన్, అబుల్ కలాం అజాద్, ఇండియా విన్స్ ఫ్రీడం, లోకమాన్య తిలక్ అనే ఉద్గ్రంథాలు అనువదించారు. 1934-1944 మధ్య వ్రాసిన కథలను "గొప్పవాళ్ళ న్యాయం" అని సంపుటంగా ముద్రించారు.

లింగరాజుగారు కాలమిస్ట్‌గా చాలా ఖ్యాతి సంపాదించారు. వారు "తరంగాలు", "వారం వారం" మొదలయిన శీర్షికల కింద వ్రాసిన వ్యాఖ్యలు ఎంతో విజ్ఞానదాయకంగాను, ఆహ్లాదకరంగాను ఉంటాయి. విమర్శ ఘాటుగానే ఉంటుంది. వారి "వ్యక్తి చిత్రణలు" (స్కెచ్చిలు) ప్రామాణికంగాను, భావ ప్రేరకంగాను, వ్యక్తి బాహ్యాంతరంగ స్వరూపాన్ని చిత్రించేవిగాను ఉంటాయి. 'రాజా సాహెబ్' అనే పేరులో సాంబమూర్తిగారు, ప్రకాశంగారు, పొట్టి పేర్రాజుగారు మొదలయినవారిని గురించి వారు వ్రాసిన వ్యక్తి చిత్రణలు ప్రజల హృదయాలు చూరగొన్నాయి.

"నేను గార్డెనర్ స్కెచ్చిలేవీ చదువలేదు. నా ధోరణి నాది. నాకు ఏ విషయం చెప్పడమన్నా ఆదర్శం భారతం. భారతాన్ని మా నాన్నగారు ఒళ్ళో కూర్చోపెట్టుకుని చెప్పారు. నాకు ఏ సందేహం వచ్చినా, తిక్కన భారత ఘట్టాలు తిరగవేసి మననం చేసుకుంటాను. తిక్కనలాగ వ్యక్తులను చిత్రించేవాడు అరుదని నా నమ్మకం" అన్నారు వారు.

లింగరాజుగారి కలం వాడైనది. తమ నాయకుడు శ్రీ ప్రకాశంగారిని సైతం ధైర్యంగా ఎదిర్చిన సందర్భాలున్నాయి ఎన్నో. విమర్శ సున్నితమైన హాస్యంతో మేళవించి ఉంటుంది. రాజమండ్రిలో వారికి షష్టిపూర్తి జరిగి నప్పుడు అధ్యక్షత వహించిన శ్రీ బ్రహ్మయ్యగారు "తమ్ముడుగారు తమ కలం వాడిని తగ్గించమని కోరుతున్నాను" అని హెచ్చరించారు మృదువుగా. రాజమండ్రి పౌరులు ఈ షష్టిపూర్తి మహోత్సవంలో వారి సహచరులను పలువురిని గూడ సన్మానించి సంతృప్తి చెందారు.

లింగరాజుగారు సంభాషణ చతురులు. వారితో మాట్లాడుతున్నంత సేపూ హాయిగా ఉంటుంది. ఎక్కడో ప్రారంభమయి, ఎక్కడెక్కడో తిరిగి ప్రధా

కాశం చుట్టూ ప్రదక్షిణం చేసి వెళ్ళుతుంది సంభాషణ. మనకు ఎంతో రాజకీయ జ్ఞానం కలుగుతుంది. కారణమేమంటే వారు మంచి జర్నలిస్ట్ కావడం. "జర్నలిస్ట్‌కు అవసరం లేనిదంటూ లేదు. అన్నీ అంతో ఇంతో తెలియాలి. ఏ విషయంతో నన్నా తీయనీటికి చేప ఎక్కినట్టు ఎక్కిపోవాలి. వంట వార్పు కూడా చేత కావాలి. జెయిలులోను నేను మెస్ మేనేజర్‌నే." అన్నారు వారు. దక్షిణాపథం లోని అన్ని కారాగారాలలోను గడపడంవల్ల జాతీయోద్యమంలో పాల్గొన్న పాత తరంవారు ప్రతివారూ-అన్ని రాష్ట్రాలవారూ-వారికి తెలుసు.

వారు పలు సాహిత్యాలనూ క్షుణ్ణంగా చదివినవారు. కవులను వర్గీకరించడం వారికి గిట్టదు. "కవులలో క్లాసిఫికేషన్ అంటే విడ్డూరంగా ఉంటుంది. భావ ప్రకటనకు ప్రక్రియ ఏదయితేనేమి? రచయిత భావనాబలం, వాంఛ బట్టి ప్రక్రియా స్వరూపం ఉంటుంది. ఏ పుస్తకమయినా చదివినవారి హృదయాన్ని కదలించాలి. గొప్ప పుస్తకం చదివితే, పఠిత దృక్పథమే మారిపోవాలి. విక్టర్ హ్యూగో రచించిన "లా మిజరబుల్" చదివితే క్రిమినాలజీపై మన మనస్సు లగ్నమవుతుంది. పరస్య హృదయే లగ్నం నమూర్ఛయతి యచ్ఛరః అంటూ మన పెద్దలు రచనా ప్రభావం గురించి తెలిపారు."అన్నారు ఆయన.

ప్రస్తుతం వారు స్వాతంత్ర్య సమర చరిత్ర సంఘం సభ్యులు. స్వాతం త్ర్యోద్యమాన్ని గురించి క్షుణ్ణంగా తెలిసిన మిగిలిన పాతతరం పెద్దలలో లింగరాజుగారొకరు గనుక, వారు ఈ సంఘంలో ఉండడం ఎంతో ప్రయోజన కరం.

30 ఏళ్ళ క్రితం అనువదించిన 'అమ్మ'కు సోవియట్‌భూమి వారు నెహ్రూ స్మారక బహుమతి ఇవ్వడం కూడ ముదావహం. "భారత సోవియెట్ సఖ్యం నిన్న మొన్నటిది కాదు. ప్రధాని నెహ్రూ, ఆయన తండ్రి మోతీలాల్ కాలంనుంచే కాంగ్రెసుకు రష్యా ఉద్యమం పైన, ఆ దేశప్రజలపైన సద్భావం ఉంది. దాని ఉద్యమం పద్ధతులను కూడ కొన్నిటిని మనం అనుసరించాము." అన్నారు లింగరాజుగారు.

లింగరాజుగారు తమ తక్కిన వ్యాసాలను, వ్యాఖ్యలను, కథలను సంపుటాలుగా ప్రకటించాలని నా అభ్యర్థన.

(లింగరాజుగారి 'అమ్మ'కు సోవియట్ బహుమతి వచ్చినప్పుడు వ్రాసిన వ్యాసం)

# వయొలిన్ నాదంతో ఆనందలోకాల ద్వారం తెరచిన ద్వారంవారు

"క్రియాసిద్ధిః సత్త్వే భవతి మహతాం నోపకరణే" అన్న భర్తృహరి మాటలు అక్షరాల లక్షమాడల మాటలు.

కాకపోతే, అపస్వర వాద్యమని, 'నిరాధార వాద్య'మని మన సంగీత విద్వాంసులు అనే వయొలిన్‌ను సాధించి, స్వాధీనపరుచుకొని, సుస్వరం పలికించి, శ్రోతలను తన్మయులను చేయడం శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడు గారికి ఎలా సాధ్యమవుతుంది? అది ఆయన సత్త్వం. అది ఆయన సాధన. అదే ఆయన తపోదీక్ష. శ్రీ రాళ్ళపల్లి వారన్నట్టు "ఏ సంగతి వాయించినా, ఎంత మృదువుగా, ఎంత ఘనంగా కమానుతీడినా, నాదంలో స్నిగ్ధత, గాంభీర్యం కొంచెమైనా చెదరక, దృఢ సంకల్పంతో, నిశ్చలమైన నమ్మికతో, ఏకాగ్ర దృష్టితో, బహిరంగమైన చేష్టలేమీ లేక" ఫిడేలే తామై, తామే ఫిడేలై నాదామృతపు సోనలు కురిపించిన నాయుడుగారు "ఫిడేలు నాయుడుగారు" అనే జనం హృదయాలలోనేగాక నాలుకపై నాట్యమాడడం సహజం.

ఆయన వాదనంలో గమకాలు, చారుపట్లు, రవ్వజాతి ఫిర్కాలు (వటుకులు) లాఘవంలో ప్రస్ఫుటంగా, నిండుగా, ఆకర్షణీయంగా ఉండేవి. లయ ఆయన రక్తం. ఆయన స్వర విస్తారం సాటిలేనిది. నోటి పాటలోని గమక విశేషాలను ఆయన కైవసం చేసుకొని, వాటికి తమ వాద్య వాదన విశేషాలు జోడించి పవిత్రమైన నాదంలో శ్రోతల "చేతనము లచేతనములై బరగ" వాయించేవారు.

ఆయన కర్నాటక సంగీతంలోని రహస్యాలను - త్యాగయ్యగారన్నట్టు నాదవిద్యా రహస్యాలను - తెలుసుకొన్నది ఒక ఎత్తు; తాము ఊహించిన సంగీత కల్పనలను వయొలిన్ వాద్యంలో ఎంత అద్భుతంగా ప్రదర్శించడానికి వీలున్నదో అంత బాగా నాదం తీయడానికి పాశ్చాత్యుల వయొలిన్ టెక్నిక్‌ను పరిపూర్ణంగా తెలుసుకొనడం మరొక ఎత్తు. పడమటివారి నాదపుష్టిని, వయొలిన్

వాయించే తీరును మన సంగీతపు రుచులు, పారిశుద్ధ్యం ఇసుమంతయినా చెడనీయక ప్రదర్శించేవారు.

పెద్ద రాగాలలో లాగ ఆయన శుద్ధ బంగాళ, అమృతవాహిని, రంజని, ఉమాభరణం, హంసానంది, శుభపంతువరాళి మొదలయిన చిన్న రాగాలలోను అత్యద్భుతమైన స్వాతంత్ర్యంతో రాగ విస్తారం రక్తిగా కొనసాగించేవారు.

పక్కవాద్యంగా వయొలిన్ వాయించడంలో ఆయనదే ఒక ప్రత్యేకమైన శైలి. సమకాలికులైన గొప్ప గాయకులందరికీ ఆయన పక్క వాద్యం వాయించారు. గొప్ప వ్యక్తిత్వం, మనోధర్మం, విశిష్ట శైలిగల ఆయన వయొలిన్ వాదన ప్రదర్శనకు పక్కవాద్యంలో అవకాశం చాల తక్కువ. కనుక తమ ఊహలను, కల్పనలను స్వేచ్ఛగా, విస్తారంగా, విస్మయావహంగా శ్రోతలకు వినిపించడానికి ఆయన స్వతంత్ర వ్యష్టివాదనం (సోలో కచేరీలు) ఎక్కువగా జరిపేవారు. తమ ఆత్మను లయింపజేయడానికి అట్టి సన్నివేశాలు తప్పనిసరి.

ఆయన పలువురు శిష్యప్రశిష్యులను తీర్చిన కులపతి. ఆయన వయొలిన్ కచ్చేరీలు విని, సన్నిహితులై, గొప్పగా బుద్ధి మనోవికాసాలు పొందిన వారిలో కర్నాటక సంగీత కళాశాల వైస్ ప్రిన్సిపాల్ శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు గారివంటి పలువురు విద్వద్వతంసులూ ఉన్నారు.

ఆంధ్ర తమిళ కన్నడ సంగీత ప్రియులను ముప్పేటగా కలిపిన కర్నాటక సంగీతంలాగే కన్నడనాడులో 1893లో పుట్టి, తెనుగునాట మనుగడ గడిపి, తమిళనాడులో స్థిరపడి, అర్ధశతాబ్దిపాటు సంగీత ప్రియులకు వయొలిన్ వాదనలో వరప్రసాదిత నిపుణతతో, అందచందాల పరిశీలనతో, పండిత పామర రంజకత్వంలో అప్రాకృతం, అనిదంపూర్వం, అనిర్వచనీయం అయిన ఆత్మానందం చేకూర్చి అనేకానేక బిరుదులు పొందిన నాయుడుగారు గడిచిన నెల (1964 నవంబరు 25వ తేదీన) భౌతిక కాయం వీడినా, సంగీతప్రియుల చిత్తాలలో చెక్కుచెదరక ఉంటారు.

నాయుడుగారి ఈ మహోన్నత దశకు కారణం సాధన - నిత్యం వేయి త్రిస్థాయులు వాయించే సాధన. అట్టి సాధన సంపత్తి కలవారికే నాదసంపత్తి సమకూరుతుంది. ఇలాటివారిని చూచే కాబోలు "సాధనమున పనులు సమకూరు ధరలోన" అని తత్త్వవేత్త వేమన అన్నాడు.

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక — 16—12—1964)

# వైద్యరత్న దివి గోపాలాచార్యులుగారు

ఆయుర్వేదం మన ప్రాచీన వైద్య సంప్రదాయం. ఎన్నో శతాబ్దాలుగా అనాదిగా ప్రజల రోగాలను నివారించడమేకాక, ఆరోగ్య రక్షణనుగూడ కలిగిస్తున్న శాస్త్రం ఆయుర్వేదం. మన దేశం విదేశీయుల పలుకుబడిలో, ఆక్రమణలో ఉన్నప్పుడు మన కళలూ శాస్త్రాలు, పోషణ, ఆదరణలేక లుప్తప్రాయమైన సంగతి మనమెరుగుదుము. అట్లే ఆయుర్వేదం గూడ తన మహోజ్జ్వల స్థితినుండి దిగజారిపోయినది. ప్లాస్టిక్ సర్జరీ వంటి శస్త్ర చికిత్సలుగూడ ఎంతో సునాయాసంగా చేయగలిగిన ఈ శాస్త్రం చాల వెనకబడిపోయింది. గడచిన శతాబ్ది ఉత్తరార్ధంలోను, ఈ శతాబ్దారంభంలోను, మనదేశంలో ఒక చైతన్యం ఉవ్వెత్తున లేచి స్వాతంత్ర్య సమరంతోబాటు ప్రాచీన కళలు, శాస్త్రాల పునరుజ్జీవానికి దోహదపడింది. ఆయుర్వేదానికట్టి వైభవాన్ని పునఃప్రతిష్ఠించడానికి అవిరళ కృషి సలిపిన అమరజీవి పండిత డి. గోపాలాచార్లుగారు.

గోపాలాచార్లుగారు 1872 అక్టోబర్ 22 నాడు జన్మ నొందినారు. వీరి స్వగ్రామం కృష్ణాజిల్లా దివిసీమలోని భావదేవరపల్లి గ్రామం. ఇది నాగాయలంకకు సమీపంలో ఉన్నది. దివిసీమ అన్ని రంగాలలోను దిగ్గజాలను ప్రసాదించింది. కోపల్లె హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావు, వేటూరి ప్రభాకర శాస్త్రి, పింగళ లక్ష్మీకాంతం మున్నగువారంతా దివిసీమవారే. ఆచార్లుగారి తల్లి రాజ్యలక్ష్మి, తండ్రి రామకృష్ణమాచార్లు. మచిలీపట్నంలోని అగ్నిహోత్రం కోదండ రామాచార్యులు, గోపాలాచార్లుగారి మాతామహులు. వీరి ప్రాపకంతో రామకృష్ణమాచార్యులు బందరులో (మచిలీపట్నం) వైద్యులుగా స్థిరపడినారు. రామకృష్ణమాచార్యులకు ఇద్దరు ఆడపిల్లల తర్వాత కలిగిన సంతానం గోపాలాచార్లు. రామకృష్ణమాచార్లు గొప్ప వైద్యులు కాబట్టి పిల్లలకు చేయవలసిన విధులన్నీ సక్రమంగా చేశారు: పుట్టగానే జాతకర్మచేసి సైంధవ లవణం తేనెతో నాకించారు. సువర్ణ భస్మాన్ని తేనెతో పెట్టారు. తరువాత నామకరణం జరిగింది. ఆవుపాలు, తల్లిపాలతో పెంచారు. ఆవుపాలలో కుంకుమపువ్వు వేసి త్రాగించేవారట. ఎనిమిదవ నెలలో అన్నప్రాశనం జరిపి బంగారురేకులు (కుందనం)

అన్నంలో కలిపి పచ్చ కర్పూరం, కుంకుమపువ్వు మిశ్రమంచేసి నెయ్యి, ఆవు పాలతో పెట్టేవారట.

గోపాలాచార్లుగారు తమ పినతండ్రి సూర్యనారాయణాచార్యుల వద్ద కావ్యాలు, బృందావనం గోపాలాచార్లువద్ద వేదం, ఆగమం, వైఖానస సూత్రములు మున్నగు విద్యలనభ్యసించి పాండిత్యం గడించారు.

తరువాత గోపాలాచార్లుగారికి ఎక్కడికైనా వెళ్ళి బాగా చదువుకోవాలని బుద్ధిపుట్టి తమ 13వ యేట ఒకనాటి రాత్రి ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయారు. ఎట్లో ఒక పావలా సంపాదించి బెజవాడచేరి, తిండి తిప్పలులేక తిరుపతిచేరి తమ బంధువు కుప్పమ్మ యిల్లుచేరి పడిపోయినారు. ఆమె వీరిని ఆదరించి, వివరాలు తెలిసికొని సంస్కృత కళాశాలలో చేర్పించింది. అట్లా మూడు నాలుగేళ్ళ తర్వాత వారి స్వగ్రామం నుండి యాత్రకు వచ్చిన ఒక కుటుంబంతో బందరు తిరిగి వెళ్ళారు. తల్లిదండ్రులు తిరిగివచ్చినందుకు సంతోషించి, పెండ్లి చేసినట్లయితే మళ్ళీ వెళ్ళడని మేనమామ కూతురితో వివాహం జరిపించారు. కాని తర్వాత కొద్దికాలానికి మళ్ళీవెళ్ళి తిరుపతి చేరారు. ఈ తడవ తెలిసినవారెవరికీ కనబడకుండా జాగ్రత్తపడసాగారు.

తిరుపతిలో తిరుగుతుండగా కొన్ని డేరాలు కనబడితే వాటిని చూస్తూ చుట్టూ తిరుగుతుంటే అక్కడి అధికారి పరిచయం అయింది. స్వతహాగా గోపాలాచార్లు సూదంటురాయిలా ఆకర్షణగల వ్యక్తి. కండ్లలో తేజస్సు, మాటల్లో ఆకర్షణ, స్వభావంలో సమున్నతత్వం ఎవర్నైనా ఆకర్షిస్తాయి. వారం రోజుల తర్వాత ఆ అధికారి తన యువరాజుకు పరిచయం చేశాడు. ఆ డేరాలు నేపాల్ మహారాజు సోదరునివి. అతడు దక్షిణయాత్రకై సపరివారంగా వెళ్లుతూ తిరుపతి చేరారు. యువరాజుగారు మహా తపశ్శాలి; దేవీ ఉపాసకుడు. గోపాలాచార్లు తనకెవరూ లేరని వారితో వస్తానని చెప్పగా సరేనని ఉపదేశంచేసి వెంట ఉంచుకున్నారు. వీరు తిరుగుతూ తిరుగుతూ హైదరాబాదు చేరారు. ఆచార్లుగారి మేనమామ ఇతనిని వెదుక్కుంటూ హైదరాబాదు వచ్చారు. యువరాజుగారు తపస్సంపన్నుడు కావటం వలన ఆచార్లుగారిని వెదుక్కుంటూ వస్తున్నట్లు గ్రహించి గోపాలాచార్లును నిర్బంధంచేసి నిజం చెప్పమని బలవంతం చేయగా వీరు నిజం చెప్పారు. యువరాజు తర్వాత వీరిని మేనమామతో ఇంటికి పంపించారు.

పిదప వీరు ఇంట్లో మౌనంగా ఉంటూ, ఉపాసన చేస్తూ కొంతకాలం గడిపారు. మళ్ళీ వారికి 'వెళ్ళి చదువుకో. వృద్ధిలోకి రా! పేరు ప్రఖ్యాతులు

సంపాదించు" అని అంతరాత్మ ప్రబోధించటం ప్రారంభమైనది. అపుడు మళ్ళీ ఇల్లు, ఇద్దరు పిల్లలను, భార్యను విడిచి తిరుపతిద్వారా మైసూరు చేరుకున్నారు.

పండిత అగరం పుట్టస్వామి శాస్త్రిగారు ఆయుర్వేద మహోపాధ్యాయులు. వారినాశ్రయించి కోరగా, శాస్త్రిగారు ఆచార్లుగారిని శిష్యులనుగా స్వీకరించారు. వారివద్ద నాల్గు సంవత్సరాలు క్షుణ్ణంగా ఆయుర్వేదాన్ని అభ్యసించారు. తర్వాత ఎన్నెన్నో ప్రదేశాలు తిరిగి దేశయాత్ర చేసి, ఆయుర్వేదంలో గొప్ప గొప్ప పండితులందరిని దర్శించి ఆశీస్సులను పొందారు. తిరిగి మైసూరు చేరగానే అక్కడ ప్లేగువ్యాధి సంక్రమించింది. ఆచార్లుగారు గురువుగారి ఆదేశం ప్రకారం ఆ వ్యాధిని నివారించుటలో అవిరళమైన కృషి సలిపి ప్లేగును అంత మొందించారు; మైసూరు మహారాజావారి మెప్పును పొందారు. అక్కడినుండి మద్రాసు చేరుకొన్నారు. అప్పుడు వారి చేతిలో రెండు రూపాయలు మిగిలినవి. దానిలో రూపాయ పావలా పెట్టి ఇల్లు అద్దెకు తీసుకొని వైద్యవృత్తి ప్రారంభించారు. త్వరలోనే వారికి మంచి పేరు వచ్చింది.

శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవస్థానంవారు వీరి పేరు ప్రఖ్యాతులు విని ఆయుర్వేద వైద్యశాలనొకదానిని ఏర్పాటుచేసి వీరినందులో నియమించారు. తరువాత ఆచార్లుగారు శ్రీ కన్యకా పరమేశ్వరీ ఆయుర్వేద కళాశాలనుగూడ స్థాపింపజేశారు. కొంత కాలానికి కమిటీవారు దానిని నడవలేని స్థితికి రాగా ఆచార్లువారు దానిని 'మద్రాసు ఆయుర్వేద కళాశాల'గా మార్చి స్వయంగా నిర్వహించారు. వారి ప్రభావం వలన ఆంధ్రదేశంలోని జమీందార్లు, మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిన్ మహారాజులు కళాశాలకు పోషకులయ్యారు పిఠాపురం మహారాజుగారు మహారాజ పోషకులయ్యారు. కళాశాలకు మద్రాసు కార్పోరేషను వారు వేయి రూపాయిలివ్వడానికి (ఈనాటి లక్ష కావచ్చు) తీర్మానించగా అప్పటి బ్రిటిషు ప్రభుత్వం దానిని తిరస్కరించింది. అపుడు గోపాలాచార్లుగారు గవర్నర్ పెన్‌ట్లెండ్‌గారిని ఆహ్వానించి కళాశాలను చూపెట్టి, స్వాగతమిచ్చి, కళాశాల కార్యకలాపాలలు వివరించి, మెప్పించి తిరిగి తీర్మానాన్ని ఆమోదింప జేశారు.

ఆచార్లుగారు ఆంధ్ర వైద్య గ్రంథమాలను స్థాపించి ఎన్నో ఆయుర్వేద గ్రంథాలను ప్రచురించారు. తాటాకులలోనున్న ఎన్నో క్రొత్త క్రొత్త గ్రంథాలను వెలికితీసి పండితులతో అర్థాలు, టీకలు వ్రాయించి ప్రకటించారు. ఆయుర్వేద ఆశ్రమాన్ని స్థాపించి ఔషధ నిర్మాణం చేయించారు. ఈ ఔషధాలు విదేశాలక్కు

గూడ ఎగుమతి అయ్యేవి. 1919లో శ్రీ ధన్వంతరి పేరుతో నొక పత్రికను స్థాపించారు. ఇన్ని కార్యక్రమాలు ఒక్క వ్యక్తి చేయడం చాల అపూర్వమైన విషయం. వీరు ధన్వంతరి జయంతిని కూడ చాల ఆర్భాటంగా నిర్వహించేవారు.

మదరాసులోని ఇన్ని కార్యకలాపాలతోబాటు ఆచార్లుగారు అఖిల భారత ఆయుర్వేద కార్యక్రమాలన్నింటిలో చురుకుగా పాల్గొనేవారు. అఖిల భారత ఆయుర్వేద వైద్య సమ్మేళనం, విద్యాపీఠంలో పాల్గొనేవారు. పూనాలో, ఇండోర్‌లో, తదితర స్థలాలలో జరిగిన అఖిల భారత సమ్మేళనాలలో పాల్గొన్నారు. వీరు ఏర్పాటుచేసిన వస్తు ప్రదర్శనలకు ఉత్తమ యోగ్యతా పతకాలు ఇవ్వబడినవి. వీరు వారణాసి హిందూ విశ్వవిద్యాలయంలోని ఆయుర్వేద శాఖకు సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. వీరు ఆంధ్ర వైద్య సమ్మేళనమును స్థాపించి దిగ్విజయంగా నిర్వహించారు. హరిద్వారములోని ఋషికుల ఆయుర్వేద విద్యాలయ సభ్యులుగా కూడ ఎన్నుకొనబడ్డారు. స్వామి దయానంద ఆయుర్వేద కళాశాల భవనాలకు లాహోరులో ఆచార్లుగారు శంకుస్థాపన చేశారు. గద్వాల ప్రభువులు వీరికి సువర్ణ పతకం ఇచ్చారు. వీరికి బొంబాయిలో వేరొక స్వర్ణపతకం బహూకరింపబడింది. కలకత్తాలో 'భిషఙ్మణి' బిరుదాన్ని, నాసికలో 'ఆయుర్వేద మార్తాండ' బిరుదాన్ని వీరికివ్వడం జరిగింది. ఐదవ జార్జి చక్రవర్తి ఆచార్లుగారికి 'వైద్యరత్న' బిరుదమునిచ్చి సత్కరించారు.

ఆచార్లుగారు మహాత్యాగి, భోగి. విరాగి కూడాను. వీరి వైద్యశాలలో రోగుల సంఖ్య అపరిమితంగా ఉండేది. డబ్బుకూడ అట్లాగే వచ్చేది. ఇంటికి వెళ్ళేటప్పుడు చిల్లరను కంపౌండరుకిచ్చి వెళ్ళేవారు. ఆ చిల్లర పది నుండి ఇరువై రూపాయలదాకా ఉండేది. దానితో అతడు ఇల్లు కట్టుకొని లక్షాధికారి అయినాడట.

వీరి త్యాగము నిస్స్వార్థమైనది. వీరు చేసినవన్నీ గుప్తదానాలే. వీరికి శిష్యులయందు వాత్సల్యం మెండు; పుత్రులకంటే ఎక్కువ ప్రేమాభిమానాలతో శిష్యుల నాదరించెడివారు. భారతదేశంలోని ప్రతి ఆయుర్వేద పండితునికి వీరి యందు గురుభావమేగాక, ఋషిగా, దైవంగాను అపార గౌరవం ఉండేది. ఔత్తరాహులు వీరు కనబడితే సాష్టాంగ నమస్కారాలు చేసేవారు. వీరి మూర్తిలోనే అంతటి తేజస్సు తొణికిసలాడుతూ ఉండేది. వీరి శిష్యులను చూచినా "మీరు ధన్యులంటూ" నమస్కరించి పరవశత్వం పొందేవారు చాలమంది.

ఆయుర్వేద పురోభివృద్ధికి. పునరుజ్జీవనానికి తన జీవిత సర్వస్వాన్ని సమర్పించిన ధన్యజీవి పండిత దివి గోపాలాచార్లు; ఆయుర్వేద మహాకాశంలో మహోజ్జ్వలంగా వెలిగిన మార్తాండుడు, ధ్రువతార,

# ఆదర్శ పత్రికా సంపాదకులు
# అడవి బాపిరాజుగారు

తెలుగు పత్రికా ప్రపంచంలో సంపాదకీయం అనే ప్రత్యేక వ్యాఖ్యను తొలిసారిగా ప్రవేశపెట్టిన వారు ఆంధ్ర భాషా సంజీవని సంపాదకులు మహా మహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు. ఈయన మొదట్లో సంపాదకుని విలేఖకుడు అని అన్నారు. తర్వాత పేరు మారింది. ఈయన పత్రికకు, సంపాదకునికి, ఉపసంపాదకునికి, చందాదారునికీ, పాఠకునికి ఉండవలసిన లక్షణాలను నిర్వచించారు. సంపాదకునికి ఉండవలసిన లక్షణాలివి :

పండితుండును సత్త్వవర్తనుండును జగ
　　ద్వ్యాపార విజ్ఞుండు స్థైర్యయుతుడు,
ధైర్య సంపన్నుండు ధని యుచితజ్ఞుండు
　　శక్తిత్రయాఢ్యుండు సూక్తి చతురు
డను పదంబులె బిరుదాభిదానంబులు
　　బిరుదాభరణములై వెలయు మిగుల
ఈ విశేషణమణుల్ భావింపబడు నవ
　　లక్షణములె విలక్షణములు
గాన నిటు నవలక్షణ కలితుడైన
వాడు నవరత్నహార సంభావనీయు
డపు విలేఖకు డిటుగామి నౌనె యొరుడు
వానివలెగాక కుముఖుండయౌ నిజముగ.

కొక్కొండవారు చెప్పిన తొమ్మిది లక్షణాలలో ధని అనేది మినహాగా తక్కినవన్నీ బాపిరాజుగారిలో ఉన్నాయి. బాపిరాజుగారు ధైర్యవంతుడు, స్థైర్యవంతుడు, సమదర్శి, రచనా చతురుడు అయిన సంపాదకుడు. ఆయనతో కలిసి పనిచేసే భాగ్యం నాకు మూడు సంవత్సరాలపాటు కలిగింది.

ఖాన్ బహదూర్ అహమద్ నవాజ్ జంగ్ అల్లుడైన గులాం ముహమ్మద్ కలకత్తా వాలా 'మీజాన్' పేరుతో మూడు పత్రికలు పెట్టారు - ఇంగ్లీషు, ఉరుదూ, తెలుగు. మూడింటిపీ మూడు విడివిడి విధానాలు. ఇంగ్లీషు నిజాం ప్రభుత్వాన్ని సమర్థించేది. ఉరుదూ లీగ్‌ను, రజాకార్లను సమర్థించేది. తెలుగు మీజాన్ నిజాం వ్యతిరేక శక్తులను సమర్థించేది; అప్పుడు నిజాంను ఎదిరించి పోరాడుతున్న ప్రజాసంస్థ రావి నారాయణరెడ్డిగారి నాయకత్వంలో ఉన్న ఆంధ్ర మహాసభ. కనుక దానిని సమర్థించేది. ఇతర ప్రజా సంస్థల వార్తలనూ బాగా ప్రచురించేది.

మీజాన్ తెలుగు సంపాదకులుగా బాపిరాజుగారు ఎంతో సాహసంతో నిజాం వ్యతిరేక వార్తలను ప్రచురించేవారు; సంపాదకీయాలు వ్రాసేవారు. జనం మీజాన్ కార్యాలయానికి జాతరగా వచ్చేవారు. వారందరికీ బాపిరాజుగారు నవ్వుతూ సమాధానం చెప్పి వార్తలను యథోచితంగా యథావకాశంగా ప్రచురించేవారు.

రజాకార్ల దుండగాలు ఎక్కువయ్యాయి. వాళ్ళు రాక్షసులను మించి పోయారు. ఆకునూరు, మాచిరెడ్డిపల్లె మున్నగుచోట్ల వారి హింసాకాండ పరాకాష్ఠ నందుకుంది. రజాకార్లు గ్రామీణుల ఇండ్లలో జూరి ధాన్యం మొదలయిన ఆహార పదార్థాలను ఇండ్లముందు కుప్పగా పోసి వాటిపై దొడ్డికి వెళ్ళేవాళ్ళు; నిలువ చేసుకున్న నీళ్ళలోను, బావులలోను మూత్రం చేసేవారు. ఈ బీభత్స దృశ్యాలను మీజాన్ ఫోటోలతో సహా ఉన్నదున్నట్లు ప్రచురించింది. పోలీసులు ప్రభుత్వాధి కార్లు మండిపడ్డారు. గోలపెట్టారు. దర్యాప్తు చేశారు. ప్రముఖ ప్రజా నాయకుడు, ధన్వంతరి సదృశ వైద్యుడు డాక్టర్ జయసూర్య తన సోదరి పద్మజానాయుడును పంపి ఆ గ్రామాలవారి బాధలను వివరంగా సేకరించారు. రజాకార్లు గ్రామ మహిళల మర్మాంగాలపై కాలుతున్న సిగరెట్లు పెట్టడం, చంకలలోను, వక్షోజాల మీద గాట్లు పెట్టడం వంటి దారుణ కృత్యాలు, రాక్షసులు చేయనివి బయటపడ్డాయి. పద్మజానాయుడు ఆ వివరాలతో పెద్ద నివేదిక సిద్ధపరిచింది. దానిని మీజాన్ తెలుగు పత్రిక యథాతథంగా ప్రచురించింది. ప్రభుత్వ సమాచార శాఖ దానిని ఖండిస్తూ ఒక ప్రకటన చేసింది. ఆ ప్రకటనను దురంతాలను తెలుగు మీజాన్ ప్రక్క-ప్రక్కనే ప్రచురించింది. ప్రభుత్వం బాపిరాజుగారిని ఇది ఎడిటింగ్ పద్ధతి కాదని మందలించగా బాపిరాజుగారు అల్లం ఎల్లిగడ్డకంటే ఘాటుగా ఎడిటింగ్ విషయం మాకు ప్రభుత్వ సమాచార శాఖలోని ఉద్యోగులు నేర్పవలసినంత దుస్థితిలో మేము లేమని జవాబు వ్రాసి, దానిని మీజాన్‌లో ప్రచురించారు.

మీజాన్ పలుకుబడికి స్థానిక వర్గాలలో కొందరికి కన్ను కుట్టింటి. రైయత్ ఉర్దూ దిన పత్రిక సంపాదకులు మందుముల నరసింగరావుగారు, మీజాన్ పత్రికల విధానం ఏమిటో తమకు అర్థం కావటంలేదని, తెలుగు మీజాన్‌లో శుద్ధ మూర్ఖులు, అవివేకులు పనిచేస్తున్నారని, వారు హైదరాబాదు రాష్ట్ర రాజకీయాలు తెలిసినవారు కారని దుమ్మెత్తిపోస్తూ 18 సంపాదకీయాలు వ్రాశారు. దానికి బాపిరాజుగారు 40 పుటల ప్రతి విమర్శ వ్రాశారు. దానిలో తమ సంపాదక మండలిలోనివారు ఎంత ఘనులో, ఎంతటి ఉద్దండ పండితులో ప్రపంచ విషయాలను ఎంతగా ఆకళించుకున్నారో సోదాహరణంగా వివరించారు. "నేను చాలాకాలం క్రింద జాతీయోద్యమంలో చేరుటకు న్యాయవాద వృత్తి మానేశాను. ఎవరైనా కోర్టుకు వెళ్ళేటట్టయితే మీజాన్ చేస్తున్న సేవను నిరూపించడానికి మళ్ళీ నల్లకోటు ధరిస్తాను" అని సవాల్ చేశారు.

ఆయన తనతో పనిచేసే సిబ్బందిపై ఈగ వాలనిచ్చేవారు కారు. నేను, రాంభట్ల కృష్ణమూర్తి, శ్రీనివాస చక్రవర్తి, బొమ్మకంటి సుబ్బారావు సబ్-ఎడిటర్లుగా ఉండేవాళ్ళం. తరువాత సంవత్సరానికి విద్వాన్ విశ్వం చేరాడు. మధ్యలోనే వెళ్ళిపోయాడు. మాలో బాపిరాజుగారి తరువాత వయసులోను, తక్కిన వాటిలోను పెద్దవారు శ్రీనివాస చక్రవర్తిగారు. తరువాత నేను, తరువాత రాంభట్లగారు, చివరివారు బొమ్మకంటి సుబ్బారావుగారు. ఈ సీనియారిటీని మేము మీజాన్ వదలి వేరు వేరు పత్రికల్లో చేరినా పాటిస్తున్నాం. అదే వింత. మీజాన్ అనుబంధం అలాంటిది. బాపిరాజుగారు మాకు సంపూర్ణంగా స్వేచ్ఛనిచ్చారు. నాకు ఫైలాలజీ, సాంఘిక శాస్త్రం, చరిత్ర ఇష్టం. నేను రోజూ ఒక కాలం వ్రాసేవాడిని. చక్రవర్తిగారు ప్రాచ్య, పాశ్చాత్య నాటకాలను, రంగస్థల శాస్త్రాన్ని, సినిమాలను బాగా అధ్యయనం చేసినవారు. భానుమతిగారు తీసిన తొలి సినిమాలో తొలి అసిస్టెంటు డైరెక్టరు. కనుక నర్తనశాల అనే శీర్షికలో వ్రాసేవారు. రాంభట్ల కృష్ణమూర్తిగారు మిర్చి మసాలా అనే శీర్షిక కింద వ్యంగ్యం, హాస్యం వ్రాసేవారు. సుబ్బారావుగారు టైంబాంబు అనే శీర్షిక క్రింద సమకాలిక విషయాలపై వ్యాఖ్య చేసేవారు. సంపాదకీయ మండలిలో లేకపోయినా బి. సి. కామరాజుగారు, కలంపోటు, మూసీ కినారే అనే శీర్షికలు నడిపేవారు.

చక్రవర్తిగారు పరమ శాంతులు. నేను శీఘ్ర కోపిని. ఎప్పుడూ రుసరుసలే. ఏ చిన్న విషయమైనా, సమయానికి గుండుసూది దొరకకపోయినా గుండెలు బాదుకొని గోలచేసేవాడిని. అంతా సరిగ్గా, సక్రమంగా పట్టు కత్తిరించినట్లు

ఉండాలి. రాంభట్లగారు తీవ్రవాదే. కాని ఓర్పుతో సమయం కోసం నిరీక్షించే వారు. సుబ్బారావుగారు అప్పుడే కాలేజీ నుంచి వచ్చిన పట్టభద్రుడు. విద్యార్థి పోకడలు వుండేవి.

మేము బాపిరాజుగారు ఇచ్చిన అవకాశాన్ని జారవిడువలేదు. నేను సైనికుల కథలు కొన్ని వ్రాశాను. కృష్ణమూర్తిగారు జ్వాలాతోరణం వంటి ఉత్తమ జాతీయ స్థాయి కథలు వ్రాశారు.

ఒకమారు సాహితీ సమితి సభాపతి శ్రీ శివశంకర శాస్త్రిగారు మీజాన్ కార్యాలయానికి వచ్చారు. వరుసగా రెండు మూడు రోజులు రావాల్సి వచ్చింది బాపిరాజుగారితో పనిబడి. మా వాలకం చూశారు. ఆయనకు మేమంతా అల్లరి మూకలా కనిపించాం. "ఏమోయ్! బాపిరాజూ! ఇలాటి నాళ్ళను పెట్టుకున్నావేమిటి స్టాఫ్‌లో? రౌడీలు, కమ్యూనిస్టులు, అల్లరివాళ్ళు అంతా. ఒకాయనకేమో నోట్లో నాలికే లేదు. మరొకాయన పరశురాముడు, ఇంకొకాయన పొంచివున్న నక్క, మరొకాయన ఎటు బడితే అటు ఊగుతాడు. ఏం బాగులేదోయ్" అన్నారు.

బాపిరాజుగారు అంతా శ్రద్ధగా విన్నారు. మేము శాస్త్రిగారి విమర్శకు కష్టపడినా, అది ఆఫీసు, ఎడిటర్ మమ్మల్ని సమర్థించాలి కనుక తలవంచుకుని మా పని మేము చేసుకుంటున్నాం. "ఇదిగో అన్నగారూ వినండి. వీణ ఎలా వుంటుంది? ఒక తీగ షడ్జం పలుకుతుంది. మరొకటి రిషభం పలుకుతుంది. ఇంకొకటి గాంధారం, నాల్గొవది ధైవతం, మరొకటి మధ్యమం, ఆరవది నిషాదం, ఏడవది పంచమం. నేను చెప్పిన వరుసతో కాదనుకోండి. సరిగమపదని - ఈ వరుసలో అంతా సప్తస్వభాలు పలికితేనే వీణ. కనుకనే సప్తతంత్రి అనే పేరు వచ్చింది దానికి. నా స్టాఫ్ కూడా వీణ వంటిది. పంచమ స్వరమే వింటాను. అదే కావాలి. తక్కినవి వద్దు అంటే కుదరదు కదా! అలాగే మా సంపాదక మండలిలో అన్ని స్వభావాలవారు, అన్ని సిద్ధాంతాలవారు ఉన్నారు. అంతా కలిసి పత్రికను ప్రొడ్యూస్ చేస్తాము. నాకిష్టమైన వార్తలే ఉండాలి పత్రికలో, ఇంకొకటి వుండరాదు అంటే కుదురుతుందా?" అన్నారు. శాస్త్రిగారు ఏమంటారు?

ప్రతి సంపాదకుడు ఏ చిన్న తప్పు దొరికినా క్రిందివారిని సతాయించే వాడే. నా అరవై ఏళ్ళ పత్రికా రచనానుభవంలో ఇలాంటివి ఎన్నో. కాని బాపిరాజుగారు తనతో పనిచేసేవారిని తరువాత నెమ్మదిగా మందలించటమే తప్ప ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని ఎప్పుడూ అవమానించలేదు.

రాంభట్ల కృష్ణమూర్తిగారు ఒకమారు నిజాం నవాబును నారాయణగూడ

చౌరస్తాలో ఉరితీయాలి - అని వ్రాశారు. బాపిరాజుగారు అంతా పర్యవేక్షించేవారే. కాని అది ఆయన చూపుదాటి అచ్చయిపోయింది. అప్పుడు సర్ మిర్జా ఇస్మాయిల్‌గారు హైదరాబాదు రాష్ట్ర ప్రధాని. ఆయనకు పర్సనల్ ఇన్‌ఫర్మేషన్ అటాచీ కుందూరి ఈశ్వరదత్తుగారు. ఆయన మరుసటి ఉదయం బాపిరాజుగారికి ఫోన్‌చేసి "నిజాంను నారాయణగూడ చౌరస్తాలో ఉరితీసేముందు మిమ్మల్ని ఎందుకు ఉరితీయరాదు?" అని అడిగారు. బాపిరాజుగారు దత్తుగారి మాట అర్థం కాక "నన్నెందుకు ఉరితీయడం?" అని ప్రశ్నించారు. "నిజాంను మరి ఎందుకు ఉరి తీయటం?" అని దత్తుగారు ఎదురు ప్రశ్న వేశారు. ఈ విషయం తెలిసిన తరువాత బాపిరాజుగారు సవరణ వేయవలసి వచ్చింది. అయినా, "ఏమోయ్! కృష్ణమూర్తీ ఇంత ఇదిగా వ్రాసేస్తే ఎలా? కొంచెం చూసుకోవద్దూ? కొంపలు అంటుకుపోతాయ్?" అని మాత్రమే మందలించారు. మరొకరయితే డిస్మిస్ చేసేవారే. పక్కవాళ్లు పొరుగువాళ్లు పుల్లలు వేసి అయినా డిస్మిస్ చేయించేవారే.

బాపిరాజుగారు అనేక కళల, అనేక శాస్త్రాల సమాహారం. ఆయన ఏమి వ్రాయదలచుకున్నా పెద్దగా పరిశోధన జరిపి ఒక నిర్ణయానికి వచ్చి వ్రాసేవారు. ఆయన చిత్రకారుడు, నాట్యాచార్యుడు, గాయకుడు, శిల్ప శాస్త్రజ్ఞుడు, న్యాయశాస్త్రజ్ఞుడు, సాముద్రిక, జ్యోతిష, వాస్తు శాస్త్రజ్ఞుడు. చరిత్రాచార్యుల కన్నా చరిత్ర బాగా చదివిన వారు. కలకత్తావాలా బంధువులు వచ్చి ఆయనకు జాతకాలు, చేతులు చూపించేవారు. జైలు కొట్టల్లో తనతోపాటు పలవరిస్తున్న అల్లూరి సీతారామరాజు అనుచరుడు పలనాటి ఎలమందపై వ్రాసిన పాట 'ఓ పలనాటి ఎలమందా, పలవరిస్తావా జైలు కొట్టల్లో' అని గొంతెత్తి పాడితే 'లేపాక్షి బసవయ్య లేచిరావయ్య' పాడితే పరిసరాలన్నీ మారుమ్రోగేవి.

వీటన్నిటికి మించి ఆయన నిజమయిన సత్యాగ్రహి. నిజమైన గాంధీ అనుయాయి. నిజమైన మానవుడు. ఆత్మ గుణాల పుట్ట. సమకాలీన రచయితలలో లేని గుణం - సహనం ఆయనలో తొణికిసలాడేది. ఆయన మంచి వంటవాడు కూడా.

బాపిరాజుగారు పత్రికా రంగానికి చాలానే ఇచ్చారు. వాటిలో కొన్నిటిని తెలుపుతాను - నాకు తెలిసినవాటిని.

## 1. మంచి భాష :

ఆయన పనికట్టుకుని దిద్దకపోయినా మేమంతా ఆయన రచనలను చదివే మీజాన్ పత్రిక భాషను ప్రామాణికం చేశాము. నవలకు ఏ భాష? లేఖలకు ఏ

వార్తలకు ఏ భాష? సంపాదకీయానికి ఏ భాష? సాధారణ వ్యాసానికి ఏ భాష? కథకు ఏ భాష? ఇలా ఆయన రచనలు చదివితే తెలుస్తుంది.

## 2. ధూప దీపాలు :

దిన పత్రికలో అంటే తెలుగు దిన పత్రికలో దినమూ వ్యంగ్య రచన పద్ధతిని హైదరాబాదులో ఆయన ప్రవేశపెట్టారు. ఇంగ్లీషులో అప్పటి సమకాలీనమైన దక్కన్ క్రానికల్‌లో బుక్కపట్నం రామానుజాచార్యులుగారి 'చార్మినార్ గాసిప్' అనే శీర్షిక ప్రతిదినం వుండేది. బడే బడే నవాబుల అంతఃపురాలలోని విషయాలు, పై అధికార వర్గం కార్యాలయాల రహస్యాలు మరునాడే చార్మినార్ గాసిప్‌లో ప్రత్యక్షం - భంగ్యంతరంగా. అందురూ కనుబొమలు ఎగరేసేవారు. పానుగంటి వారు ఆంధ్ర పత్రిక వారపత్రికలో సాక్షి వ్యాసాలు వ్రాసేవారు. నారాయణమూర్తిగారు పాన్ సుపారి వ్రాసేవారు ఆంధ్ర ప్రభలోనూ, విజయ ప్రభలోను. బాపిరాజుగారు ధూప దీపాలను హైదరాబాదు తెలుగు పత్రికలో తొలిసారిగా ప్రవేశపెట్టారు. ఉగాదికి ప్రముఖులకు బిరుదాలు ప్రకటించేవారు. ధూప దీపాలలో. ప్రతాపరెడ్డిగారికి ముల్కీ గైర్ముల్కీ మహాముల్కీ అనే బిరుదు ఇవ్వడం నాకు గుర్తు. బాపిలాజుగారు ఒక ఏడాది ధూప దీపాల బిరుదాలలో కొండా వెంకట రంగారెడ్డిగారిని మరచిపోయారు. "ఏంది? మీజాన్ తెలుగు ఎడిటర్‌కు నాపేరు యాద్ లేదా?" అని ఆయన తన అంతరంగికులతో అన్నట్టు అక్కినేపల్లి జానకి రామారావుగారికి తెలిసింది. ఆయన బాపిరాజు గారికి తెలిపారు. "నిన్న స్థలాభావంవల్ల కొందరి బిరుదులు మిగిలిపోయాయి. నేడు ప్రకటిస్తున్నాం" అని మరికొందరిని కలిపి మరుసటిదినం ప్రకటించారు.

## 3. నవల :

దిన పత్రికలో ప్రతిదినమూ రెండు కాలాల నవల బాపిరాజుగారి ఊవి. అదివరకు అంధ్ర పత్రికలో వారానికొకమారు నవల ప్రచురించేవారు. దానిని బాపిరాజుగారు ప్రతిదిన పఠనీయం చేశారు.

బాపిరాజుగారు ధూపదీపాలు ఒక శైలిలో, నవల మరొక శైలిలో, సంపాదకీయం ఇంకొక శైలిలో, కవితలు వేరొక శైలిలో ఇలా రెండున్నర సవ్యసాచిగా వ్రాసేవారు.

మీజాన్ ఆఫీస్ ఖైరతాబాద్‌లో ఎ.సి. గార్డ్స్ ఎదుట గుట్టమీద, వుండేది. ఇప్పుడు దాని రూపం మారింది, జిల్లా విద్యాశాఖ కార్యాలయమైంది. గుట్టమీద అఫీసు పక్కన పెద్ద వేపచెట్టు ఉండేది. మధ్యాహ్నం ఫలహారానికి అక్కడ

చేరేవాళ్ళం వేప చెట్టు నీడను, పక్కన క్యాంటీను. బాపిరాజుగారు ఏకంగా ఒక క్యారీరు నిండా ఫలహారాలు తెచ్చేవారు. అందరికీ పంచేవారు. పక్కన వున్న రేడియో స్టేషనులో పనిచేస్తున్న కురుగంటి సీతారామ భట్టాచార్యులు కూడా అక్కడికే చేరేవారు. అక్కడ జరిగే వివిధ విషయాల చర్చ, వివిధ అనుభవ గాథలు, బాపిరాజుగారు మధ్యాహ్నం వ్రాసే నవలలో చేరిపోయేవి కళాత్మకంగా.

## 4. తరిమెన :

ముడి రచయితలను ఆయన తీర్చిదిద్ది తరిమెన, సాన పెట్టి, వెలిగించేవారు. ఒకరోజు నేను డే డ్యూటీలో వున్నాను. ఆఫీసుకు రాగానే చెత్తబుట్టను చూడడం నా అలవాటు. నైట్ డ్యూటీలో వాళ్ళు పొరపాటున చెత్తబుట్టలో ఏదైనా పారేయవచ్చు. కనుక చూదేవాణ్ని. ఒకరోజు ఒక కాయితాల బొత్తి నా చెత్త బుట్టలో పడివుంది. అదృష్టం. దాన్ని గది తుడిచేవాళ్ళు పారవేయలేదు. నేను దానిని తీసి చూచాను. పావుతావుల్లో పది పన్నెండు కాయితాల బొత్తి. చదివే వేశారో, చదువకుండా వేశారో! హెడ్డింగ్ - 'చప్రాసీ ఆత్మకథ' అని, రచయిత పేరు ఆవుల పిచ్చయ్య అని ఉంది. దస్తూరీ తమాషాగా, అప్పుడే తెలుగు కొత్తగా నేర్చుకున్న వ్రాతలాగా ఉంది. అలా వుండడం చూచి వారవేసి వుంటారు. నేను ఒక పేరాగ్రాఫ్ చదివాను. ఆరంభం బాగానే వుంది. రెండు మూడు పుటలు చదివాను. ఆశ్చర్యంగా ఉంది. అంతా ముగించి, రెండోసారి చదివాను. భాష, పంక్చుయేషన్సు దిద్దితే మంచి రచన కాగలదని అనిపించింది. దానిని బుట్టలో పారేసినందుకు కోపం వచ్చింది. సంపాదక వర్గం పని ఏమాత్రం కొత్తదనం. ప్రతిభ కనిపించినా సవరించి దిద్ది, చక్కజేయడం, కొత్త రచయితలను తీర్చడం గాని, బుట్టలో పారేయడం కాదు. బాపిరాజుగారు రాగానే, "చూడండి సార్! ఇంత మంచి రచనను బాధ్యతారహితంగా బుట్టలో వేశారు. కొత్త రచయితలు రమ్మంటే ఎక్కడినుంచి వస్తారు? ఆకాశం నుంచి ఊడిపడతారా?" అని ఆ తప్పు ఆయనే చేసినట్లుగా కోప్పడ్డాను. ఆయన నన్ను శాంతపరచి, తాపీగా దానిని చదివారు. ఆయన సహజభావుకుడు, సహృద యుడూ, మానవతావాదీ గనుక నాకన్నా ఎక్కువగా థ్రిల్ అయ్యారు. "చప్రాసీ భాషను మార్చకండి. కొద్దిగా మెరుగులు పెట్టండి. ఆదివారం సారస్వతానుబంధంలో ప్రచురిద్దాం" అన్నారు; నా పరిశీలన దృష్టిని మెచ్చు కొన్నారు.

ఆదివారం అది ప్రచురితమైంది. సోమవారం నాడు రచయిత ఆవుల పిచ్చయ్య మొక్కజొన్న కండెలతో ఆఫీస్‌కు వచ్చాడు. అది అతని అచ్చయిన

తొలి రచన. కృతజ్ఞతలు తెలుపుతూ మొక్కజొన్న కండెలు ఇవ్వబోయాడు. బాపిరాజుగారు లాంఛనంగా, అతని సంతృప్తికోసం ఒకటి తీసుకొని తక్కినవి బజారు ధరకు కొని, మీరెప్పుడూ ఇలాటి పని చేయవద్దని హెచ్చరించారు. తర్వాత అతనివి హమాలీ ఆత్మకథ, గిర్దావర్ ఆత్మకథ, మరికొన్ని అచ్చయ్యాయి. మంచి రచయిత అయ్యాడు. ఇలా ఎందరో!

మా ఫోర్మన్ పేరు వెంకన్న. చాలా మంచి కుశలుడైన పనివాడు. రాజమండ్రి వాడు. "శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు పద్యం చెబుతూంటే, నేను కంపోజు చేసేవాడిని. ఏమనుకున్నారో! ఒరిజినల్ కాపీయే లేదు, వ్రాయడానికి ఆయనకు తీరికలేదు. కేసుల దగ్గరికి వచ్చి పద్యం చెప్పేవారు. నేను గబగబా కంపోజ్ చేసేవాడిని" అనేవాడు. బాపిరాజు గారి విషయంలో కూడా ఎమర్జెన్సీలలో (అంటే అయనకు తీరికలేని సమయాలలో) అలాగే చేసేవాడు.

బాపిరాజుగారి నవలను గురించి కొన్ని విషయాలు : బాపిరాజుగారి నవలలోని నాయకుడు మొదలు తక్కిన పాత్రలంతా ఆయన పరిసరాలలోని పరిచితులైన జీవులే. నారాయణరావు ముష్టి లక్ష్మీనారాయణ అనే కాంగ్రెస్ యోధుడు. ఆయన నవలలో హిమబిందు తర్వాత గొప్పది తుఫాను. దాని నాయకుడు ఆయన గురువైన ప్రమోద్ కుమార్ చటర్జీ. తూఫానులో నా దేశ యాత్రానుభవాలను బాపిరాజుగారు వాడుకున్నారు. కోనంగిలో నాయకుడు నాలోని, రాంభట్లగారిలోని చిత్ర విచిత్ర గుణాల కలబోత. మా యిద్దరినీ పరిశీలించి నాలోని సీరియస్‌నెస్‌ను, రాంభట్లగారిలోని హాస్యాన్ని కలబోసి సృష్టించారు. ఇలా ఆయన పాత్రలను సృష్టించడమేకాక, తన పరిసరాల వ్యక్తుల అనుభవాలను కూడా రమ్యతరంచేసి వాడుకునేవారు. "గోన గన్నారెడ్డి" వాస్తవ చారిత్రకుడే అయినా, పలనాటి ఎలమందను కలిపారు అతనిలో.

ఇలా బాపిరాజు ఎన్నో గొప్పదనాల కలబోత, మానవత్వపు మేలిమికి బంగారుపూత. అలాటి మహనీయునితో - మహనీయుని కింద పనిచేయడం భాగ్యంగా నిరంతరం భావిస్తుంటాను - భావిస్తుంటాము.

# ధూజీ ఛేయ్ ఛోవెూ లుంగ్వా!

"మేము వెళ్ళిన చోటెల్లా మారు ఘనంగా సన్మానాలు జరుపుతున్నారు. మాకు దండలేమిటి, కానుకలేమిటి, శాలువాలేమిటి - చాల కోలాహలం. అంతా బాగుంది. ఒక్కటడుగుతాను చెబుతారా? ఇప్పుడు నేనూ, నా భర్తా, ఇద్దరు పిల్లలు డార్జిలింగ్‌లో ఒక్క గదిలో కాపురం చేస్తున్నాము. ఎదిగే పిల్లలు. ఎంతో జాగ్రత్తగా మసలుకోవలసి వస్తున్నది మేము. సర్కారువారు మాకు మూడు గదులు ఇల్లు ఇవ్వగలరా, చెప్పండి?" అని ప్రశ్నించారు శ్రీమతి అంగ్‌లహ్మూ. ఎవరెస్ట్ వీరుడు టెంజింగ్ నోర్గే సతీమణి అంగ్‌లహ్మూ.

టెంజింగ్ నోర్గే సర్ ఎడ్మండ్ హిల్లరీతోపాటు 1953 మే 29 వ తేదీ మధ్యాహ్నం ఎవరెస్ట్ శిఖరం అధిరోహించిన తర్వాత భారతదేశమంతటా సకుటుంబంగా పర్యటిస్తూ మద్రాసుకు వచ్చి, ఆంధ్రప్రభ కార్యాలయం చూచినప్పుడు, ఆంధ్రప్రభ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, దినమణి పత్రికా రచయితలు ఏర్పాటు చేసిన గోష్ఠిలో అంగ్ లహ్మూ పైన పేర్కొన్న ప్రశ్న వేశారు. ఆ ప్రశ్నకు మేమంతా ఆశ్చర్యపడ్డాము, విషాదపడ్డాము. అంగ్ లహ్మూ షేర్పా భాషే కాక నేపాలీ, హిందీ, ఇంగ్లీషు చక్కగా మాట్లాడారు. మా ప్రశ్నలకు చక్కగా సమాధానమిచ్చారు. ఆమె మాటల్లో టెంజింగ్ నోర్గే కుటుంబస్థితి ఎంత దయనీయమో మాకు స్పష్టమైంది. బ్రిటిష్ ప్రభుత్వం హిల్లరీకి ఎవరెస్ట్ శిఖరాధిరోహణ వార్త ప్రకటించిన వెంటనే సర్ బిరుదం ప్రకటించి గౌరవించింది. భారత ప్రభుత్వం టెంజింగ్ నోర్గేకు భారతరత్న బిరుదం ఇవ్వవలసింది. అప్పుడూ ఇవ్వలేదు, మరెప్పుడూ ఇవ్వలేదు.

టెంజింగ్ సంభాషణ చతురుడు; హాస్యప్రియుడు. మమ్మల్ని నవ్విస్తూ, కవ్విస్తూ తన జీవితాన్ని ఆవిష్కరించాడు. తన చిరకాలపు కల నిక్కల అయినందువల్ల కలిగిన సంతోషదీధితులు అతని ముఖంలో వెలిగిపోయాయి. ఆయన చెప్పినదాని సారాంశమిది ఆయన మాటలలోనే.

నేను షేర్పా తెగవాడిని. షేర్పా అంటే తూర్పు ప్రాంతం వాడు అని అర్థం. మేము మంగోల్‌జాతి వాళ్ళమని పెద్దలంటారు. మా పూర్వులు టిబెట్ నుంచి దక్షిణంగా హిమాలయ ప్రాంతానికి వలస వచ్చారు. నేను సోలోఖుంబులో

పుట్టాను. మేము బౌద్ధులం, టిబెట్ సంప్రదాయానుయాయులం గనుక, టిబెట్ పంచాంగం ప్రకారం యోయా (కుందేలు) సంవత్సరంలో పుట్టాను, టిబెట్ సంవత్సరాలకు గుర్రం, పులి, ఎద్దు, పక్షి, పాము అనే పేర్లుంటాయి. ఇలా పన్నెండు పేర్లలో ఆరు మగవి, ఆరు ఆడవి. ఈ పన్నెండు వరుస పూర్తికాగానే, మళ్ళీ చక్రనేమిక్రమంగా అదే ప్రారంభమవుతుంది. నేను పుట్టిన కుందేలు సంవత్సరం క్రీస్తు శకం 1914 కు సరిపోతుందని తర్వాత తెలుసుకున్నాను. నాకు మే నెల జీవితమంతా బాగుంది కనుక నేను మే నెలలో పుట్టివుంటానని భావిస్తున్నాను. ఈ మే నెలలోనే నేను హిమాలయ పర్వతాధిరోహణకు పూనుకున్నాను. ఒక మే 28 న చాలవరకు ఎవరెస్టును సమీపించాను. మరుసటి మే 29 న ఎవరెస్టును అధిరోహించాను, హిల్లరీతోపాటు. కనుక మే నెల నాకు ఎప్పుడూ మంచిదే.

నా తల్లిపేరు కింజోమ్. నా తండ్రిపేరు ఘంగ్‌లా మింగ్మా. పిల్లలకు వంశనామం పెట్టరు. నాకు ఆరుగురు సోదరులు, ఆరుగురు సోదరీమణులు. వారిలో నేను, ముగ్గురు సోదరీమణులు మాత్రమే ఇప్పుడు మిగిలాము. నేను పదకొండో సంతానం. సోలోఖుంబుతో మా జీవితం కష్టంతోనే గడిచేది. సోలోఖుంబు నేపాల్‌లో చేరింది.

నా తలిదండ్రులు నాకు నమ్‌గ్యాల్ వాంగ్డీ అని పేరు పెట్టారు. ఒకనాడు రోంగ్‌బుక్ నుంచి ఒక గొప్ప లామా మా యింటికి వచ్చాడు. అతడు నన్ను చూచిన మీదట బౌద్ధమత గ్రంథాలను పరిశీలించి నేను ఆ మధ్య సోలోఖుంబులో మరణించిన ఒక ధనవంతుని అవతారమని, గొప్ప అదృష్టవంతుడినని, అందువల్ల నా పేరు మార్చాలని నా తలిదండ్రులతో అన్నాడు. ఆ ప్రకారంగా ఆయనే నా పేరు టెంజింగ్ నోర్గే అని మార్చాడు. టెంజింగ్ అంటే ధర్మ రక్షకుడు. నోర్గే అంటే ధనవంతుడు, లేదా అదృష్టవంతుడు.

నేను కొంచెం పెద్దవాడు కాగానే, నన్ను లామాగా చేయాలనే నిర్ణయమయింది. నన్నొక బౌద్ధ విహారానికి పంపారు. అక్కడ నా తల వెండ్రుకలు తీయించి కాషాయ వస్త్రాలు కట్టించి శిక్షణ ఇవ్వసాగారు. కాని, నేనక్కడ కొంత కాలమే ఉన్నాను. ఎందుకంటే, ఒకనాడు విహారంలోని ఒక లామా కోపించి నా బోడితలపై కర్ర పలకతో కొట్టాడు. నేను విహారంనుంచి పరుగెత్తి వచ్చి ఇల్లు చేరాను; తిరిగి వెళ్ళలేదు.

చిన్నతనంలో నేను ఆకాశాన్ని అంటే ఎవరెస్టు శిఖరాన్ని ఎన్నోసార్లు చూచాను. అప్పుడు దాని పేరు ఎవరెస్టు కాదు, చోమో లుంగ్మా అనేవారు. అంటే, ప్రపంచ మాతృదేవి, వాయు మాతృదేవి అని అర్థం. ప్రతి షేర్పాకూ తల్లులు

ఈ పేరే చెప్పేవారు; నా తల్లి కూడ ఈ పేరే నాకు చెప్పింది. ఒక్క పిట్టకూడ ఆ శిఖరం మీద ఎగిరేది కాదు.

సుప్రసిద్ధమైన ఎవరెస్ట్ ఆరోహణ యాత్రలు మూడు 1921, 1922, 1924 లలో జరిగాయి. సోలోఖుంబు నుంచి, డార్జిలింగ్ నుంచి కూడ చాల మంది షేర్పాలు ఆ యాత్రలలో పాల్గొన్నారు వారు తిరిగివచ్చి ఛిలిన-గ్గాలను గురించి ఎన్నో కథలు చెప్పేవారు. ఛిలిన-గ్గా అంటే విదేశీయులు. వారు ఆకాశానికి ఎక్కడం గురించీ, పర్వతాలలోని విశేషాలను గురించీ ఎన్నో సంగతులు చెప్పేవారు. వింతయిన బూట్లు, వింతయిన దుస్తులు ధరించేవారు. అలాటివాటిని మా ప్రాంతం వారెప్పుడూ చూచి ఎరుగరు. వారు ఎవరెస్ట్, ఎవరెస్ట్-ఎవరెస్ట్ గురించే ఎప్పుడూ ముచ్చటించేవారు. నేను కుతూహలం పట్టలేక అడిగేవాడిని "మీరు ముచ్చటించే ఎవరెస్ట్ అంటే ఏమిటి?" అని. ఛోమో లుంగ్మాయే ఎవరెస్ట్ - అనేవారు వారు. మా కుటుంబంలోని వారెవరూ ఎవరెస్ట్ ఆరోహణ యాత్రకు వెళ్ళలేదు. నన్ను పంపితే వెళ్ళేవాడినే. కాని నేను చాల చిన్నవాడిని, పదేళ్లుకూడ నిండలేదు.

నేను కొంచెం పెద్దవాడయిన పిదప ఇంటి పనులలోను, వ్యవసాయం పనులలోను నా అన్నలకు, తలిదండ్రులకు తోడ్పడేవాడిని. ఎంతోపని వుండేది. మేము ఆలూగడ్డలూ, యవలు, త్యాంపా అనే ఒకరకం జొన్నలను పండించే వాళ్ళం. గొర్రెలను, జడల బర్రెలను (యాక్‌లను) పెంచేవాళ్ళం. వాటి వున్నితో మా గుడ్డలు తయారయ్యేవి. ఉప్పు, ఒకొకప్పుడు ఎండు మాంసం ఇతర ప్రాంతాల నుంచి తెచ్చుకొనేవాళ్ళం. నేపాల్‌లో పశువులను చంపడం నిషిద్ధం గనుక మేము మా జడల బర్రెలను చంపేవాళ్ళంకాదు. కాని, వాటిని చంపకనే వాటి మెడనుంచి రక్తం తీసి ఇతర ఆహారపదార్థాలలో కలిపేవాళ్ళం. ఇలా రక్తం తీయడం జడల బర్రెలకు కూడ ఆరోగ్యకరమే.

సోలోఖుంబు చిన్న ఊరు. నాకు ప్రపంచం చూద్దామని ఎంతో అభిలాష. అప్పుడు నాకు వయస్సు పదమూడేళ్లే. బాహాటంగా ఎక్కడికైనా వెళ్లుదామంటే పెద్దలు వెళ్ళనివ్వరు. అందువల్ల ఇంటినుంచి పరుగెత్తిపోయాను. కాట్మండూ చేరాను. చేరడానికి రెండు వారాలు పట్టింది. నేను చూచిన మొదటి నగరం అదే. రెండు వారాలు గడిచాయి. ఇంటి బెంగ పట్టుకుంది; సోలోఖుంబునుంచి నాకు తెలిసినవారు వచ్చారు. వారిని చూడగానే బెంగ మరీ ఎక్కువై వారివెంట ఇంటికి తిరిగివచ్చాను. మొత్తం ఆరు వారాలు వెలుపల వున్నాను. నన్ను చూచి నా తలిదండ్రులు, సోదరులు చాల సంతోషించారు, కౌగిలించుకొని దుఃఖించారు,

మరి ఐదేళ్ళపాటు తలిదండ్రులవద్దే ఉన్నాను, వారికి తోడ్పడుతూ. కాని నేను కర్షకుడుగానో, పశు పాలకుడుగానో వుండడానికి పుట్టలేదు. గొప్ప పనులు చేయాలి, ఛోమో లుంగ్మాను అధిరోహించాలి, అదే నా లక్ష్యం-అని అనిపించింది. ఇక అక్కడ ఉండలేకపోయాను. ఈసారి డార్జిలింగ్‌కు పరుగెత్తిపోయాను. 1933 లో ఎవరెస్ట్ అధిరోహణ యాత్ర జరుగుతుందని వదంతి బయలుదేరింది.

నేను నేపాల్-భారత సరిహద్దు చేరాను. అక్కడ నిమన అనే గ్రామంలో రింగలామా అనే ధనవంతునితో నాకు పరిచయమైంది. అతని యింట్లో ఆయన ఇంటి పనులుచేస్తూ కొన్నాళ్ళు గడిపాను. తర్వాత ఒకరోజు ఆయనతో నా డార్జిలింగ్ ప్రయాణం ప్రస్తావించాను. అతడు నా మాటకు చాల సంతోషించి, తను త్వరలో సొంత పనిమీద డార్జిలింగ్‌కు పోతున్నానని, నన్ను తనవెంట పిలుచుకొని వెళ్ళతానని చెప్పి, అలాగే చేశాడు. డార్జిలింగ్‌లో తన బంధువు పోవురీ అనే అతని ఇంట్లో పనికి కుదిర్చాడు. డార్జిలింగ్‌లో నేను నేపాలీ భాష, ఆ ప్రాంతంలో వాడే యాల్మా అనే భాష నేర్చుకొన్నాను.

అప్పుడు నాకు ఉత్సాహోద్వేగాలు కలిగించే సంఘటన జరిగింది. అది 1933లో జరుగబోయే ఎవరెస్ట్ అధిరోహణ యాత్రకు ఏర్పాట్లు. నేను దావా థోండుప్ అనే నా మిత్రుని దగ్గరకు వెళ్ళాను. ఎవరెస్ట్ పర్వతారోహకుల సామాన్లు మోసుకొని వెళ్లే షేర్పాల దళాన్ని ఏర్పాటు చేయడంలో పేరు పొందినవాడు థోండప్. నన్ను అలాటి బృందంలో చేర్చమని అతన్ని కోరాను. "నీవింకా చిన్నవాడివి" అన్నాడు అతడు. నేనే మరొకరిద్వారా ఆ పనికి ప్రయత్నించాను. కాని నేను ధరించిన నేపాలీ దుస్తులు చూచి పర్వతారోహకులైన విదేశీయులు నన్ను షేర్పాగా గుర్తించలేదు. దానితో ఆ బృందం తరలిపోయింది. నేను చాల బాధపడ్డాను.

కొన్ని నెలలపాటు నేను పోవురీ ఇంట్లో పనిచేస్తూ గడిపాను. ఆవులను మేపడం, పాలు పితికి అమ్మడం ముఖ్యమైన పని. అప్పుడు అంగ్ లహ్మా అనే షేర్పానీ (షేర్పాతెగ మహిళ) యువతి నావద్ద రోజూ పాలు కొనేది. ఆమె ఒకరింట్లో ఆయాగా పనిచేసేది. పాల విషయంలో, ధర విషయంలో రోజూ నాతో వాదులాడేది. "నీవు వట్టి హల్కావు, పిసినారివి. కొసరు అడిగినా ఇవ్వవు" అనేది. తర్వాత ఆమె నా రెండవ భార్య అయింది.

నేను అలా సంవత్సరంపాటు డార్జిలింగ్‌లో ఉన్నాను. సోలోఖుంబు నుంచి వచ్చిన వారు నేను చనిపోయినట్టు నా తలితండ్రులు, బంధువులు

భావిస్తున్నారని తెలిపారు. నేను సోలోఖుంబుకు వెళ్ళే బాటసారులతో కలిసి సోలోఖుంబు చేరాను. ప్రయాణికులు చెప్పిన వార్త నిజమయింది. నా తండ్రి నాకు అంత్యక్రియలు చేస్తుండగా అక్కడికి చేరాను. నన్ను చూచి వారంతా ఎంతో ఆనందించారు. అప్పుడు భూకంపం వల్ల మా యిల్లు సగం కూలి పోయింది. నేను మా యింటిని మళ్ళీ కట్టుకోవడంలోను, వ్యవసాయంలోను సాహాయ్యం చేస్తూ అక్కడే ఉన్నాను. మా నాన్నగారు ఉప్పు తీసుకొని రమ్మని నన్ను టిబెట్‌కు వెళ్ళి రమ్మన్నారు. నేను టిబెట్టుకు పోక, డార్జిలింగ్‌కు వెళ్ళాను.

డార్జిలింగ్‌లో షేర్పాలు ఎక్కువగా నివసించే ప్రాంతాలు రెండున్నాయి. నేను వాటిలో ఒకటైన టూంగ్‌సూంగ్ బస్తీలో ఒక షేర్పా పెద్దమనిషి ఇంట్లో అద్దెకున్నాను. అతని పేరు అంగ్‌థార్కాయ్. అదృష్టవశాత్తు అతడు అనుభవం గల పర్వతారోహకుడు, షేర్పాల బృందాన్ని ఏర్పాటు చేసేవాడూను. ఆ యింటికి దగ్గరలోనే నా పూర్వ మిత్రుడు, షేర్పా నాయకుడు దావా థోండుప్ నివసించేవాడు. అక్కడ నివసించే తక్కినవారు కూడ ఎవరెస్టును, తక్కిన ప్రాంతాలను అధిరోహించడంలోను లబ్ధప్రతిష్ఠులు.

టూంగ్‌సూంగ్ బస్తీలో ఇళ్ళు కలపవి. కప్పులు తగరపు రేకులవి. 1935 ప్రారంభంలో నేను వివాహం చేసుకున్నాను. నా భార్య పేరు దావా ఫుతి. ఫుతి అంటే సంతానవతి అయిన అదృష్టవంతురాలు అని అర్థం. అది త్వరలోనే నిజమయింది. ఆమె సోలోఖుంబుతో పుట్టినదే. నేను ఆమెను చాలాసార్లు చూచాను; కాని డార్జిలింగ్‌కు వచ్చేవరకు పరిచయం కాలేదు.

అల్పారంభః క్షేమకరః — అంటారు పెద్దలు. కాని నా సంగతి అలా కాదు. నా మొదటి పర్వతారోహణ యాత్ర 1935 లో ఎవరెస్ట్‌తోనే ఆరంభ మయింది. అదీ ఐదవ బ్రిటిష్ పర్వతారోహక బృందంతో. నాకు పరమోత్సాహంగా వుంది. మాకు ప్రత్యేకమైన దుస్తులు ఇచ్చారు. నేను కష్టపడి పని చేశాను. నన్ను బృంద నాయకుడు ఇష్టపడ్డాడు. అప్పుడు మేము 20 వేల అడుగుల ఎత్తున వున్న నార్త్‌కోల్ వరకు ఎక్కాము. నేను అదివరకు అంత ఎత్తుకు వెళ్ళలేదు. ఆ అనుభవం నాకు ఎంతో ఆత్మ విశ్వాసం కలిగించింది తక్కిన షేర్పాలతో పోల్చుకుంటే, నాలో ఒక విశిష్టత కనిపించింది. వారు కూలీ కోసం పనిచేస్తున్నవారు; నేను నా లక్ష్యాన్ని సాధించడానికి - చోమో లుంగ్మాను అధిరోహించడానికి. వాళ్ళు కిందికి చాలా ఉత్సాహంతో దిగారు. నాకు అక్కడే వుందామని, ఇంకా పైకి వెళ్ళదామనీ అనిపించేది. నేను 1935

శరత్కాలంలో మరొకమారు హిమాలయం ఎక్కాను; ఇది 24 వేల అడుగుల కాబ్రూ శిఖరం. కాని దానిలో నా పాత్ర అత్యల్పం. షేర్పాలు ఎవరూ ఆ శిఖరం కొనకు వెళ్ళలేదు.

నాకు అప్పుడే ఒక కుమారుడు కలిగాడు. చాల అందమైన శిశువు. నిమా దోర్జీ అని పేరు పెట్టాము ఒక శిశువుల ప్రదర్శనంలో వాడికి బహుమానమూ వచ్చింది. కాని వాడు దురదృష్టవశాత్తు 1939 లో నాలుగేళ్ళ వయస్సులో కన్ను మూశాడు.

ఎరిక్ షిప్టన్ నాయకత్వంతో, హగ్ రట్‌లెడ్జ్ నాయకత్వంలో 1936లో రెండుసార్లు ఎవరెస్ట్ అధిరోహణకు ప్రయత్నం జరిగింది. మంచు తుఫానుల వల్ల ప్రయత్నం ఫలించలేదు. ఈ రెండు యాత్రలలోను నేను ప్రముఖంగా ఉన్నాను. రట్‌లెడ్జ్ గొప్ప వ్యక్తి. 1953 లో ఎవరెస్ట్ అధిరోహకుడినిగా నన్ను బ్రిటిష్ ప్రభుత్వం సన్మానించినప్పుడు ఆయన నన్ను కలుసుకొని ఎంతో సంతోషించాడు.

1936 తర్వాత నేను డార్జిలింగ్‌లో ఎక్కువ కాలం ఉండలేదు. గఢ్ వాల్ ప్రాంతంలోను, ఇతరత్రాను విదేశ బృందాలతో తిరిగాను. తొలిసారిగా రైలెక్కి ఢిల్లీ, కలకత్తా వంటి మహా నగరాలు చూచాను. నందాదేవి శిఖరం ఎక్కాను. ఎవరెస్టుకు ఆవలివైపున 27,200 అడుగుల ఎత్తువరకు వెళ్ళాను. ఇంత ఎత్తుకు వెళ్ళిన షేర్పాలకు ఏర్పాటయిన 'టైగర్' (షేర్) బిరుదును 1938 లో పొందాను. చిత్రాల్‌లోని 25,260 అడుగుల ఎత్తయిన తిరిచ్‌మీర్‌ను ఎక్కాను. ఇంతలో యుద్ధం వచ్చింది. ఆ సమయంలో వాయవ్య ప్రాంతం లోను, చిత్రాల్ అంతటా ఉన్న పర్వత ప్రాంతాలలోనూ విదేశ బృందాలతో పాటు పర్యటించాను.

చిత్రాల్‌లో నా భార్య దావాఫుతి జబ్బు పడింది. అక్కడి శీతోష్ణస్థితి ఆమెకు పడలేదు. నా మిత్రుడు జాకబ్ ఎంత శ్రద్ధగా చికిత్స చేసినా, ఆమె 1944 లో మరణించింది. అప్పటికి నాకు ఇద్దరు కుమార్తెలు. పెద్దదాని పేరు పేంపేం, ఐదేళ్ళది. రెండవదాని పేరు నిమా, నాలుగేళ్ళది. నేను చిత్రాల్ వదలి డార్జిలింగ్ చేరాను. మళ్ళీ నాకు వివాహం చేసుకొనే ఉద్దేశంలేదు. కాని, పిల్లల పోషణ కోసం తప్పనిసరిగా చేసుకోవాలని మిత్రులు బలవంతం చేయడం వల్ల డార్జిలింగ్‌లో పరిచితురాలయిన అంగ్‌లహమ్మాను పెండ్లాడాను. నేను చానా చాలా అదృష్టవంతుడిని. ఆమె ఎంతో అనుకూలవతి అయిన భార్య. నాకు పనిలేనప్పుడు నన్ను పోషించింది. పిల్లలను ఎంతో ప్రేమతో పెంచింది.

"హిమాలయాలలో అతి మానుష స్వరూపుడైన మంచు మనిషి ఉంటూం టాడట. మీరు చూచారా?" అని అడిగాను, మధ్యన కలుగజేసుకొని. దానికి నోర్గే సమాధానంగా ఇలా అన్నాడు :

నేను మంచు మనిషి అనబడే జంతువు అడుగులను 1946 లో తొలి సారిగా జేము హిమానీనదంపై చూచాను. తర్వాత 1952 లో చూచాను ఎవరెస్ట్ శిఖరం కింది భాగంలో. ఈ జంతువును యేటి అంటారు మావాళ్ళు. ఇదొక రకం కోతి జాతి జంతువు. దీని పాదాలు చాల పొడుగ్గా వుంటాయి. దీనిని చూచిన వాడికి మరణం తప్పదని షేర్పాలు నమ్ముతారు. వీటిలో నర భక్షకమైన జాతి, కేవలం మృగ భక్షకమైన జాతి - రెండు తెగలు ఉన్నా యంటారు. నరభక్షక జాతిని మేత్రేయ్ అని మృగభక్షక జాతిని ఛుత్రేయ్ అని అంటారు. నేను యేటీని ఇంత వరకూ చూడలేదు.

నేను 1948 లో ఏ పని లేకుండా ఉన్నాను. ఇల్లు గడవడం కష్ట మయింది. నా భార్య అంగ్‌లహమ్మా విదేశీయుల వద్ద ఆయా పనిచేసి కుటుంబాన్ని పోషించింది. అప్పుడు బౌద్ధులమయిన మాకు పుణ్యభూమి, ఒకప్పుడు మా పూర్వుల జన్మభూమి అయిన టిబెట్టుకు, ముఖ్యంగా టిబెట్ రాజధాని అయిన లాసాకు యాత్రచేసే భాగ్యం కలిగింది. ప్రొఫెసర్ గూసెప్ తుక్సీ అనే ఇటలీ విద్వాంసుడు టిబెట్‌లో ప్రాచీన హస్త లిఖిత గ్రంథాలను సేకరించడానికి వచ్చాడు. అతని బృందంతో లాసా వెళ్ళాను. అయన బహు భాషా కోవిదుడు.

మేము సిక్కిం ప్రభుత్వ సహకారానుమతులతో కాంచెన్‌జంగా శిఖర ప్రాంతం దాటి లాసాకు బయలు దేరాము. దారిలో తుక్సీ ఎన్నో బౌద్ధ విహారాలు దర్శించి భూర్జపత్ర గ్రంథాలు సేకరించాడు. కాంచెన్ జంగా అనే పదం నాలుగు టిబెట్ భాషా పదాలతో ఏర్పడిందని నాకు తెలిసింది. కాంగ్-ఛెన్-జోడ్-న్గా- ఇవి నాలుగు పదాలు. కాంగ్ అంటే మంచు. ఛెన్ అంటే గొప్ప. జోడ్ అంటే భండాగారం. న్గా అంటే ఐదు. కాంగ్ చెన్ జోడ్‌న్గా - ఐదు శిఖరాల మహా హిమనిధి అని అర్థం. ఇది జన వ్యవహారంలో కాంచెన్ జంగా అయింది. నేను ప్రతి విహారంలోను బుద్ధుణ్ని దర్శించిన తర్వాత ఓమ్ మణి పద్మే అని జపించాను. నావల్ల ప్రొఫెసర్ తుక్సీకి అతి ప్రాచీనమైన ఒక లిఖిత పుస్తకం లభించింది. అందరూ నిరాశపడిన సమయంలో ఒక సాధారణ విహారంలో వెదుకుతుండగా అది నేను వెదకుతుండగా దొరికింది. దానిని మొదట తుర్కిస్తాన్‌లో వ్రాశారట. తర్వాత ఆ భాషనుంచి టిబెట్ భాషకు అనువాద మైంది. తుక్సీ చాల సంతోషించారు. ఆయన అన్వేషణలో అదే ప్రధానం మరి!

నేను తర్వాత కొంత కాలం చిన్న చిన్న పనులు చేస్తూ 1950 వరకు గడిపాను. ఆ సంవత్సరం ఆగస్టు నెలలో లెఫ్టినెంట్ రిచర్డ్ మార్ష్ బృందంతో నంగా పర్వత్ శిఖరం ఎక్కడానికి వెళ్ళాను. ఇది ఎవరెస్టుకు పడమరగా వెయ్యి మైళ్ళ దూరంలో వుంది. మేము కలకత్తా నుంచి రావల్పిండికి అక్కడి నుంచి పెషావర్‌కు వెళ్ళి, అక్కడి నుంచి విమానంలో గిల్గిత్‌కు వెళ్ళాము. నంగా పర్వత్ ఎత్తు 26,660 అడుగుల భయంకరమైన శిఖరం. మృత్యుశిఖరం అని దీనికి పేరు. మేము వెళ్ళే సమయానికి భయంకరమైన మంచు తుఫాను కొట్టడంవల్ల శిఖరం కింది వరకు వెళ్ళి ఎక్కలేక తిరిగి వచ్చాను.

నేను ఒక ఫ్రెంచి పర్వాతారోహక బృందంతో కలిసి నందాదేవిని అధిరోహించడానికి హిమాలయన్ క్లబ్బుతో ఒప్పందం చేసుకున్నాను. నందా దేవి శిఖర సమూహంలో పెద్ద శిఖరం ఎత్తు 25.660 అడుగులు. ఈ శిఖరాధి రోహణానికి జరిగిన రెండు యాత్రలలో నలుగురు మరణించారు.

స్విట్‌జర్ల్యాండ్ బృందంతో 1952 వసంత ఋతువులో ఎవరెస్ట్ శిఖరాధిరోహణ యాత్రకు బయలుదేరాను. ఆ బృందానికి నాయకుడు రేమండ్ వేబర్ట్. ఈసారి నేపాల్‌నుంచి ఎక్కాము. 28,250 అడుగుల ఎత్తు వరకు ఎక్క గలిగాము. మానవులు ఎవరెస్ట్ శిఖరానికి ఇంత దగ్గరగా రావడం ఇదే మొదటిసారి. శిఖరానికి ఎక్కలేక పోయాము. తిరిగి వచ్చాను. ఆ సంవత్సరమే స్విస్ బృందం లేంబర్ట్ నాయకత్వంలో శరదృతువులో నామ్‌చే బజారు నుంచి అధిరోహించాము. నామ్‌చే బజారులో నేను మా అమ్మను, కుటుంబాన్ని చూచాను. నవంబర్ 19 వ తేదీకి మేము ఎవరెస్ట్ వైపుగా మరొక కొంతమేర పైకి వెళ్ళాం. కాని మంచు తుపాను గంటకు 60 మైళ్ళ వేగంతో వీచింది. వెను దిరుగక తప్పలేదు. ఈసారికూడ మా ప్రయాస విఫలమైనందుకు నేను చాల విచారపడ్డాను. మేము వైఫల్యంతో వచ్చినా కాట్మండులో మాకు ఘనమైన స్వాగతం లభించింది. నేపాల్ రాజు నాకు 'నేపాల్ ప్రతాప్ వర్ధక్' పతకం బహూకరించారు.

నేను కొంచెం నీరసంగా ఉన్నాను. నా భార్య అంగ్‌లహ్మూ నన్ను హెచ్చరించింది. నేను ఈసారి కూడ అధిరోహణ యాత్రా బృందంలో చేర దలచాను. ఇది నా ఏడవసారి యత్నం. ఈసారి బ్రిటిష్ బృందం. నాయకుడు కల్నల్ హంట్. అతడు మంచి పథకాలు వేయగలవాడు. నా జీతం నెలకు

300 రూపాయలకు పెంచారు. నేను మరణిస్తే, నా భార్యకు 2,000 రూపాయల పరిహార ద్రవ్యం నిర్ణయమైంది. మా బృందంలో కలనల్ హంట్, మేజర్ విలీ, న్యూజిల్యాండ్ వాస్తవ్యుడైన హిల్లరీకాక ఏడుగురు పాశ్చాత్య అధిరోహకులు ఉన్నారు. లండన్ టైమ్స్ పత్రిక విలేఖరి జేమ్స్ మారిస్ కూడ వున్నాడు. మేము నామ్చే బజారు నుంచి బయలుదేరాము. హిల్లరీ నేను ఒక జట్టు. అతడు గొప్ప పర్వతారోహకుడు. ఆరడుగుల మూడంగుళాల ఎత్తు. ఎక్కుతున్నప్పుడు హిల్లరీ పదిహేను అడుగులు కిందికి జారాడు. ఇంకా అగాధానికి పోవలసిన వాడే. కాని, నేను పగ్గంతో పైకి లాగాను. అతడు "శభాష్ టెంజింగ్!" అన్నాడు నా సమయస్ఫూర్తికి.

మే 28 మధ్యాహ్నానికి 1952 లో స్విస్ బృందం అధిరోహించిన ఎత్తుకు 150 అడుగులు పైగా చేరుకున్నాము. మా బృందంలో అంతా అలసిపోయారు; దిగిపోయారు. 27,900 అడుగుల ఎత్తున నేను, హిల్లరీ మకాం (క్యాంప్) ఏర్పరచుకొన్నాము. అంత ఎత్తున మకాం అదే మొదటిది. దగ్గర ఉన్న పళ్ళు, బిస్కత్తులు తిని చీకట్లో రేపటి పథకాలు ఆలోచించాము. నేను స్విస్ రెయిన్ డీర్ బూట్లతో పడుకున్నాను. హిల్లరీ బూట్లు తీసి స్లీపింగ్ బ్యాగ్ పక్కన పెట్టాడు. రాత్రంతా బయట ఉండడంవల్ల అవి మంచుకు బిగుసుకుపోయాయి. వాటిని సరిచేసుకోడానికి మేము గంటసేపు వాటిని స్టౌమీద పెట్టి కాచవలసి వచ్చింది.

మే 29న ఆక్సిజన్ సీసాలను పరిశీలించుకొని పైకి ఎక్కడం ప్రారంభించాము. ఉదయం 9-00 గంటలకు మేము దక్షిణ శిఖరం చేరాము. ఇక 309 అడుగులే ఎక్కవలసివుంది. దారి నిటారుగాను, ఇరుకుగాను ఉంది. ఎవరెస్ట్ శిఖరానికి వందడుగుల కింద మంచుకప్పని గుండ్లు కనిపించాయి. అక్కడ రెండు గుడారాలు నాటగలిగినంత చదునైన చోటు కనిపించింది. నేను అక్కడి చిన్న రాళ్ళు ఏరి జేబులో వేసుకున్నాను. ముందుకు వెళ్ళాము. ఇప్పుడు మా ఎదుట ఉన్నది ఒక పెద్ద మంచుకప్పిన గుండు.

ఎవరెస్ట్ శిఖరానికి కొంచెం కిందుగా మేమిద్దరం ఆగాము. మా యిద్దరినీ కలిపే పగ్గం పొడవు 30 అడుగులు. దానిలో ఎక్కువ భాగం కొలుకులతో నా చేతిలోనే ఉంది. మా మధ్య ఆరడుగుల పగ్గమేవుంది. ఎవరెస్ట్ శిఖరాన్ని ఎవరు ముందు, ఎవరు తర్వాత ఎక్కాలి అనేది మేము ఆలోచించలేదు. మేము నెమ్మదిగా, పక్కలకు కదలకుండా వెళ్ళాము. ఎవరెస్ట్ శిఖరం ఎక్కాము; మొదట హిల్లరీ అడుగు పెట్టాడు; తర్వాత నేను.

మేము అక్కడ మొట్టమొదట చేసిన పని - అందరు పర్వతారోహకుల లాగే పరస్పరం కరచాలనం చేసుకున్నాం. అంతటితో మాకు సంతోషం కలుగ లేదు. నేను నా చేతులెత్తి గాలిలో కదలిస్తూ హిల్లరీని కౌగలించుకున్నాను. మేము పరస్పరం వీపులు తట్టుకున్నాము. ఆక్సిజన్ ఉన్నా అక్కడ ఊపిరి ఆడడంలేదు. అప్పుడు సమయం 11-30 గంట. సూర్యుడు వెలిగిపోతు న్నాడు. ఆకాశం మహా నీలంగా కనిపించింది; అలాటిది నేనెప్పుడూ చూడలేదు.

మా చుట్టూ నేపాల్, టిబెట్టులగుండా పరచుకున్న సువిశాల హిమా లయాలు. ల్హోట్సే, నుప్‌ట్సే, మకాలూ, కాంచెన్ జంగా వంటి శిఖరాలన్నీ చిన్న గుండ్లుగా కనిపించాయి. ఆక్సిజన్ లేకనే అక్కడ వుండవచ్చు. కనుక ఆక్సిజన్ కట్టివేశాము. హిల్లరీ తన కెమరా తీశాడు నేను నా గొడ్డలికి చుట్టిన నాలుగు పతాకాలను విప్పాను. నేను పతాకాలున్న గొడ్డలిని ఎత్తాను హిల్లరీ నా ఫోటో తీశాడు. పతాకాల వరుసలో పైనుంచి కిందికి-మొదట ఐక్యరాజ్య సమితి పతాక, తర్వాత బ్రిటిష్ పతాక, మూడవది నేపాల్ పతాక, నాల్గవది భారత పతాక, మా విజయం మాకే పరిమితం కాదు గనుక, ప్రపంచానిదంతా గనుక నేను ఐక్యరాజ్యసమితి పతాకను మొదట అన్నిటికన్నా పైన ఉంచాను.

తర్వాత నేను నా జేబులోంచి నేను తెచ్చిన మిఠాయి పొట్లం, నాకూతురు నిమా యిచ్చిన ఎరుపు-నీలం పెన్సిలు తీసి, మంచులో చిన్న గుంత చేసి వాటిని దానిలో పెట్టాను. హిల్లరీ అది చూచి కలనల్ హంట్ తనకిచ్చిన గుడ్డ పిల్లిని నాకు అందించాడు. దానిని మిఠాయి పొట్లం, పెన్సిల్ పక్కన పెట్టాను. కావలసినవారు ఎవరైనా మన యింటికి వచ్చినప్పుడు మనం వారికి మిఠాయిలు ఇస్తాము. ఎవరెస్ట్ నాకు అత్యంత ప్రియమైంది. కనుక ఈ మిఠాయిలు-అని అనుకుంటూ మౌనంగా ప్రార్థన చేశాను. తర్వాత "ధూజీ ఛేయ్ ఛోమో లుంగ్‌మా!" – ప్రపంచ మాతృదేవి నీకు ధన్యవాదాలు అన్నాను.

మేము పదిహేను నిమిషాలపాటు ఎవరెస్ట్ శిఖరంపై ఉన్నాము. నేను దిగడానికి గొడ్డలి కావాలి గనుక పతాకాలను విప్పి శిఖరం మీద పరిచాను. దారం కొనలను మంచులో సాధ్యమైనంత లోతున పూడ్చాను. అక్కడ నాకు అదిసరకు 33 సంవత్సరాలుగా ఎవరెస్ట్ అధిరోహణకు ప్రయత్నించినవారు, మరణించిన వారు అంతా జ్ఞాపకం వచ్చారు. వారికి జోహార్లు అర్పించాను.

నేను హిమాలయాలు దిగి ఇంటికి వచ్చిన తర్వాత అందరూ నన్ను అడిగిన ప్రశ్నలు రెండు - శిఖరంపై బుద్ధ భగవానుడు దర్శనమిచ్చాడా? పరమేశ్వరుడు కనిపించాడా?" నేను అతి మానుషమైనది ఏదీ కనిపించలేదని జవాబు చెప్పాను.

నేను దిగి దిగగానే "టెంజింగ్ జిందాబాద్" నినాదాలు ప్రతిధ్వనించాయి. హంట్ మకాంలో నన్ను, హిల్లరీని కౌగలించుకొని "ఇది నిజమేనా?" అని పలు మార్లు పలవించినట్టుగా అడిగాడు. మకాంనుంచే నా భార్యకు సందేశం పంపాను. తక్కిన మకాంలలో రెండు రోజులు గడిపి థామేలో మా అమ్మను చూడడానికి వెళ్ళాను. "నేను ఎన్నోసార్లు చెప్పాను. హిమాలయం జోలికి పోవద్దని. విజయం పొందావు. ఇక వెళ్ళనవసరంలేదు" అని ఆమె నాతో అన్నది.

పత్రికలవాళ్లు, ఫోటోగ్రాఫర్లు నన్ను ముసురుకున్నారు. కాట్మండూలో నేపాల్ రాజు త్రిభువన ఆ దేశపు అత్యున్నత బిరుదు "నేపాల్‌తార" బహూకరించారు. తర్వాత లండన్‌కు వెళ్ళి బ్రిటిష్ ప్రభుత్వం నుంచి విక్టోరియా పతకం పొందాను. భారత రాష్ట్రపతి బాబూరాజేంద్రప్రసాద్‌ను, ప్రధాని జవాహర్‌లాల్‌ను, తక్కిన ప్రముఖులను కలుసుకొన్నాను. ఎక్కడికి వెళ్ళినా గౌరవమే, జిందాబాద్‌లే. ఇప్పుడు మీ ఎదుట ఉన్నారు.

"ఇకమీద మీ కార్యక్రమం ఏమిటి?" అనడిగాను. "నా జీవితమే కొండలు కదా! పర్వతారోహణ శిక్షణ పాఠశాల నడుపుతాను" అన్నాడు టెంజింగ్. జయజయధ్వానాల మధ్య వీడ్కోలు ఇచ్చాము టెంజింగ్ నోర్గేకు, ఆయన సతీమణి అంగ్ లహ్మూకు.

(1953 జూన్, మద్రాసు)

# రమ్యాలోక విరాజితులు రాయప్రోలు

అది ఉదాత్తత అనే ఆత్మ ఎగిరిపోయి సంప్రదాయ కళేబరం మాత్రమే మిగిలినకాలం. అది సంస్కరోద్యమజ్వాలలు అటూ ఇటూ అంటుకొంటున్న అపరంజికాలం. అది జాతీయోద్యమం పోటిమరించి ఆకులు వేస్తున్న విప్లవా రంభకాలం. అవసానదశలో ఉన్న ప్రబంధాల పోకడల జణజణాత్కారాలు మాత్రమే మిగిలిపోయిన పిదపకాలం. కొత్తదనంకోసం, చిత్తప్రసాదనం కోసం గొంతు సవరించుకొంటూ పదిదిక్కులకూ చూపులు పరపుతున్న కాలం. ఆ కాలంలో జన్మించారు రాయప్రోలు సుబ్బారావుగారు.

ఏ కాలంలో పుట్టినా స్పందించని హృదయంలేని వారికి ఏదీ అంటదు. స్పందించే హృదయమున్న వారికే బాధలన్నీ. సమసామయిక ఉద్యమ ప్రభాత వాత పోతాలు రాయప్రోలు వారిపై వీచాయి. ఆయనది లేలేత ఊర్పులకే స్పందించే హృదయం కనుక స్పందించింది, ఆక్రోశించింది, ఆలపించింది, నవ్యకవితాప్రస్థానాచార్యత్వం పుణికి పుచ్చుకొన్నది.

రాయప్రోలు 1892 మార్చినెలలో గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా గార్లపాడులో జన్మించారు. వారి మేనమామ శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు గొప్ప అలంకారికులు, అవధాన విద్యాధురీణులు. వారివద్ద రాయప్రోలువారు సంస్కృతాంధ్రాలు చదివారు. 1910లో బాపట్లలో మెట్రిక్యులేషన్ పూర్తి చేసుకొని 1911లో ఇంటర్‌మీడియట్ చదవడానికి హైదరాబాదు వెళ్ళారు. హైదరాబాదులో నిజాం కళాశాలలో చేరారు. కాని, వారు ఉన్నత విద్య పూర్తి చేయకముందే మద్రాసుకు వెళ్ళి శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి సంపాద కత్వంలో రూపుదిద్దుకుంటున్న ఆంధ్ర విజ్ఞాన సర్వస్వానికి సహాయ సంపాద కులుగా పనిచేశారు. 1914లో శాంతినికేతన్‌లో చేరారు. అక్కడ ఐదారేళ్ళు రవీంద్ర కవీంద్రుని, విధుశేఖర భట్టాచార్యుని, మరికొంచరు ప్రాచ్య పాశ్చాత్య ఆచార్యుల అంతేవాసిత్వంతో తమ మనస్సును మధురతరం చేసుకొన్నారు. శాంతినికేతనం నుండి తిరిగి వచ్చిన తరువాత ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు ఆచార్యులుగా చేరారు. నవ్యకవితకు ఆద్యులయినట్లే, ఆయన చాల వాటికి ఆద్యులు. తొలితెలుగు ప్రిన్సిపాల్, వరంగల్ కళాశాలకు ప్రిన్సిపాల్

అయ్యారు. పెక్కు సన్మానాలు పొందారు. 1984 జూన్ 30వ తేదీని సికిందరాబాద్‌లో స్వగృహంలో పరమపదించారు.

రాయప్రోలు వారిపై సమసామయికమైన పెక్కు ప్రభావాలు పడ్డాయి. ఆ ప్రభావాలతో మొలకెత్తిన తొలి కవిత ఏది అంటే, అయన కూడా చెప్ప లేనన్నారు. "నా కవితా కంఠంలోనుంచి తొలిసారి పలికిన ముగ్ధ పదబంధ మేదో నేనిప్పుడు చెప్పలేను. నేను గుంటూరు సీమలో పుట్టి పెరిగితిని. గుమ గుమలాడే కొత్తిమెరచేల మీద, కుంద పొదుగులతో నడువలేకనడిచే పాడిఆవుల మీద, మా ఊరి చెరువునుండి నీళ్ళు తెచ్చే పౌరభామలమీదా కొన్ని పద్యాలు తొల్తతొల్త వ్రాసినట్టు బాగా జ్ఞాపకం ఉన్నది కాని, ఆ పద్యాలేవీ నా స్మృతిలో లేవు" అన్నారు ఆయన. కనుక ఆయన తొలి రచన మనకు పుస్తకరూపంలో లభించింది లలిత.

అప్పుడు వారు రాజమహేంద్రవరంలో ఉన్నారు. చరిత్ర చతురానన చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రకేసరి అనే పత్రిక నడుపుతున్నారు. అత్తిలి సూర్యనారాయణగారు రాయప్రోలువారి ప్రతిభకు పాదులు తీర్చారు. వారి ప్రోత్సాహంతో రాయప్రోలువారు ఆ పత్రికలో వ్యాసాలు ప్రచురించారు. గంటి లక్ష్మన్న పంతులుగారనే న్యాయవాది ప్రోత్సాహంతో గోల్డ్‌స్మిత్ వ్రాసిన ది హెర్మిట్‌ను లలిత అనే పేరుతో రచించారు. ఇది భావానువాదం. దీనితో వారి రచనా జీవితం 1909లో కొత్తమలుపు తిరిగింది. లలిత 1912లో పునర్ముద్రణ కూడా పొందింది. కాని, రాయప్రోలు వారిని నవ్యాంధ్ర కవితా ప్రస్థానాచార్యుని చేసింది తృణకంకణం. ఇదీ 1912లోనే వెలువడింది.

రాయప్రోలు వారి ప్రతి రచన రసానందసంధాయి మాత్రమేకాక ప్రయో జనాత్మకం కూడా. ప్రతిదీ ఏదో సన్నివేశంలో, ఏదో ప్రయోజనం కోసం అవత రించిందే. వారు మొదట్లో తమ మేనమామగారు అవ్వారి వారితోపాటు శతవధాన ప్రక్రియకు దిగినవారే. అప్పట్లో అవధాన కవితతో, ఆశు కవితతో ఆంధ్రావళిని ఉర్రూతలూగించిన తిరుపతి వెంకటకవులలాగ అవధానం చేయ సాహసించక పోలేదు. కాని, అంతలోనే వారు మేల్కొని తమ ఉత్తమ కవితా కళను దుర్విని యోగం చేయరాదనుకొన్నారు. అశాశ్వతమైన ఆశుకవిత్వానికి స్వస్తి చెప్పి, శాశ్వత కవితా కమనీయ లోకంవైపు అడుగులు వేశారు. అప్పుడు వారు చేసిన ఇష్ట దైవప్రార్థనలో వారి ఆవేదన కనిపిస్తుంది, వినిపిస్తుంది.

తెనుగే తీయనిదీ, దుంధురందు
పద్యక్రీడ లత్యంత మో

హనముల్, శోభనముల్ తదీయరస
రక్తాలాపనంబుల్ లభిం
చిన వాగర్థకలాకలాప జయ
లక్ష్మన్ గాలికిం బుత్తునే
జననీ, ఏమిటికింక ఆశుకవితా
సన్న్యాస మిప్పింపవే!

రసమో, భావమొ, జీవదర్థసుకుమార వ్యంజనా మంజు శ
బ్దసమాసారచనంబొ, సాధు హృదయ స్పంద ప్రతిష్ఠా కథా
విసరంబో, సకలార్థశూన్య మగునీ వేగాతివేగోక్తి దు
ర్వ్యసనంబేటికి త్రిప్పుమింక జననీ రమ్యాక్షరక్షోణికిన్.

అంటూ వారు ప్రార్థించడం చూడగా ప్రయోజనకరమైన, సార్థకమైన రమ్యాతి రమ్యమైన అక్షర క్షోణి - క్షయ మెరుగని సాహిత్య లోకం చిన్ననాడే ఆయనకు ఊహాపథంలో ఉంది. ఆయన క్రమంగా అంచెలంచెలుగా ఆ రమ్యా లోకపు రమ్యలోకాన్ని చేరుకొని, మననూ చేర్చే యత్నం చేశారు.

రాయప్రోలు వారి రచనలను మూడు విధాలుగా విభజించవచ్చు: 1. అనువాదాలు, 2. స్వతంత్రాలు, 3. లక్షణ కావ్యాలు-అని. మన సాహిత్యం అనువాదంతోనే ప్రారంభమయింది. అంత మాత్రాన మనకు కలిగిన న్యూనత ఏమీలేదు. భారతం వంటి విజ్ఞాన భండారాన్ని తెలుగు వారికి చుబ్బనచూర లిద్దామనే సత్సంకల్పంతోనే నన్నయ భట్టారకుడు భారతానువాదానికి పూను కున్నాడు. అదే వరవడిలో రాయప్రోలు వారు గోల్డ్‌స్మిత్ ది హెర్మిట్‌ను లలితగా రూపొందించారు. వారి అనువాదాలతో లలిత, అనుమతి, మధుకలశము, భజగోవిందము, సుందరకాండము ముఖ్యమైనవి.

అనుమతి టెన్నిసన్ గోరాకు అనువాదం. దీనిని బాపట్ల ప్రధానోపాధ్యా యుల ప్రేరణతో అనువదించారు. భజగోవిందం శంకరుల స్తోత్రానికి అను వాదం. దీనికి వారి పిన్నిగారి ప్రోత్సాహం కారణం. మధుకలశము ఉమర్ ఖయ్యాం పారసీరుబాయతుల ఆంగ్లానువాదానికి పునరనువాదం. సుందరకాండ వాల్మీకి రామాయణ సుందరకాండకు గేయానువాదం.

స్వతంత్ర కావ్యాలు: తృణకంకణం, కష్టకమల, స్నేహలత, స్వప్న కుమారము, జడకుచ్చులు, ఆంధ్రావళి, తెనుగుతోట మున్నగునవి.

తృణ కంకణం 1912 లో వెలువడింది. దీనితో అంతవరకు ప్రబంధ కలేబరాలతో కంపుకొడుతున్న తెలుగు కవితా క్షేత్రంలో కొత్త వాసనలు

పీచాయి, కొ_త్త సౌరభం గుబాళించింది, కొ_త్త కాంతిరేఖ ప్రసరించింది, కొ_త్త రుచులు పుట్టుకొచ్చాయి.

పేరు, ఆరంభ పద్ధతి, ఇతివృ_త్తం, అమలిన శృంగారం మొదలయిన అనేక నవీన లక్షణాలతో విలక్షణతను సంచరించుకొన్న ఈ కావ్యం సహజంగానే నవ్యకవితకు ఆచార్యత్వం వహించడం అబ్బురమేమీ కాదు.

కవితలో రాయప్రోలు వారి విప్లవం కళ్ళు మిరుమిట్లు గొలిపేది కాదు. గొంతు చించుకొని, ఆవేశంతో ఊగిసలాడిపోయే శివకం కాదు. చల్లని సంధ్యా రాగం వంటిదది, పచ్చకర్పూరపు పూత వంటిదది, చందన చర్చ వంటిదది. పాతదనం నుంచి కాలానుగుణమైన కొ_త్తదనం సృష్టించడం వారి లక్ష్యం. నన్నయ భాష, చిన్నయ వ్యాకరణం, లాక్షణికుల కావ్యమర్యాదలను కాదనక, కొ_త్తదనం తేవడం వారి ఉద్దేశం కనుక, దూత భ_త్తేభ రచన వరకు వారు యతిప్రాసలను కూడా విడనాడలేదు. మార్పు, కోసితెచ్చి అతికించినట్టుగా కాక, మొగ్గ తొడిగి పూచినట్టుండాలనేది కదా వారి సిద్ధాంతం.

తృణ కంకణ మొక ప్రేమ గీతం. ఒక యువతి, యువకుడు ప్రేమించు కొన్నారు. వివాహం జరుగలేదు. ఆమె మరొకనిని కారణాంతారాల వల్ల వివాహ మాడుతుంది. నిరాశోపహతుడైన అతనికి ఆమె ప్రేమ త_త్త్వం విప్పి చెప్పి, అంతరంగాల కలయికే ఆదర్శ ప్రేమయని, శరీర సంబంధం అక్కరలేదని, లౌకిక ప్రణయంకన్నా అలౌకికకానుబంధం గొప్పదని ఓదార్చుతుంది. కావ్యం చివరికొక పవిత్ర ప్రేమ సందేశమిస్తుంది :-

"ఈ తృణ కంకణమ్ము ధరి
యింపుము నీ మణిబంధమందు సం
ప్రీతిని నప్పుడప్పు వల
పింపులు నెయ్యము జ్ఞప్తిగొన్న బ్రా
ఖాతిక వేళ నీ ప్రణయ
బాష్పకణాంజలి నింత యిచ్చి యే
రీతిని వాడకుండ నలరింపు
మిదే తుది వాంఛ సోదరీ!"

రాయప్రోలువారి రమ్యాలోక రమ్య సిద్ధాంతసౌధానికి 1912 లోనే తృణ కంకణంలో మూలబంధం పడింది.

వారు మద్రాసులో ఉన్నప్పుడు తెలుగు వారి సమైక్యానికి గొంతు పెగలి వచ్చిన రచన ఆంధ్రమాత. దానిలో వారు ఆనాడు అస్పష్టంగా ఉన్న ఆంధ్ర

మాతను స్పష్టంగా దర్శించుకొని, ఆంధ్ర మహోద్యమ ప్రథమ పూజా పుష్పాలు చల్లి

శ్రీలింపొందగ యావదాంధ్ర జన
మాతృష్మాతలీ నూత్న తే
జో లీనామృతమాని, తద్బలన
దౌత్సుక్యంబునన్ తావకో
ద్వేల ప్రార్థనకీర్తి గీతముల
నర్థిన్ పాడు నీ పుత్ర పు
త్రీ లోకమ్మున కేమి దెల్పెదవు
సందేశంబు నాంధ్రావనీ?

అని ప్రశ్నించారు. వారి ఆంధ్రత్వం సంకుచితంకాదు. విశ్వభారతీయతలో భాగం. వారు పొందిన సంస్కారం సంకుచితత్వాన్ని ఎరుగనిది. నిజానికి జాతీయతనుంచి కూడా విస్తరించి మించినది.

ఏ దేశమేగినా ఎందుకాలిడినా
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనినా
పొగడరా నీతల్లి భూమిభారతిని
నిలుపరా నీజాతి నిండుగౌరవము.
అవమానమేలా! అనుమానమేల
భారతీయుడనంచు భక్తితోపాడ!

అని ఎలుగెత్తి చాటిన గేయం జన్మభూమి స్తవంతోపాటే అంతర్జాతీయతా సౌరభాలు వెలార్చింది.

లక్షణకావ్యాలు: రూపనవనీతము; మాధురీ దర్శనము, రమ్యాలోకము- వీటిలో వారు తమ అమలిన శృంగార సిద్ధాంతాన్ని ప్రాచీనాలంకారికుల ఫక్కీలో కారికలరూపంలో వివరించారు. అట్లని ఇవి శుష్కశాస్త్ర సూత్రాలుగా ఉండవు: రసగుళికలుగా ఉంటాయి.

రూప నవనీతము ఒక రూపకం వంటిది. దాని ఉద్దేశ్యాన్ని వారే నివేదనమనే పీఠికలో ఇలా తెలిపారు :

"చేతనా చేతన ప్రపంచములో రతి అనే చిత్పదార్థమున్నది. అది మానవులలో స్త్రీపుంసయోగ నియమితమై నిర్వృతమయినపుడు పుష్పించి ఫలించి ఆవరణముక్తమై, ఆనందానుసంధానమై విపాకము పొందుతుంది. స్త్రీపుం

సంయోగస్థాయి విలసనమే శృంగారము. ఏతదానంద భావనతో సంసార క్షీరసాగరం మథింపగా ఉత్పన్నమైనదే రూపనవనీతము."

రమ్యాలోకంలో వారు ఆమలిన శృంగారాన్ని ప్రతిష్ఠించి పట్టాభిషేకం చేశారు. ఈ శృంగారం మనకు కొత్తదికాదు. కాళిదాసభవభూత్యాదుల నుంచి జాలువారిందే. కాని, తెలుగు ప్రబంధాల క్షీణకాలంలో శృంగారం మలినమై, మకిలపట్టి అసహ్య రూపాలుదాల్చింది; వెర్రి పోకడలు పోయింది. ఆ దుస్థితిని తొలగించి శృంగారానికి పూర్వపు పావిత్ర్య ప్రాభవాన్ని పునస్సంధానించారు రాయప్రోలువారు, కాని, దానిని ఆధునికులకు అనుభోగ్యంగా

"రసములకు నెల్ల శృంగారరసము తల్లి
అనిరి పూర్వులు సంభోగ మవధిగాగ
అక్షరానందసిద్ధి లక్ష్యముగనెంచు
నవ్యులకు నది అప్రధానంబ యయ్యె."

అని సవరించారు. ప్రాచీనుల భావం స్పష్టీకరించారు ఇలా:

"కులశుభాంగీ పయోధర కుసుమమందు
మోహమధువునె గవేషించె మున్ను సుకవి
స్వాత్త్వికప్రేమ కోశ పేశలము లయిన
వత్సలామృత రుచులను వలచె నేడు"

ఈ వలపును మాధురీదర్శనంలో వివరించారు. స్త్రీని భోగ్యవస్తువుగా కాక స్నేహ పవిత్ర దృష్టిలో చూచిన తీరు ఇది.

"నరనారీ సంబంధము
పరిభావింపుచు దిశావిభాగము వరుపన్
ధర జననీ భగినీ సహ
చరీ కుమారీక్రమము నిజంబగుట బుధా!"

స్తనంధయానంద తన్మయురాలైన స్త్రీయును యౌవన్నర జాతమును వత్స కృత్స్నంగా ప్రేమింపగలుగుతున్నదని స్త్రీ ప్రేమ హృదయాన్ని రూపనవ నీతంలో రూపొందించారు.

మనస్సు కోతివంటిది. గీతాచార్యుడు చెప్పినట్టు పెనుగాలివంటిది. దానిని అడ్డడం సాధ్యంకాదు. అయినా, దానిని మలుపుతిప్పి మంచిదారి చూపెట్టాలి. అలాటి మనసును తిప్పడానికి, అమలిన శృంగారానికి పరాకాష్ఠగా వారొకదారి చూపారు, పరకీయనాయికా వాదులకు :

"చతుర పరకీయ నాయికా సాహచర్య
సుఖముపాదేయమగు, అన్య శోభనోప
వన సుమంబట్లు హృదయ సేవనకు మాత్ర
మందరాక, అనగరాక, పొందరాక.

రమ్యాలోకంలో సందేశం సర్వ ప్రాచీనాలంకారిక సిద్ధాంత సమన్వయ సారసుధ ఇది.

"శీల మట్టుల నౌచితిం జెదరనీక
అహివిధాన నశ్లీల మనాదరించి,
ప్రేమ మంత్ర మహోపాసనామయులగు
నవ్యులకుపాధియయ్యె సౌందర్యమొకటె."

ఈ సౌందర్యం లౌకికం కాదు. వారే రమ్యాలోకంలో దానిని ఇలా నిర్వచించారు:

"కానరాదు సౌందర్య శృంగారములకు
భేదమధిక మారాధన వృత్తియందు
గుణము శృంగారమగును, తద్గుణశరణ్య
మమృత సౌందర్య మగును నవ్యార్చకులకు."

ఈ సౌందర్యం కాళిదాసు చెప్పిన పార్వతీ సౌందర్యం, తపస్వులకుకూడ ఉపదేశకమయిన సౌందర్యం.

రాయప్రోలు వారి యశఃకాయం వారే ఆంధ్రావళిలో అన్నట్లు

"నాదుజాతి నాదేశము నాదుభాష
అను అహంకార దర్శనము"

తెలుగు గడ్డలో ఉన్నంతవరకు, భారతదేశంలో ఉన్నంతవరకు ఉజ్జ్వలంగా ఉంటుంది.

(ఆంధ్రప్రదేశ్ — సెప్టెంబర్, అక్టోబర్, 1984)

# మూగపోయిన మధురకవి కంఠం

మిత్రులు మధురకవి శ్రీ బెళ్ళూరి శ్రీనివాసమూర్తి మంచం పట్టి ఉన్నారని తెలిసి, చూచి వద్దామనుకున్నాను. కొంత జాగు అయింది. ఇంతలోనే ఆ మధురకవి కంఠం మూగవోయిందని తెలిసి హతాశుణ్ణయ్యాను. పరిసరాలన్నీ అసహ్యాలనిపించాయి. ఎదిగిన కుమారుని కోల్పోయిన విషాద సమయంలో ఆవేదనతో ఆయన చెప్పిన పద్యాలలో ఒక్కటి జ్ఞాపకం వచ్చింది:-

పాడకు మీ ప్రభాతమున
పాడకు కోకిల నీదు పాటలో
వాడి కృపాణ వర్గములు
వ్రచ్చెడు నా హృదయంబు పుత్రునిన్
బూడిదవైచి నే శిశిర
ముంగనుచుంటిని జీవితంబులో
పాడకు మీ ప్రభాతమున
పాడకు కోకిల ప్రేమ గీతమున్.

శ్రీనివాసమూర్తి జీవితం వడ్డించిన విస్తరి ఏమీకాదు; ఎన్నో ఆటుపోట్లకు ఆలవాలమైనట్టిది. పుత్రికను కోల్పోయినప్పుడూ ఆయన ఇట్లే శోకించాడు:-

పానము సేయబూని మధు
పాత్రిక నా యధరంబు జేర్చితిన్
గాని యపారమై యచట
గానబడెన్ విషబుద్బుదంబులా
శానిహతుండనైతినని
స్వామి వచింపగలేను నాకథన్
ప్రాణమువోసి నా హృదయ
భారమణంపుము నీకు మ్రొక్కెదన్.

అని ఆర్తత్రాణ పరాయణుడైన భగవంతునితో మొరపెట్టుకొన్నాడు. ఈ కుమార్తె పేరు విమల. తెలుగులెంక, మహాకవి శ్రీ తుమ్మల సీతారాము

మూర్తిగారు ఈ విషాద పద్యాలు చదివి "కవిగారూ! మీ విమల చనిపోలేదు. ఆమె చిరంజీవిని. ఆమె ఈ కవితా కుమారి"-అని సమాశ్వాసించారు. శ్రీ బెళ్ళూరి కరుణ రసాన్నే కాదు. తక్కిన ఎనిమిది రసాలను సన్నివేశానుగుణంగా కుమ్మరించిన రససిద్ధుడు; నిరంతర రచనా పరాయణుడు. అందువల్లనే-

పూరిగుడిసెలలోనైన బుత్తుగాని
గీతమల్లక బ్రతుకు సాగింపలేను.

అని నిష్కర్షగా అన్నారు ఒక సందర్భంలో. శ్రీ బెళ్ళూరి ప్రకృతిని పరవశించి ఆరాధించాడు. తన పారవశ్యాన్ని ఆయన ఇలా ఆలపించాడు "తపోవనము" కావ్యంలో-

ప్రకృతి ఒడిలోన సుఖసుప్తి బడయుచుండు
కోయిలలు లేప నిదుర మేల్కొనుచునుండు
అడవికోనల సెలయేటి పడుచుగాంచి
పరమ సంతోషభరమున బలుకరింతు
మొగ్గనై యాకు మరుగున బొలుతునేమొ!
పూవుగాబూచి పరిమళములుకబోతు
నో! విహంగమై పరతునో! భావగీత
మగుదునో నేను భావి జన్మములయందు.

శ్రీ బెళ్ళూరి ఖండికలు, కావ్యాలు, మహాకావ్యాలు-అన్నీ విశిష్టమైనవే. కావ్య గంగలో ఆయన కవితాంగనను తెలుగు ప్రాంగణంలోకి ఆహ్వానించి విశేషాలు తెలియజేస్తాడు. శిల్ప పారమ్యమైన లేపాక్షిని ఆయన ఇలా పరిచయం చేశాడు:

తరుణీ తప్పకపోయి చూడదగు నం
దంబైన లేపాక్షి యె
వ్వరు నిర్మించిరొ దేవతాయతన మ
బ్బో! యేమి శిల్పంబు మ
త్సరమున్ గాంతురు భిన్నదేశ జనులా
సౌందర్యముంజూచి ఆ
శిరముల్ విప్పిన సర్పమో, వృషభమో,
శ్రీమూర్తులో యచ్చటన్.

శ్రీ బెళ్ళూరి శిల్పవాణి కావ్యం శిల్పవిలాసిని ఆత్మకథ వంటిది. వివేకానందునీ అమెరికాలో కొందరు నీ దేశమేది అని ప్రశ్నించారు. దానికాయన

భారత వైభవం వర్ణిస్తూ సమాధానం చెప్పారు. దానిని సుప్రసిద్ధ హిందీ కవి, ఆర్య సమాజ ప్రచారకుడు స్వామి సత్యదేవ పరివ్రాజక్

మెరావతన్ వహీహై
మేరావతన్ వహీహై
బహతీ జహాఁపె గంగా
యమునాకీ స్వచ్ఛధారా
ఋషియోఁనే జిస్‌కె తటపర్
ఈశ్వరకో థా విచారా

అని గానం చేశారు. శ్రీ బెళ్ళూరి తన వివేకానంద కావ్యంలో సహజసుందరంగా ఇలా వర్ణించాడు :

అతి పూత చరిత భారత రత్నగర్భ
బ్రతుకెల్ల ద్రోచితీవరకు; నయ్యదియె
నా జన్మభూమి మానసము నర్పించి
పూజింతు నా దివ్యభూమినేనాడు.

విమర్శకవతంసులు శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు శ్రీ బెళ్ళూరి కవితను ఆస్వాదించి చక్కని మాటలన్నారు:-

"పద్యము చదువగానే కవికి ఆర్జవగుణ మెంతయుండునదియు కావ్యాను భవ రసికులకు స్పష్టముగా తెలిసిపోవును. ఈ యార్జవ గుణము నిండియుండు టను శ్రీనివాసమూర్తిగారి కవనమందు ప్రతి పద్యమునందును చూడవచ్చును. ఈ గుణముచే వీరి సుందర వస్తు ప్రపంచము విశాలమైనది." శ్రీ బెళ్ళూరి కవితా తపస్సు భారతి, సాధన పత్రికల వాత్సల్యంతో కొనసాగింది. భారతికి ఆయన 1930 నుండి కాలధర్మం చెందేవరకూ కవితాసేవ చేశారు. "అవ్యాజ వాత్సల్యముతో భారతి భిక్ష పెట్టకయున్నచో నా జీవితములో ఏనాడో కవితా సన్యాసము స్వీకరించియుండవలసిన వాడనే" అని ఆయన చెప్పుకున్నాడు. శ్రీ బెళ్ళూరి రచనలలో ఖండ కావ్యాలే ఎక్కువ. అవి తపోవనము, కావ్యగంగ, అమృతాభిషేకము, జాముకోడి, విశ్వవైణికుడు అనే సంపుటాలుగా వెలు వడ్డాయి. శిల్ప వాణి, వివేకానందము కావ్యాలు, రెడ్డిరాజ్య మహోదయము ఈయన చారిత్రక మహాకావ్యం. దీనిని ఈయన అనంతపుర కళాశాలలో ఇంటర్మీడియెట్‌లో సహాధ్యాయుడు, రాష్ట్రపతి అయిన డాక్టర్ నీలం సంజీవరెడ్డి గారికి 1977లో అంకితమిచ్చాడు.

అతిలోకంబగు రెడ్డిరాజుల చరి
త్రాంశంబు హృద్యంబు మ
న్మతి రాపాడెడు కొండవీటి ఘనతల్
నానా రసోపేతమ
ద్భుత సందేశ సుధాకరమ్ము కృతి
యిత్తున్ ప్రేమ నింపార శా
శ్వత కీర్తిన్ గొను సాహితీ ప్రియుడవై
సంజీవరెడ్యగ్రణీ!

అని ఉదాత్తంగా సంబోధిస్తూ. మధురకవి, రాయలసీమకవికోకిల, అభినవకాళి దాసు, ఆంధ్ర కీట్స్ మున్నగు బిరుదులను అందుకొన్న శ్రీ బెళ్ళూరి శ్రీనివాస మూర్తి అనంతపురం జిల్లా పెనుకొండ తాలూకా తలమర్ల గ్రామాన 1910 ఫిబ్రవరి 4వ తేదీన జన్మించాడు. తండ్రి పేరు హనుమంతరావుగారు, తల్లి సీతమ్మగారు. వీరిది పండిత వంశం. తండ్రిగారి వద్ద సాంప్రదాయికంగా చదువుకున్నాడు. అనంతపురం కళాశాలలో ఇంటర్మీడియెట్ పూర్తి చేశాడు. పిదప పై చదువులు చదువలేక సెకండరీ గ్రేడు టీచర్స్ ట్రెయినింగ్ పూర్తి చేసి కొంతకాలం అన్ని విషయాలు చెప్పే ఉపాధ్యాయుడుగా ఉండి, విద్వాన్ చదివి అనంతపురం జిల్లా పరిషత్ పాఠశాలలో తెలుగు పండితుడుగా ముప్పై సంవత్సరాలు పనిచేసి పదవీ విరమణ తర్వాత ధర్మవరం తాలూకా కుంటిమద్ది గ్రామంలో ప్రశాంతంగా జీవిస్తూ, హిందూపురంలోని శ్రీకృష్ణదేవాయాంధ్ర గ్రంథమాలకు సేవచేస్తూ గడిపాడు. 1979 సెప్టెంబర్‌లో బెంగుళూరులో ఒక సంస్థవారు శ్రీ బెళ్ళూరి కవితా రీతులపై గోష్ఠి జరిపి, ఈయనను సన్మానించారు. ఈయన కొన్ని కవితలు 'హెర్మిటేజ్' పేర ఆంగ్లీకరించబడినవి. ముద్రితాలో, కాదో తెలియదు. 1988 ఫిబ్రవరి 5వ తేదీ ఉదయం కన్నుమూశాడు. రాయల సీమ కవికోకిల పంచమ స్వరం ఇక వినిపించదు. ఇంత గొప్పవాడు చివరి దశలో నిప్పచ్చరంతో మరణించాడు. కుటుంబం దీనావస్థలో వుందని విన్నాను. రాష్ట్రప్రభుత్వం, మాజీ రాష్ట్రపతి వంటి మిత్రులు, సాహిత్యాభిమానులూ కుటుంబాన్ని ఆదుకోవడం అవసరం. శ్రీ బెళ్ళూరిని, శ్రీ రమణను చూచినప్పుడల్లా నేను అనుకొనేవాడిని- వీరికి మరికొన్ని అవకాశాలుంటే వీరి కీర్తి, స్థితి గొప్పగా వుండేవని. విధి బలీయం. మిత్రుడు శ్రీ బెళ్ళూరి త్రికరణశుద్ధిగా న్యాయధర్మ మార్గాన్ని అనుసరించినవాడు గనుక అతనికి సద్గతులు తప్పవని నా విశ్వాసం.

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక, హైదరాబాద్ నోట్‌బుక్ – 7.10.88)

# కలలు నిక్కాలలైన నీలంరాజువారు

దాదాపు ఏడు దశాబ్దాల నాటి మాట. స్వాతంత్ర్యోద్యమం అప్పుడే ఊపు అందుకుంటున్న రోజులు. శ్రీబాగ్, ఆంధ్రపత్రిక కార్యాలయం, ఆంధ్ర మహాసభ మొదలయిన ప్రాంతాలు స్వాతంత్ర్య సమరయోధుల కలకలం ముమ్మరంగా వినిపించే స్థలాలు. ఈ ప్రాంతాలంతటా నవ యువకుడొకడు ఒంగోలు ఖద్దరు దోవతీ - కుర్తాలలోగాని, చూడీదార్ పైజామా - అచ్కన్‌లతో గాని తరచూ కనిపించేవాడు. అందగాడు, సౌమ్యుడు, సంగీతజ్ఞుడు, సువాసనలు వెదజల్లుతూ కనిపించేవాడు. పెద్దన వరూధిని ఉనికిని మగువ పొలుపు తెలుపు నాక్క మారుత మొలసెన్" అని సూచించాడు. ఆ యువకుని పొలుపు తెలిపే చందనాది తైల సౌరభం అల్లంత దూరం నుంచే వీచేది. "అదిగో శేషయ్యగారు! వస్తున్నారు శేషయ్యగారు!! ఆ సుగంధం అదే!!!" అని జనం సుగంధాలు వీచేవైపు తలలు తిప్పి చూచేవారు.

"వస్త్రేణ వపుషా వాచా
విద్యయా వినయేన చ,
వకార పంచభిః హీనః
నరో నాయాతి గౌరవమ్."

శుభ్రమైన ఆకర్షణీయమైన దుస్తులు, శుభ్రమైన సౌష్ఠవం గల శరీర యష్టి, మంచి పలుకు - ప్రవర్తన, సరైన చదువు - సందెలు, వీటికన్నిటికీ బంగారు మలామా వంటి వినయం అనే ఈ వకార పంచకం లేని వ్యక్తి గౌరవం పొంద లేడు సమాజంలోనని-అన్నారు పెద్దలు. వీటిలో ఏవో కొన్ని ఉన్నా మర్యాదగా గడిపేయవచ్చు. ఐదూ ఉంటే అపరంజికి తావి.

ఈ తావియే శేషయ్యగారిది. శేషయ్యగారు స్వయం సుందరులు. ఒంగోలు లేత వంగపండు ముతక ఖద్దరు పోషాక్‌లో మరీ మెరిసిపోయేవారు. సౌమ్యంగా మాట్లాడేవారు. ఆయన బహిరంగంగా ముఖం చిట్లించుకోవడం నేను చూడలేదు. నాతో వాద వివాదాలు వచ్చినప్పుడు నేను రెచ్చిపోయే వాడినిగాని, ఆయన వాద బలంతో నాకు నచ్చజెప్పడానికే ప్రయత్నించేవారు శాంతంగా,

ఇక చదువంటారా! ఆయన పట్టుగా పలెకూటంలో చదివింది మెట్రిక్యులేషనే. కానీ ప్రపంచ పాఠశాలలో చదివించి అపారం, ఆకళించుకుంది అనంతం. ఎదుటి వారిని బోల్తా కొట్టించి విన్రముణ్ణి చేసేది ఆయన విన్రమత. అందుకే ఆయన చుట్టూ అంత జనం, ఆయన రాకకు అంత నిరీక్షణ!

ఆయనకు మాటలకన్నా మందహాసాలే ఎక్కువ. వానిలో ఎన్నో అర్థాలు అందంగా వెలిసేవి. కాళిదాసు అజమహారాజును మేల్కొల్పే ఘట్టంలో -

"తామ్రోదరేషు పతితం ద్రుమ పల్లవేషు
నిరూతహార గుళికా విశదం హిమాంభః,
ఆభాతి లబ్ధ పరభాగతయాధరోష్ఠే
లీలాస్మితం సదశనార్చి రివ త్వదీయమ్."

ప్రభూ అజమహారాజా! ఎర్రని పొట్టల పల్లవ పుటాలలో పడిన, కడిగిన ముత్యంలాంటి మంచు బొట్టు చక్కని పలు వరుస కాంతితో నీ పెదవిపై మెరిసే మందస్మితంలాగా ఉంది సుమా! - అని అన్నాడు. శేషయ్యగారి మందహాసం నాకు ఈ కాళిదాసు శ్లోకాన్ని స్మరింపజేసేది ఎప్పుడూ.

అప్పటి తెలుగు పత్రికా రచయితలకు ఎవరికీలేని, ఆయనకు ప్రత్యేకంగా ఉన్న అర్హత తెలుగు షార్ట్‌హాండ్ యోగ్యతా పత్రం. అది నాకు ఆయనపట్ల ప్రత్యేక గౌరవానికి కారణం. ద్వితీయ ప్రపంచయుద్ధ సమయంలో ఆయన ఆంధ్రపత్రిక ప్రత్యేక ప్రతినిధిగా ఆగ్నేయాసియా దేశాలలో పర్యటించి యుద్ధ వార్తలు పంపారు. నాకు ఆయన బాగా పరిచయమైన తరువాత ఎన్నోసార్లు అడిగాను షార్ట్‌హాండ్ తరగతులు నిర్వహించండని. ఆయన ఒప్పుకొనేవారుకారు. "అది పాతపద్ధతి. ఇప్పుడు మక్కీకి మక్కీ రిపోర్టింగ్ అవసరంలేదు. అంతేగాక టేప్‌రికార్డర్, డిక్టాఫోన్ వంటివి వచ్చాయి. షార్ట్‌హాండ్ అనవసరం" అనేవారు.

ఆయన ఆంధ్రపత్రిక వదలిన పిదప నాట్యకళ, నవోదయ పత్రికలు ఉదాత్తంగా నడిపారు. 1950లో కాబోలు ఆంధ్రప్రభలో ఎడిటోరియల్ రైటర్‌గా చేరారు. అప్పుడాయనతో బాగా సన్నిహితత్వం ఏర్పడింది. ఆయనకు మొదటి నుంచి ఉన్న ఆంధ్ర మహాసభ సంబంధం కొన్ని దశాబ్దాలు కొనసాగింది. ఆంధ్ర మహాసభ సన్మానితులకు సన్మాన పత్రాలు కొన్ని శేషయ్యగారి ఆదేశంపై వ్రాసే భాగ్యం నాకూ కలిగింది.

ఆంధ్రప్రభలో ఉన్నప్పుడు నార్లగారితో ఘర్షణతో నేను రాజీనామా యిచ్చాను. నార్లగారు అప్పుడు రాజ్యసభ సభ్యులు: ఢిల్లీలో ఉన్నారు. ఆయన వచ్చేలోగానే వెళ్ళిపోదామని నా ఆత్రం. కనుక రాజీనామా శేషయ్యగారికి

అందజేశాను. వారమైంది. ఉలుకూ లేదు, పలుకూ లేదు. నాకు సహజమైన కోపతాపాలతో ఆయనను నిలదీశాను. "మీరు ఎట్లాగూ పోతున్నారు. మీకేమైనా రెండు డబ్బులు లాభిస్తాయేమో అని నా ప్రయత్నం" అన్నారు ఆయన. నేను చప్పగా చల్లారిపోయాను. ఆయన ఉపకార పరత్వానికి, సౌమ్యతా పరాకాష్ఠకు ఇదొక తార్కాణం.

శేషయ్యగారు మొదటి నుంచీ పెద్దస్వాప్నికులు - ఆ స్వప్నాలలో రెండు పెద్దవి. ఒకటి రామదాసు ధ్యాన మందిర నిర్మాణం, రెండవది వాగ్గేయకార వార్షికోత్సవం ఏర్పాటు. ఆశ్చర్యమేమిటంటే ఆ రెండు కలలూ నిక్కాలలు కావడంలో నాకు కూడా ఉడుతా సేవకు అవకాశం కలుగడం.

శేషయ్యగారు పరమ లౌక్యులు. కాని వారి లౌక్యం ప్రశాంత గంభీరం, పరోపకార పరాయణం. భద్రాద్రి రామాలయ పునరుద్ధరణకు నిధి సేకరించా లనుకున్నారు. ఆంధ్రప్రభకు రాయలసీమ కరవు కాటకాలకు, తుపాను వరద బాధలకూ నిధులు సేకరించిన కీర్తి ఉండనే ఉంది. కాని, దేవాలయం అనగానే మత మౌఢ్యం ప్రచారమవుతుంది. పత్రిక దెబ్బతింటుంది - అని పలువురు శంకించారు. శేషయ్యగారు శ్రీ గోయెంకాగారి అనుమతిని మహాలౌక్యంతో పొందారు దీనికి....ఢిల్లీలోని శ్రీ రామనాథ గోయెంకాగారికి ఆఫీసు టెలిప్రింటర్ మీదనే ఇలా వార్త పంపించారు. "ప్రసిద్ధ రామక్షేత్రమైన భద్రాచలం దేవాలయ పునరుద్ధరణకు ఆంధ్రప్రభ ద్వారా నిధి సేకరించబోతున్నాను. దయచేసి మీ విరాళం ప్రకటించండి" అని. కోరింది అనుమతి కాదు, విరాళం. ఇదీ లౌక్యం.

శ్రీ గోయెంకాగారు మీన మేషాలు లెక్కించే మనిషి కాదు. "తగినంత మొత్తం వసూలు చేయగలమని మీకు ధైర్యం ఉంటే అలాగే కానివ్వండి. నా వంతు ఐదు వేలు" అని సమాధానం నిముషాల్లోనే వచ్చింది.

ఈ నిధి దాదాపు రెండు లక్షలు చేకూరింది. ఆయనే అన్నట్టు - "ఎవరో కొందరు నిత్య శంకితులు అనుమానించినట్టుకాక ఈ నిధి సేకరణవల్ల "ఆంధ్ర ప్రభ" పేరు ప్రతిష్ఠలు పెరిగినవే కానీ తరగలేదు.... హిందువులు మాత్రమే కాక కొందరు ముస్లిములు, క్రైస్తవులు కూడా నిధి సేకరణకు సహాయపడ్డారు.

ఈ మొత్తం శేషయ్యగారు భద్రాచలం రామాలయ జీర్ణోద్ధరణ సంఘా ధ్యక్షులు శ్రీ కల్లూరు చంద్రమౌళిగారికి అందచేశారు. "ఆంధ్రప్రభ ద్వారా మీరు సమకూర్చి పెట్టిన డబ్బుకంటే అంతశ్చేతనను కదిలించేట్టు మీ పత్రిక ద్వారా రాష్ట్ర ప్రజలకు మీరు చేసిన ప్రబోధ ప్రచారాలు నూరింతలుగా మాకు సహాయపడినవి. మీరు వసూలు చేసిన డబ్బును మొత్తం నిధిలో చేర్చడంలేదు.

దానిని ఏ విధంగా వినియోగించాలో మీరే నిర్ణయించండి" అని శ్రీ చంద్ర మౌళిగారు ఆ బాధ్యతను శేషయ్యగారి మీదే పెట్టారు.

తిరువయ్యారులో త్యాగరాజుల పేరిట చక్కని స్మారక భవనం వెలసింది. త్యాగరాజువంటివారే ప్రహ్లాద నారదాదుల కోవకు చెందిన పరమ భాగవతోత్తము డని ప్రస్తుతించిన రామదాసుకు ఆంధ్రదేశంలో గోదావరీ తీరంలో ఆదర్శ ప్రాయమైన స్మారక మందిరాన్ని నిర్మించడం సముచితమని శేషయ్య గారికి తోచింది. వెంటనే స్థలం కోసం అన్వేషించారు. జీర్ణోద్ధరణ సంఘం సభ్యులు శ్రీమాన్ ఎస్.టి.జి. వరదాచార్యులవారితో కలిసి రంగనాయకుల గుట్ట ఎక్కారు. "ఆ గుట్టపైకెక్కి నలుదిక్కులూ కలయజూతును గదా! నాకొక విధమయిన తన్మయత కలిగింది. కొండ కొమ్మున నిలిచి క్రిందికి చూస్తే అర్ధ చంద్రాకారంగా ప్రవహించే గోదావరీ మహానది, తల ఎత్తి తిలకిస్తే శ్రీ రామచంద్ర ప్రభువుకు ఛత్రం పట్టినట్లు నిర్మల నీలాకాశం, ఒక వైపున ఆనాడు గోపన్నగారు నిర్మించిన గోపుర ప్రాకార మండపాలు, వేరొక వైపున కంటికింపైన పచ్చని చేలు. అతిలోకసుందరమైన ఆ వాతావరణాన్ని చూసి నప్పుడు అది రామపద రాజీవ రేణువులచే పావనమైన ప్రదేశమే అయి ఉండాలి" అని తోచింది ఆయనకు.

అక్కడే 1962 జనవరి 5 వ తేదీన ఆనాటి ఉపరాష్ట్రపతి, వేద వేదాంత విద్యాపారీణుడు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు రామదాస ధ్యాన మందిరానికి శంకుస్థాపన చేశారు.

ఆ శంకుస్థాపన మహోత్సవం విశిష్టమైన గొప్ప సంఘటన. రాధా కృష్ణన్ ప్రసంగం వినడం కోసం చుట్టు ప్రక్కల నుంచి వేలాది జనం వచ్చారు. భద్రాచలం నూరింతలు పొంగినట్లనిపించింది. దేశంలోని వివిధ పత్రికల ప్రత్యేక విలేఖకులు దాదాపు రెండు వందల మంది వచ్చారు. నేను శేషయ్యగారి వెంట వ్యానులో ఆ సభను కవర్ చేయడానికి వెళ్ళాను. అది నాకొక అగ్ని పరీక్ష. ఎడిటర్ స్వయం రిపోర్టరుగా, ఇంగ్లీషు, తెలుగు షార్ట్‌హాండ్ తెలిసిన వారు. అనుభవజ్ఞుడైన వ్యక్తి ఆయనను మెప్పించగలగాలి. రాధాకృష్ణన్ ఇంగ్లీషులో ప్రసంగం ప్రారంభించారు. ఎస్. టి. జి. వరదాచార్యులుగారు దానిని వెంట వెంటనే అనువదించాలని ఏర్పాటయింది. రాధాకృష్ణన్ రెండు నిముషాలు ప్రసంగించారు. దాని అనువాదం విన్నారు. ఆయనకు సంతృప్తి కలుగలేదు. వరదాచార్యులుగారిని కూర్చోండన్నారు. తెలుగులో ప్రసంగించడం ప్రారంభించారు. అదే ఆయన తొలి తెలుగు బహిరంగ సభా ప్రసంగం, అదే

చివరి ప్రసంగం. రాధాకృష్ణన్ బ్రహ్మ సూత్రాలు, శంకర కృతులు, నారద భక్తి సూత్రాలు, పాశ్చాత్య తత్త్వవేత్తల, భక్తుల సూక్తులు - అసంఖ్యాకంగా ఉదాహరిస్తూ గంటసేపు అనర్గళంగా వ్యావహారిక భాషలో ప్రసంగించారు. జనం విస్తుపోయారు. నేను యథా మూలంగా వ్రాసుకున్నాను. ఆనాడు నాచేతిని హనుమంతుడు ఆవేశించా డనిపించింది. యమ వేగంతో వ్రాసుకున్నాను. [ఏమి స్వామీ - మీరూ, మీ శ్రీమతిగారూ ఎంతో అందంగా ఉన్నారు. మీ కుమారుడు అంద వికారంగా పుట్టాడే - అని మా నాన్నగారిని ఎవరో ఒకమారు అడిగారు- నేను తుంగభద్రా తీరంలో చక్రతీర్థంలో అంజనేయుణ్ణి ఉపాసించిన తరువాత పుట్టాడు మరి - అని ఆయన నవ్వుతూ సమాధానం చెప్పారు.] తక్కిన పత్రికల భాయీలకు ప్రసంగ సారాంశం నేనే చెప్పవలసి వచ్చింది.

సభ ముగిసి భోజనానంతరం మధ్యాహ్నం రెండు గంటలకు వ్యానులో బయలుదేరి రాత్రి పదకొండు గంటలకు విజయవాడ చేరుకున్నాము. సభా విశేషాలు - ముఖ్యంగా రాధాకృష్ణన్ ప్రసంగం వ్రాసి ముగించాను. ఒంటిగంట దాటింది. శేషయ్యగారు సరిచూశారు. దేశంలో ఏ పత్రికా కవరు చేయనంతగా ఆంధ్రప్రభ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ కవర్ చేశాయి.

రామదాసు ధ్యాన మందిరం ఏవో కారణాల వలన 1972 కు గాని పూర్తి కాలేదు. "ప్రశాంత సుందరమై, ధ్యాన సాధనాల కనువై, అనల్ప శిల్ప కళా లక్ష్మికి ఆలవాలమై, ఆధ్యాత్మిక తేజోవిలసితమైన, భద్రాద్రి రామచంద్ర ప్రభువుకు రత్న కిరీటమో అన్నట్లు శ్రీ రామదాసు ధ్యానమందిరం రూపు దాల్చింది. శిలా ప్రకృతిలో జీవం పుట్టినట్టు మందిర ప్రాంగణంలో నిలువెత్తు రామదాసు శిలా విగ్రహం వెలిసింది. మందిర కుడ్యాలపై ముత్యాల ముగ్గుల వలె రామదాసు కీర్తనల, దాశరథీ శతక పద్యాల ఫలకాలు అమరినవి" అని శేషయ్యగారు సంతోషించారు. 1972 జూన్ నెలలో ఆనాటి రాష్ట్ర ముఖ్య మంత్రి శ్రీ పి. వి. నరసింహారావుగారి నాయకత్వంలో ధ్యానమందిర ప్రారంభో త్సవం జరిగింది. దానిని నేను ఆంధ్రప్రభకు - ముఖ్యంగా ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రికకు కవర్‌చేసి పంపే అవకాశం కలిగింది. [అప్పుడు నేను 'హైదరాబాద్ లేఖ' అని ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో వ్రాసేవాడిని.]

ఈ విధంగా శేషయ్యగారి మరొక కల కూడా త్వరలోనే నిజమయింది. అది ఏటా భద్రాచలంలో వాగ్గేయకార మహోత్సవం. అది ఎలా ఫలించిందీ ఆయన మాటలలోనే చదవండి. "1971 లో భద్రాద్రి రామాలయ ధర్మకర్తల మండలికి అధ్యక్షులుగా ఎన్నికైన శ్రీ అల్లూరి మూర్తిరాజుగారి సన్మాన సభకు

నేను అధ్యక్షత వహించాను....వాగ్గేయకార మహోత్సవాలలో ప్రాంతీయ వివక్ష లేకుండా దేశంలోని ప్రసిద్ధ విద్వాంసులంతా పాల్గొనవచ్చు. భక్తికీ సంగీతానికి భద్రాద్రిని యావద్భారతానికే కేంద్రస్థానంగా చేయవచ్చు - అన్నాను.

"శ్రీ మూర్తిరాజుగారి ముఖం పద్మంలా వికసించింది. శేషయ్యగారూ! ఇన్ని మాటలెందుకు? సంగీత విద్వాంసులను ఆహ్వానించి సభా కార్యక్రమాలను మీరు నిర్వహించండి. వారికి సౌకర్యాలు సమకూర్చి యథోచితంగా వారిని సత్కరించే బాధ్యతను మేము వహిస్తాము - అంటూ బ్లాంక్ చెక్కు నాకు ఇచ్చారు."

ఇలా ఆయన రెండు కలలూ ఫలించాయి. మొదటి ఉత్సవం 1973 డిసెంబరు నెల చివర జరిగింది. తొమ్మిదవ ఉత్సవం సందర్భంలో విద్వత్సన్మాన ప్రత్యేక సంచిక వెలువరించారు. దానికి నేనూ, నా మిత్రులు శ్రీ చాగంటి కపాలేశ్వరరావుగారూ తోడ్పడ్డాము.

తమ పెక్కు కలలతో పాటు ఈ రెండు పెద్ద కలలను నిక్కలలుగా చేసుకున్న శ్రీ శేషయ్యగారితో సహకరించి నేనూ కృతార్థుణ్నయ్యాను.

శేషయ్యగారు సహజ శాంత గంభీరులు. సంపూర్ణంగా గాంధీజీ అనుయాయులు. కనుక అందరితోనూ అతిసరళంగా ప్రవర్తించేవారు. ముఖ్యంగా సహోద్యోగులతో చాలా చనువుగా ఉండేవారు. అంతమాత్రాన ఆ చనువు దుర్వినియోగపరచే అవకాశమిచ్చేవారు కారు. కాళిదాసు దిలీపుని విషయంలో అన్నట్టు "అప్రధృష్యోభిగమ్యః." ఆయనకు సంపాదకులుగా "టు హైర్ అండ్ ఫైర్" అధికారాలున్నా, ఎన్నడూ వాటిని ఆయన దుర్వినియోగం చేయలేదు. ఆంధ్రప్రభలో 1959 లో సమ్మె తరువాత నార్లగారు తప్పుకోగానే శేషయ్యగారు సంపాదకత్వం వహించినప్పుడు ఇక "ఆంధ్రప్రభ మూతపడుతుంది" అని కొందరు శంకించారు. అలాంటిదేమీ జరగలేదు. నార్లగారు గద్గదన దద్గోదావరి లాంటివారు. శేషయ్యగారు కాన్పూరు వద్ద ప్రవహించే విశాలోదార గంగ వంటివారు. ఏదో నెమ్మదిగా ప్రవహిస్తున్నది కదా - అని దూకితే లోపలి వేగంతో కొట్టుకు పోవలసిందే.

శేషయ్యగారి పని తీరు హడావుడి లేని నిత్య కర్మ వంటిది. అంతా సవ్యంగా, ప్రశాంతంగా జరిగిపోయేది.

ఆయన సహోద్యోగులలో కొందరు - నిత్యోద్రేకులు ఆయనపై బుట్టల కొద్దీ, గుట్టలకొద్దీ ఫిర్యాదులు చేసినా వారి ఎడల ఎలాంటి వైషమ్యం, వైరస్యం లేకుండా ప్రవర్తించేవారు. ఆయన వారికి నచ్చ చెప్పడానికి ప్రయత్నించేవారు. యజమానులతోనూ ఆయన తీరు ఇదే.

అభిప్రాయ భేదాలకు అవకాశమివ్వని అపరంజి దోవ ఆయనది. దానికి ప్రధాన బలం సౌమ్యత, సానుభూతి. ఇవి ఆయనకు చిన్ననాటి నుంచే దుగ్గిరాల గోపాల కృష్ణయ్య, టంగుటూరి ప్రకాశంగార్ల వంటి చండ ప్రచండులు, గొల్లపూడి సీతారామశాస్త్రిగారి వంటి శాంతి దాంతి ధనుల సహవాస, సాహచర్య, సహకార్య కర్తృత్వంతో అబ్బినవి. సంగీతం, నాటక రంగం కూడా ఆయన పవృత్తికి వన్నె తెచ్చాయి. కనుకనే సహోద్యోగులు కొందరు ఎంత తిరగబడినా, కొందరు అధికారుల అండతో ఎగిరిపడినా చివరకు పిల్లికూన లయ్యేవారు.

ఆయన సహోద్యోగులకు ఇచ్చిన ప్రోత్సాహమూ అసమానం. నేను అప్పుడు మద్రాసునగరంలో ఉన్నాను. ఆంధ్రప్రదేశ్ పురాతత్త్వ శాఖ డైరెక్టరు, ఉస్మానియా విశ్వవిద్యాలయ చరిత్రాచార్యులు డాక్టర్ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు అమెరికాలో మరణించారు. శేషయ్యగారు ఆయన సేవలను వివరిస్తూ సంపాదకీయం వెంటనే క్రీడుపై వ్రాసి పంపమని నాకు సందేశం పంపారు. నేను అప్పటికప్పుడు పాత జ్ఞాపకాలు కూడగట్టుకుని ఏదో అయిందనిపించాను. ఉజ్జయినిలో జరిగిన కాళిదాసు సమ్మేళనంపై సంపాదకీయం వ్రాశాను. సరిహద్దు సమస్యలు, ఇతర రాష్ట్ర సమస్యలు, సాహిత్యోద్యమాలు, ప్రముఖ కవి పండిత పరిశోధకుల నిర్యాణాలు మొదలయిన వాటిపై సంవాదకీయాలు వ్రాసే అవకాశం కలిగించారు. సహోద్యోగుల అభిరుచిని బట్టి, శక్తిని బట్టి వారిని ప్రోత్సహించడం ఆయన తమ విధిగా భావించేవారు. నార్లగారి కాలంలోను నేను సంపాదకీయాలు పెక్కు వ్రాశాను. ఆంధ్రపత్రికలో కొంతకాలం రెండవ సంపాదకీయం వ్రాశాను.

నేను ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో ఉన్నప్పుడు "మరపురాని మనీషులు" మొదలయిన శీర్షికల నిర్వహణకు పరోక్షంగా ఆయనే బాధ్యులు. ఆయన రెండవ కుమారుడు శ్రీ నీలంరాజు మురళీధర్ ఆంధ్రప్రభలో అప్పుడు ఫోటోగ్రాఫర్. ఆయనతో కలిసి ప్రముఖులతో ముఖాముఖి జరిపి ఆ శీర్షిక నిర్వహించాను. అది చాలా జనాకర్షకమైంది. తరువాత పుస్తకం రూపం దాల్చింది.

శ్రీ శేషయ్యగారు 1905 లో జన్మించారు. 1992 జనవరి 16 న హైదరాబాదులో కన్ను మూశారు.

వృత్తి ధర్మాన్ని సత్య ధర్మంతో మేళవించి పత్రికా రచనకు, మేధా విలసితాన్ని లౌకిక ప్రజ్ఞా పాటవంతో మేళవించి సేవా ధర్మానికి మెరుగులు పెట్టిన ఆ పత్రికా సుగతునికి ఇవే నా బాష్పాంజలులు.

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక – 1992 ఫిబ్రవరి 19.25)

# నిజమైన కవి బైరాగి

"వీరులు నీలకంఠులు మృత్యుంజయులు
వేదనల విషం త్రాగి జనతకు
మహితకు,
సమతామృతం పంచుతారు
మృత్యువు వారికి వంగి చేస్తుంది జోహారు
వగపు వలదు
ప్రతిచెర ఒక తిరుపతిగా
ప్రతిశిల ఒక తిరుమలగా
పూజించే రోజులు ముందున్నాయి!"

అని ఘంటాపథంగా ఘోషించాడు ఆలూరి బైరాగి, అత్యయిక పరిస్థితి రోజులలో నిర్భయంగా. మందవేసే మనఃప్రవృత్తి, ఇచ్చకాలాడే పిచ్చిచేష్ట, పదవులకోసం ప్రాకులాడే పైరవీ కంచుకాగడా వేసి కలయ వెదికినా కానరాని కవితామూర్తి ఆలూరి బైరాగి. ప్రజాశ్రేయస్సుకు నిరంతరాన్వేషణ సాగించిన అనంతమైన ఆర్తి ఆలూరి బైరాగి. ఈ అన్వేషణార్తులు స్వాతంత్రోద్యమం ముమ్మరంగా జరుగుతున్ననాడే, తన 14 వ ఏటనే ఆయన కవితలో ప్రస్ఫుటించాయి. కనుకనే

"ప్రతి అక్షర మొక భటుడు
ప్రతి పదమూ ఒక శకటూ
ప్రతి ఊహా ఒక వ్యూహం
జీవశంకాతంక సంకుల సమరంలో
కవితను ఏమనుకున్నావు?"

అని ప్రశ్నించగలిగాడు. 1925 లో తెనాలిలో జన్మించాడు. పదకొండు సంవత్సరాల వయసులోనే దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి విశారద పరీక్షలో సర్వప్రథముడుగా వచ్చాడు. 14 వ ఏట బీహార్ రాష్ట్ర హిందీ సాహిత్య సమ్మేళనంలో హిందీ కవితకు ప్రత్యేక బహుమతి పొందాడు. హిందీ, తెలుగు, ఇంగ్లీషు, బెంగాలీలలో స్వయం కృషితో పాండిత్యం సంపాదించాడు. చందమామ హిందీ పత్రికకు కొంతకాలం సంపాదకుడుగా ఉన్నాడు. సామాన్య

ప్రజల శ్రేయస్సు కోసం కలం పట్టి చీకటి నీడలు మున్నగు కవితా సంపుటులు వెలయించాడు. ఆయన "నూతిలో గొంతుకలు" కవిత జున్నుగట్టిన కావ్యం. హిందీలో రచించిన పలాయన్, ఆధునిక తెలుగూ కవితా– అనే కవితా సంకలనాలు హిందీ సరస్వతికి కొత్త నగలు, నగవులు తొడిగాయి.

"నేడు కాదు, రేపు మీది
రేపుదయించెడి సూర్యుడు
మీ కొరకై తరుణారుణ
మధుకాంతుల జయమాలలు
సిద్ధంగా వుంచుతాడు.
రేపే మీ కళ్యాణం"

అని అలజడీ అశాంతీ అనే ఉగ్గుబాలతో పెరిగిన వీర ప్రజలను ఉద్బోధిస్తూ, 1979 సెప్టెంబర్ 9 వ తేదీన కన్ను మూశాడు మిత్రుడు బైరాగి.

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక – హైదరాబాద్ నోట్ బుక్,
ఆలూరి బైరాగి సంస్మరణ సంచిక 1979)

# నేను సైతం గాంధీ దేవుని దర్శనంతో ధన్యుడయ్యాను

అప్పుడే గాంధీజీ ఆఫ్రికానుంచి భారతదేశానికి వచ్చారు. ఆయన గొప్పదనం గురించి చిలువలు పలవలుగా చెప్పుకొంటున్నది జనం. భారతదేశ పరిస్థితులను ఆకళించుకొనడానికి ఆయన పర్యటన ప్రారంభించారు. ఆయన అడుగు పెట్టిన చోటెల్లా బ్రహ్మరథం పడుతున్నది జనం; తండోపతండాలుగా వచ్చి దర్శిస్తున్నది; ఆయనలోని అతిమానుష శక్తులేమిటో తెలుసుకోడానికి ఉవ్విళ్ళూరుతున్నది; ఆయన ఊరు వదిలిన తర్వాత నెలల తరబడి ఆ ధ్యానంలోనే ఉంటున్నది.

ఆ పర్యటనలోనే గాంధీజీ బళ్ళారికి విచ్చేశారు. బళ్లారి పట్టణమే కాక బళ్ళారి జిల్లా అంతా పెళ్ళి పందిరిగా మారింది. బళ్ళారి పట్టణం కలకల లాడింది రాట్నాల తోరణాలతో, కాంగ్రెస్ త్రివర్ణ పతాకాలలో, గెలలున్న అరటి కంబాలతోను. నాకప్పుడు తొమ్మిదేళ్ళనుకుంటాను— మా ఊరు కమలాపురం (హంపీ కమలాపురం) నుంచి మా తాతగారు మొదలైనవారు గాంధీ దర్శనానికి వెళ్ళుతుంటే, నేనూ మారాం చేశాను వస్తానని. మా తాతగారు తిరుమల నరసింహాచార్యులుగారు మొదటి నుంచీ కాంగ్రెసు వాదులు. ఇంట్లో రకరకాల రాట్నాలు అరడజను నిత్యము ఆడేవి. ఆయన సపరివారంగా బెల్గాం కాంగ్రెసుకు పట్టు పీతాంబరాలతో, జింక చర్మం రైలు సంచీలతో హాజరైన నైష్ఠికులు. సరే. నా ఆసక్తి చూచి నన్ను వెంట పిలుచుకొని వెళ్ళడానికి అంగీకరించారు. నేను మహోత్సాహంలో వెళ్ళాను.

'ఆంధ్ర నాటక పితామహ' ధర్మవరం రామకృష్ణమాచార్యుల బంగ్లా కాంపౌండులో గాంధీజీకి స్వాగత మివ్వడానికి ఏర్పాట్లు జరిగాయి. వాటినంతా తన్మయతలో చూస్తున్నాను. ఆంధ్ర నాటక పితామహుని కుమారులు, ఇంజినీర్లు అనంత కృష్ణమాచార్యులు, భోగీంద్రనాథ్ తెల్లటి ఖద్దరు దుస్తులతో చక చకా అటూ ఇటూ తిరుగుతూ ఏర్పాట్లు చేస్తున్నారు. గోల చేయవద్దంటున్నారు. గాంధీజీ అల్లంత దూరాన వస్తున్నారనగా కోలాహలం బయలుదేరింది. జనం

బంగ్లా కాంపౌండులో క్రిక్కిరిసిపోయింది. పిల్లలమంతా జనసమర్దానికి ఉక్కిరి బిక్కిరవుతున్నాము. సేవాదళ్ సైనికులు జనాన్ని సర్దుతున్నారు.

ఇంతలో గాంధీజీ ఏతెంచినారు. ఆయన అప్పటి దుస్తులు నాకు ఇంకా గుర్తు. కొల్లాయిగుడ్డ- పైన దుప్పటీ, కాదు; ధోవతి, గుజరాతీ తలపాగా, గుజరాతీలు ధరించే నాడాలు బిగించిన చొక్కా, మెడచుట్టూ ఉత్తరీయం. అందరితోపాటు నేను గంతులు వేశాను; జయ జయ నినాదాలు చేశాను.

గాంధీజీ ప్రత్యేకంగా ఏర్పరచిన వేదికను అలంకరించారు. ఎవరో జ్ఞాపకం లేదు - స్వాగతవచనాలు పలికిన మీదట గాంధీజీ లేచి చేతులు జోడించి నిలబడి ఆంగ్లంలో ఏదో ప్రసంగించారు. రెండు చేతులూ చాచి– ఆయనవి పొడుగాటి చేతులు– జన సందోహాన్ని చూస్తూ ఏదో కోరారు. వెంటనే కరతాళ ధ్వనులతో తోసుకువచ్చారు ఆడవాళ్ళు; చేతులలోని బంగారు గాజులు ఊడదీసేవాం, మెడలలోని బంగారు గొలుసులు తీస్తున్నవారు, చెవుల కమ్మల మరలు తిప్పుతున్నవారు కనిపించారు. ఏదో నాటకం చూస్తున్నట్టు చూస్తున్నాను. వాళ్ళంతా వెళ్ళి వేదికముందు తమ నగలు ఉంచారు; దేవాలయంలో దేవతకు సమర్పించినట్టు. గాంధీజీ వాటిలోని ఒక నగను తీసుకొని ఏదో ప్రసంగించారు. దాని సారాంశం మా తాతగారు చెప్పారు- ప్రతి వస్తువూ స్వాతంత్ర్య సాధనకు వినియోగపడుతుందని. ఆయన చెప్పిన దానిలో నాకు కొంత అర్థమయింది; కొంత అర్థం కాలేదు; మా ఊరు విజయనగర శిథిలాల సివారు గ్రామం గనుక, తరచు ఆ పాడు పట్నాన్ని [హంపీ విజయనగర శిథిలాలకు పాడుపట్నం, హాళు పట్న అని స్థానిక వ్యవహారనామం] చూడడానికి వచ్చే యాత్రికులను చూస్తుండేవాడిని గనుక, చిన్ననాటినుండే రాట్నాల ఝుంకారాలు, స్వాతంత్ర్య సమరగాథలు వింటున్నవాడిని గనుక మా తాతగారు చెప్పిన దానిలో కొంతకు కొంత అర్థం చేసుకొన్నాను. అలా నగలు ఊడ్చి నిలువు దోపిడి ఇచ్చినవారిలో మా బంధుగురాలు, వరుసకు దూరపు పినతల్లి తాడిపత్రి నివాసిని ఎర్రగుడి కమలమ్మ స్వరూపం నాకింకా జ్ఞాపకం ఉంది. బక్క పలచని ఎర్రనికోమల శరీరం, లేతవంగపండు ఖద్దరు 'మడిశారు' చీరలో ధగధగలాడేది ఆమె. భర్త వకీలు ఎర్రగుడి శ్రీనివాసాచార్యులు. ఇద్దరూ కాంగ్రెసు భక్తులే. ఎర్రగుడి కమలమ్మ త్యాగాన్ని మా బంధువులలో పలువురు పలువిధాలుగా చిత్రించారు- కొందరు మహాగొప్ప అన్నారు. కొందరు వట్టి ఆవేశమన్నారు; అడక్కుండా చేయకుండా అధిక ప్రసంగమన్నారు కొందరు. ఏమైతేనేం? కమలమ్మ, అలాటి మరికొందరు మా బంధువులలో అగ్రస్థానంలోనే వుండిపోయారు.

తర్వాత నేను గాంధీజీని దర్శించింది హరిజనోద్యమ సమయంలో. అప్పటికే నేను చదువుమాని సత్యాగ్రహంలో చేరి 'కారాగారానికి వెళ్ళడం, మద్రాసు కుట్ర కేసులో ముద్దాయి కావడం, పోలీసులు వెంటాడగా ఊరూరూ తిరగడం జరిగాయి. ఆ దేశదిమ్మరి దశలో హరిజనోద్యమంలో దూరాను పోలీసుల బారినుంచి రక్షణకోసం. అప్పుడు గాంధీజీని దర్శించడమే కాదు, ఆయనతోపాటు దాదాపు రెండు మూడు వందలమైళ్ళు పయనించే భాగ్యమూ లభించింది.

అదొక లక్కీ-ఛాన్స్: గాంధీజీ కోస్తా జిల్లాలు పర్యటిస్తున్నారు. బంకుపల్లి మల్లయ్య శాస్త్రిగారు తమ ప్రసంగాలతో, మంగిపూడి వేంకట శర్మగారు తమ రచనతో శ్రోతలను హరిజనోద్యమం వైపు ఆకర్షిస్తున్న కాలమది. గాంధీజీ పర్యటన బృందంలో ఎవరి సిఫార్సుతోనో జ్ఞాపకంలేదు—బహుశా వావిలాల గోపాల కృష్ణయ్యగారి ద్వారా విశ్వదాత సిఫార్సుతోనో ఏమో-దూరాను. గాంధీజీ ప్రత్యేకమైన కారును ఇష్టపడలేదు. ఏదో పెద్ద వ్యానువంటి దానిలో పయని స్తున్నారు బృందంతో. అటునుంచి మద్రాసువైపు పయనం. రాత్రి పన్నెండు లోపుగా మద్రాసు చేరాలని ప్రయత్నం. దారిలో ఎన్నో సభలు సమావేశాలు. చాలవరకు అన్నీ సంగ్రహంగానే. అయినా సమయం చాలడంలేదు. సూళ్ళూరు పేట చేరాము. గాంధీజీ అడిగారు "మద్రాసు ఇంక ఎన్ని మైళ్ళుంటుంది?" అని "దాదాపు నలభై" అని ఎవరో చెప్పారు. "ఎంత సేపటిలో చేరగలము?" అని మరొక ప్రశ్న వేశారు గాంధీజీ. "ఎక్కువయితే గంట" అన్నారు ఎవరో. "అయితే నేను గంటసేపు నిద్రపోతాను" అన్నారు గాంధీజీ. అన్నారో లేదో కళ్ళు మూసుకున్నారు, రెండో నిమిషానికే గురకలు వినిపించాయి. అందరితో పాటు నాకూ ఆశ్చర్యం కలిగింది. మద్రాసు పొలిమేర సమీపిస్తుండగా గాంధీజీ కనులు విప్పారు. "మద్రాసు చేరామా?" అని అడిగారు. మా ఆశ్చర్యం ఇనుమ డించింది.

అవును. గాంధీజీ కర్మయోగి. కృష్ణ భగవానుడు కర్మయోగంలో

తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ,

పాప్మానం ప్రజహిహ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్.

మొదట ఇంద్రియాలను అదుపులో పెట్టుకొని, జ్ఞానాన్ని, ఆత్మీయతను చంపేటటువంటి కామక్రోధాలనే పాపసముదాయాన్ని మొట్టమొదటే మొదలంట నరికివేయి - అన్నట్లు బహిశ్శత్రువులను అంతశ్శత్రువులను జయించి, ఇంద్రియాల కంటె పరమైన మనస్సును, మనస్సు కంటె పరమైన బుద్ధిని, ఆ బుద్ధికన్నా

పరమైన తత్త్వాన్ని గ్రహించిన జితేంద్రియుడు కనుక ఆయనకు నిద్ర, జాగృతి చెప్పుచేతలలో ఉండక ఏమిచేస్తాయి - అనుకుని సంతృప్తిపడ్డాను.

మరి రెండేళ్ళకు గాంధీజీ మళ్ళీ మద్రాసుకు వచ్చారు. అప్పుడు దాదాపు నెల రోజులు విడిశారు. ఆయన ప్రార్థనలలో, ప్రార్థనానంతర సమావేశాలలో పాల్గొనే మహాభాగ్యం కలిగింది. ఆ ఉపదేశాలు ఎంతవరకు నా మనస్సులో దూరాయి, హృదయంలో ఎంతవరకు నాటాయి అన్న సంగతివేరు. అధికారి తారతమ్యాన్ని బట్టి జ్ఞానదీధితులు వెలుగుతాయి. నీటిబిందువే ముత్యపు చిప్పలో పడితే ముత్యమవుతుందంటారు. మరి నేను ముత్యపుచిప్ప కాను గదా! నాబోటి వాళ్ళను గురించి భర్తృహరి చెప్పనే చెప్పాడు - కూపే పశ్య పయోనిధావపి ఘటో గృహాతి తుల్యం జలం - అని.

ఏమైనా ఆ మహాయోగిని, మహానాయకుని, పురుషోత్తముని, లోకారాధ్యుని దర్శించి, అమృతవాక్కులు విని, సహచరించే భాగధేయం నాకూ కలిగింది. ఈ మూడు సన్నివేశాలను-మూడు రత్నాల లాగ, బౌద్ధుల త్రిరత్నాల లాగ మనః పేటికలో భక్తితో దాచుకున్నాను ఇన్నాళ్లు. ఇప్పుడు మీకు అర్పిస్తున్నాను. నాలాగే చిన్ననాడు గాంధీజీని దర్శించే మహారాజయోగం పొందిన సహృదయులు ఆనందించండి, దివ్యస్మృతులను మననం చేసుకోండి.

## గండర గండడు గాంధీజీ

గడ్డిపోచలను గండుమగలుగా గండరించిన గాంధీ మహాత్ముడు హఠాత్తుగానో కాకతాళీయంగానో మహానాయకుడుగా రూపొందలేదు. బాల్యంనుంచి క్రమశిక్షణతో, సత్యనిష్ఠతో, సేవానిరతితో, భగవద్భక్తి భావంతో గడిపిన జీవితమే ఆయనను మహాయోద్ధగా, మహాసేనానిగా, జాతిపితగా తీర్చిదిద్దిందని పరిశీలించగా మనకు స్పష్టమవుతుంది. ఆయన అనుపదం, అనుక్షణం చేసిన సత్యశోధన ఆయన జీవితాన్ని ఎప్పటికప్పుడు మెరుగులుపెట్టి సహస్రకిరణ సదృశం చేసింది.

గాంధీజీ దక్షిణాఫ్రికానుంచి భారతదేశానికి తిరిగివచ్చిన తర్వాత 1916లో కాశీ విశ్వవిద్యాలయం శంకుస్థాపనోత్సవంలో పాల్గొన్నారు. వైస్రాయి హార్డింజ్ శంకుస్థాపనోత్సవం జరిపారు. గాంధీజీ ఆ ఉత్సవంలో దేశభక్తి ప్రపూరితమైన ప్రసంగం చేశారు. "ఏదో ఒకనాడు మనకు స్వరాజ్యం లభిస్తే, అది మన పురుషార్థంవల్లే లభిస్తుందికాని, ఇతరుల దానత్యాగాలవల్ల కాదు. బ్రిటిష్ సామ్రాజ్య చరిత్రను తరచి చూడండి. బ్రిటిషువారు ఎంత స్వాతంత్ర్య ప్రియులయినా, స్వాతంత్ర్య సంసిద్ధికై స్వయంకృషి చేయనివారికి ఎన్నడూ స్వాతంత్ర్యాన్ని

దానంగా ఇవ్వరు. ఈ విషయంలో బోయరు యుద్ధంనుంచి మనం ఒకే గుణ పాఠం నేర్వవచ్చు. బోయర్లు కొన్ని సంవత్సరాల క్రితం బ్రిటిష్ సామ్రాజ్యానికి శత్రువులు, కాని ఇప్పుడు మిత్రులయ్యారు."

ఇన్ని దశాబ్దాల తర్వాత మనకు ఈ మాటలు సర్వసాధారణంగా కని పిస్తాయి. కాని, 1916 వరకు ఇలా ప్రసంగించిన భారతీయుడు లేడు. ఇలా ప్రసంగించడం ఆ కాలంలో మహాపరాధం. అలాటి మహాసాహసానికి ఒడిగట్టిన గాంధీజీ –

"యదాయదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తాదాత్మానం సృజామ్యహమ్"

అర్జునా ధర్మానికి హానికలిగి, అధర్మం తలయెత్తినప్పుడు నేను అవతరిస్తాను - అనే గీతాచార్యుని అభయ వచనాన్ని తలపింపజేస్తారు.

గాంధీజీ నేటి గుజరాతు రాష్ట్రంలోని పోర్‌బందర్‌లో 1869వ సంవత్సరం అక్టోబర్ నెల 2వ తేదీని జన్మించారు. పోర్‌బందర్ అప్పుడు ఒక చిన్న స్వతంత్ర్య రాజ్యం. గాంధీజీ పితామహుడు ఉత్తమచంద్ గాంధీ. ఆయన ఈ స్వదేశ రాజ్యానికి దివాను. గాంధీజీ తండ్రి కరమ్‌చంద్. ఆయన కూడా దివానుగా పనిచేశారు. గాంధీజీ తల్లిపేరు పుతలీబాయి. గాంధీజీ పేరు మోహన్ దాస్. చిన్ననాడు ఆయనను మను, మోనియా, మోహన్ అని ముద్దుగా పిలిచే వారు. గుజరాతీలు తమ పేరుతోపాటు తండ్రిపేరు, వంశంపేరు పెట్టుకోవడం ఆచారం కనుక గాంధీజీ పూర్తిపేరు మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ అయింది.

పూవు పుట్టగానే పరిమళిస్తుంది–అని అంటారు కాని, మోహన్‌దాస్ చిన్న వాడు చదువులో చెప్పుకోదగ్గ తెలివితేటలుగల వాడేమీకాదు; సామాన్య విద్యార్థి మాత్రమే. కాని, ఉత్తరోత్తరా మహాత్ముడు కాదగిన గుణసంపద మాత్రం ఉండేది. ఆ గుణ సంపదలో ప్రముఖమైంది సత్యనిష్ఠ. క్రమంగా తెలివితేటలూ అలవడ్డాయి.

గాంధీజీకి అతి బాల్యంలోనే-అనగా 13వ ఏటే వివాహమయింది. అది అప్పటి గుజరాతీ ఆచారం. గుజరాతీలే కాదు, భారతదేశంలోని తక్కిన ప్రాంతాల వారు కూడా చిన్న వయస్సు వారికి బొమ్మల పెళ్ళిళ్ళలాగా పెళ్ళిచేసి సంతో షించేవారు. గాంధీజీ పెద్దలు కూడా ఆ ముచ్చట తీర్చుకున్నారు. గాంధీజీ భార్యపేరు కస్తూరీబాయి. ఆమె సుశీల. ఆమె సౌశీల్యమే గాంధీజీ చేసిన ఘన కార్యాలకు పెట్టని కోటగా ఉండేది.

గాంధీజీని గొప్ప న్యాయవాదిని చేద్దామని తండ్రి తాతల అభిమతం

గనుక, ఆయన 1888లో మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసయిన పిదప బారిస్టర్ పరీక్ష చదవడానికి లండన్ నగరానికి వెళ్లారు. అక్కడికి వెళ్ళిన విద్యార్థులు సాధారణంగా ఆడంబరమైన జీవితం గడుపుతూ, దుర్వ్యసనాలకు లోనయి తిరిగి వచ్చేవారు. అలాకాక గాంధీజీ లండన్‌లో నిరాడంబరంగా జీవితం గడుపుతూ, కష్టపడి చదివి, లండన్ మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణులై పిదప బార్ ఎట్ లా పరీక్షలో 1901లో నెగ్గారు. తర్వాత భారతదేశానికి తిరిగివచ్చి, బొంబాయిలోను, రాజ్‌కోట్‌లోను న్యాయవాద వృత్తి ప్రారంభించారు. అయితే, ఆయన వకాల్తావృత్తి సంతృప్తికరంగా జరుగలేదు.

గాంధీజీ జీవితాన్ని మహోన్నతదిశకు మళ్ళించే ఒక విచిత్రం అప్పుడొకటి జరిగింది. పోర్‌బందర్‌లోని వ్యాపారస్థులు కొందరు దక్షిణాఫ్రికాలో వ్యాపారం చేసేవారు. దక్షిణాఫ్రికాలో వారి దావా ఒకటి నడిచేది. దానిలో తోడ్పడవలసిందని గాంధీజీని ఆ వ్యాపారస్తులు ఆహ్వానించారు. దక్షిణాఫ్రికాను చూడడం, కొంత అనుభవం సంపాదించడం, కుటుంబానికి కొంత తోడ్పడడం జరుగుతాయని గాంధీజీ ఆ ఆహ్వానాన్ని మన్నించి దక్షిణాఫ్రికాకు వెళ్ళారు. కోర్టు పని పూర్తి అయినా, ఆయన భారతదేశానికి తిరిగి రాలేదు.

దానికి కారణం భారతీయులను తెల్లవారూ, అక్కడి ప్రభుత్వమూ కూలీలుగా చూడడం. భారతీయులను దక్షిణాఫ్రికాలో పనిచేయడానికి అక్కడి ప్రభుత్వం కూలీలుగా తీసుకొని వెళ్ళింది. వారికి ఇతరులతో సమానమైన గౌరవ మర్యాదలు లేవు. అక్కడి చట్టాలు కూడా భారతీయులను బానిసలుగా చేశాయి. గాంధీజీ స్వదేశీయులయిన భారతీయులను క్రూరమైన ఈ చట్టాల నుంచి విముక్తులను చేయడం కోసం అక్కడే ఉండి, సత్యాగ్రహం నడిపి, నాయకత్వం వహించి విజయం సాధించారు. ఈ విజయం సులభంగా లభించలేదు. 21 సంవత్సరాల పాటు పోరాడగా లభించింది. ఈలోగా గాంధీజీ 1896లో ఒకమారు, 1901-2లో మరొకమారు భారతదేశానికి వచ్చారు. 1906, 1909లలో ఇంగ్లాండుకు వెళ్ళి వచ్చారు, భారతీయుల ఆత్మగౌరవాన్ని రక్షించారు.

దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహం విజయవంతమైన పిదప గాంధీజీ సకుటుంబంగా 1915లో భారతదేశానికి తిరిగివచ్చారు. మొదట కొచ్రబ్‌లోను, పిదప సాబర్మతీలోను నివసిస్తూ, భారతదేశ స్థితిగతులను తెలుసుకొన్నారు. 1916లో భారతదేశ రాజకీయాలలో ప్రవేశించారు; అప్పుడు తొలిసారిగా కాశీ విశ్వవిద్యాలయం శంకుస్థాపనోత్సవంలో ప్రసంగించారు.

గాంధీజీ భారత రాజకీయాలలో ప్రవేశించిన ఏడాదికే గొప్ప విజయం

సాధించి యావత్ప్రపంచ దృష్టిని ఆకర్షించారు. అప్పుడు బీహారులో ఒక పద్ధతి ఉండేది. దీనికి తీన్‌కతియా అని పేరు, రైతులు భూస్వాముల కోసం భూమిలోని 20 భాగాలలోని మూడు భాగాలలో నీలి మందు విధిగా పండించాలి. ఈ నీలి పంటవల్ల రైతులకు ప్రతిఫలం ఉండేది కాదు. బీహార్ రైతులు ఈ పద్ధతిని రూపుమాపించాలని గాంధీజీ మొదలైన కాంగ్రెస్ నాయకులను కోరారు. గాంధీజీ ఆచార్య జె. బి. కృపలానీ, బాబూ రాజేంద్రప్రసాద్‌లతో వెళ్ళి చంపారన్ అనే ప్రాంతంలో రైతులను ప్రోత్సహించి ఉద్యమం జరిపి తీన్‌కతియా పద్ధతిని అంతమొందించారు.

ఈలోగా గుజరాతులో మరొక కల్లోలం చెలరేగింది. గుజరాతులోని కేడా జిల్లాలో క్షామ పీడితులైన రైతులపై అన్యాయంగా పన్నులు విధించారు. అహమదాబాదులో మిల్లు కార్మికులకు యజమానులు సరిగ్గా జీతాలు ఇవ్వలేదు. గాంధీజీ ఈ రెండు ప్రాంతాలకు వెళ్ళి సత్యాగ్రహం జరిపి న్యాయం చేకూరేటట్టు చేశారు. ఆయన సత్యాగ్రహం వివిధ సమయాలలో వివిధ రూపాలలో సాగింది; 1920-21లో బ్రిటిష్ ప్రభుత్వంలో సహాయ నిరాకరణంగాను, 1930-32లో ఉప్పు సత్యాగ్రహంగాను, 1940-42లో ద్వితీయ ప్రపంచ యుద్ధ వ్యతిరేక వైయక్తిక సత్యాగ్రహంగాను, 1942లో క్విట్ ఇండియా మహోద్యమంగాను రూపుదాల్చింది. ఈ ఉద్యమాలన్నిటికీ గాంధీజీయే నాయకులు.

క్విట్ ఇండియా మహోద్యమం బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడ వణికించింది. 1942 ఆగస్టు 9వ తేదీన బ్రిటిష్ ప్రభుత్వం గాంధీజీని, తక్కిన నాయకులను అరెస్టు చేసింది. గాంధీజీని పూనాలోని ఆగాఖాన్ మహలులో బంధించింది. ఆయన వెంట అంతరంగిక కార్యదర్శి మహాదేవ్ దేశాయి, కస్తూర్బా ఉన్నారు. నిర్బంధించిన వారంలోగా 1942 ఆగస్టు 15న మహదేవ్ దేశాయి మరణించారు. 1944 ఫిబ్రవరి 22న కస్తూర్బా మరణించారు. "చనిపోయింది మహదేవ్‌కాదు, నా కుమారుడే మరణించారు. కస్తూర్బా నాలో కలిసిపోయింది." అని గాంధీజీ పరితపించారు.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం 1944లో బ్రిటిష్ ప్రభుత్వం గాంధీజీని, తక్కిన నాయకులను విడుదల చేసింది. బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశాన్ని ముక్కలు చేసేయాలని నిర్ణయించింది. ముస్లింలీగ్ పాకిస్తాన్ కోసం 1946 ఆగస్టు 16 నుంచి ప్రత్యక్ష చర్య ప్రారంభించింది. దేశంలో కనివిని యెరుగని ఘోర కృత్యాలు జరిగాయి. ముఖ్యంగా ముస్లింలు అత్యధిక సంఖ్యలో ఉన్న తూర్పు బెంగాలులోని నవఖాలీలో హిందువులపై హృదయ విదారకమైన దౌర్జన్యం జరిగింది. ఈ దౌర్జన్యాలను అణచడానికి గాంధీజీ చరిత్రాత్మకమైన యాత్ర

సాగించారు. ఈ యాత్రలో ఆయన 49 గ్రామాలలో పర్యటించారు. లక్షల మంది ఆర్తులను ఆశ్వాసించారు. 1947 మార్చి 2వ తేదీని నవఖాలీ నుంచి బీహారుకు బయలుదేరారు. బీహారుతో ప్రజ్వలించిన దౌర్జన్యకాండను అణచ వలసి వచ్చింది.

భారతదేశం 1947 ఆగస్టు 15న స్వతంత్రమైంది. కాని, దేశం ముక్కలయింది. వాయవ్య సరిహద్దు రాష్ట్రం, సింధ్, బెలూచిస్తాన్ రాష్ట్రాలు, పంజాబులో పశ్చిమ ప్రాంతం, బెంగాలులోని తూర్పు ప్రాంతం పాకిస్తాన్‌గా ఏర్పడింది. ఉభయ ప్రాంతాలనుంచి వలసలు ప్రారంభమయ్యాయి. నిరపరాధులయిన లక్షోపలక్షలు జనం ప్రాణాలు కోల్పోయారు. దేశం ముక్కలయినందుకు గాంధీజీ ఆవేదన పడ్డారు. "ఆగస్టు 15వ తేదీనాటి స్వాతంత్ర్య దినోత్సవంలో నేను పాల్గొనలేను. 32 సంవత్సరాల నా పరిశ్రమ ఈవిధంగా పరిణమించడం సిగ్గుచేటు" అని ఆయన వాపోయారు.

దేశ విభజన వల్ల చాలామందికి అసంతృప్తి కలిగింది. గాంధీజీ వల్లనే దేశానికి, హిందువులకు ఈ దుర్గతి కలిగిందని కొందరు భావించారు. అలాటి దురభిప్రాయంగల వారిలో అవివేకి అయిన నాథూరాం గోడ్సే అనే యువకు డొకడు. 1948 జనవరి 30వ తేదీ శుక్రవారం సాయంకాలం గాంధీజీ ప్రార్థన కోసం ప్రార్థనావేదిక చేరేలోగానే ప్రార్థనకు వచ్చిన జన సమూహం నుంచి నాథూరాం గోడ్సే అటూ ఇటూ మోచేతులతో తోసుకుంటూ గాంధీజీ ముందుకు వచ్చాడు. ఆయనకు పాదాభివందనం చేస్తున్నట్టుగా కిందికి వంగి లేచి, తన చేతిలోని పిస్తోలుతో ఢాం ఢాం ఢాం అని మూడుసార్లు ఆయన గుండెపై కాల్చాడు. గాంధీజీ 'హే రామ్!' అంటూ అక్కడే కూలిపోయారు. ఆ దురాత్ముణ్ణి ప్రార్థనకు వచ్చినవారు అక్కడికక్కడే పట్టుకున్నారు; పోలీసులకు అప్పగించారు.

ప్రపంచమంతా గాంధీజీ అస్తమయానికి దుఃఖించింది. "మన జీవితాలను వెలిగించిన జ్యోతి ఆరిపోయింది" అన్నారు అప్పటి భారత ప్రధాని జవాహర్‌లాల్ నెహ్రూ. "కాదు, కాదు. నేను పొరబడుతున్నాను. ఇంతరవకు ఈ దేశాన్ని ప్రకాశింపజేసిన ఆ జ్యోతి సాధారణ జ్యోతికాదు. ఇది వేయి సంవత్సరాల తర్వాత కూడా ఈ దేశానికి వెలుగును ఇస్తూనే ఉంటుంది. యావత్ప్రపంచం ఈ జ్యోతిని చూస్తూనే ఉంటుంది. ఇది ప్రత్యక్ష సత్యజ్యోతి" అన్నాడు జవాహర్ లాల్ నెహ్రూ.

గాంధీజీకి విశ్వవిఖ్యాతులైన పలువురు జోహార్లర్పించారు. "ఈ భూమి మీద అట్టి మహాత్ముడు మనుగడ సాగించాడంటే ముందుతరాలవారు నమ్మను గూడా నమ్మకపోవచ్చు" అని విశ్వప్రఖ్యాత విజ్ఞాన శాస్త్ర విశారదుడు అల్బర్ట్ ఐన్‌స్టీన్ అన్నాడు. ప్రపంచ ముఖ్య రచయిత్రి పెరల్‌బక్ "శిలువపై ఎక్కించిన రెండవ ఏసుక్రీస్తు ఆయన" అని కీర్తించింది.

రామునివలె, కృష్ణునివలె, తథాగతునివలె గాంధీజీ యుగపురుషులయ్యారు. ఆయన మాటలు, చేతలు కథలుగా, గాథలుగా ముందు తరాలవారికి వరవడిగా ప్రపంచ చరిత్రలో, సాహిత్యంలో నిలిచిపోయాయి. గాంధీజీపై వెలువడినంత సాహిత్యం బుద్ధునిపై వెలువడినంతదనవచ్చు. ఉత్తమ గుణాలన్నిటికీ ఆయన ఉదాహరణమయ్యారు. ఆయన పితృభక్తికి, సత్యనిష్ఠకు శ్రావణకుమార పితృభక్తి నాటకం, సత్యహరిశ్చంద్ర నాటకం ఉద్దీపకాలయ్యాయి. "ఎన్ని ఇడుములకైన ఓర్చి, హరిశ్చంద్రునిలాగ సత్యాన్ని విడనాడక ఉండడమే పరమార్థమని నిశ్చయించుకొన్నారు శ్రావణకుమార, హరిశ్చంద్రులు. ఇద్దరూ వాస్తవ వ్యక్తులేనని నాకు అనిపిస్తూంటుంది" అని ఆయన ఆత్మకథలో వ్రాసుకొన్నారు.

గాంధీజీ అన్నగారు రహస్యంగా మాంసం తినేవాడు. అందువల్ల అప్పుల పాలయ్యాడు. అతని చేతికి ఒక గట్టి బంగారు కడియం ఉండేది. అతడు ఆ కడియం నుంచి ఒక ముక్క తెగగొట్టి అప్పుతీర్చాడు. ఈ సంగతి తల్లిదండ్రులకు తెలిసింది. అన్నగారు అబద్ధమాడాడు. దీనిని గాంధీజీ సహింపలేకపోయారు. స్వయంగా తల్లి తండ్రులకు చెప్పలేక వివరంగా ఒక చీటీపై వ్రాసి అందజేశారు. తండ్రి అప్పుడు జబ్బుగా వున్నారు. ఆయన సహజంగా కోపిష్ఠుడు. కాని, తప్పుచేసిన కుమారుణ్ని మన్నించారు. తండ్రి ఓరిమి గాంధీజీ హృదయాన్ని ప్రభావితం చేసింది. అది ఆయనకు మొట్టమొదటి అహింసా పాఠమైంది. ఈ సంఘటనను ఆయన ఆత్మకథలో పేర్కొన్నారు:- "ఇది నాకు అహింసా విద్యలో ప్రత్యేక శిక్షణ వంటిదయింది. అప్పుడది నాన్నగారి ప్రేమాతిశయమని భావించాను. కాని, ఇప్పుడది అచ్చమైన అహింస అని గ్రహించాను. అలాటి అహింసే ప్రపంచమంతా అలింగనం చేసుకొంటే, అది వరుస వేదిలాగ పనిచేస్తుంది. దానికి అసాధ్యమేది ఉండదు."

గాంధీజీకి నగానట్రా అంటే గిట్టదు. నగలపై మోజు వద్దని ఆయన కస్తూర్బాకు నచ్చజెప్పేవారు. గాంధీజీ 1901లో దక్షిణాఫ్రికాలో దావా ముగించి భారతదేశానికి తిరిగి రానున్నప్పుడు, అక్కడి భారతీయులు ఆయన సేవకు

కృతజ్ఞతగా పెక్కు బహుమానాలిచ్చారు. వాటిలో బంగారు గుండీలు, బంగారు గాజులు, బంగారు కడియాలు, బంగారు గొలుసులు, వజ్రాలనగలు ఉన్నవి. వాటిని ఉంచుకుందామని కస్తూర్బాకు మనసైంది. కాని, గాంధీ ఆమెను ఒప్పించి, వాటికొక ధర్మనిధి ఏర్పాటుచేసి, బ్యాంకులో భద్రపరచి, ప్రజావసరాల కోసం వాటిపై అప్పు తీసుకొనేటట్టు ఏర్పాటు చేశారు. ఇది స్వార్థ త్యాగంలో ఆయన మొదటి అడుగు అనవచ్చు.

గాంధీజీ వకాలత్ చేసేటప్పుడుకూడా సత్యసంధతను అతిక్రమించలేదు, కేసు న్యాయమైనదని నమ్మినప్పుడే చేపట్టేవారు. సాక్షులను కూడా ఎప్పుడూ అబద్ధమాడమని చెప్పలేదు. ఆయన దక్షిణాఫ్రికాలో ఉన్నప్పుడు జోహన్స్ బర్గ్ మేజిస్ట్రేటు కోర్టులో ఒక అభియోగంలో వాదిస్తున్నారు. తన కక్షిదారు తనకు సరిఅయిన వివరాలు చెప్పక అబద్ధమాడాడని క్రాసు పరీక్షా సమయంలో తెలిసింది. గాంధీజీ వెంటనే వాదం మానివేసి కేసు కొట్టివేయవలసిందని మేజిస్ట్రేటును కోరారు. ఇలాటి తప్పుడు కేసులు తేవద్దని తన కక్షిదారును చీవాట్లు పెట్టారు. అది చూచి ప్రతివాది పక్షం న్యాయవాది విస్తుపోయాడు. కాని, మేజిస్ట్రేటు చాలా సంతోషించాడు. గాంధీజీ సత్యసంధతను శ్వేతజాతి న్యాయవాదులు కూడా మెచ్చుకొనేవారు.

గాంధీజీ చిన్న చిన్న విషయాలలో కూడా చాలా శ్రద్ధ వహించేవారు. చిన్న విషయాలపై శ్రద్ధ పెద్ద విషయాలకు చాలా అవసరమని, తన జీవితం చిన్న విషయాలపైనే ఆధారపడిందని ఆయన విశ్వాసం. ఏ వస్తువునైనా చివరకు నీళ్ళనైనా వ్యర్థం చేయడం ఆయనకు గిట్టేదికాదు. దీనికి ఉదాహరణ సేవాగ్రాం ఆశ్రమంలోని భోజనశాల వద్ద ఉన్న నోటీసుబోర్డు: "ఆశ్రమం ఆస్తిని సొంత ఆస్తిగా చూచుకోండి. ఉప్పును కూడా అవసరానికి మించి వడ్డించవద్దు. నీరుకూడా వృథాచేయకండి," అని ఈ నోటీసు బోర్డు హెచ్చరించేది.

ఆయన చిన్న కాయితం ముక్క అయినా వృథాచేసేవారుకారు. కవర్లు చక్కగా చింపి తిరగవేసి వ్రాసేవారు, పేపరు క్లిప్పులు, గుండుసూదులుకూడా భద్రపరచేవారు. ఒకరోజు ఆయన దేనినో వెదుకుతున్నారట. దేనికోసమని ఎవరో అడిగారట. ఒకచిన్న పెన్సిలు కనిపించడంలేదు; దానికోసం అని ఆయన అన్నారట. అడిగిన వ్యక్తి మరొక పెన్సిలు ఇవ్వబోగా, కనిపించని పెన్సిలు తమ ప్రియమిత్రుని కుమారుడు ఇచ్చినదని, దాని విలువ ప్రేమ అని అన్నారట. ఇద్దరూ కలిసి వెదకగా, అది దొరికిందట. తీరాచూస్తే అది అంగుళం ఖాతవు ముక్క.

అలాగే, ఆయన ప్రతి పైసాకూ పద్దు వ్రాసేవారు. ఆయన సేకరించిన ప్రతినిధికి పైసాలవారిగా లెక్కలు ఉండేవి. "నేను వసూలు చేసిన ప్రతి పైసా జాగ్రత్తగా ఖర్చుచేసి, పద్దు చెప్పకపోతే, మనం ప్రజా జీవితంలో సుస్థిరస్థానం పొందడానికి వీలుఉండదు," అనేవారు.

గాంధీజీ క్రమశిక్షణను కఠోరంగా పాటించేవారు. "నేను నా జీవితంలో మానవులనుభవించని తీవ్రాతితీవ్రమైన అగ్ని పరీక్షలు ఎదుర్కొన్నాను. వాటి వల్ల నాకు క్రమశిక్షణ అలవడింది" అని ఒకానొక సందర్భంలో ఆయన అన్నారు. చాలా మంది క్రమశిక్షణ లేక నిత్య జీవితంలో ఎన్నో కష్టాలకు గురి అవుతుంటారని, క్రమశిక్షణ అలవరచుకోవడం కష్టమైనా, అది వ్యక్తికి ఎంత అవసరమో, సంస్థలకూ అంతే అవసరమని ఆయన పదే పదే అనేవారు. ముఖ్యంగా ప్రజాస్వామ్యానికి క్రమశిక్షణ అత్యావశ్యకమని నొక్కి నొక్కి చెప్పేవారు.

"అత్యున్నతమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు అతి తీవ్రమైన క్రమశిక్షణ, నమ్రత అవసరం. అగ్నిని, జలపాతాన్ని తెలివితేటలు లేకపోతే ఎలా వశపరచుకోలేమో, అలాగే మన పునరుద్ధరణం కూడా క్రమశిక్షణ లేకపోతే ప్రయోజనకరం కాదు. మనం ఏదైనా ఘనమైనదీ, శాశ్వతమైనదీ సాధించాలంటే క్రమశిక్షణకు లోబడాలి. అఖండమైన జాతిగా రూపొంద దలుచుకున్న ప్రజలకు క్రమశిక్షణ చాలా ముఖ్యం. క్రమశిక్షణ లేకపోతే, రామరాజ్య మన్నమాట కలగానే ఉండిపోతుంది" అని గాంధీజీ పెక్కుమార్లు ఉద్బోధించారు.

క్రమశిక్షణలాగే సమయపాలనం కూడా ఆయన రక్తంలో జీర్ణించుకొని పోయింది. ఆయన కార్యక్రమం అనుకొన్న వేళకు ఎన్ని కష్టాలు వచ్చినా నిర్వహించేవారు. "వైస్రాయిని కలుసుకొనడానికి ఎంత శ్రద్ధగా సకాలంలో వెళ్ళుతామో, ప్రజల సమావేశానికి కూడా అంత శ్రద్ధగా వెళ్ళాలి" అనేవారు.

ఒకమారు ఆయన గుజరాత్ విద్యాపీఠం సెనేట్ సమావేశానికి వెళ్ళవలసి వచ్చింది. సాబర్మతి ఆశ్రమం నుంచి వెళ్ళాలి. ఏ వాహనమూ దొరకలేదు. సకాలానికి సమావేశంలో పాల్గొనాలనే పట్టుదలతో ఆయన కాలినడకను బయలు దేరారు. కొంత దూరం వెళ్ళిన తరువాత సకాలానికి చేరుకోలేనని తోచింది. అంతలో ఒక కాంగ్రెస్ స్వచ్ఛంద సేవకుడు సైకిలుమీద ఎదురుపడ్డాడు. గాంధీజీ అతనిని ఆపి, అతని సైకిలు తీసుకొని బయలుదేరారు. సైకిలు తొక్కడం సరిగా రాకపోయినా, ఎలాగో తొక్కుతూ సకాలానికి సమావేశానికి హాజరయ్యారు. గాంధీజీ సైకిలుమీద రావడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది,

సమయ పాలనం పాటించని వారిని ఆయన సహించేవారు కారు. ఒకసారి ఆయనా, లోకమాన్య బాలగంగాధర తిలక్ గుజరాత్‌లోని గోద్రా పట్టణంలో జరిగిన రాజకీయ మహాసభలో ప్రసంగించ వలసి వచ్చింది. గాంధీజీ సకాలానికి వచ్చి ప్రసంగించారు. లోకమాన్యులు అరగంట ఆలస్యంగా వచ్చారు. గాంధీజీ ఆయనకు స్వాగతం పలుకుతూ, "లోకమాన్యులు అరగంట ఆలస్యంగా వచ్చారు. మనకు స్వరాజ్యం రావడం అరగంట ఆలస్యమైతే, ఆ పాపం లోక మాన్యుల నెత్తిమీదే ఉంటుంది." అని చమత్కరించారు.

గాంధీజీ కర్మయోగి. కర్మయోగమంటే కష్టించి పని చేయడం. ఎవరి పని వారు చేసుకోవాలని, అలా చేసుకోవడంలో తప్పులేకపోగా గౌరవం ఉందని ఆయన విశ్వాసం. ఎలాటి పనీ చేయకుండా ఊరికే కూర్చుని భోజనం చేసే వారు దొంగల వంటి వారని ఆయన విశ్వాసం. "ఎవరు శ్రమపడక, భగవదా రాధనచేయక భుజిస్తారో, వారు దొంగకూడు తినేవారని గీతాచార్యుడు చెప్పాడు. ప్రతి వ్యక్తి కష్టపడి చెమట ఓడ్చి తన తిండి తాను సంపాదించుకొన్ననాడు దేశం భూతల స్వర్గమవుతుంది. సంఘ వ్యవస్థ మారిపోతుంది. ప్రశాంత విప్లవం ఏర్పడుతుంది. సంస్కృతి వికసితమైన మానవ సంఘంలో కాయ కష్టానికి ఒక విశిష్ట స్థానం ఉంది." అని ఆయన అనేవారు. దీనిని ఆయన దక్షిణాఫ్రికాలో ఫీనిక్స్ సెటిల్‌మెంట్‌లోను, టాల్‌స్టాయ్ ఫారంలోను, సేవాగ్రాం ఆశ్రమం లోను ఆచరణలో పెట్టారు.

గాంధీజీకి భగవంతునిపైన, ప్రార్థనలోను సంపూర్ణ విశ్వాసం ఉండేది. ప్రతి పనినీ ఆయన ప్రార్థనానంతరమే చేసేవారు. ఆయన కార్యక్రమం ప్రార్థనతో ప్రారంభమయి, రాత్రి ప్రార్థనతో అంతమయేది. శరీరానికి తిండి ఎంత అవసరమో ఆధ్యాత్మికంగా ప్రార్థన అంత అవసరమనేవారు ఆయన. "ప్రార్థనకు ఏవో పాటలు, మాటలు అవసరంలేదు. ప్రశాంతమైన, హృదయ పూర్వకమైన ప్రార్థన హృదయం లేని భజనకన్నా చాలా మంచిది. మనసులోని భయాలను, దౌర్జన్యాలను తొలగించడానికి ప్రార్థన చాలా శక్తిమంతమైన మార్గం" అని గాంధీజీ ప్రార్థనను గురించి చెప్పేవారు.

ప్రజా స్వామ్యం విషయంలో గాంధీజీకి స్వతంత్రమైన అభిప్రాయాలు ఉండేవి. ఆయన వాటిని "హింద్ స్వరాజ్" అనే గ్రంథంలోను, ప్రసంగాల లోను, వ్యాసాలలోను వెలిబుచ్చారు. దానినే సర్వోదయమని నిర్వచించారు. గాంధీజీ భావాలను ఆచార్య వినోబా భావే 'శోషణరహిత (దోపిడీలేని), శాసన ముక్త, అహింసాత్మక, స్వరాజ్యం' అని వ్యాఖ్యానించారు.

గాంధీజీ తమ నిర్యాణానికి ముందు వ్రాసిన వీలునామాలో తాము భావించిన స్వరాజ్యం రూపురేఖలను చిత్రించారు. దానిలోని కొన్ని భాగాలివి:—

"నేను కలలుగన్న స్వరాజ్యం బీదల స్వరాజ్యం. రాజులు, ధనికులు తమ జీవితావసరాలను ఎలా తీర్చుకొంటారో అలాంటి సదుపాయాలు బీదలకు కూడా లభించాలి. అవి అందరికీ లభించినంత వరకు నేను కలలుగన్న స్వరాజ్యం సిద్ధించదు.

"నేను కలలుగన్న స్వరాజ్యంలో కులమత భేదాలకు ఎలాటి స్థానమూ లేదు. దానిమీద ధనికుల, మేధావుల ఆధిపత్యం ఏమాత్రం ఉండరాదు. ఆ స్వరాజ్యం అందరి క్షేమం కోసమూ, కల్యాణం కోసమూ ఉంటుంది.

"మన స్వరాజ్యానికి అర్థం మనదేశ ప్రజలను సభ్యతగల వారినిగా తీర్చడం. ఆ సభ్యత ఆర్థిక దృష్టితో శుద్ధమైనదిగా, బలమైనదిగా ఉండకపోతే దానికి విలువ ఉండదు. సభ్యతకు మూలం సర్వోత్కృష్టమైన నీతి పాలన. ఈ నీతి పాలన సార్వజనిక కార్యాలకూ, వ్యక్తిగత కార్యాలకు కూడా వర్తిస్తుంది.

"అహింసపై ఆధారపడితే, స్వరాజ్యంలోని ప్రజలకు తమ అధికారాలను గూర్చిన పరిజ్ఞానం లేకున్నా ఫరవాలేదు. కాని, వారికి తమ కర్తవ్యాలను వినయ విధేయతలతో నిర్వర్తించాలనే వివేకం తప్పక ఉండాలి. విధుల నిర్వహణలోనే హక్కులు ఇమిడి ఉన్నాయి. కర్తవ్య పాలనలో లభించేదే నిజమైన అధికారం. మనమందరం మన విధ్యుక్త ధర్మాలను సక్రమంగా నిర్వహిస్తే, హక్కుల కోసం వెదుక్కోనక్కరలేదు. మొదటిది లేకుండా రెండవ దానికోసం ఆశించడం ఎండమావుల వెంట పరుగెత్తడమే. మనం వాటివెంట ఎంతగా పరుగెత్తుతామో, అవి అంతగా దూరమవుతాయి.

"మన లక్ష్యం రాజ్యాధికారం కాదు. రాజ్యాధికారం ప్రజా జీవిత రంగాలన్నింటిలో ఉపయోగపడి, వారి పరిస్థితులను చక్కబరచడానికి ఏర్పడ్డ సాధనం మాత్రమే. రాజ్యాధికారమంటే ప్రజా ప్రతినిధులద్వారా దేశ జీవితాన్ని అదుపులో ఉంచే శక్తి. మన జాతీయ జీవనం పరిశుద్ధమూ, పరిపూర్ణమూ అయి, ఎవరికి వారు స్వయం శిక్షణ ద్వారా తమ జీవితాన్ని సరిదిద్దుకున్నప్పుడు ప్రజా ప్రతినిధుల అవసరం కూడా ఉండదు. అట్టి స్థితిని జ్ఞానసంపన్నమయిన అరాజక మనవచ్చు. అప్పుడు ప్రతివాడూ తనకు తానే రాజు. తన్ను తాను శాసించుకుంటూ జీవించేటప్పుడు పక్కవారికెట్టి ఇబ్బందులూ ఉండవు. ఆదర్శ సంఘ వ్యవస్థలో రాజకీయ సత్తా అనేది ఉండదు. రాజ్యమే లేనప్పుడు రాజకీయ సత్తా ఎక్కడది? అది చరమ లక్ష్యం. అంతిమ ఆదర్శం. కాని, ఆదర్శమనేది

ఎప్పుడూ ఆదర్శమే. అది ఎప్పుడూ సిద్ధించదు. అందుకే తక్కువలో తక్కువ అధికారం వినియోగించేదే ఉత్తమ ప్రభుత్వమని హెన్రీ థోరో అన్నారు.

"నిజమైన ప్రజా ప్రభుత్వం అహింసా సాధనకు ఫలమని నా విశ్వాసం. నిజమైన ప్రపంచ రాజ్యాల సమాఖ్యను కేవలం అహింస అనే పునాది మీదనే నిర్మించగలం. దాని సంపూర్ణ రూపంలో అది హింసను పూర్తిగా త్యజించవలసి ఉంటుంది. సమాజమనే మాటకు నా దృష్టిలో సరిఅయిన అర్థం అందరూ సమానంగా జన్మించారనే గనుక, మనకందరికీ సమానంగా జీవితావకాశాలు పొందే హక్కు ఉంది. అయితే అందరి శక్తులూ సమానంగా ఉండవు. నైసర్గికంగా మనిషికీ మనిషికీ మధ్య కొన్ని భేదాలు ఉంటాయి. మేధా సంపన్నులూ, కుశాగ్ర బుద్ధులూ ఎక్కువగా సంపాదించుకోవచ్చు. కాని, కుటుంబంలోని తండ్రీ కొడుకుల సంపాదన ఆ కుటుంబ పోషణకు ఉపయోగ పడినట్టే, మేధావుల సంపాదన సంఘ సంక్షేమానికి పనికి రావాలి.

"స్వరాజ్యమంటే ప్రభుత్వ శాసనానికే దూరంగా బ్రతికే ప్రయత్నమని అనవచ్చు. ఆ ప్రభుత్వం పరాయి వాళ్ళదయినా, మనదైనా ఒక్కటే. ప్రతి జీవితావసరాన్ని ప్రభుత్వమే తీర్చాలని మనం పట్టుబడితే, ప్రభుత్వానికి ముప్పు వాటిల్లినట్లే.

"రాజ్యం సత్తా కేంద్రీకృతమై ఘనీభవించినప్పుడు హింసకు ప్రతిరూప మవుతుంది. అంతేకాక అది ఆత్మరహిత జడ యంత్రం అయిపోతుంది. వ్యక్తికీ కూడా ఆత్మ ఉన్నరని అది ఆలోచించదు.

"బహు జనాభిప్రాయమనే నియమానికి ఒక హద్దు ఉంది. ఆ హద్దువరకే దాని ప్రయోజనం. బహు జనాభిప్రాయమని చెప్పి ఇచ్ఛవచ్చినట్టు చేస్తే, దానికి లొంగి పోవడం బానిసత్వమవుతుంది. ప్రజా ప్రభుత్వమంటే, ప్రజలు గొర్రెల లాగ ప్రవర్తించడం కాదు. ప్రజా ప్రభుత్వంలో వ్యక్తి అభిప్రాయాన్ని, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఎంతో మర్యాదతోను, జాగరూకతతోను మన్నించాల."

సత్కార్య సాధనకు సత్సాధనాలు ఉండాలనేది గాంధీజీ సిద్ధాంతం. ఈ సిద్ధాంతానికి ఆయన వీలునామా గొప్ప తార్కాణం. వీలునామాయే కాదు, ఆయన జీవితమంతా గొప్ప ఉదాహరణం. బాపూజీ కథ రచించిన శ్రీహరి బాపూ ఉపాధ్యాయగారు అన్నట్టు ఈ వీలునామా ఎప్పుడు అమలవుతుందో చెప్పలేము.

(ఆంధ్రప్రదేశ్ – సెప్టెంబర్, అక్టోబర్ 1984)

# నాదస్వర మౌలా షేక్ చినమౌలా

[దేశాన్ని రాజకీయాలు ముక్కలు చెక్కలు చేస్తున్న ఈ మంటల వేళలో — మనిషికి మనిషికి మధ్య సంగీతం లాంటి అనుబంధం ఒక్కటి మాత్రం ఉంటే మన దేశం స్వర్గంలా ఉండేది కదా అనిపిస్తుంది. రాముడిని, అల్లాను, కృష్ణుడిని, త్యాగయ్యను సంగీతంతో పూజించే మేటి నాదస్వర విద్వాంసులు షేక్ చినమౌలాగారి పాట విన్నా, మాట విన్నా మన సంస్కృతి సమైక్యాల మూలాన్ని దర్శించిన అనుభూతి కలుగుతుంది. ఈ ముఖాముఖిలో ఆ మహా విద్వాంసుడి అభిప్రాయాలు వింటే, ఈ పవిత్ర భారత భూమిలో సంగీతం, నాట్యం, సత్ సాహిత్యం సజీవంగా ఉన్నన్ని రోజులూ ఈ దేశం ఒక్కటే, దీనినెవరూ ఏమీ చేయలేరు అన్న ధీమా ఏర్పడుతుంది. త్యాగరాజుకు, షేక్ చినమౌలాకు ఒక్కసారి చేతులెత్తి దండం పెడదామనిపిస్తుంది. చదవండి!]

శ్రీరాముణ్ణి విశ్వామిత్రుడు అస్త్రశస్త్ర విద్యలు నేర్పి మహావీరుణ్ణి చేశాడు. ఆ విద్యలతో శ్రీరాముడికి గొప్ప కాంతి కలిగింది. రామచంద్రు డయ్యాడు. రాజసూయంలో ఎవరిని పూజించాలి మొదట? — అనే విచికిత్స కలిగింది ధర్మరాజుకు. కృష్ణుడే ప్రథమ పూజకు అర్హుడు — అని అన్నారు భీష్మాదులయిన పెద్దలు. అప్పుడు కృష్ణుడు పురుషోత్తము డయ్యాడు. ఈ ఇద్దరినీ ఆశ్రయించుకొని పెరిగింది మన సంగీతం. కనుక దానిని పవిత్రంగా భావించి అధ్యయనం చేయాలి — అన్నారు సుప్రసిద్ధ నాదస్వర విద్వాంసులు డాక్టర్ షేక్ చినమౌలా సాహెబ్‌గారు, నేను ఇటీవల వారిని దర్శించినప్పుడు.

భక్తి వినా పాడలేరు. సంగీతం భక్తిలేక ఉన్నత స్థాయికి చేరదు — అంటారు మౌలా. భగవత్సాక్షాత్కారానికి వివిధ మార్గాలు ఉన్నా నిజానికి భక్తితో కూడిన జ్ఞానం, జ్ఞానసహితమైన భక్తి ప్రధాన మార్గం. ఆ భక్తికి దోహదం చేసేదే సంగీతం - అంటారు మౌలా. "నాకు సంగీతమే వేదాంతం. దానిలో పై స్థాయికి పోవడమే నా లక్ష్యం -" అని దృఢంగా అంటారు మౌలా.

"మరి సంగీతం ఇతరత్రా కూడా వాడుకలో ఉంది కదా?" - అని సవినయంగా ప్రశ్నించాను.

నిజమే. ఉంది. దాని స్థాయి వేరు. అది తాత్కాలికమైన ఆనందాన్ని చేకూర్చేది. అంతకు పై స్థాయిది కాదు. భక్తి లేకుంటే ఉన్నత శిఖరాలను అందుకోడం కష్టం. సాంకర్యం నాకు అంతగా ఇష్టంలేదు. కనుకనే నేను సిని మాల్లో ఎందరో పిలిచినా వెళ్ళలేదు - అన్నారు ఆయన.

శ్రీ కందాడ శ్రీనివాసాచార్యులు గారనే విద్వాంసులు గానభాస్కరం, త్యాగరాజ హృదయం అనే గ్రంథాలు రచించారు. వాటిలో భక్తికి, సంగీతానికి గల సంబంధం, ఆ భక్తితో త్యాగరాజస్వామి ఎంతటి ఉన్నత శిఖరాలను అధి రోహించాకో నిరూపించారు. అన్ని మతాల్లోను సంగీతానికి, భక్తికి సంబంధం ఉంది. మేము అనుదినం చేసే నమాజు అల్లా అ-ఆ-ఆ-ఆ అనే బాంగ్ (నినా దం)తో ప్రారంభమవుతుంది. అది మాయామాళవ గౌళరాగం. దీనినుంచే భూపాల, సావేరి మొదలయిన రాగాలు పుట్టాయి. కొందరు సంగీతానికి మూలం ఓంకారమన్నారు. మరికొందరు బాంగ్ అన్నారు. ఏదైనా భక్తి మూలమే - అని తమ వాదాన్ని వివరించారు మౌలా.

"ఉత్తర భారతంలో సంగీతంలో ఏవేవో ఘరానాలు (బాణీలు) ఎన్నో ఉన్నాయి. మీది ఏ బాణీ?" అని ప్రశ్నించాను.

"మనకు నాదస్వరంలో జి.ఎం. సుబ్రహ్మణ్యం బాణీ, రాజరత్నం పిళ్ళై బాణీ - ఇలా ఎన్నో బాణీలు ఉన్నాయి. నాది మా పెద్దల బాణీ. నా జన్మస్థలం గుంటూరు జిల్లా కరవది. నా జన్మదినం ప్రభవ వైశాఖ బహుళ చతుర్దశి సూర్యోదయ సమయం. కరవది దేవాలయంలో మా వంశంవారు మూడు వందల ఏళ్ళకు పైగా నాదస్వరం వాయిస్తున్నారు. మా వంశం వారిలో విద్వాన్ ఆదం సాహేబ్ దేవగాంధారి రాగంలో నిపుణులు. ఆయనను దేవగానం ఆదం సాహేబ్ అనేవారట. మరొకరు రాసవారిపాళెం కాశిం సాహేబ్. ఆయన సంగీత శాస్త్రంలో ఏ సందేహాన్నయినా తీర్చగల మహా విద్వాంసులట. పల్లవి పాడుతున్నప్పుడు చేతులతోను, కాళ్ళతోను కూడా తాళం వేసేవారట. చాల చురుకుగా ఉండడంవల్ల ఆయనను "తాచుపాము" అనేవారట. ఆయన గద్వాల మొదలయిన సంస్థానాల ఆస్థాన విద్వాంసులట. కొమ్మూరు వాచా సాహేబ్ నాద స్వరాన్ని ఎంతో వృద్ధిపరచారు.

"విద్వాన్ చిలకలూరిపేట చిన్న మౌలా, పెద్ద మౌలా అనేవారు సోద రులు. చిన్న మౌలా సంస్కృత విద్వాంసులు. అమరం, రామాయణం ఆయ నకు కంఠపాఠం. 'మున్నురావణ' అనే తోడిరాగం కృతిని ఆయన నాద స్వరంపై గొప్పగా వాయించేవారు. 'ద్రోణ కర్ణ దుర్యోధనాది హర' అనే

సింహేంద్ర మధ్యమ కృతిని ఆయన మొదట పాడి, తర్వాత నాదస్వరంలో వాయించేవారట. ఆయనను సమకాలికులు 'నాదస్వర సంగీత విద్వాన్' అనే బిరుదంతో సత్కరించారట. కొమ్మూరు సోదరులు పెంటూ సాహేబ్, సిలార్ సాహేబ్ మహా విద్వాంసులు. పెంటూ సాహేబ్ 'పరిధానమిచ్చితే, ఎందరో మహానుభావులు' అనే కృతులను మహా మధురంగా వాయించేవారట. కల్యాణి, బిలహరి, కేదారగౌళ రాగాలను మధుర సుకుమారంగా వాయించడంవల్ల ఆయనను కల్యాణి పెంటూ సాహేబ్, బిలహరి పెంటూ సాహేబ్, కేదార గౌళ పెంటూ సాహేబ్ అనేవారట." అంటూ ఇంకా ఇలా చెప్పారు చిన మౌలాగారు.

"మరొక సోదరులు నాదబ్రహ్మ చిలకలూరిపేట చిన్నపీరు సాహేబ్, పెద్దపీరు సాహేబ్. వీరిది సావేరి, ఆభేరి రాగాలలో అందె వేసిన చేయి. అభేరి రాగంలోని 'నగుమోము గనలేని' అనే కృతి చిన్నపీరు సాహేబ్‌కు చాల ఇష్టమైనది. ఆయనను 'నాదబ్రహ్మ' అనే బిరుదంతో సత్కరించారు. ఆయన విజయవాడలోని కనకదుర్గాలయంలో సావేరి రాగం వాయిస్తుండగా సుప్రసిద్ధ గాయకులు, నటులు శ్రీ జొన్నవిత్తుల శేషగిరిరావుగారు 'చిన్నపీరూ, కనకదుర్గాంబ ప్రత్యక్షమౌతున్నదయ్యా నీ రాగం వింటూంటే. కనుక ఇకమీద ఈ రాగాన్ని దుర్గాంబకు అంకితం ఇవ్వు' అన్నారట. కళాకారునికి ఇంతకన్నా ఏం గౌరవం కావాలి?

"చిన్నపీరు సాహేబ్ మనుమడు షేక్ మహబూబ్ సుభానీ మా శారదా నాదస్వర సంగీతాశ్రమంలో శిష్యుడు. చిలకలూరిపేట ఆదం సాహేబ్ నా గురువులు. నేను మా తండ్రిగారు షేక్ కాశిం సాహేబ్ వద్ద మొదట్లో శిక్షణ పొందాను. తొమ్మిదవ ఏటి నుంచే మా నాయనగారితోపాటు వాయించడం ప్రారంభించాను. హరికాంభోజిలోని 'ఎందరని', తోడి రాగంలోని 'ఎందుకు దయరాదు'. ఖరహరప్రియలోని 'చక్కని రాజమార్గము' అనే కృతులు మా పెద్దల సొమ్ము" అని వివరంగా చెప్పారు మౌలా.

"అదేదో శారదా నాదస్వర సంగీతాశ్రమం అన్నారే. అదేమిటి?" అంటూ ప్రశ్నించాను.

"మా సంప్రదాయం విచ్ఛిన్నం కాగూడదు గదా! ఇక్కడే నా ఇంట్లోనే ఈ సంగీతాశ్రమం స్థాపించాను. నా దౌహిత్రుడు షేక్ కాశిం, ఇంతకుముందు చెప్పిన షేక్ మహబూబ్ సుభానీ, మరి అయిదుగురు శిష్యులున్నారు. గురుకుల సంప్రదాయంలో విద్యాభ్యాసం, సాధన జరుగుతాయి" - అన్నారు ఆయన.

నేను అప్పుడు తల ఎత్తి చూచాను. దాదాపు అయిదారు వందల చదరపు

గజాల స్థలంలో ఉంది మౌలాగారి మేడ. చుట్టూ తోట. ప్రహరీ గోడ. ఆశ్రమంలాగే ఉంది. బయట వసారాలో ఆయన మంచం మీద కూర్చున్నారు. దౌహిత్రుడు శ్రీ కాశిం పక్కనే నిలుచున్నారు. ఆయన బి.ఎస్.సి. పట్టభద్రులు. మౌలాగారితో పాటు కచ్చేరీలలో వాయిస్తారు. బాబూ అనేవారూ వాయిస్తారు. మంచి పరిసరాలు అని అనుకుంటుంబగా, మౌలా ఇలా అన్నారు :

"క్షమ గల్గు భూతనయ లక్ష్మణాదులకే గాని అన్యులకు గాదు - అని త్యాగయ్య అన్నారు గనుక, నేను ఒక రాగం వాయించేటప్పుడు దానిని అర్థం చేసుకొనే స్థాయికి వచ్చినవారికే నేర్పిస్తాను. పూర్వకాలంలో అయితే పడరాని పాట్లూ పడి సంగీతం నేర్చుకొనేవారు. ఇప్పుడు తిండి అవసరం. ఇప్పటి యువకులకు నిగ్రహం తక్కువ. కష్టపడి నేర్చుకోలేరు. కనుక భోజన సదుపాయమూ కలిగిస్తున్నాను. కాని యువకులను నేను కోరేది ఒక్కటే. సాధించాలనే దృష్టి అవసరమని. లక్ష్య శుద్ధి ఉండాలని. తిన్నా తినకున్నా మనం అనుకున్నది సాధించాలి అనే పట్టుదల కావాలి."

"మీ ఆశ్రమంలో హిందుస్థానీకి స్థానం ఉందా?" - అనడిగాను.

"లేదు. కేవలం శాస్త్రీయ కర్ణాటక సంగీతమే. హిందుస్థానీ మార్గీ అని, మనది దేశీ అని నా నమ్మకం. హిందుస్థానీలో రాగానికి ప్రాధాన్యం. మనది లయ ప్రధానం. శ్రుతిర్మాతా లయః పితా అన్నారు శాస్త్రకారులు. హిందుస్థానీకి తాళం లేకున్నా తప్పులేదు" - అన్నారు మౌలా.

"మీరు ఇలా అంటున్నారు. కాని, శహనాయీకి ఉన్నంత ఆదరణ మన నాదస్వరానికి లేదే?" - అన్నాను.

"మీరు చెప్పింది నిజమే. నాదస్వరానికి కూడా ఆదరణ ఏర్పడుతూంది. తమిళనాడులో చాల ఆదరం ఉంది. కనుకనే నేను ఈ శ్రీరంగంలో స్థిరపడ్డాను. కరవదిలో మాన్యాలు, ఇళ్ళూ వాకిళ్ళూ ఉన్నా శ్రీరంగం శ్రీవైష్ణవుల 108 దివ్య దేశాలలో ప్రధానమైంది. కలియుగ వైకుంఠమని విఖ్యాతమైంది. ఆళ్వార్లలో పెక్కుమంది శ్రీరంగ వైభవాన్ని గానం చేశారు. తిరుప్పాణాళ్వార్, శిబి, నాచ్చియార్ రంగనాథుని పాద సన్నిధిలో లీనమయ్యారు. ఇక కర్నాటక సంగీతంలో శ్రీరంగం స్థానం చెప్పలేను. పెక్కుమంది కర్నాటక సంగీత విద్వాంసులు ఈ శ్రీరంగ ద్వీపంలో జన్మించారు...." అని చెబుతూ పోయారు మౌలా.

ఆ మాటలు వింటుంటే నాకు ఎవరో వైష్ణవాచార్యుడు మాట్లాడుతున్నట్టు అనిపించింది. ఆయన స్ఫురద్రూపం వసారా లోపలి హాలులో గోడలకు వ్రేలాడుతున్న రామపట్టాభిషేకం మొదలయిన పటాలు... ఇవన్నీ చూస్తూ వెంటనే అడిగాను :

"మీ ఇల్లు చూస్తే, మీ మాటలు వింటుంటే, మీ ఆచారాలు, వ్యవహారాలు చూస్తుంటే, ఏదో వైదిక బ్రాహ్మణుల ఇంట్లో ఉన్నట్లు ఉందే? మీ కులస్థులు ఆక్షేపించరా?" - అని.

కళారాధకులకు, ముఖ్యంగా నాదోపాసకులకు మత భేదమేమీ లేదు. ప్రవీణ్ సుల్తానా చక్కగా కుంకుమ బొట్టు పెట్టుకొనేది. బడే గులాం అలీఖాన్ పాకిస్తాన్‌లో పాడుతున్నప్పుడు 'కన్హయ్యా' అని ఒక గీతం ఆలపిస్తే అక్కడి వారు ఆక్షేపించగా, కన్నయ్య లేక సంగీతమే లేదని జవాబు చెప్పాడని చెప్పగా విన్నాను. నేను తొమ్మిదో ఏటి నుంచీ నాదస్వరంతో నాదోపాసన చేస్తున్నాను. తంజావూరు బాణీ నేర్చుకోడానికి నాచ్చియార్ కోవిల్ (తమిళనాడు)కు వచ్చి శ్రీరాజం, దొరైక్కణ్ణు సోదరుల వద్ద నేర్చుకున్నాను. దాలిపర్తి పిచ్చి హరి గారు, కోయవారి పాలెం నాగయ్యగారు వంటివారిని దర్శించాను. తాళినడక శేషయ్య, పొన్నూరి రామస్వామయ్య వంటి భక్త గాయకుల సంగతి విన్నాను. ఎక్కడా సంగీత ప్రపంచంలో కుల మత వైషమ్య ప్రసక్తి కనిపించలేదు" - అని అర్ధ నిమీలిత నేత్రాలతో చెబుతూ పోయారు ఆయన.

నేను ఆయనను దర్శించిననాడు తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి ఎం.జి. రామచంద్రన్ జయంతి. శ్రీరంగమంతా నాదస్వరంతో, డోళ్ళ ధ్వనులతో మారు మోగిపోతోంది. మా మాటలు వినబడనంతగా గోల.

"ఈ సున్నితమైన నాదస్వరానికి భయంకరమైన డోలును పక్కవాద్యంగా ఎవరు ఏర్పాటు చేశారో? సన్నాయికి తబలా లాగ మృదంగం పెట్టరాదా?" - అని ప్రశ్నించాను.

"డోలు సంప్రదాయంగా వస్తూంది. దాన్ని త్వరగా తీసివేయలేము. కాల మనేది సర్పం. దానిని అణచలేము. అదే తనను నిర్ణయించుకుంటుంది. ఫిడేలు మనది కాదు కదా! అది మన దేశంలో స్థిరపడింది. అలాగే డోలు మరొక విధంగా మారవచ్చు" - అన్నారు.

"మరి మీరిక్కడ స్థిరపడ్డారు గదా! మీ వలస ఉద్దేశం నెరవేరిందా?" - అని ప్రశ్నించాను.

నొసట కుంకుమ బొట్టుతో, బంగారు రంగుతో, నాదస్వరోపాసన దివ్య తేజస్సుతో వెలిగిపోతున్న ఆయన దౌహిత్రుడు శ్రీ కాశిం అందుకొని జవాబు చెప్పారు: "నిస్సందేహంగా నెరవేరింది. ఇక్కడ ఎంతో ఆదరణా, ప్రోత్సాహం కలిగాయి. తమిళనాడు ప్రభుత్వం 1976లో 'కలైమామణి' అనే బిరుదంతో తాతగారిని సత్కరించింది. 1977లో పద్మశ్రీ బిరుదం వచ్చింది. ఆ సంవత్స రమే కేంద్ర సంగీత నాటక అకాడమీ అవార్డు వచ్చింది. తర్వాత తెలుగువారు

ప్రారంభించారు బిరుదులివ్వడం. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ 1980లో 'గానకళాప్రపూర్ణ' బిరుదు, 1981లో రాజమండ్రి రసికులు 'గాంధర్వ కలానిధి' బిరుదు, 1984లో మచిలీపట్నం సరస్వతీ కళా సమితివారు' నాదస్వర కలానిధి' బిరుదు, ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు 1985లో గౌరవ డాక్టరేట్ పట్టమూ ఇచ్చారు. 1984లో తిరుపతి త్యాగరాజోత్సవ సంఘం 'సప్తగిరి విద్యన్మణి' బిరుదంతో గౌరవించింది. 1987లో తెలుగు విశ్వ విద్యాలయం సత్కరించింది. 1988లో విజయవాడ త్యాగరాజ సంగీత కలాసమితి 'సంగీత విద్యన్మణి' బిరుదు ఇచ్చింది. తమిళనాడు ప్రభుత్వం రాష్ట్ర సంగీత విద్వాంసుడుగా నియమించింది. మా తాతగారు తంజావూరులోని రాజాస్ గవర్నమెంట్ మ్యూజిక్ కాలేజీలో గౌరవాచార్యులు, భారతి దాసన్ విశ్వవిద్యాలయంలో బోర్డ్ ఆఫ్ స్టడీస్ సభ్యులు, కేంద్ర ప్రభుత్వం సాంస్కృతిక శాఖ సీనియర్ ఫెలో, తమిళనాడు రాష్ట్ర సంగీత నాటక అకాడమీ సభ్యులు. నాదస్వరంలో గౌరవ డాక్టరేట్ పొందిన మొదటివారు వీరే. సోవియట్ యూనియన్, అమెరికా, హాంగ్‌కాంగ్ మున్నగు దేశాలలోను నాదస్వరంతో సహృదయులను మెప్పించారు. దేశంలోని ప్రతి రాష్ట్ర రాజధానీ గౌరవించింది."

"ఇన్ని సన్మానాలు పొందారు గదా! ఏది మీకు ఎక్కువ సంతోషం కలిగించింది?" - అని ప్రశ్నించాను.

"నన్ను దేశ విదేశ సహృదయులందరూ ఆదరించారు. మాజీ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ఆదరించారు. కంచి కామకోటి పీఠం శంకరాచార్యులవారు, శృంగేరీ పీఠం శంకరాచార్యులవారూ పండిత శాలువలతో ఆశీర్వదించారు. త్యాగరాజుల వారన్నట్టు 'ఇంత సౌఖ్యమని నే చెప్పజాల.' ఏ సన్మానమైనా సంతోషం కలిగిస్తుంది. అంతా రామచంద్రునికే అర్పణం -" అన్నారు మౌలా.

"మీరు శ్రీరామభక్తులుగదా! రామజన్మభూమి విషయంలో ఏమంటారు? -" అని ప్రశ్నించారు.

"హిందువులూ, ముస్లిములూ ఇక్కడ ఒకరి సరసన మరొకరు నివసించ వలసినవారు. బలవంతపు బ్రాహ్మణార్థమని అంటారే, అలాగ నిర్బంధపు నిర్ణయాలేవీ మంచివి కావు. ప్రేమ, సామరస్యాలతో ప్రజలు పరిష్కరించుకోవాలని నా వినయపూర్వక సూచన -" అన్నారు మౌలా. తమకు తోడ్పడిన, తోడ్పడుతున్న శ్రీ వడాల రామారావు, శ్రీ ఈమని రాఘవయ్య మొదలయిన వారిని కృతజ్ఞతతో స్మరించారు మౌలా.

ఒక మహా విద్వాంసుని, ఒక సత్పురుషుని, ఒక సర్వసమ మానవతావాదిని, ఒక తత్త్వవేత్తను దర్శించాననే తృప్తితో సెలవు తీసుకున్నాను షేక్ చిన మౌలాగారి వద్ద.

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక – 20-3-1991)

# మానవతామూర్తి శ్రీ మండలి

సరిగా ఇరవైయేడు నెలల మాట. తలచుకుంటేనే ఒళ్ళు జలదరిస్తుంది. ఆనాడు శనివారం 1977 నవంబరు 19. సూర్యుడు అనుదినమూ ఉదయించినట్లే ఆ దినమూ ఉదయించాడు. ప్రజలు నిత్యకృత్యాలు యథావిధిగనే సాగించారు. కాని ఒకటే భేదం. తుఫాను సూచనలున్నాయి సుమా! జాగరూకతతో మెలగాలి సుమా! - అని వాతావరణ వేత్తలు హెచ్చరికలు చేశారు. సరే, ఎప్పుడూ ఉన్న వే ఈ తుఫానులు, ఎన్నో వచ్చాయి, నిలువదొక్కుకున్నాము. ఇది కొంచెం తీవ్రమైనదేమో! ధైర్యంతో నిలబడదాము. అంతకన్నా ఏం చేయగలం? - అనుకున్నారు దివిసీమ వాసులు. పాపం! వాళ్ళకేమి తెలుసు వంద సంవత్సరాల క్రితం మచిలీపట్టణాన్ని ముంచెత్తి, వేలకొలది ప్రజలను పొట్టన పెట్టుకొన్న ఉప్పెనకన్నా పెద్ద జలప్రళయం తమపై వికటాట్టహాసంతో విరుచుకొని పడుతుందని, తమను నామరూపాలు లేకుండా చేస్తుందనీని? కొన్ని గంటలలో అంతా సమాప్తమయింది. సముద్రుడు ఎందుకు ఆగ్రహించాడో, అమాయిక ప్రజలను అకారణంగా ఎందుకు దండించాడో తెలియదు.

కానీ, ఇలాటి క్లిష్ట సమయాలలోనే నిత్యసత్యాలు పునర్నిరూపితం అవుతాయి. అగ్గిలో పడితేగాని అపరంజి ఏదో తెలియదు కదా! మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం నచ సుఖం-అన్న భర్తృహరి సూక్తి మరొకమారు దేశమంతటా మారుమ్రోగింది. ఆ సూక్తికి మానవతా రూపమే శ్రీ మండలి వెంకట కృష్ణారావు.

శ్రీ మండలి తుఫాను సంభవించిననాడు కాకతాళీయంగా అవనిగడ్డలో ఉన్నారు. అప్పుడాయన చేసిన సేవ సువర్ణాక్షరాలతో లిఖించదగింది. ఆయనలోని మానవత్వం వేయి మత్తగజాల బలంతో ఉప్పెనకన్నా ఉవ్వెత్తున లేచింది. గంటకు రెండువందల కిలోమీటర్ల వేగంతో వీచే పెనుగాలులలోను ఆయన "హిందీ విద్యాలయంలోని పిల్లలేమయ్యారో! సేవాశ్రమం, అనాథ శరణాలయం పరిస్థితి యేమిటో!" - అని విలపిస్తూ పరుగెత్తారు, వారిని దక్కించుకొందామని. తెల్లవారింది. ఉప్పెనరాక్షసి ఎందరినో ప్రజలను, ఎన్నో పశువులను ఉన్నపళంగా మింగిందని వార్తలు వ్యాపించాయి, ఒంటిమీద గుడ్డలున్నాయా, లేవా అన్నది

కూడ పట్టించుకోకుండా బయలుదేరారు, పాదచారియై. కూలిపోయిన ఇండ్ల మధ్యన నడిచారు. పీనుగుల పెంట మధ్యన నడిచారు. చచ్చిపడిన పశువుల మధ్యన నడిచారు. రాయి రప్ప, ముళ్ళు వేళ్ళు లెక్క చేయకుండా నడిచారు. తమ ఆరోగ్యం బాగలేకపోయినా నడిచారు. జల ప్రళయంలో మరుగయిపోయినవారు పోగా, మిగిలిన వారి మనసులలో బలం నింపడానికి నడిచారు. ప్రజల హృదయాలలోనే నడిచారంటే సరిపోతుంది ఒక్కమాటలో.

అంతటితో ఆగలేదు ఆయన. కని విని యెరుగని ఈ ఘోరకలి ప్రభుత్వానికి తెలియాలి. ప్రభుత్వం సహాయ కార్యక్రమం వెంటనే ప్రారంభించాలి త్వరగా చేరడానికి తగిన వాహనం లేదు.

అతి కష్టంమీద వారు విజయవాడకు వెళ్ళారు హుటాహుటిగా. ప్రభుత్వ యంత్రాంగాన్ని కదిలించారు. కాలిలో దాదాపు 36 ముళ్ళు గుచ్చుకొన్నాయి. ఐనా, లక్ష్యపెట్టలేదు. కాలికి కట్టు కట్టించుకొన్నారు. నడక ప్రారంభించారు; విరామమెరుగని నడక. పల్లె పల్లెకు తిరిగారు. పరిస్థితి చూచారు, పరితపించారు, పరితాపం పోగొట్టారు, చొరరాని ప్రాంతాలను హెలికాప్టరు ద్వారా పరిశీలించారు.

ఈ సమాశ్వాసన యాత్రలో, ఈ సహాయ సేవా యాత్రలో ఆయన చూడని పల్లె లేదు. ఆయన మాట్లాడని మనిషిలేడు. ఆయన ఎన్నికల ప్రచారోద్యమంలో ఎన్నో మార్లు గ్రామాలు తిరిగారు. ఆ పర్యటనల పద్ధతి వేరు, ఉద్దేశం వేరు. ఈ యాత్ర అట్టిది కాదు: విషాదయాత్ర, పరామర్శ యాత్ర, పునరుజ్జీవన యాత్ర. ఇలా తుఫానుకు గురి అయిన ప్రాంతాన్నంతా కాలికి బలపం కట్టుకుని తిరిగారన్న సామెతగా పలుమారు తిరిగారు. ప్రజలలో విశ్వాసాన్ని నింపారు. విషాదయోగం వలదన్నారు. ఇప్పుడు కావలసింది పునరుజ్జీవన పునర్నిర్మాణాలని ఉత్సాహపరిచారు. తత్‌క్షణమే చేయదగిన సాహాయ్యం, సహకారం చేశారు; చేయించారు.

అవనిగడ్డలో తుఫాను బాధితుల శిబిరమైంది ఆయన మకాం. వేలకొలది తుఫాను బాధితులు అహమహమికతో ఆత్రంగా, ఆశతో తీసుకొని వచ్చారు శిబిరానికి. తుఫాను బాధితులకు సహాయపడుదామని వచ్చే ప్రతివారికీ ఆ శిబిరమొక పర్యాటక కేంద్రమయింది, యాత్రాస్థలమైంది. శ్రీ మండలి నిర్విరామ కృషివల్ల వందలకొలది స్వచ్ఛంద సేవా సంస్థలు ఉరుకులు పరుగులతో వచ్చాయి. ఆహారం, వస్త్రాలు అపారంగా అందజేశాయి. ఆయన చిత్తశుద్ధిని, అక్కడి హృదయ విదారక పరిస్థితిని చూచిన వందలకొలది సేవా సంఘాలు చురుకుగా పని ప్రారంభించాయి. ఎటు చూచినా కనిపిస్తూ, ఎవరిని చూచినా

పలకరిస్తూ, ఏమి కోరినా అందజేస్తూ పరమాణువులోని పరమ సూక్ష్మాంశంలాగ తిరుగుతున్న శ్రీ మండలి - సేవోత్సాహాలు మూర్తీభవించిన శ్రీ మండలి ఆ సేవా సంఘాలకు రెట్టింపు, మూడు రెట్లు ఉత్సాహావేశాలు పోశారు. ఎక్కడ చూచినా, ఇందుగలడందు లేడనే సూక్తిలాగ ఆయనే కనిపిస్తూ సేవచేశారు. ఆయన వ్యక్తిత్వం అలాటిది. కనుకనే రాష్ట్రపతి మొదలు నడివీథిలోని మనిషి వరకు, దేశంలోని సంఘ సేవాసంస్థలు మొదలు అంతర్జాతీయ సంస్థల వరకు, స్థానిక పత్రికలు మొదలు అంతర్జాతీయ పత్రికల వరకు ఆయన సేవానిరతి ప్రశంసలే. 1877 నవంబరు 19 నుంచి నేటివరకు ఆయన నిరంతరం పని చేస్తూనే ఉన్నారు. తుఫాను బాధితులను ఒక కంట కనిపెడుతూ, వారి బాగోగులను చూస్తూనే ఉన్నారు.

ఆ సేవాతత్పరత, చిత్తశుద్ధి, శ్రీ మండలి అంతర్జాతీయ ఖ్యాతిని పెంపొందించాయి. 1977 సంవత్సరపు మానవతామూర్తిగా ఆయన కీర్తితు లయ్యారు. మతప్రచారకులు, సర్వోదయ కార్యకర్తలు, సంఘ సేవా పరాయణులు - ఇంతెందుకు, తుఫాను బీభత్సం తెలిసిన ప్రతి వ్యక్తి మత, వర్గ, కుల, రాజకీయ సిద్ధాంతాల భేదం లేకుండా ఆయనను ప్రశంసించారు. ఆయన బద్ధ శత్రువులు గూడ ఆయనను కొనియాడక తప్పలేదు. మాసిన గడ్డంతో, బెదురు చూపులతో, మూర్తీభవించిన విషాదంలాగ ఉన్న ఆయన బొమ్మను దేశవిదేశాలలో దూరదర్శినిలో చూచిన వారికి ఉప్పెనవల్ల ఉప్పతిల్లిన ఘోర నష్టం నిజంగా ఎంతో ఆయన మాటలవల్ల, వివరణలవల్ల తెలిసింది. క్షణంలో ఎంతటి మానవ సమూహం మడిసిందో తెలిసింది. ఉపకార చింతగల వారికి, సంఘ సేవా సంస్థలకు సహాయబుద్ధి సహజంగానే కలిగింది. దేశ విదేశాలలోని సంస్థలు ఆయనకు బాసటగా నిలిచాయి. నేడు దివిసీమలో పెక్కు సంస్థలవారు, వ్యక్తులు నిరాశ్రయులైన ప్రజలకు ఆశ్రయాలు కల్పించారంటే, తక్కిన సహాయ కార్యక్రమాలు జరిపి సేవ చేయగలిగాయంటే ఇదంతా శ్రీ మండలి కృషి ఫలితమేనని, ఇతరుల సానుభూతి సాహాయ్యాలను పొందటానికి ఆయన పడిన పాట్లేనని ప్రతివారు గ్రహించగలరు. దివిసీమకు వెళ్ళిన ప్రతి వారు, దేశీయులైనా, విదేశీయులైనా ఆయనను చూచి, ఆయన ద్వారా తమ సేవలు వెల్లడించుకోవాలని ఉవ్విళ్లూరారు. అలా అయితే, తమ సాహాయ్యం సక్రమంగా, సరిగా, సకాలానికి ఆర్తులకు అందగలదని వారు విశ్వసించారు. ఆ విశ్వాసం నెలకొల్పుకున్నారు శ్రీ మండలి.

పూర్వం కాటయవేముడు ఆది వరాహమూర్తివలె దివిసీమను ఉద్ధరించి

నట్లు చరిత్ర చెబుతున్నది. ఈనాడు శ్రీ మండలి తుఫాను సమయంలో మేరునగ ధీరుడుగా నిలిచి ప్రజలను ఆదుకున్నారు. సేవాశ్రమంలో తుఫానుగాలికి కొట్టుకొని పోతున్న పిల్లలను రక్షించారు. బాధితులకు సహాయ కార్యక్రమాలు నిర్వహించారు. గ్రామాలలో పక్కా ఇండ్లు నిర్మించే పథకం అమలుపరచడంతో అలసట యెరుగక పాటుపడ్డారు. ఆయన ఉత్సాహ ప్రోత్సాహాలు స్వచ్ఛంద సేవా సంస్థలు దివిసీమలో కృషి చేయడానికి, విజయవంతంగా పనిని నిర్వహించడానికి పాథేయాలయ్యాయి.

శ్రీ మండలి ధైర్య సాహసాలు పెనవేసుకొన్న రాజనీతిజ్ఞుడు. సోషలిజానికి అంకితులైన సిద్ధాంతవాది. ఉపజ్ఞగల వ్యవస్థాపకుడు. విశ్రాంతి యెట్టిదో తెలియని కార్యకర్త. ఒక్క మాటలో ప్రజల మనిషి, మానవతా మూర్తి. నిరాడంబరత, సర్వ సులభత ఆయనను గాంధీ మార్గంవల్ల అబ్బిన గుణాలు. బీదబిక్కి, శత్రువు మిత్రుడు ఆయనకు ఎప్పుడుబడితే అప్పుడు, ఎక్కడబడితే అక్కడ చూడవచ్చు, చెప్పవచ్చు, వినవచ్చు, తగిన మేలు పొందవచ్చు. నిజజీవితం విషయంలోను, సంఘ, ప్రభుత్వ విషయాలలోను ఆయన పూర్తిగా గాంధీతత్త్వవాది. మనసా వాచా కర్మణా గాంధీతత్త్వవాది.

గాంధీజీ ప్రబోధాలు పత్రికలలో పఠించి బెజవాడలోను, బొంబాయిలోను గాంధీని దర్శించి ఉత్తేజితులై కార్యరంగంలో దూకారు. విధానసభ సభ్యులుగా, లోక్‌సభ సభ్యులుగా, మంత్రిగా చిరస్మరణీయ సేవ చేశారు. విద్యా మంత్రిగా ఉన్నప్పుడు చేసిన సేవ ఆయనకు చిరకీర్తి సంపాదించింది. ప్రపంచ తెలుగు మహాసభను అత్యద్భుతంగా నిర్వహించారు. కార్యనిర్వాహకాధ్యక్షులుగా రాత్రింబవళ్ళు పనిచేసి తెలుగుజాతి చరిత్రలో అదొక మహత్తర సంఘటనగా ముద్రవేశారు. మాటలకన్న చేతలకే ప్రాధాన్యమిచ్చే గాంధీ సిద్ధాంత విశ్వాసి గనుక, గాంధీజీ శతజయంతి నాడు అవనిగడ్డలో గాంధీక్షేత్ర నిర్మాణం ప్రారంభించి దానిని మహాసంస్థగా రూపొందించారు. ఉప్పెనలో సర్వస్వమూ కోల్పోయిన 400 మంది పిల్లలకు గాంధీక్షేత్రంలోని సేవాశ్రమంలో ఆశ్రయం కల్పించారు. వారికి ఉపాధికల్పనకై కుట్టుమిషన్ సెంటర్, బట్టల కట్టింగు ట్రయినింగు; స్త్రీ సంక్షిప్త విద్యాకేంద్రము, ఆశ్రమ పాఠశాల, గాంధీ గురుకులం, హిందీ ప్రచార విద్యాలయము, మహా విద్యాలయము మున్నగు అనేక సంస్థలు నెలకొల్పారు. 80 వయోజన పాఠశాలలు స్థాపించారు. సర్వోదయ కార్యకర్తల, సంఘ సేవకుల సభలు జరిపారు. దక్షిణ భారత నిర్మాణ కార్యకర్తల మహాసభలు నిర్వహించి గాంధీక్షేత్ర విశిష్టతను భారతదేశ వ్యాప్తం

చేశారు. ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థల సంఘ సేవకుల మహాసభలు జరిపి రాష్ట్రస్థాయి సంస్థను స్థాపించి స్వచ్ఛంద సేవలో సమన్వయ కృషికి తోడ్పడ్డాడు. ప్రపంచ హిందీ మహాసభ సందర్భంగా భారత ప్రతినిధిగా మారిషస్‌కు వెళ్ళి అక్కడి ప్రధాని శ్రీ రాం గులాంను కలుసుకొని, మారిషస్ తెలుగువారికి ఆంధ్రప్రదేశ్‌కు సదవగాహన కల్పించారు. రాష్ట్ర సమైక్యానికి పెట్టనికోటగా నిలబడ్డారు.

దేశ పురోభివృద్ధి స్వచ్ఛంద సేవకుల మీదనే ఆధారపడి ఉందని శ్రీ మండలి విశ్వాసం. ఆ విశ్వాసానికి కార్యరూపం ఇస్తున్న ఆదర్శ సేవకుడైన శ్రీ మండలిని ఉత్తమ సంఘ సేవకునిగా నిర్ణయించి ప్రభాకర్‌జీ మెమోరియల్ అవార్డుతో సన్మానిస్తున్నందుకు ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థల, సమాజ సేవకుల సంఘాన్ని ప్రశంసిస్తున్నాను. శ్రీ మండలి వెంకటకృష్ణారావును హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

(గాంధీక్షేత్రం – 1980 ఫిబ్రవరి)

# అసత్యంతో సత్యం దర్శించిన అపూర్వ యోగి: డాక్టర్ చంద్రశేఖరం

డాక్టర్ చంద్రశేఖరంగారు నెల్లూరులో 1904 లో జన్మించారు. చిన్న నాటి నుంచే రంగస్థల నటులయ్యారు. బహురూప ధారులుగా, ఆహార్య నిపుణులుగా, మహా నటులుగా, నాటక కర్తలుగా, నాటక ప్రయోక్తలుగా విశ్వ విఖ్యాతులయ్యారు. భారత ప్రభుత్వ సాంస్కృతిక బృంద సభ్యులుగా విదేశాల లోను పర్యటించి, పలువురు ప్రపంచప్రముఖుల ఆహార్యం నిమిషాలలో ధరిస్తూ, మారుస్తూ ప్రేక్షకులను ముగ్ధులను చేశారు, చేస్తున్నారు. రంగస్థల, నటన. ఆహార్యాదులపై తెలుగు, ఇంగ్లీషులలో పెక్కు గ్రంథాలు రచించారు, రచిస్తు న్నారు. శతమానం సమీపిస్తున్నా నిత్యోత్సాహం పొంగులువారే బాలాకుమారులు సత్యస్వరూపుడైన భగవంతుని చేరడానికి అసత్యమైన నటనయోగం భక్తియోగం కన్నా మిన్న అని వీరి సిద్ధాంతం.

"ఒకానొక దినం నేను నిర్లక్ష్యంగా అగాధ బాధా సముద్రంలో పడ్డాను. వణుకుతున్న నా వేళ్ళకు మెరుస్తున్న ఒక వజ్రం తగిలింది.

"అది నిశావేదిక మీద నక్షత్రంలాగ మినుకు మినుకు మన్నది.

"నేను దానిని బజారుకు తీసుకువెళ్ళి ఒక షరాబుకు చూపాను. అతడు దానిని పరిశీలించి ఆలోచనా ముద్రతో 'అయ్యా! ఇది సాధారణమైన వజ్రం కాదు. ఇలాటిది నాకు తెలీదు; దీని విలువ కూడా నాకు తెలీదు' అన్నాడు.

"బజారు నుంచి నేను నెమ్మదిగా ఇంటికి తిరిగి వచ్చాను. దారిలో ఆ పల్లెటూరి కవి కనిపించాడు. ఆయనను ఆపి ఆ వజ్రం చూపించాను.

"కవి దానిని చూచాడు ఒక క్షణం. అరిచాడు 'ఓహ్! ఎంత అదృష్ట వంతులండి మీరు?' అని.

"ఆయన మనసులోని ఉత్కంఠతో అడిగాను 'కవిగారూ, ఇదేమిటో మీకు తెలుసా?' అని.

"ఆయన గొంతులో ఆశ్చర్యం వినిపించింది. 'ఇది ఒక హాస్య చతురుని కంటినుంచి ఒలికిన కన్నీటి చుక్క' అన్నాడు ఆయన,

"'దాని విలువ మీకు తెలుసా?' అన్నాను.

"ఆయన తల పంకిస్తూ అన్నాడు: 'ఇది అన్ని స్తోత్రాల విలువకూ అతీతమైంది. దీని విలువను ఇంతవరకూ ఎవరూ ఎరుగరు.'

"ఆనాటినుంచి నేను ఈ అమూల్యమైన బాష్ప బిందువనే వజ్రాన్ని నా జీవిత సంపుటంలో ఎంతో మెలకువతో భద్రపరచుకొని తిరుగుతున్నాను.

"నా హృదయంలో అలాటి అదృష్టాన్ని దాచుకొన్నాను!"

ఇది డాక్టర్ వైద్యుల చంద్రశేఖరం రచించిన 'ఫర్ ది డి లైట్ ఆఫ్ ది ఎలైట్' అనే పుస్తకంలోని 'ఎ రేర్ ట్రెజర్' అనే ఖండికకు స్వేచ్ఛానువాదం. (పుట-69.) దీనినిబట్టి ఆయన హృదయం ఎంత రసప్లావితమో, ఆవేదన ఎంత గహనానుభూతి భావితమో తెలుస్తుంది. ఇది ఆత్మసాక్షాత్కారానికి తొలి మెట్టు.

ఆత్మసాక్షాత్కారానికి మన పూర్వులు ఎన్నో మార్గాలు సూచించారు. ఈ కాలంలో సులభతర మార్గం భక్తియోగం. త్యాగరాజాదులు గానంతో భగవత్సాక్షాత్కారం పొందడానికి ప్రయత్నించారు. స్వధర్మాన్ని విడనాడకుండా బ్రహ్మసాయుజ్యం పొందవచ్చుననడానికి మనకు ధర్మవ్యాధుని దృష్టాంతం ఉండనే ఉంది. "స్వధర్మే నిధనం శ్రేయః" అని ఘంటా ఘోషంగా చెప్పాడు కృష్ణ భగవానుడు. డాక్టర్ చంద్రశేఖరం స్వధర్మం నటన. దానిద్వారా ఆత్మ సాక్షాత్కారం చేసుకున్నారు. ఇది భక్తికన్నా సులభతమ మార్గం.

వేదాంతులు ఇది కాదు, ఇది కాదు - నేతి, నేతి - అంటూ సృష్టిలోనివన్నీ భగవంతుడు కాదని కాదని నిరాకరించి, సృష్టికి మూలమైన దానిని కనుగొన డానికి ప్రయత్నించారు, ఫలవంతులయ్యారు. డాక్టర్ చంద్రశేఖరం ఇది కాదు, ఇదికాదు అని అనరు. ఇది లేదు, ఇది హుళక్కి - అంటారు. అందే నటన హుళక్కి, నిజం కానిది, అసత్యం. దాని ద్వారా సత్యాన్ని సాక్షాత్కరించుకొన డానికి అహరహం సాధన చేస్తున్నారు. "నటన సత్యాన్ని వెలువరించే అసత్యం. నేను సత్యం తెలుసుకొన్నంత మాత్రాన సంతృప్తిపడను. ప్రపంచ ప్రవృత్తి కోసం, ఈ జీవిత నాటకంలో నటించడం కోసం అసంఖ్యాక అనృతాలలో కూరుకుపోయిన నేను నేనే ఆ ఋతమని ఆ సత్యమని అనుభూతి పొందదలచి నాను". అంటారు చంద్రశేఖరంగారు. (ప్లే యాక్టింగ్ అండ్ సెల్ఫ్ రియలై జేషన్ పు-14) ఈ భావన ఆధారంగా రూపొందినదే ఆయన నాటకోపనిషత్తు అనే వినోద వ్యంగ్య వేదాంత ఏకపాత్ర నాటకం. దీనిని రచించడానికి కారణం ఏమిటో, ఆయన దాని ముందుమాటలో ఇలా చెప్పారు: (ఈ నాటిక దాదాపు పదిహేడు సంవత్సరాల క్రితం రచించినట్టిది.)

"25 సంవత్సరాలకు ముందు ఒకరోజు నెల్లూరు బజారులో ఒక విచిత్ర వ్యక్తిని చూచాను. అతడు పిచ్చివానివలె (కొద్దిగా) గంతులువేస్తూ, ఏవో పదాలు పాడుతూ, వుండినాడు. వాటిలో సాంఘిక మతాచారాల వ్యవహారాల మీద, మూఢవిశ్వాసాలమీద కొన్ని విసుర్లు విసురుతూ వుండినాడు. అప్పుడప్పుడు మనం అసహ్యం అనుకొనే భాషకూడ అడపా దడపా కొద్దిగా ప్రయోగించేవాడు కూడ. అతని చుట్టూ మూగిన జనం కొంతమంది అతని చేష్టలను చూచి, అతని మాటలు విని, నవ్వుతూ వుండినారు. కొంతమంది అతనిని గేలిచేస్తూ వుండినారు. అయినా అతడు చలించలేదు. కాని, అతను మధ్యమధ్య కొన్ని ఆధ్యాత్మిక సత్యాలు కూడా వదులుతూ వుండినాడు. నేను అతనిని చూస్తూ, అతని మాటలు వింటూ, కొంత సేపు అలాగే నిలబడిపోయినాను. అతను ఈ అసత్య ప్రపంచ జీవితానికి అతీతుడైన ఒక గొప్ప యోగి అని నాకు తోచింది. అతని దగ్గరికి వెళ్ళి 'దయచేసి ఇలా కొంచెం వస్తారా?' అన్నాను. 'చిత్తం ప్రభూ' అంటూ నా వెంబడి వచ్చాడు. దగ్గరలోవున్న ఒక కాఫీ హోటల్లోకి పిలుచుకువెళ్ళి 'టిఫెన్, కాఫీ తీసుకోండి' అన్నాను. తీసుకొన్నాడు. ఆ అయిదు నిమిషాలు చాల నెమ్మదిగాను, ఒక అమాయిక బాలుని మోస్తరుగాను వుండినాడు. 'మీరెవ్వరు?' అని నేనడగలేదు. అతనే నన్ను ప్రశ్నించాడు 'మీ పేరేమండీ? మీరేమి చేస్తారు?' అని. 'నా పేరు చంద్రశేఖరం. రంగస్థల నటన నా పని' అన్నాను. అంతే. ఇద్దరం బయటికి వచ్చి ఎవరితోవన వాళ్ళం వెళ్ళిపోయినాము.

"తర్వాత వారం రోజులకు గూడూరు స్టేషను బయటి అంగళ్ళవద్ద అతనే ఆ ముందు మోస్తరే ఆటలు మాటలూ ఆడుతూ వుండినాడు. నన్ను చూచి వెంటనే 'ప్రభూ, చంద్రశేఖరంగారూ' అంటూ నడివీథిలో సాష్టాంగంగా నాముందు పడి లేస్తూ, రహస్యంగా నా చెవిలో 'మీ గురువుగారు ఎవరండీ?' అని అడిగినాడు.

"వెంటనే ప్రతాపరుద్రీయ నాటకంలోని యుగంధరుని పిచ్చివాని పాత్ర జ్ఞాపకం వచ్చింది. ఈ సంఘటన యీ పిచ్చి నాటకం వ్రాయడానికి నన్ను పురికొల్పింది .. ....

"నటుడు సచ్చిదానంద స్వరూపుడు. అతనికి మనస్సులేదు. అతడు మహా యోగి. ఏమైనా అవుతాడు; ఏమైనా మాట్లాడుతాడు. వాటితో తనకు నిమిత్తం లేదు. ఆరోజు నాకు దర్శనమిచ్చిన అతను ఈ జాతిలో చేరినవాడేనని నాపూర్తి నమ్మకం. ప్రపంచమే అతని రంగస్థలం. పరిసరాలే స్టేజి సెట్టింగ్స్. సూర్య చంద్రుల కాంతే లైటింగు. ప్రజలే ప్రేక్షకులు."

కొందరు సత్యం వెంటపడతారు. అది వారికి చిక్కదు. కొందరు అసత్య మార్గం తొక్కుతారు; సఫలులవుతారు. ఇలాటి వారే నటులు; కళాకారులు. అలాటి వారిలో ఒకరు చంద్రశేఖరంగారు. ఆయనకు నాటకరంగం దేవాలయం; మహాపుణ్యస్థలం. ఇది; భూమికి దిగివచ్చిన స్వర్గం. కనుక ఇక్కడ ఏమైనా చేయవచ్చు నటుడు. ఏమి చేసినా ప్రజలు ఆనందిస్తారు. ఆయనే అన్నట్టు "రంగ స్థలంలో నవ్వవచ్చు. ఎన్ని రకాలుగా అయినా నవ్వవచ్చు, ఏడవవచ్చు. ఏడవడం కూడ ఒక కళే.........ఇక్కడ ఒకరిని దూషించవచ్చు. స్త్రీని ప్రేమించ వచ్చు. ఎవరి పెళ్ళాన్నయినా లవ్ చేయవచ్చు. బయట ప్రేమిస్తే వాళ్ళదేమో పోయినట్టు తిడతారు, కొడతారు. ఇక్కడ ప్రేమిస్తే ఆనందిస్తారు."

డాక్టర్ చంద్రశేఖరం ఈ నాటకోపనిషత్తులో జీవిత నాటకం ఎంత అసత్యమైందో వ్యంగ్యంగా ఒక విసురు విసిరారు. "కావ్యేషు నాటకం రమ్యం అన్నారు. అయితే అన్నవారెవరో నాకు తెలీదు. అయితే నా అనుభవం వల్ల నేను యింకా ఏమి చెప్తానంటే :

"కావ్యేషు నాటకం రమ్యం
నాటకేషు జీవితం రమ్యం
జీవితేషు రాజకీయం రమ్యం
రాజకీయేషు పదవీ రమ్యం
పదవీషు మంత్రా్యా రమ్యం
మంత్రిషు కలహం రమ్యం
కలహేషు దేశ నాశనం రమ్యం."

అని నేటి పరిస్థితిని వ్యంగ్యంగాను, వాచ్యంగాను విమర్శించారు అసత్యంతో.

"నాటకం భజ - నాటకం భజ
భజ నాటకం - జ్ఞానమతే"

అని శంకరాచార్యుల శైలిలో ఉపదేశించారు. జగత్తు మిథ్య అని, బ్రహ్మసత్య మని వేదాంతులు కనిపిస్తున్న దానిని మిథ్య అని చెప్పి, తద్జ్ఞానంతో బ్రహ్మ సత్యమనే జ్ఞానాన్ని సంపాదించగా, కేవలం నటన అనే మిథ్యతో మిథ్య కాని దాన్ని దర్శించడానికి నడుం కట్టారు చంద్రశేఖరం.

"మానవునిలో మనుగడ సాగిస్తున్న భగవంతుని విభూతి అయిన కళ ఆనందం, సౌందర్యం, జ్ఞానం, శక్తి. అది మావవజాతి శాంతికి, సంతోషానికి వినియోగపడేది. మానవ నిర్మితాలైన మతాలకన్నా ఉత్తమమైనది భగవంతుని మతమైన కళ. ప్రాపంచిక మతాలు మనుషులను విడదీస్తాయి; కాని భగవత్సృష్టి

అయిన కళ మనుష్యులను కలిపేది. భగవంతుని సామ్రాజ్యంలో అందరినీ సమానులను చేసేది కళ" అని అంటారు డాక్టర్ చంద్రశేఖరం. కనుకనే ఏదో జీవనోపాధికేకాక ఆత్మప్రత్యక్షీకరణకూ సాధనమంటారు.

ఏడు రెండ్ల సంవత్సరాల క్రితం కృష్ణార్జున సంవాదమై, మన వేదాంత ప్రస్థానత్రయంలో ఒకటయిన భగవద్గీత పద్ధతిలో చంద్రశేఖరం ఆంగ్లంలో నాటక భగవద్గీత అనే గ్రంథం రచించారు. దానిలో ఆయన నటనాధారమైన ఆధ్యాత్మిక భావాలు మరింత విపులంగాను, స్పష్టంగాను ఉన్నాయి. దాని చివరి కొంత భాగానికి స్వేచ్ఛానువాదం ఇక్కడ పొందుపరచడం నా కర్తవ్యం. కృష్ణుడు అర్జున స్థానంలోని చంద్రశేఖరానికి కళలోని ఆధ్యాత్మిక మూల్యాలను, సంఘానికి కళాకారుల సేవను వివరించి, ప్రజల హితంకోసం, స్వహితం కోసం నటన అనే - కర్తవ్యాన్ని స్వధర్మాన్ని కొనసాగించమంటాడు.

"కృష్ణ ఉవాచ:- ఇప్పుడు నటులను గురించి విను, చంద్రశేఖరమ్. ప్రతి నటుడూ ఒక యోగి, అని నేనంటున్నాను. అతడు ఏ విధంగానయినా జీవిస్తాడు - ప్రపంచం దానిని మంచిదనవచ్చు, చెడ్డదనవచ్చు. నీతి అనవచ్చు, అవినీతి అనవచ్చు. పై స్థాయిది కావచ్చు, తక్కువ స్థాయిది కావచ్చు. గౌరవ పాత్రమయినది కావచ్చు, నీచమయినది కావచ్చు. ఇది నిజమైనవి కావని, నిజంగా అసత్యమైనవని, వాటి విలువ కేవలం జీవిత నాటకంలోనేకాని, జీవితంలో కాదని, అతనికి తెలుసు. అతడు వీటికతీతుడు.

"తనలోని అసత్యాన్ని తెలుసుకోగలుగుతాడు. ఆ అసత్యాన్ని వేరు చేస్తాడు. మరొక అసత్యాన్ని ముందుకు పెడతాడు. అది నిజంకాదని తెలుసు గనుక, దానికి నిజానికి ఇచ్చినంత విలువ బాహ్య ప్రపంచంలో ఇస్తాడు. కర్మతో ప్రభావితుడు కాడు. అంతేకాక ఇతరులతో తను మరొక వ్యక్తి అని, విభిన్న జీవితం గడుపుతున్నానని భ్రాంతి కలిగిస్తాడు. అంటే, తత్కాలానికి వారి మనస్సులు మరుగయ్యాయన్న మాట. వివిధ పాత్రలు ధరించే నటులుగానో, రంగస్థలం మీద వివిధ పాత్రలను చూచే ప్రేక్షకులుగానో తరచు నాటకాలలో పాల్గొనడం వారి మనస్సును తొక్కివేస్తుంది. తన మనస్సును చంపుకొని, ఇతరుల మనస్సులను కూడ చంపివేసి, తాత్కాలికంగా వారి చింతలను దూరం చేసి సంతోషం కలిగించేవాడు నటుడొక్కడే. మనస్సును చంపివేయడమంటే చిత్తప్రవృత్తిని పూర్తిగా ఆపివేయడం కాదని తెలుసుకో. తనకే కొత్తదిగా వుండే మనఃప్రవృత్తిని పరిశీలించి, దాని ప్రభావానికి గురికాకుండ, తనలో ఆనగా మనోవాక్కాయ కర్మలా స్థిరంగా వుండడం సచ్చిదానందం.

"ఇప్పుడు నీవు నన్ను నా నిజమైన స్వరూపంలో చూస్తావు. నేను నీకు

నన్ను నీవు విభిన్న పాత్రలలో నటించే రూపంలోనే తెలుసుకొంటావు. విద్య లేక వినోదమనేది లేదు గనుక నీవు చూచేది వినోదంగాను, విద్యగాను వుంటుంది.

"నీ కండ్లు మూసుకో. నన్ను గురించి, నిన్ను గురించి, గొప్ప ప్రపంచం లోని ప్రజలను గురించి సత్యాన్ని తెలుసుకొంటావు. ఇది గొప్ప సాధారణ రహస్యం. ఇప్పుడు చూడు, నీవు చూచేదంతా నాకు చెప్పు."

"చంద్రశేఖరం ఉవాచ:- భగవన్, నాకు ఏమీ కనబడడంలేదు. నేనే నాకిప్పుడు కనిపిస్తున్నాను. నీవు కనబడడంలేదు. నేనేదో పెద్ద అద్దం చూస్తు న్నట్టుంది. నేనింకా కళ్ళు మూసుకొనే నిలుచున్నాను. కాని, ఇక్కడ నా కళ్ళు తెరుచుకొన్నాయి. నేను కదులుతున్నాను. ఇది అద్దం అయివుండదు. నేనిప్పుడు తింటున్నాను, తాగుతున్నాను. నేనిప్పుడు మంచంపై పడుకొని నిద్రపోతున్నాను. నేనిప్పుడు ఆహార్యం (మేకప్) ధరిస్తున్నాను. ఇప్పుడు నటిస్తున్నాను. నా ప్రేక్ష కులు, నా పోషకులు ఎలా సంతోషిస్తున్నారో! ఎలా నవ్వుతున్నారో! ఎలా చప్పట్లు కొడుతున్నారో! ఏమి ప్రశంసలు! నాకు దండలు వేస్తున్నారు. ఎవరో నా కళను, నా కార్యక్రమాలను పొగడుతున్నారు. వెనుక బెంచీల వారెవరో నన్ను గేలి చేస్తున్నారు. డబ్బులు పడ్డాయేమోనని నేను నా జేబులు తడుము కుంటున్నాను. కాని అవి ఖాళీగా వున్నవి. నేను కుంగిపోయాను. నేను నా భార్యను, పిల్లలను, మనుమలను, మిత్రులను, బంధువులను చూస్తున్నారు. కొందరు అపరిచితులు వస్తున్నారు. వారిలో ఒకరు 'మీరు డాక్టర్ చంద్రశేఖరం కదా?' అని అడిగారు. అతడు సంతోషంగా వున్నాడు. నేను గొప్ప నటుడిని, వినోదకారుణ్ని, నవ్వు కలిగించేవాడిని అని అతడు తక్కనవారికి తెలుపుతున్నాడు. వారందరూ చేతులు ఆడిస్తూ సెలవు తీసుకుంటున్నారు. నేనిప్పుడొక గదిలో ఒక మహిళతో వున్నాను. నా కౌగిలిలో ఆమె ఎంతో సంతోషంగా వుంది! నేనిప్పుడు ఒక దేవాలయంలో విగ్రహాన్ని పూజిస్తున్నాను. అర్చకులు ఏవో శ్లోకాలు చదువుతూ నన్ను డబ్బడుగుతున్నారు. నేను ఇంటికి వెళ్ళుతున్నాను. ఎవరో నా ప్రదర్శన కోసం నాకు కొంత డబ్బిస్తున్నారు. నా జేబులిప్పుడు నిండిపోయాయి. నేను ఎంత సంతోషంగా వున్నానో! నావాళ్ళు కూడ ఎంత సంతోషంగా వున్నారో! నేను ఏదో చలన చిత్రాన్ని, నా వార్తా చిత్రాన్ని చూస్తున్నట్టుగా వుంది. కాదు. అది చలనచిత్రం కాదు. అవి జీవంలేని కేవలం నీడలు కావు. నేను జీవంతోవున్న వాస్తవమైన పురుషులను, స్త్రీలను చూసు న్నాను. ఇప్పుడు వారు పాటలు పాడుతున్నారు, ఇప్పుడు వారు ఆడుతున్నారు. ఇప్పుడు నేను మరికొందరితో కలిసి నటిస్తున్నాను. నేను చూస్తున్నది ఒక నాటకం. కాని, రంగస్థలం లేదు; తెరలు లేవు; ప్రవేశమార్గాలు లేవు, నిష్క్రమణ మార్గాలు లేవు; ఫోకసింగులు లేవు. దృశ్యాలు మారుతున్నాయి. ఇప్పుడు

స్థలాలు, ఇప్పుడు కుటీరాలు, ఇప్పుడు పర్వతాలు, ఇప్పుడు నదులు, ఇప్పుడు సముద్రం, ఇప్పుడు అడవులు, ఇప్పుడు ఆరామాలు, ఇప్పుడు కర్మాగారాలు, ఇప్పుడు వ్యవసాయ క్షేత్రాలు, ఇప్పుడు ఒక నగరంలోని వీథి, ఇప్పుడు ఒక గ్రామంలోని వీథి, నటులు ప్రేక్షకులతో కలిసిపోతున్నారు, ఎవరు నటులో, ఎవరు ప్రేక్షకులో తెలుసుకోలేకపోతున్నాను. వారిలో వివిధ జాతులవారున్నారు, వివిధ మతాల, రకరకాల దుస్తుల స్త్రీలు, పురుషులు ఉన్నారు. వారు విభిన్న భాషలు మాట్లాడుతున్నారు. వారంతా చేతులు చేతులు కలిపి పనిచేస్తున్నారు. ఎంత సంతోషంగా ఉన్నారో వారంతా! వారిలో లింగభేదంగాని, జాతి, మత, కుల, వర్గ, భాషా భేదంగాని వున్నట్టు తోచదు. ఇప్పుడు వారంతా నృత్యంచేస్తూ వెళ్ళిపోతున్నారు. వారంతా అదృశ్యులయిపోయారు. ఇప్పుడంతా శూన్యం. అంతా చిమ్మచీకటి. ఇప్పుడు నేనా చీకటిలో వెలుగు రేఖను చూస్తున్నాను. అది నక్షత్రంగా పెరుగుతూంది. అంతకంతకూ ఉజ్వలమవుతున్నది. ఇప్పుడు దానిని చూడలేకపోతున్నాను, దానిని వినలేకపోతున్నాను. నక్షత్రం కదులుతూంది; కదులుతూంది, నావైపు కదులుతూంది. అది నా శరీరంలో ప్రవేశిస్తూంది, అది నా శరీరంలో ప్రవేశించింది. నా దేహం ఉన్నట్టే నాకు తోచడంలేదు, అయినా నేను ఉన్నాను. శరీరం లేకుండా నే నెవడిని?"

"కృష్ణ ఉవాచ:- చంద్రశేఖరం! నీవిప్పుడు నా మహానాటకం చూచావు. నేనే దాని నిర్మాతను, దర్శకుడిని, నటుణ్ని, ప్రేక్షకుణ్ని. ఈ నిరంతర నాటకంలో నీవొక నటుడివి మాత్రమే. నేనే నీలో ఉన్న 'నేనును.' ఇది పరమ సత్యం. నీ అంతశ్చక్షువు ఇప్పుడు తెరుచుకుంది. దానితోనే నీవు ఈ మహా నాటకం చూచావు. ఒకానొక నాడు నీవు నటుడు మాత్రమే కావడం వుండదు. నిర్మాతతో ఒక్కటయిపోతావు కూడా."

ఈ నాటక భగవద్గీతలోని కృష్ణుడెవరో కొంచెం ఆలోచించండి. ఈ కృష్ణుడు వైవిధ్యం విరాజిల్లే విశాల మానవజాతిసారం. ప్రతి వ్యక్తి, ప్రతి మానవుని, ప్రతి పురుషుని, ప్రతి స్త్రీ జీవితంలోను ఉన్న చైతన్యం. శారీరక, నైతిక, ఆధ్యాత్మిక సౌందర్యాలకన్నిటికీ జీవం అతడే. భావనా ప్రపంచ మూలం అతడే.

నాటక భగవద్గీత చదివితే మానవుడు మరణానంతరం ఏదో ఊహా స్వర్గానికి చేరడు. ఆ స్వర్గం-మోక్షం అనేది, జీవించివున్నప్పుడే అనుభవించ వచ్చునని గ్రహించగలుగుతాడు.

డాక్టర్ వైద్యుల చంద్రశేఖరం తమ తొమ్మిది దశాబ్దాల జీవితంలో, ఎనిమిది దశాబ్దాల నట జీవితంలో గ్రహించిన, మననం చేసుకొన్న, అనుభూతి పొందిన గొప్ప విషయం అసత్యం ద్వారా సత్య సాక్షాత్కారం. ఆ అసత్యం నటన. డాక్టర్ చంద్రశేఖరం నటనయోగి, నటన తపస్వి, నటన సాధకుడు, నటన సిద్ధుడు.

(1984 మార్చిలో డాక్టర్ చంద్రశేఖరం సన్మాన సంచికకు వ్రాసిన వ్యాసం)

# ఏకాంగి వీరుడు శ్రీ కోదండరామయ్య

"కృష్ణ దేవరాయలను గురించి దేశవిదేశ విద్వాంసులు ప్రకటించినంత మంచి అభిప్రాయాలు ప్రపంచంలో మరే చక్రవర్తిని గురించీ ప్రకటించలేదు. ఇది మనకు గర్వకారణం. ఇటు కటకం నుండి అటు గోవా వరకు, గోవానుండి కన్యాకుమారి వరకు కృష్ణ రాయల విషయాలు ఎన్నో లభిస్తున్నాయి. వాటిని సేకరిస్తేగాని రాయల చరిత్ర, ఆంధ్రదేశ చరిత్ర సమగ్రం కాదు. తెలుగు భాష కోసమే ఆంధ్రప్రదేశ్ అవతరించడం నిజమైతే, కృష్ణ రాయల చరిత్ర పరిశోధన కోసమే ఒక శాఖ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో ఏర్పడాలి" అన్నారు ఇటీవల కార్యాంతరంగా రాజధానికి వచ్చిన శ్రీ కె. ఎస్. కోదండరామయ్య.

తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలలో ఉన్న 75 లక్షలమంది తెలుగువారి అభ్యున్నతిని గురించి నిరంతర చింతనం, అద్వితీయమైన కృషి, సర్వకాల సర్వావస్థలలోను తెలుగుభాషా వికాసంకోసం పరాయణత్వం – శ్రీ కోదండ రామయ్య అంటే సరిపోతుంది. రాజకీయాలలో పూర్వం న్యాయవాదులెక్కువమంది ఉండేవారు. తరువాత డాక్టర్లు ఎక్కువయ్యారు. శ్రీ కోదండరామయ్య వంటి పరిశోధన ప్రవీణులు అరుదు. ఇటు చరిత్ర పరిశోధన, అటు రాజకీయ ప్రచారం, మరొకవైపు దక్షిణాంధ్ర భాషారక్షణ సమాజం, హొసూరు తాలూకా ఆంధ్ర సాంస్కృతిక సమితి, తమిళనాడు తెలుగు పండిత సంఘం వంటి సంఘాల స్థాపన, తమిళనాడులో తెలుగు పాఠశాలల స్థాపన, తాళపత్ర గ్రంథాలు సేకరించి హొసూరులో పరిశోధనాలయం నెలకొల్పడం—ఇవి కోదండరామయ్య లక్ష్యాలు. ఇవి నెరవేరుతున్నాయి క్రమంగా.

కోదండరామయ్యకు ఇంత సేవా పరాయణత కలుగడానికి కారణం తండ్రిగారయిన కారుపల్లి శివరామదాసుగారు. ఆయన వీరేశలింగంగారి మిత్రులు. అన్ని అభ్యుదయోద్యమాలలోను ముందంజవేసినవారు. కోదండ రామయ్య బెంగుళూరు, చిత్తూరు, మద్రాసులలో విద్యాభ్యాసంచేసి, ఎం. ఏ., బి. ఒ. ఎల్., బి. టి. అయ్యారు. దాదాపు 20 సంవత్సరాలు ఉపాధ్యాయులుగా, హెడ్ మాస్టరుగా ఉండి, తర్వాత రాజీనామా యిచ్చి, పూర్తిగా ప్రజాసేవా రంగంలో దిగారు. 1967 లో స్వతంత్రపార్టీ అభ్యర్థిగా తమిళనాడు శాసన సభకు ఎన్నికయ్యారు. 1971 ఎన్నికలో ఇండిపెండెంట్‌గా నిలబడి గెలిచారు.

తూర్పు మైసూరు, ఉత్తర సేలంలోని తెలుగువారు హెచ్చుగా ఉన్న ప్రాంతాలు— అనే గ్రంథం వ్రాసి పటాస్కర్‌కు అందజేసినప్పుడే ఆయన దూరదృష్టి, వివిధ శాస్త్రజ్ఞానం తెలియవచ్చాయి. కేవలం పరిశోధన దృష్టితో అపూర్వమైన వ్యాసాలు దాదాపు 100 వ్రాశారు. ప్రస్తుతం "ఆదర్శ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు" అనే ఉద్గ్రంథం మొదలుపెట్టారు. ఒక్క కృష్ణరాయల వంశాదికము—అనే మొదటి అధ్యాయమే 400 పుటలయింది వ్రాతలో. నిరుడు ప్రకాశం శతజయంతి సంచిక ప్రచురించారు. ప్రకాశం స్మారక మందిరానికి శ్రీ బ్రహ్మానందరెడ్డితో శంకుస్థాపన చేయించారు.

"విపులాంధ్ర చరిత్ర వ్రాయనిదే తమిళ కర్ణాటక చరిత్రలు సమగ్రం కాదు" అంటారు కోదండరామయ్య. "ఈ దృష్టితోనే ఇన్ని సంఘాలు స్థాపించి విషయాలు సేకరిస్తున్నాము. తమిళనాడు తెలుగు పండిత సంఘానికి శ్రీ కె. శ్రీరాములు అధ్యక్షులు, శ్రీ తెలిదేవులపల్లి వెంకటేశ్వర్లు కార్యదర్శి. ఈ సంఘం గొప్ప పరిశోధన చేస్తున్నది" అంటూ తమ వ్రాతలో మునిగారు. 66 సంవత్సరాల యువకుడు కోదండరామయ్య, ఏకాంగి వీరుడు కోదండరామయ్య.

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక — హైదరాబాద్ నోట్‌బుక్ : 26—4—74)

ప్రవాసాంధ్రులపాలిట పెట్టని కోట అయిన శ్రీ కోదండరామయ్య "మేము ప్రవాసాంధ్రులం కాము, స్థిర నివాసాంధ్రులం" అని అంటూ ఉండేవారు. ఆయనకు సంస్కృతమన్నా చాల ఇష్టం. తాము ప్రధానోపాధ్యాయులుగా ఉన్నప్పుడు ఎంతోమంది విద్యార్థులకు సంస్కృత పరీక్షలకోసం శిక్షణ ఇచ్చారు.

ఆయన ఎన్నో గ్రంథాలు వ్రాశారు. "శ్రీకృష్ణదేవరాయ సర్వస్వం" అనే బృహద్గ్రంథాన్ని ప్రారంభించి రాయల వంశం వివరించే తొలి సంపుటం ప్రచురించారు. ప్రతి ఏటా తమ స్వస్థలమైన హొసూరులో కృష్ణదేవరాయల పట్టాభిషేకోత్సవం, ప్రకాశం జయంత్యుత్సవం జరిపేవారు. ప్రకాశం హాలు నిర్మించి, ఎన్నో పథకాలు నిర్వహించారు.

ఆయన తెలుగు కన్నడ తమిళ రాష్ట్రాలలో పెక్కు భాషా సాహిత్య సాంస్కృతిక సంఘాల సభ్యులు, హైదరాబాదులోని అంతర్జాతీయ తెలుగు సంస్థ డైరెక్టర్లలో ఒకరు. ఆ డైరెక్టర్ల సంఘం సమావేశంలో పాల్గొనడం కోసం హొసూరు నుంచి హైదరాబాదు వచ్చారు. సమావేశాల అనంతరం జూన్ 24న ఎవరికో ఫోను చేస్తూ హఠాత్తుగా కన్నుమూశారు. ఆయన భౌతికకాయాన్ని అంతర్జాతీయ తెలుగు సంస్థ డైరెక్టర్ డాక్టర్ ఎన్. శివరామమూర్తిగారు హొసూరుకు వ్యానులో తీసుకొని వెళ్ళారు. అక్కడ అంత్యక్రియలు జరిగాయి.

శ్రీ కోదండరామయ్యగారి వయస్సు 78 సంవత్సరాలు. ఆయన అకాల మరణం తెలుగుజాతికి - భాషా సాహిత్య సాంస్కృతికంగా అన్ని విధాల - అపార నష్టం కలిగించింది.

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక - హైదరాబాద్ నోట్‌బుక్ : 6-7-84)

# శ్రీ దేవీప్రసాద్ రాయ్ చౌధురీ

"మీరు లలితకళల కళాశాల ప్రిన్సిపాలు దేవీ ప్రసాద్ రాయ్ చౌదురీ గారిని కలుసుకొని, ఆయన 'శ్రామికజన విజయం' శిల్పం రచించడానికి ప్రేరణ ఏమిటో తెలుసుకుని, ఒక్క వ్యాసం వ్రాయండి" అన్నారు ఆంధ్ర ప్రభ ఎడిటర్ నార్లగారు.

కాళిదాసు దిలీపుని వ్యక్తిత్వం వర్ణిస్తూ అప్రధృష్యోభిగమ్యః - అన్నాడు. రాయ్‌చౌధురీ అప్రధృష్యుడు కాని అభిగమ్యుడు కాడు. క్షణంకూడ విశ్రమించ కుండా పనిలో నిమగ్నుడయి ఉంటాడు. ఆయనతో మాట్లాడడమంటేనే సాహసం.

"నేను ఉదయం 10.00 గంటలప్పుడు వెళ్లాను. ఏదో స్త్రీ రూపం మలుస్తున్నాడు. ఒకమారు నావైపు తిరిగిచూచే తీరికకూడ లేదు ఆయనకు. గంట గడిచింది. నాకు ఓపిక సన్నగిల్లింది. ఆయన దృష్టిని మరల్చడానికి ఏమైనా చేయాలి. కోపం వచ్చినా సరే. నా సొంత పనిమీద రాలేదు నేను - అనుకుంటూ ధైర్యంగా "మీ శిల్పం చూస్తుంటే కాళిదాసు పార్వతీదేవిని వర్ణించిన శ్లోకం జ్ఞాపకం వస్తున్నదండీ!" అన్నాను అసందర్భంగా.

ఆయన ఒక్కసారి గిరుక్కున వక్కకు తిరిగి "ఎవరు మీరు? ఎప్పుడు వచ్చారు? నార్లగారు ఫోన్ చేశారు ఉదయం. ఒక పండిట్‌ను పంపుతున్నానని అన్నారు. మీరేనా?" అన్నారు. "ఇంతకూ ఆ కాళిదాసు ఏమన్నాడు?" అని ప్రశ్నించారు క్షణం ఆగి.

అప్పుడు చెప్పాను శ్లోకం :

"స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధరోత్సేద నిపాద చూర్ణితాః,
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోదబిందవః."

కాళిదాసు పార్వతీదేవి వర్ణన వ్యాజంతో సుందర స్త్రీమూర్తి లక్షణం చెప్పాడండీ!- అన్నాను.

"చాలా బాగుంది. వివరించండి" అన్నారు ఆయన.

పార్వతీదేవి స్థిర సుఖాసనంలో ఆసీనురాలై తపస్సు చేస్తూంది. వర్షాకాలం వచ్చింది. తొలివాన చినుకులు ఆమెపై పడ్డాయి. ఆ చినుకులు మొదట కంటిరెప్పలపై పడ్డాయి. క్షణం ఆగాయి. తర్వాత కింది పెదవిని తాకుతూ ఎత్తయిన చనుకట్టుపై పడి చెదరి కిందికి జారి పొట్టమీది చిన్న మడతలలో పడి అటు ఇటు గజిబిజిగా కదులుతూ గంభీరమైన నాభిలో ప్రవేశించాయి చాలా సేపటికి. కూర్చున్న ఉత్తమ స్త్రీమూర్తి దట్టమయిన కనురెప్పలు, పెదవి, పయోదరాలు ఒకే మట్టంలో ఉండాలని, నిటారుగా కూర్చున్నప్పుడు నాభి మరింత గంభీరంగా కనిపించాలని శిల్ప లక్షణాలను కాళిదాసు చెప్పాడేమో! - అన్నాను.

ఆయన ముఖం ప్రసన్నమైంది. "నాకు చాలా పని ఉంది. మీకు కావలసినదేమిటో అడగండి. ఐదు నిమిషాలు" అన్నారు.

ఇదీ ఈ వ్యాసం పూర్వరంగం.

పూర్ణసిద్ధుడైన శిల్పి తన గంభీరానుభూతినో, భావావేశాన్నో, భావశబలతనో, భావోజ్జ్వలతనో, అసమాన చాతుర్యంతో కుంచెతోనో, కరకు రాతితోనో, కరిగే లోహంతోనో, మంటితోనో మనకు వ్యక్తంచేసినపుడు కలిగే భావం వేరు; వాటిని మనం మననం చేసుకొని, తన్మయులైనప్పటి దశ వేరు. నాదోపాసకుడైన గాయకుడు తనతోపాటు శ్రోతలను కూడా నాద సుధారసార్ణవంపై తేలాడించి ఆనంద ద్వీపాలకు చేరవేస్తున్నట్టుగానే, మహాశిల్పి తన శిల్పమనే అపూర్వ వ్యోమయానంలో మనల్ని దివ్యలోకాలకు కొనిపోతాడు.

ఈ ఆనంద తన్మయత్వం చాక్షుషవిషయ జన్యమని, కనుక క్షణికమని ద్రష్టకో, మంతకో తోచినప్పుడు మనస్సు తునాతునకలైపోతుంది. పరిసర ప్రపంచం బుద్ధభగవానుడన్నట్టు "సర్వం దుఃఖం దుఃఖం"గాను, పరాధీనంగాను, పరపీడన పరాయణంగాను వున్నప్పుడు శాశ్వత ఆనందం ఎక్కడిది? కాని, నిజానికి జీవితం_ప్రపంచగతి - ఒక మహా సంఘర్షణం, మహా సంగ్రామం, క్షీరాబ్ధి మథనం. దానినుంచి హాలాహలం పుడుతుంది; అమృతం దాని లక్ష్యం. అంతవరకు_మిట్టపల్లాలులేని మహా వ్యవస్థ ఏర్పడేవరకు_ఈ సంఘర్షణ తప్పదు. ఎప్పటికప్పుడు సంఘర్షణలు ఎడతెగకుండా కనిపిస్తున్న ప్రపంచ ప్రాణికోటిగతి "చక్రనేమి క్రమం" కాదు, శంఖా వృత్తక్రమం. కనుక కష్టాలు తిరిగివచ్చినట్టు కనిపించినా, ఒక అంగ ముందుపడటం అనివార్యం. కాని, సామాన్యులకు ఇది తోచదు; కష్టాలలో కొట్టుమిట్టాడుతున్నట్టే తోస్తుంది. ఈ కష్టాలు శాశ్వతమైనవి కావని, మహోజ్వల భవిష్యత్తు మనకై వేయికన్నులతో వేచివున్నదనే విశ్వాసం కలిగించి, వీపు చరిచి, గుండెనిమిరి నీవు సైతం

"భువన భవనపు బావుటావై పైకి లేస్తావు" అనే ధీమా కలిగించి, జాతిని అభ్యుదయ పథంలో నడిపించగలవాడే కవి, చిత్రకారుడు, శిల్పి. మానవాళి జీవితాన్ని తీర్చిదిద్దడంలో కళాకారుని బాధ్యత మహత్తరం. ఆ బాధ్యత నిర్వర్తించినప్పుడే లలితకళల చరితార్థత. అయినప్పుడు, ప్రపంచంలో ఆపాత రమణీయంగా తోచే హాయిని వదలి, హాలాహలచిత్రణనే శాశ్వతమైన హాయిని చేకూర్చే ఆదర్శంతో — తన కుంచెకు, తన సుద్దచేతికి లక్ష్యంగా శ్రీ దేవీప్రసాద్ రాయ్ చౌదురి చేసుకొనడంలో అబ్బురంలేదు. "ఏకో రసః కరుణ ఏవ నిమిత్త భేదాత్" అని ఎలుగెత్తి చెప్పిన భవభూతి ఈ సందర్భంలో మన కట్టెదుట నిలుస్తాడు.

శ్రీ రాయ్ చౌదురి ప్రజా జీవితాన్ని, శ్రమ ఫల రహస్యాన్ని ఆకళించుకున్న మహాశిల్పి. ఆయన మనసుకు ఆనందం వైపుకన్న, కష్టాల వైపుకే ఎక్కువ మొగ్గు. ఆయనకు హిమశిశిర రాత్రులే కాని, మధుర మధుమాసాలు తక్కువ. కఠోర జీవితాఘాతాలతో కరకుదేరిన ఆయన హృదయం, చురుకు బారిన ఆయన ప్రతిభ సత్యశోధనకు,శాశ్వత సౌందర్యాన్వేషణకు పూనుకున్నాయి.

శ్రీ రాయ్‌చౌదురి బాల్యంనుంచి కళా తపస్వి. ఆయన సకల లలితకళల అపూర్వ సమ్మేళనం. ఆయన మేటి గురికాడు. మల్లయుద్ధ విశారదుడు. చెవుల విందైన పాటకాడు. అపూర్వ ప్రతిభ వెదజల్లే చేతిపనులెరిగినవాడు. ప్రసిద్ధ గురువులవద్ద చేతిపనులు అభ్యసించాడు. ఆయన ఎరుగని లలితకళ కనిపించదు.

ఆయన తన తొలి జీవితం ట్రిక్ సైకలిస్టుగా ప్రారంభించాడు. ఆ తొలి సైకిల్ యాత్రలే జగద్రహస్యాన్వేషణ యాత్రకు, సత్యశోధనకు ప్రోత్సహించి వుంటాయి.

మహాపురుషులు మెట్టినచోటెల్లా మహనీయం చేస్తారు. మహాకవి పరిసరాలు తమంతటవే కవిత చెబుతాయి. మహాశిల్పి తానున్నచోటును కళాక్షేత్రంగా చేస్తాడు. శ్రీ రాయ్‌చౌదురి మద్రాసు లలితకళా పాఠశాలకు 20 సంవత్సరాలుగా ప్రిన్సిపాలుగా వుంటూ, దానిని చెన్నపురికే కళాక్షేత్రంగా చేసివేశాడు. ఆయన కీర్తి, దానితోపాటు చెన్నపురి లలితకళా పాఠశాల కీర్తి రాష్ట్ర పరిధిని, దేశ పరిధిని, ఉత్తుంగ హిమాలయాలను, దేశం మూడువైపుల వున్న మున్నీరును దాటి ఖండఖండాంతరాలకు ప్రాకింది. ఆయన శిష్యపరంపర తామరతంపరలా విస్తరించి వ్యాపించింది.

అన్ని విధాల భావపరిణామం కలుగుతున్న సంధియుగ మిది. పాత రీతులతో, పాత సంప్రదాయాలతో తృప్తిపడని కాలమిది. శ్రీ చౌదురి ప్రాచీన

కళా పరిభాషను మన్నించినా, దానినే అంటిపెట్టుకోడు. ఆయన పరిభాష స్వతంత్ర, నిత్య నూతన, నవనవోన్మేషశాలి కళా సృష్టికి విధాత్రి. ఆయన మనస్సు, చూపు ఎప్పటికప్పుడు నిత్యనూతనత్వాకాంక్షిణులు. తన నూతన కళాఖండాలలో పాతవాటిలోని పోలికలు ఏ మాత్రం కనిపించినా, ఇతరుల శిల్పాల పోలికలు కనిపించినా, వాటిగతి మంటిపాలే. ఎంతో శ్రమపడి చేసిన పని మూడు నిమిషాలలో మట్టిపాలవుతుందనే జంకు కొంకులు గాని, విషాదంకాని ఆయనకు కలుగవు. విధాత సృష్టిలో పోలికలు వుండవచ్చునేమోకాని, ఈయన సృష్టిలో పోలికలకు అవకాశంలేదు.

విశ్రాంతి నెరుగని కార్మికుడు శ్రీ రాయ్. క్షణమైన తీరికలేక పాటుపడే పాటక జనం ఆయన చిత్రణ లక్ష్యమైనప్పుడు ఆయనకు విశ్రాంతి ఎక్కడిది?

ఆయనకుంచే మెరుగేమోనని చిత్రాలు చూచినవారు, చేతిసుద్దే మెరుగేమో నని శిల్పాభిమానులు భావిస్తారు, వాదిస్తారు. నిజానికి వానికి అవే సాటి. ఇంతకూ సిద్ధహస్తులైన శిల్పుల రచనలలో భేదాలు గుర్తించడం కష్టం. విషయభేదం, ఆశ్రయభేదం, ఉపకరణభేదం వున్నంత మాత్రాన కళా కౌశలంలో భావోన్మీల నంలో తరుగుమెరుగులు వున్నట్టు కానము. అజంతా గుహలలో చిత్రాలు రచించిన కొన్ని అమృతహస్తాలే ఎల్లోరాలో శిల్పాలు తీర్చాయనుకుందాము. అప్పుడు తారతమ్యాలు పోల్చుకోగలమా? కంచి కైలాసనాథుని కోవెలలోని కుడ్యాలలో శిల్పాలు నిర్మించిన హస్తాలే వర్ణ చిత్రాలు లిఖించాయి. వాటి వైదగ్ధ్యంలో భేదం కనిపెట్టగలమా?

ఆయన సాధించిన వర్ణికా సామరస్యం, ఆయన తూలిక తరిబీదు పొందిన రేఖానాట్యం, ఆయన మునివ్రేళ్లు పుణికి పుచ్చుకున్న ముద్దు ముద్దు నొక్కులు అపూర్వం, అత్యద్భుతం.

మనిబొగ్గులలోని మాణిక్యాలను ఏరుకొనడం తేలికే కాని, మాణిక్యాలను రాసులు రాసులుగా పోసినపుడు, మాట దక్కించుకోడం కష్టం. ఆయన కళా ఖండాలలో వేటివి ఏమని వర్ణించడం? సత్య సౌందర్యాన్వేషణ జైత్రయాత్రకు బయలుదేరినట్టు కనిపించి తారతమ్యమయ విధాతృ జగత్తును ముట్టడించి లగ్గ పట్టినట్టు కనిపించే ఆయన కళా ఖండాలలో ఏది మహాయోధ? ఏది పోటరి? ఆయన ఇంతవరకు కొన్ని వందల శిల్పాలకు, వర్ణచిత్రాలకు విధాత. కష్టాలతో అలసిసొలసిన కార్మిక జనాళికి కళమూలంగా ప్రాణదాత.

ఆయన నవశిల్పాలు "శ్రామికజన విజయం", "ఎముకలు కొరికే చలి", "స్నానానంతరం". శిల్ప సౌందర్యలహరి అవలిదరి. "శ్రామిక జన విజయం" ప్రపంచ శ్రామిక లోకానికి మహాశ్వాసం, సమీచీన సాంత్వనం. అనాదిగా

సాగుతున్న ఈ అనంత సంగ్రామంలో తుది గెలుపు శ్రామికులదేనన్న సందేశం, కార్మికుల శక్తి అనంతం, అజేయమనే హెచ్చరిక దానిలో విస్పష్టం.

"ఎముకలు కొరికే చలి"లో శ్రీనాథుడు ముద్దుగా వర్ణించినట్టు మనిషి ముద్దగట్టుకుపోయాడు. కాని ఇది తాత్కాలికం. రానున్నది నవవసంతం అన్న సందేశం ఇందులో ధ్వని. ఆయన కుంచె చిందులు త్రొక్కే రంగు చిత్రాలు ఇలాంటివే.

మానవాళి కడగండ్లను కని, విని, మననం చేసుకొని చేతిలో కుంచెను, సుద్దను పట్టుకొనేవాడే కలకాలం నిలువగల ఇలాటి కళాఖండాలను సంతత ధారగా వెదజిమ్మగలడు. ఆ బాధల మదిరను సేవించినవాడే సత్యాన్ని కరతలామలకం చేసుకోగలడు. అప్పుడే ఆ కళాసృష్టి సర్వాంగ సుందరం, సమగ్రం కాగలదు.

శ్రీ దేవీప్రసాద్ రాయ్‌చౌధురీ ఎనలేని కళా భండారం, జాతి పురోగమనానికి, ప్రజాసామాన్య అభ్యుదయ సౌధానికి ఆయన చేయివేసిన సుద్ద, కుంచె పూసిన పూత, కరిగించి వంచిన లోహపు పోత అసాధారణమైనవి. ఆయన ఇతోధికంగా భారత జాతిసేవ చేయడానికి తగు సౌకర్యాలు కల్పించడం జాతీయ ప్రభుత్వం కనీసపు ధర్మం.

(ఆంధ్రప్రభ – 1950 డిసెంబర్ 31)



# ఈ వ్యాస సంపుటిని గురించి...

ఈ విశ్వం వైవిధ్యవిలసితం. ప్రతి వ్యక్తిలోను ఏదో మంచి, ఏదో మించు కనిపిస్తుంది, సహృదయతతో చూస్తే. నేను పత్రికా రచయితగా ఈ మంచిని, మించును చూడడం నేర్చుకున్నాను.

మానవుడు మంచి చెడ్డల కలయిక. మంచిని చూడడం అలవరచుకొంటే, మనకు ఎంతో హాయి. చెడు చూచి మన మనసును చెడుపుకోడం ఎందుకు? ఈ దృష్టితో వృత్తిధర్మంగా నేను కలుసుకొన్న సామాన్యుల, అసామాన్యుల స్వరూప స్వభావాల లేఖినీ చిత్రాలివి.

మంచీ, చెడ్డా రెండూ చెబితేనే గదా సమగ్రచిత్రం ఏర్పడుతుంది - అని నేనంటే, నా లేఖిని అంగీకరించదు. సూర్యుని సమగ్రబింబం చూచామా, చంద్రుడి సగమే గదా చూస్తున్నాము. చెడును చెప్పడానికి, ఉన్నవీ లేనివీ - లేనిపోనివీ ఆడిపోసుకోడానికి చాల మందే ఉన్నారు. నేను మంచినీ, మించునే చెబుతాను - అని అలిగింది. డెబ్బయియేళ్ళ సహచరి మరి!

స్వేచ్ఛను అందరికీ ఆశించడం మానవత్వంలో ఒక అంశం కదా! కనుక, నేను ఎవరి స్వేచ్ఛను అడ్డుకోదలచలేదు. నా లక్ష్యం మానవత్వం; అది చిరంజీవి; నేనూ చిరంజీవిని.

Printed at Lakshmi Ganapathi Printing Press
SRT 199, 1-1-379-50/1, Jawahar Nagar, Hyderabad - 500 020.